mohan

PUBLICATIONS

ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,

రాజమహేంద్రవరం - 533101.



- డా॥ బి.జయరామరెడ్డి

## ఆంధ్ర మహాభారతంలో

# వరాలు శాపాలు - ఒక పరిశీలన

# ఆంధ్ర మహాభారతములో వరాలు, శాపాలు- ఒక పరిశీలన



డా॥ డి. జయరామ రెడ్డి

ఆచార్య కె. సర్వోత్తమ రావు
తెలుగు అధ్యయన శాఖాధ్యక్షులు
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం

తిరుపతి
20-12-1993

## అభిప్రాయము

నాకూ డా॥ జయరామరెడ్డికి పాతికేళ్ళనుండి పరిచయం ఉంది. ఎం.ఏ. తెలుగు చదువుకునే రోజులలో కలిసి తిరిగాం. ఎస్.వి. యూనివర్సిటీ పార్కుల్లో రూముల్లో లైబ్రరీలలో పాఠ్యాంశాలు చర్చించుకునే వాళ్ళం. ఎం.ఏ. అయ్యాక రెడ్డి, ప్రభుత్వకళాశాలలో చేరడం దూరం కావడం జరిగింది. నేనూ ఓరియంటల్ కాలేజి ఉద్యోగం వదలి పెట్టి యూనివర్సిటీలో లెక్చరర్ కావడం కాకతాళీయం. ఆ తరువాత రీడర్ కావడం, తదనంతరం ప్రొఫెసర్ కావడం దైవ నిర్ణయాలు అనడం సబబు. రీడర్‌గా ఉన్నప్పుడు మిత్రులు జయరామరెడ్డి తెలుగులో పి.హెచ్.డి.చేయాలనుకోవడం.కీ.శే॥ డా॥జి.యన్.రెడ్డిగారి సూచనల మేరకు శీర్షిక ఎన్నుకోవడం, నా పర్యవేక్షణలో పరిశోధన సాగించడం వగైరాలు "కలిసొచ్చిన కాలంలో" జరిగిన సన్నివేశాలు. అయినా పరిశ్రమించి రెడ్డి పి.హెచ్.డి. పట్టా పుచ్చుకోవడం అతనికే కాదు నాకూ ఎంతో సంతోషకరమయిన అంశం.

రామాయణం భారతం - వీటిని ఇతిహాసాలనడం పరిపాటి. వీటిని కల్పనలని త్రోసిపుచ్చడం అవివేకానికి గుర్తు. యథాతథంగా జరిగిందనుకోవడం నమ్మకానికి సంబంధించిన అంశం. నది జన్మస్థానంలో చిన్నదిగా కనిపించినా కొండలో ఉరికి కోనల్లో నిండి మైదానాలలో ప్రవహిస్తూ "ఎంత పెద్దనది" అనే భావన కలిగించే విధంగా భారత కథ పెరిగింది. ఉప కథలు ఉప నదుల్లా చేరాయి. వక్తృబట్టి

పురాణ శ్రవణ కాలంలో సందేహాలు అడిగే శ్రోతల బట్టి "ఇంతింతగా" పెరిగింది. చివరకు అనేకాంశాలు చేరి "విజ్ఞాన సర్వస్వం"లా రూపం మార్చుకుంది. అలాంటి భారతానికి దక్షిణ దేశంలో ప్రత్యేకించి "తెలుగునాట" ఆదరం పెరిగింది. "వింటే భారతం వినాలి" అన్నంతగా తన స్థానాన్ని పదిలపరచుకుంది. దీనికి భారతకధ ఒక కారణమయితే రచన మరో కారణమయింది.

ఆంధ్ర మహాభారతాన్ని ఎందరో ఎన్నో దృక్పథాలలో పరిశీలించారు. రస దృష్టితో చూచినవారు కొందరు, ధ్వని దృష్టితో పరిశీలించినవారు మరి కొందరు, మనస్తత్వ విశ్లేషణ చేసినవారు ఇంకా కొందరు. పాత్రకు పాత్ర విడమరచి, పర్వానికి పర్వం వేరుచేసి' కవికి కవికి పోటీలు, తేడాలు చెబుతూ కొందరు ఇలా ఎన్నో రకాలుగా పరిశోధన చేశారు. అయినా త్రవ్వితీయవలసిన రత్నాలు భారతంలో ఇంకా ఎన్నో ఉన్నాయి. ఆ ప్రయత్నంలోని భాగమే డా॥ జయరామరెడ్డి "ఆంధ్ర మహాభారతములో వరాలు - శాపాలు ఒక పరిశీలన" ఈ పరిశీలనకు ఎంతో ఓపిక కావాలి. విశ్లేషణకు ఎంతో జాగ్రత్త కావాలి. వివరణకు ఎంతో నేర్పు కూడా కావాలి. ఇవన్నీ రెడ్డికి పుష్కలంగా ఉన్నాయనడానికి ఈ సిద్ధాంత వ్యాసం సాక్ష్యం. యాచిత వరం, అయాచిత వరం, యాచితాయాచిత వరం,అనే వింగడింపు, అలాగే శాపంలో స్థాన భ్రష్టాత్మక శాపాలు, స్వరూప వైకల్య శాపాలు,పరిశిష్టంలాంటి విభాగం వాటిలో అంతర్విభాగం మొదలయినవి సూక్ష్మదృష్టితో చూచి విశ్లేషించిన విశేషాలు. ఈ గ్రంథ మందలి విషయసూచికను చూస్తే దీని విశిష్టత తెలుస్తుంది.

ఈ విశ్లేషణ వల్ల తెలిసిన సత్యాలెన్నో. మచ్చుకు భారతమనగానే భారత నాయకుడు కృష్ణుడని, నారాయణుడని చెప్పడం అలవాటైనా వరాలు, శాపాలలో "శివుని" ప్రాధాన్యమే ఎక్కువ కనిపించడం

చాల చిత్రమయిన విషయం. శాపం చెప్పడం,ఆ భాగమున్న భారత సన్నివేశాన్ని సంగ్రహంగా ఉదాహరించడం, కథను వివరించడం, చివరకు ప్రాణ భూతమయిన పద్యాలను ఉటంకించడం లాంటి పద్ధతి ఈ సిద్ధాంత గ్రంథంలో కనిపించే ప్రణాళిక.

తమిళులు కంబ మహాకవిని అభిమానిస్తారు. కంబనికి కోవెల కూడా కట్టారు. కంబ రామాయణానికి సంబంధించిన అన్ని పుస్తకాలు, అన్ని వ్యాసాలు ఒక చోట చేర్చారు. కాని ఆంధ్రులు ఈ విషయంలో ఇంకా ఎంతో వెనుకబడి ఉన్నారనడం సత్యం. భారతానికి సంబంధించిన అన్ని పుస్తకాలను, వ్యాసాలను, దేవాలయాలలో కనిపించే భారత శిల్పాల జాబితాలను, భారతం ప్రదర్శించే వారి భోగట్టాను, ఒక చోట చేర్చడం చాల అవసరం. ఈ కల ఏరోజు నిజమవుతుందో.

"ఆంధ్ర మహాభారతములో వరాలు, శాపాలు - ఒక పరిశీలన" అనే సిద్ధాంత వ్యాసాన్ని జయరామ రెడ్డి ముద్రించాలనుకోవడం పరవశింపజేసే విషయం. తిరుమల తిరుపతి దేవస్థానం ఆర్థిక సహాయం అందించడం మెచ్చుకోవలసిన అంశం. ఈ గ్రంథం వ్యాప్తిలోనికి రావాలని కోరిక. భారతానికి సంబంధించి ఇంకా అనేక రకాలుగా పరిశోధనలు సాగాలని నా ఆకాంక్ష.

కె. సర్వోత్తమ రావు

అవనిగడ్డ నారాయణమూర్తి, ఎం.ఏ.
ఆంధ్రోపన్యాసకులు
యస్.వి.ఏ. ప్రభుత్వ కళాశాల
శ్రీకాళహస్తి

20-12-1993
శ్రీకాళహస్తి

## మనసులోని మాట

ప్రాచీన ఆంధ్రసాహిత్యమన్నా, అందునూ కవిత్రయ భారత మన్నా మొదటి నుంచి నాకెనలేని అభిమానము. ఆ కారణముచే మా శాఖలో పనిచేయు మిత్రులు డా॥ జయరామ రెడ్డి గారు "ఆంధ్ర మహాభారతములో వరాలు, శాపాలు - ఒక పరిశీలన" అను తమ సిద్ధాంత గ్రంధమును చదివి అభిప్రాయమును లిఖిత రూపమున నొసగుడని కోరగా మిగుల సంతోషించితిని. ఈ గ్రంథమును సాంతముగా చదివి ఆనందించితిని. ఆ అనుభూతికి వాగ్రూపమే యీ మనసులోని మాట.

తేలికపాటి రచనల మీద సిద్ధాంత వ్యాసములను వ్రాసి M·Phil., Ph·D పట్టాలు పొందుచున్న నేటి రోజులలో ప్రాచీన సాహిత్యము పట్ల మోజుతో ప్రాచీన సాహిత్యముపై ఇట్టి సిద్ధాంత వ్యాసము సమర్పించుట గొప్ప విషయమే. ఇట్టి పరిశోధన గ్రంథములకుకావలసిన ప్రధానసాధనము ఓపిక. అది పుష్కలముగ నుండుట చేత రెడ్డిగారు ఈ గ్రంథమును వ్రాయ గల్గిరి - కవిత్రయి భారతములోని వరాలను, శాపాలను ఏర్చి కూర్చుకొనుటలోను, వర్గీకరించుటలోను రచయిత కృషి, ఓపిక అభినందించ తగ్గది.

ఈ సిద్ధాంత గ్రంథము శాస్త్రోపన్యాసకులు (Science Lecturers) సాగించు పరిశోధన కోవలోనికి సమానమైనదని నా మనోభిప్రాయము. సాహితీ పిపాసవులకి గ్రంధము ఆకర్షించి రసానందము కలుగ చేయదు. కేవలము విషయ పరిజ్ఞానము నపేక్షించు సాహితీ

జిజ్ఞాసువులకు మాత్రమే యిది యుపయుక్తము కాగలదు. ఇట్టి పరిశోధనా గ్రంథములు సాహిత్య చరిత్రలో చోటుచేసుకోదగ్గవే. అన్ని గ్రంథములు రసానందము నివ్వవలయునని గాని, సర్వ జనామోదములు కావలయునని గాని నియమము లేదు. అందువలన సాహితీ జిజ్ఞాసువులు కొందరైనా దీనిని చదివి ఆనందానుభూతిని పొందినచో రచయిత కృషి ఫలించినట్లే -

మిగుల ఓపికతో పరిశ్రమించి కవిత్రయ భారతముపై ఇట్టి పరిశోధనా గ్రంథమును రచించిన మిత్రులు జయరామ రెడ్డిగారికి జ్ఞాన ప్రసూన సమేత శ్రీ కాళహస్తీశ్వరస్వామి సంపూర్ణ ఆయురారోగ్య ఐశ్వర్యమును ప్రసాదింప వలయునని మనసారా ప్రార్థిస్తూ

అభినందనలతో

అవనిగడ్డ నారాయణమూర్తి

# ప్రశంతి

నేను 1968-70 సంవత్సరములలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము తెలుగు విభాగములో విద్యార్థిని. ఎం.ఏ. చదువు కొంటున్న రోజులలోనే నాకు భారతము పట్ల ఆసక్తి, పరిశోధనా దృష్టి పెరిగింది. ఉద్యోగములో చేరాక పిహెచ్.డి. చేయాలనే ఉబలాటము పెరుగుతూ వచ్చింది. నా ఆసక్తిని, అభిరుచిని గుర్తించిన కీ.శే॥ ఆచార్య జి.యన్. రెడ్డిగారు "ఆంధ్రమహాభారతములో వరాలు, శాపాలు-ఒక పరిశీలన" అనే అంశాన్ని సూచించారు. పరిశోధన కొనసాగించడానికి పర్యవేక్షణకు సమ్మతించిన వారు ఆచార్య కె. సర్వోత్తమరావు గారు.

నా సిద్ధాంత వ్యాసానికి పరీక్షాధికారులుగా తమ అమూల్యమైన సలహాలను ఇవ్వడమే గాకుండా పిహెచ్.డి. పట్టమునకు అన్ని విధాల తగినదని ఆమోదముద్రను వేసినవారు కీ.శే॥ ఆచార్య యస్.వి. జోగారావుగారు, ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మ గారు, ఆచార్య తంగిరాల వేంకట సుబ్బారావుగారు.

పరిశోధన సాగడం ఒక యెత్తు, ప్రచురణ ఒక యెత్తు. అయినా నా పరిశోధనా వ్యాసాన్ని గుర్తించి, ఆర్థిక సహాయమును మంజూరు చేసినవారు తిరుమల-తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ యం. వి.యస్. ప్రసాద్ ఐ.ఏ.యస్. గారు, నా కృషిని గుర్తించి ప్రోత్సహించిన వారు డా॥ రావుల సూర్యనారాయణమూర్తి గారు (పి.ఆర్.ఓ.-తి.తి.దే.), శ్రీ కాట్రగడ్డ సుబ్బారావుగారు (సప్తగిరి సంపాదకుడు - తి.తి.దే.), ఆచార్య యస్.బి. రఘునాథాచార్యగారు (సంస్కృత విభాగం - శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం), అడిగిన వెంటనే అభిప్రాయాలను వ్రాసియిచ్చిన ఆచార్య కె. సర్వోత్తమరావు

గారు, ఎక్కువగా సహకరించిన నాభార్య శ్రీమతి డి. శ్రీరంజిని, ప్రోత్సహించిన నా చిరంజీవులు డి. శ్రీహరిహరనాథరెడ్డి: బి.టెక్., డి. కిరణ్మయి, సకాలములో ఈ గ్రంథమును అందముగా ముద్రించిన శ్రీ సత్యసాయి ప్రింటర్స్ అధినేత శ్రీ డి.యస్.పి. రామకృష్ణగారు.

డా॥ డి. జయరామ రెడ్డి

# విషయ సూచిక

# 1. ప్రస్తావన

"వింటే భారతం వినాలి తింటే గారెలు తినాలి" అను మాటల వరుసలు తెలుగునాట సర్వత్ర వినబడు సూక్తులు. ఔత్తరాహులకు శ్రీమద్రామాయణము ప్రీతికరమైనట్టు "ఆంధ్రులకు భారతము పరమాదరణీయము. కనుకనే సామాన్యజనులు కూడ వాడుకలో భీష్మ ప్రతిజ్ఞ, కుంతీ సంతానము, మయసభ, దుష్టచతుష్టయము, దాన కర్ణుడు, యక్షప్రశ్నలు, వలలుని వంట, సంజయ రాయబారము, ధృతరాష్ట్రుని కౌగిలి మొదలగు వానిని సందర్భమున కనుగుణముగా నన్వయించుకొనుట తెలిసినదే.

ప్రాచీన భారతీయార్యుల విజ్ఞానమును, నాగరికతను వ్యక్త పరచు సద్గ్రంథములలో వ్యాసప్రణీతమగు మహాభారతము ముఖ్య

మైనది. మానవుల భౌతిక, మానసిక, యాధ్యాత్మిక జీవితమంతయు భారతమున ప్రతిబింబితము. ఇట్టి భారతమును గూర్చి నన్నయ

సీ॥ "ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రం బని
కవి వృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్షణం బనియును
నైతిహాసికు లితిహాస మనియు
బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యం బని మహి గొనియాడుచుండ"(ఆది-1 ఆ 32)

అని స్పష్టముచేసెను. సంగ్రహముగా చెప్పదలచినది"ఆయుష్యంబు, ఇతిహాస వస్తు సముదాయంబు, ఐహికాముష్మిక శ్రేయః ప్రాప్తి, నైమిత్తికము, ఉత్తమ సభాసేవ్యము, లోకాగమన్యాయ్యై కాంత గృహంబు, నానా వేద వేదాంత విద్యాయుక్తము." ఇట్టి భారతమును గూర్చి జరిగిన పరిశోధన భారతరాశికంటె నెక్కువ యనుటలో నతిశయోక్తి లేదు.

తెలుగులో భారతమునుగురించి విశ్వవిద్యాలయములలో సాగిన పరిశోధన నాలుగు రకములు. 1. సాహిత్యసంబంధులు, శాస్త్ర సంబంధులు, తులనాత్మక పరిశోధనలు, ఇతరములు.ఆంధ్రమహాభారతముపై మొదటి సిద్ధాంత గ్రంథము "ఆచార్య" దివాకర్ల వేంకటావధాని గారి "ప్రాఙ్నన్నయ యుగం - నన్నయ భారతం." ఇదియే మొదటి సాహిత్య సంబంధి సిద్ధాంత గ్రంధము. శాస్త్ర సంబంధి పరిశోధనలో మొదటిది డా॥ పాటిబండ మాధవశర్మ గారి "ఆంధ్రమహాభారతము-ఛందః శిల్పం." తులనాత్మక పరిశోధనలో డా॥ కంబాలూరు వేంకటేశ

ఆచార్య గారి "మహాభారతం-పెరుందేవనార్, నన్నయల తులనాత్మక పరిశీలన" ప్రసిద్ధి పొందిన సిద్ధాంత గ్రంథము. భారతేతరకావ్యాలపై సాగిన పరిశోధన లనంతము.

భారతము "ఇతిహాసము." కథ ప్రత్యక్షముగ జరిగిన దనుట వలన నాకర్షణీయము. ఇందలి యితివృత్తము సువిశాలమగుటవలన జీవితమును సమగ్రముగ పోషించుట కనువైనది. ఒక్క కౌరవ వంశమేగాక యాదవ పాంచాల మాత్స్య వంశాదులుకూడ భారతమున ప్రాధాన్యము వహించినవి. శంతనుని చరిత్రతో మొదలై బహుముఖాలుగా విస్తృతిని పొంది పాండవుల స్వర్గప్రాప్తితో సమాప్తి నొందుటవలన సువిస్తరమైనది. ఆర్యావర్తమందలి "ఆర్యానార్య" సమ్మేళనమునకు, సంఘర్షణలకు నద్దము పట్టిన కథ భారత కథ. భారతమును కావ్యముగా, శాస్త్రముగా పరిశీలించిన వారే యెక్కువ. సామాజిక దృష్టితో పరిశీలించిన వారు తక్కువ. ప్రత్యేకించి "ఆంధ్ర మహాభారతము"న వరముల-శాపముల గురించి పరిశోధించిన వారు లేరు. ఈ దృష్టితో "ఆంధ్ర మహాభారతములో వరాలు, శాపాలు - ఒక పరిశీలన" అను నంశము స్వీకృతము.

## పరిశోధనా పరిధి

కవిత్రయ భారతమునందలి వరముల, శాపముల గురించి మాత్రము పరిశీలించుట తొలి ప్రయత్నము. అవసరమగుచోట్ల సంస్కృతభారతమును సంప్రదించుట పరిశోధనలోనియంతర్భాగమే. కథా విస్తృతి నందిన భారత భాగసౌష్ఠవమునకు వరములు, శాపము లెట్లుకుపకరించినవో సంప్రదించుట పరిశోధనలోని మరియొక దృష్టి. వరములను, శాపములను కథాభాగము ననుసరించి యొకచో క్రోడీకరించుటయేగాక యాయా వరముల శాపముల ప్రయోజనములను సూత్రబద్ధముగ వర్గీకరించుట మరియొక ప్రయత్నము.

ఈ సిద్ధాంత గ్రంథములో "ఐదు" ప్రకరణము లున్నవి.

మొదటిది ప్రస్తావన.

రెండవది వరము, శాపము-శబ్ద నిష్పత్తి, స్వరూపము.

మూడవది "ఆంధ్ర మహాభారతము" లోని వరముల, వృత్తాంతములు.

నాల్గవది "ఆంధ్రమహాభారతము"లోని శాపములవృత్తాంతములు

ఐదవది ఉపసంహారము.

తరువాతి ప్రకరణము "వరము, శాపము - శబ్ద నిష్పత్తి - స్వరూపము.

# 2. వరము, శాపము-శబ్దనిష్పత్తి స్వరూపము

ఆంధ్రమహాభారతములోని వరములను, శాపములను విశ్లేషించుటకు ముందు ఆ శబ్దములకున్న యర్థములను, వ్యాప్తిని, విమర్శకుల యభిప్రాయములను పరిశీలించుట యుక్తము.

2.1. ప్రసిద్ధ నిఘంటువులలోని వర శబ్దార్థ వివరణ :-

సూర్యకాంత్ గారి 'A Practical Vedic Dictionary' లో వర శబ్దార్థ వివరణ : వర్ + అ (వృ-chose) m.

ఇచ్ఛా, ఛాహ్, పసంద్, చాంటీ, wish, desire, choice, vi-21-4. కస్తే యజ్ఞో మనసే శం వరాయ. వర్ధనాయ X-164-2; భద్రం వై వరం వృణతే truely they make a good choice, boon. క ము స్విదతోధి వరం వరిష్యామహే. మైత్రేయాణి

సంహిత. what boon pray, beyond this shall we chose ఇష్ట పదార్థే desired object 1-119-3 యం శివనా బహుథఃసురిమా వరం శ్రేష్ఠమ్ ధనమ్ (an object of heart's desire) 11-39-2 యమా వరమా సచేత్ according to the wish of another.

Sir Monier Monier Williams గారి 'A Sanskrit-English Dictionary' లో వర శబ్దార్థ వివరణ :

వర్ : Vara act or object of chosing, choice, election which request boon, gift, reward, benefit, blessing, favour (varaya-varan.) A prati varam or varam varan according to which to one's heart's content

"వాచస్పత్యమ్"లో వర శబ్దార్థ వివరణ :

వర : న. ప్రియతే వృ కర్మణి అపవరి అచ్ వా 1. మనోజాభీష్టే అమరః వర ప్రాణాన్ పరిత్యక్ష ఇతి తంత్రమ్ ఆపే అయ్ అచ్య వా 2. ఇచ్ఛాయామ్, 3. యాచనే, 4. ఆవరణే, 5. వేష్టనే చ వృ- కర్మణి అప్, 6. అభీష్టే, 7. శ్రేష్ఠే చ వి అమరః, 8. జారే, 9. జామాతరి, 10. గుగ్గులౌ శబ్దమ్ చ, 11. వత్యా చ పు హేమ చ.

"మేదినీకోశము"లో వర శబ్దార్థ వివరణ :

వరో జామాతరి వృతౌ దేవతాదే రభీప్సితే
షిద్గే పుంసి త్రిషు శ్రేష్ఠే కుంకుమేతు నపుంసకమ్

"అల్లుడు, దేవతాదులవలన పొందబడు కోరిక, ఇష్టుడు, విటుడు" అను నర్థములలో పుంలింగములోను, "కుంకుమపూవు" అర్థములో నపుంస మని వివరణ.

"గురుబాల ప్రబోధిక"లో వరశబ్ద వివరణ :-

వర : ప్రియతే ఇతి వరః వృఞ్ వరణ్-వరింపబడునట్టిది.

వర: ప్రియతే జనై రితి వరం వృఞ్ సంభక్తౌ-జనులచేత నాశ్రయింప
బడునది. వరణం వరః వృత్తిశ్చ. వృఞ్ వరణే వరించుట
వరము వృత్తియును. ఈ రెండును కన్యాదులను వరించుటకు
పేర్లు.

సారో బల్లే స్థిరాంశే చ న్యాయ్యే క్లీబం వరే త్రిషు.

వర శబ్దము కన్నడాంధ్ర తమిళములందును గలదు. వీనిలో తమిళము చాల ప్రాచీన భాష. ప్రాచీన లిఖిత వాఙ్మయము గల సుసంపన్నమైన భాష.

'Tamil Lexicon' లో వర శబ్ద వివరణ :

వరం : Varam-n < Vara 1. Boon, gift, blessing by a deity or a great person కాదలిను వందు వరం కొడుత్తన్నే (తిరుమురు 94), 2. Grace, favour, help అనుగ్గిరగం (w), 3. Blessing ఆశీర్వాదం (యాళ్. అగ) 4 Supplication, solicitation, entreaty, request as made to a deity or a great person వేణ్డుకోల్ వళైయిలాళ్ వరత్తిన్ వందాళ్ (శీవక 201) 5. Desire విరుప్పం.

Rer. W. Reeve 'Dictionary of Kannada and English' లో వరశబ్ద వివరణ :

వర : Vara-S; A blessing, boon, gift especially from a Brahman or deity, 2. engaging appointing, selecting, 3. requesting, soliciting especially prevailing on a person by entreaty

to undertake any business. వరకొడు to confer a boon దేవరు వరకొట్టరు పూజారి వరకొడరు. వరకేళు to entreat a favour వరబేళు to go from the place of batling and sleep before an idol inorder to receive favourable intimations in a dream. respecting the obtaining a family.

"ఆంధ్ర శబ్ద రత్నాకరములో వరశబ్దార్థ వివరణ :

వరము : సం.వి.అ.న. 1. కుంకుమపూవు, 2. ఇంచుక ప్రియమైనది (ఈ యర్థమం దిది అవ్యయమని కొందఱు.) పుం. 1. దేవతాదులవలన పొందబడు కోరిక. 2. వరించుట. 3. ఒక నిధి.

పైవివరణవలన తెలిన విశేషములు—సంస్కృతాంధ్ర తమిళ కన్నడములందు "వర" శబ్దము కలదు. దాక్షిణాత్యభాషలందు 'వర' శబ్దమునకు సమానమగు మరొక పదము కనిపించదు. వర విషయములో "దేవతాదులవలన పొందబడు కోరిక" అను నర్థమునకు ప్రాధాన్యము కనిపించును. మఱియు "తనకంటె గొప్ప మానవుల_ మహర్షుల, మునుల, రాజుల, పెద్దలనుండి పొందబడు కోరిక, ఆశీర్వాదము, దీవెన" అని కూడ నర్థము స్ఫురించును.

2.2 ప్రసిద్ధ నిఘంటువులలోని శాప శబ్దార్థ వివరణ :

సూర్యకాంత్ గారి 'A practical vedic dictionary' లో "శాప" శబ్దార్థ వివరణ :

శాప. m. : ప్రవహమాణ కాష్ఠ అథవా అన్యకోయీ వస్తు drift wood floting, floting wood or any other thing VII-18-5. శాపం సింధునావు క్షణో దశస్థేః అభిశాపమ్ X.28-4. ప్రతీపం. శాపం నద్యో వహంతి ఉదకం. అన్యవ్యాహరణః curse

Sir Monier Monier Williams 'A Sanskrit English Dictionary' లో
శాప శబ్దార్థ వివరణ :

శాప : Sāpa. m. (ife. f. ā; fr. √sap) a curse malediction, abuse, oath, imprecation, ban, interdiction (acc. with √vac, √dā, pra-√yam, ny-√as, vi-√srij, ā-√dis, 'to pronounce or utter a curse on any one with dat-2 gen, loc. or acc. with prati, MBh; kav &e-grasta, mfn. seized by or suffering from a curse, ib.-tā, f-being under a curse, kad-nāsana, m 'c°-destroyer', N of a Muni.

V S. Apte గారి 'The Practical Sanskrit English Dictionary' లో
శాప శబ్దార్థ వివరణ :

శాప : (శప్.ఘఞ్) 1 A curse, an imprecation, anathema, 2 An interdiction, a ban-comp అంతః, అవసానమ్ నివృత్తిః of the end of a curse అస్త్రః having a curse, having a weapon, a sage saint, ఉత్సర్గః the utterance of a cusse- ఉద్ధారః, ముక్తిః, మోక్షః release or deliverance from a curse. గ్రస్త released from a curse- యంత్రితః, restrained by a curse

శాపిత. : P.P.I. Bound by an oath, conjured. 2. Sworn, adjurned.

"వాచస్పత్యమ్"లో శాప శబ్దార్థ వివరణ :

శాప : పుం. శప-ఘఞ్. 1, అభీష్ట భూవాదిత్యేవమ్ ఆక్రోశరూపే.
2. శపథే చ మేది.

"మేదినీకోశము"లో శాప శబ్దార్థ వివరణ :

శాప ఆక్రోశ దివ్యయోః
శాపః. పుం. ఆక్రోశము, తిట్టు
దివ్యయోః ఒట్టు

గురుబాల ప్రబోధికలో శాప శబ్దార్థ వివరణ :

శాప : శపన శపథః పుమాన్. శపన శపథ శబ్దములు-ఒట్టు పెట్టు
కొనుట, దీనిచేత జనము విశ్వసించును.

శాపశబ్దము కన్నడాంధ్ర తమిళములందును గలదు. వీనిలో తమిళము చాల ప్రాచీన భాష. ప్రాచీన లిఖిత వాఙ్మయముగల సుసంపన్నమైన భాష.

Tamil Lexicon III Volume

శాప : Capan-n ◄ sāpa-curse, imprecation. తనత్తోర్ పసిత్తు
క్కూరుం మొళి తడుప్పరుం చ్చావమ్-కంబ రామాయణం
అగలికై.

Rer W. Reeve 'Dictionary Kannada and English'లో శాప శబ్దార్థ వివరణ :

శాప : Shapa-S-curse; imprication,malediction, 2.abuse 3 an oathg
హిడి శాప విట్టు బగుళు to abuse excertirely శాపకుడువ
శాసిసు, శపిశు, to curse శాపగ్రస్త, శాపహోందిర్వ'
a man who has been cursed శాప విముక్తి, శాప విమోచనే
deliverence from a curee the removal of a curse శాపా
నుగ్రహనమర్థ one who is capable of blessing or cursing

శబ్దరత్నాకరములో శాప శబ్దార్థ వివరణ :

శాపము : సం.వి. అ. పుం. 1. తిట్టు, 2. ఒట్టు

పై వివరణవలన తేలిన యంశము:లు-సంస్కృతాంధ్ర తమి కన్నడ భాషలందు "శాప" శబ్దము కలదు. శాపమునకు దాక్షిణాత

భాషలందుగూడ సమానమగు మౌళికపదము కనిపించదు. శాపము నకు నెవరైనను కర్తలు కావచ్చును. శాపమునకు "ఒట్టు, తిట్టు" అను నవి సమానార్థకములు.

2.3. వర, శాపములు-మానసిక స్థితి :

ఒక వ్యక్తి నోటినుండి బహిర్గతమైన వాగ్రూప సముదాయము వర, శాపముల రెంటను ప్రధానము. కాని యింతకంటెను వీరివెనుక నున్న మానసికస్థితి ప్రధానము. సంప్రీతి యనునది వర ప్రధానము నకు భూమిక కాగా బాధాతప్త హృదయము శాపమునకు ప్రేరక మగుచున్నది.

2.4. వర, శాపములు-సాఫల్య వైఫల్యములు :

అతీతశక్తులు వర, శాపములకు మూలకేంద్రము. జపతపాదుల వలన, దైవానుగ్రహమువలన నతీతశక్తులు లభించుట యొక తెగకు చెందినవి కాగా నిష్కళంకమైన మనోవృత్తితో చెప్పుట రెండవ తెగకు చెందినవి. సామాన్య మానవుని మాటలు ఫలించుటయో నిష్ఫలములగుటయో రెండవ తెగకు చెందినవి.

ఒక వ్యక్తి సంపాదించుకున్న శక్తి తరుగుగలబట్టి వర, శాప ములు నిర్ధారితములగును. విశిష్టవ్యక్తి యీ తరుగుదల కారణముగా కొంతకాలమునకు సామాన్య వ్యక్తి యగును.

వరము యాచితము, అయాచితము, యాచితాయాచితాము కావచ్చును. అట్లే వ్యక్తి ప్రత్యక్షసంబంధముగాని, పరోక్షసంబంధము గాని శాపమునకు కారణము కావచ్చును.

2.5. వర, శాపముల ప్రాచీనత :

భారతీయ సంస్కృతికి మూలాధారమైన వేద వాఙ్మయములో "వరం, శాపం" అను మాట లున్నవి. ముఖ్యముగా ఋగ్వేద, అథర్వణ వేదములలో వర, శాప పదములు కనబడుచున్నవి.

2.5.1. వేదములలో వరము-శాపము :

వరమునకు నుదాహరణములు

ఆపోన దేవీరుపయన్తి హోత్రియ మనః పశ్యన్తి వితతం యథా రజః
ప్రాచైర్దే వాసః ప్రణయన్తి దేవయుం బ్రహ్మప్రియం జోషయన్తే
వరా ఇవ॥ (ఋగ్వేద. 1-83-2)

అనువాదము

ఉ॥ సూర్యుని కాంతి భూమిపయి సూటిగ బోయెడునట్లు దేవతా
వారము దృష్టులన్నియు సువాసిత పాత్రముపైకి బోయెడుం
గోరిక తోడ బాత్రములగూర్చిన వేరుగ దేవతోత్తముల్
సారము గల్గు సోమరస సారము గోరుచునుందు రెప్పుడున్

ఆ నో అగ్నే సుమతి సైభలా గమే దిమామ్ కుమారీ సహనో భగేమ్న
జుష్టా వరేషు సమనేషు వల్గురేషమ్ పత్యా సౌభగమస్త్వ స్యై॥
అథర్వణవేద-2-36-1

శాపమునకు నుదాహరణములు

అర్ణాంసి చిత్ పప్రథానా సుదాస ఇన్ద్రో గాధాన్య కృణోత్ సుపారా
శర్ధన్తం శిమ్యు ముచథస్య నవ్యః శాపం సిన్ధూ నామకృణో దశస్త్రీః
ఋగ్వేద. 7-18-5

అనువాదము :

వ॥ స్తుతియోగ్యుడగు నింద్రుడు నదులను ప్రథితములుగా జేయుచు సునిశ్చితల స్పర్శయోగ్యులుగాను సుఖపార యోగ్యులుగాను జేయుచున్నాడు.

2) ఇమాం యాః పఞ్చ ప్రదిశో మానవీః పఞ్చ కృష్టయః
వృష్టే శాపం నదీరివేహ స్ఫాతిం సమావహాన్॥
అథర్వణవేద-3-24-3

2.5.2 ఇతిహాసములలో వరము-శాపము :

ఇతిహాసములలో ప్రాచీనమైన రామాయణమునందు 92 వరములు గలవు. వీటిలో రామాయణ కథకు సంబంధించినవి 30. రామాయణమందలి వరములలో తొలి, తుది వరములు బ్రహ్మ యిచ్చినవే. తొలి వరము "అయాచితము," ఇది బ్రహ్మ వాల్మీకి మహర్షికి పుణ్య (ఊర్ధ్వ) లోకము కలిగించినది. తుదివరము యాచితము. ఇది దేవతల ప్రార్థనపై బ్రహ్మ మేఘనాథు (ఇంద్రజిత్తు) నకు నచ్చజెప్పి "ఇంద్రుని"ని విడిపించినది.

రామాయణమందలి ప్రసిద్ధమైన వరములు - నారాయణమూర్తి దేవతల ప్రార్థనపై దశరథరాజునకు పుత్రుడుగాపుట్టుదునని పలుకుట, దశరథుడు కైకేయికి నిచ్చిన రెండు వరములు, "అడవి"లో మునుల ప్రార్థనపై రాక్షసులను చంపుదునని శ్రీరాము డభయము నిచ్చుట, జటాయువుకు, శబరికి శ్రీరాము పుణ్యలోక ప్రాప్తిని కలిగించుట, శ్రీరామ సుగ్రీవులు పరస్పరము "అభయ", శరణులను పొందుట, శ్రీరాముడు కాకాసురునకు, విభీషణునకు శరణు నిచ్చుట,

హనుమంతుని తోక కాలకుండ చల్లగ నుండవలెనని సీతాదేవి అగ్ని దేవుని ప్రార్థించుట, సముద్రముపై వారధిని నీలుడను వానరుడు కట్టునని సముద్రుడు శ్రీరామునకు నుపాయమునుచెప్పుట, శ్రీరాముడు రావణుని చంపుటకు మూడుమార్లు "ఆదిత్య" హృదయమును పఠించగా సూర్య భగవానుడు ప్రత్యక్షమై శ్రీరాముని ప్రోత్సహించుట, మనుష్యులవలన కాక మరెవ్వరివలన రావణునకు మరణము లేకుండునట్లు బ్రహ్మ వరము నిచ్చుట, దేవతల ప్రార్థనపై బ్రహ్మ కుంభకర్ణునకు గొప్ప వరము నీయకుండ నిద్రా వరము నిచ్చుట మొదలగునవి.

రామాయణమునందు 40 శాపములు గలవు. వీటిలో 2,3 పునరావృత్తము. వీటిలో రామాయణ కథకు సంబంధించినవి 9. రామాయణములో శాపమునకే ప్రాధాన్యము. వాల్మీకి 'ఆది" శ్లోకము శాపమునే తెలుపును. తొలి, తుది శాపములను పరిశీలించగా తొలి శాపము శాశ్వతమను కీర్తి కలుగకుండుగాక యని వాల్మీకి బోయవానిని శపించెను. తుదిశాపము సంతానము కలుగకుండుగాక యని పార్వతీదేవి దేవతలను శపించెను.

రామాయణమందలి ప్రసిద్ధమైన శాపములు - గౌతమ మహాముని తన భార్య "అహల్య"ను రాయిపై పడియుండి శ్రీరాముని పాదము సోకగనే శాప విమోచనమగునని పలుచుట, శ్రవణుని తండ్రి దశరథుని పుత్రశోకముతో మరణింతువని శపించుట, తన వంశములో పుట్టబోవు రాముడను వానిచే సంహరించబడుదువని "అనరణ్యుడు" రావణుని శపించుట, తన వంటి రూపముగల వానరులే నాశనము చేయుదురని నందికేశ్వరుడు, రావణుని శపించుట,

మరొక జన్మము నెత్తి నీ పాలిటి మృత్యువు నగుదునని వేదవతి రావణుని శపించుట, ఇష్టములేని స్త్రీని బలవంతము చేసినచో తల పగిలి చచ్చునని నలకూబరుడు రావణుని శపించుట, నరజన్మము నెత్తి చిరకాలము సతీ వియోగమువలన బాధపడుదువుగాక యని భృగుమహర్షి భార్య ఖ్యాతి విష్ణువును శపించుట మొదలగునవి.

రామాయణ భారతము లందలి కొన్ని వరములకు సామ్య మున్నది. అవి 6 1. దశరథుడు కైకేయికి నిచ్చిన రెండువరములు. 2. వారధి నిర్మాణమును గురించి శ్రీరామునకు సముద్రుని యుపాయము, 3. వైశ్రవణు (కుబేరు)డు తపమును చేసి బ్రహ్మవలన పొందినవరములు, 4.రావణునకు మనుష్యులవలనతప్ప,మరెవ్వరివలన మరణము లేకుండునట్లును, 5. కుంభకర్ణునకు నిద్రా వరమును, 6. ధర్మమును విడువకుండునట్లును, నభ్యసించకనే విభీషణునకు బ్రహ్మాస్త్ర ప్రాప్తిని బ్రహ్మదేవు డిచ్చిన వరములు.

**రామాయణ భారతము లందలి కొన్ని వరములకు కొంచెము తేడా యున్నది-అవి-5.** 1. రామాయణములో ఇంద్రునికి వృత్రాసురుని సంహారమువలన కలిగిన బ్రహ్మహత్యాదోషములైన మాలిన్యమును, "అకలి"ని సరయూ నది సమీపారణ్యమున వదలెను. వాటిని గ్రహించిన జనపదములకు మలదమనియు, కరూశమనియు పేర్లు కలిగి లోకమున ఖ్యాతినిగాంచునని "అయాచిత" వరమును ఇంద్రుడే యీయగా భారతములో ఇంద్రుని బ్రహ్మహత్యా దోషమును "అగ్ని, ఓషధి, తృణ, వృక్ష, స్త్రీ, జలము"లకు బ్రహ్మ పంచి యిచ్చెను. 2. రామాయణములో సగరుడను రాజు తన యిద్దరు భార్యలతోకలిసి హిమవంతమున సంతానార్థియై తపమును చేసెను. భృగుమహర్షి

ప్రత్యక్షమై యిద్దరి భార్యలకు సంతానమును కలిగించగా భారతములో సగరుడు తన యిద్దరి భార్యలతో కలిసి హిమవంతమున శివు నుద్దేశించి తపమును చేసి శివునివలన నిద్దరి భార్యలకు సంతానమును పొందెను. 3. రామాయణములో భగీరథుడు తపస్సును చేసెను. బ్రహ్మ ప్రత్యక్షమయ్యెను. గంగాజలముతో తన పినతండ్రుల భస్మమును తడుపుట, తనకు సంతానము కలుగుట-అను వరములను కోరెను. "అవి నేరువేరుగాక" అని బ్రహ్మ దీవించెను. శివు నుద్దేశించి తపమును చేయుమని చెప్పెను. అతడట్లు చేసెను. శివుడు ప్రత్యక్షమై మొదట గంగను తన జడలలో ధరించి పిమ్మట భూమి మీదకు వదలగా భారతములో భగీరథుడు మొదట ఆకాశగంగ నుద్దేశించి, పిమ్మట శివునుద్దేశించి తపమును చేసి భూమి మీదకు గంగావతరణమును చేయించెను. 4. రామాయణములో హనుమంతుని కార్యమునకు మెచ్చి యెట్టి యాయుధమువలనను మరణము లేకుండునట్లును శ్రీరాముడు స్వచ్ఛంద మరణము నీయగా భారతములో హనుమంతుని సేవకు మెచ్చి చిరంజీవిగా శ్రీరాముడు వరము నిచ్చెను. 5. రామాయణములో శ్రీరాముని జయమునకు సంతసించి శ్రీరాముడు కోరినట్లు మరణించిన సైన్యమును "ఇంద్రుడు" బ్రతికించగా భారతములో సీతాదేవి "అగ్ని"పరీక్ష సమయమున బ్రహ్మ ప్రత్యక్షమై, యామె పతివ్రత, పవిత్రతలను స్తుతించి యాయామాచితముగా మరణించిన సైన్యమును బ్రతికించెను.

రామాయణ భారతము లందలి కొన్ని శాపములకు సామ్యమున్నది. అవి-4. 1. రావణునికి నలకూబరుని శాపము. 2. శుక్రాచార్యుడు యయాతి కిచ్చిన శాపము, 3. యయాతి తన మొదటి

నలుగురు కొడుకుల కిచ్చిన శాపము, 4. కపిల మహాముని క్రోధ వీక్షణములచే సగర పుత్రులు భస్మమగుట.

రామాయణ భారతము లందలి యేకైక శాపమునకు తేడా గలదు. రామాయణములో నృగురాజును బ్రాహ్మణు లిద్దరు తొండవు కమ్మని శపించగా- భారతములో నృగుడు యమలోకమునకు వెళ్ళినపు డతని పాపఫలముచే భూమి మీదకు చేరి తొండగా మారెను.

2.6. బైబిలులో వరము, శాపము :

ఇలాగే హిబ్రూ భాషలో వ్రాయబడిన బైబిలుకు తెలుగు నను వాద గ్రంథములో వరమునకు పర్యాయపదములైన "ఆశీర్వాదము, వరము, అనుగ్రహము, దీవన"లును, శాపమునకు 'శపించెను' శాపము నిచ్చెను" అను పదములు కనబడుచున్నవి.

బైబిలులోని మొదటి వరము :

మొట్టమొదటి పర్యాయముగా సృష్టించిన ప్రాణులలో (చరిత్రలో) దేవుడు చేపలను పక్షులను"ఆశీర్వదించెను, అను గ్రహించెను, వరముల" నిచ్చెను (ఆదికాండము 1వ అధ్యాయము. 22వ వచనము) సృష్టి 5వ దినమున దేవుడు చేపలను, పక్షులను సృష్టించెను. అతడు చేపలతో "మీరు ఫలించి యభివృద్ధిని పొంది సముద్ర జలములలో నిండి యుండుడనియు, పక్షులు భూమిమీద విస్తరించును గాక యనియు వాటిని ఆశీర్వదించెను. (ఆదికాండము 1వ అధ్యాయము-22వ వచనము.)

బైబిలులోని మొదటి శాపము :

యెహోవా అబ్రహాముతో "నేను నీకు చూపిన దేశమునకు నీవు వెళ్ళుము. నిన్ను గొప్ప జనముగా చేసి, యాశీర్వదించి నీ నామ

మును గొప్ప చేయుదును. నీవు "ఆశీర్వాదముగా నుందువు" అని చెప్పి, నిన్ను "ఆశీర్వదించు" వానిని "ఆశీర్వదించుదును, నిన్ను దూషించు వానిని శపించుదును. భూమియొక్క సమస్త వంశములు నీయందు ఆశీర్వదించబడును" అని చెప్పెను. (ఆదికాండము 12వ అధ్యాయము, 3వ వచనము.)

పైపరిశీలనవలన వర, శాపము లను రెండుపదములు ప్రాచీనములు. దక్షిణభారత సాహిత్యములందును నీశబ్దములకే వ్యాప్తియుని, వర శాపముల ప్రసక్తిపై భారతేతిహాసములందేకాక బైబిలు, ఖురాను మొదలగు గ్రంథములందును కలదనుట స్పష్టము.

తరువాతి ప్రకరణము "ఆంధ్ర మహాభారతములోని వరముల వృత్తాంతములు.

# ఆంధ్రమహాభారతములో వరాలు, శాపాలు- ఒక పరిశీలన

## 3. ఆంధ్రమహాభారతములోని వరముల వృత్తాంతములు

ఆంధ్ర మహాభారతములోని వరములను ప్రధానముగా యాచిత,అయాచిత, యాచితాయాచితవరములని మూడువిధములుగా వర్గీకరించవచ్చును.

3.1 యాచిత వరములు :

యాచిత మనగా "అడుగుట, ప్రార్థించుట" అని యర్థము. తపమువలనగాని, దైన్య ప్రార్థనవలనగాని పొందెడు వరము లన్నియు యాచిత వరములే. ఈ యాచిత వరములను సాఫల్య, వైఫల్య, అదత్త వరములని మూడువిధములుగా విభజించవచ్చును.

3.1.1 సాఫల్యవరములు :

ఫలమనగా "అనుగ్రహము". సఫలమనగా ఫలసహితమని యర్థము. సఫలముయొక్క భావము సాఫల్యము. యాచకుల కోరిక లన్నియు దైవానుగ్రహమువలనఫలించినచో నట్టివిసాఫల్యవరములు. వీటిని ప్రధానముగా కుటుంబసంబంధి, వ్యక్తిసంబంధి, రక్షణానుబంధి, మనస్తత్వానుబంధి, విశ్వాసానుబంధి వరములని విభజించవచ్చును.

3.1.1.1 కుటుంబ సంబంధి వరములు :

నియమ నిబంధనలను గలిగి వారసత్వరూపమైన యాచార సంప్రదాయములకు కట్టుబడి, సాంఘికమర్యాదలకు లోబడి వర్తించు చిన్న సమాజము కుటుంబము. ఇందులోని తల్లి, తండ్రి, అత్త, మామ

భర్త, సంతానము మొదలైన వారి సంబంధమును గలిగిన వ్యక్తుల సమూహము కుటుంబమనికూడా వ్యక్తీకరించవచ్చును. కుటుంబములోని పైవ్యక్తులలో నెవరైన కుటుంబ సంక్షేమముకొఱకు చేయు ఏ ప్రయత్నమైన కుటుంబ సంబంధి యగును. వీటిని ప్రధానముగా వైవాహిక, పతి, సంతాన, భుక్తి, పునరుజ్జీవన వరములుగా వర్గీకరించ వచ్చును.

3.1.1.1.1 వైవాహికవరములు :

వివాహమునకు సంబంధించిన వరములు వైవాహిక వరములు. ఇట్టి వానిని రెండురకములుగా వర్గీకరించవచ్చును. 1. పురుష ప్రయత్నోపేత వరములు 2. వనితా ప్రయత్నోపేత వరములు.

3.1.1.1.1.1 పురుష ప్రయత్నోపేత వరములు :

ఇట్టివివాహములందు ప్రధానముగా పురుషుని ప్రయత్నములకే ప్రాధాన్యము. ఒక స్త్రీని దర్శించి, మోహించి, వరించు సన్నివేశము లిందెక్కువ. ఇట్టివి "ఆఱు" కలవు. 1. గంగా శంతనోద్వాహము 2. తపతీ సంవరణ సంవరణము 3. చిత్రాంగదార్జున పరిణయము 4. అగస్త్య లోపాముద్ర వరణము 5. సత్యవతీ ఋచీక వివాహము 6. సుదర్శనాగ్ని సంవరణము.

3.1.1.1.1.1.1 గంగా శంతనోద్వాహము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" చతుర్థాశ్వాసములో (143-150) గలదు. వరమును కోరి పొందినది గంగాదేవి. వరప్రదాత శంతనుడను రాజు.

ఒకరోజున శంతనుడు వేటకు నడవికి వెళ్ళెను. అచట నొక సుందరాంగిని చూచెను. ఏ తెగకు చెందినదో యని యనుమానించెను.

ఒంటరిగ దుర్గమారణ్యమున మర్త్యాంగన యెందుకు వచ్చునని సంశ-యించెను. తదేకదృష్టితో నామెను చూడసాగెను. ఆమెయును రాజు సౌందర్యవిలాసములకు ముగ్ధురాలయినది. అంత రాజొక్కమాటయు నడుగలేదు. అప్పుడామెయే తెగించి —

కం॥ "భూనాథ నీకు భార్యం
గా నన్ను బరిగ్రహింప గడుకొని యిష్టం
బేని సమయంబు సేయుము
మానుగ నా కిష్టమయిన మార్గము ప్రీతిన్" (149)

వ॥ "అది యెట్లంటేని యే నెద్ది సేసినను దానికి
నొడంబడి వారింపకుండను నన్ను నప్రియంబులు
పలుకకయుండను వలయునట్లైన నీకు భార్యనై
యభిమత సుఖంబు లొనరింతునటుగాక నీ
వెప్పుడేని నన్ను నప్రియంబులు పలుకుదప్పుడ
నిన్ను బాసిపోదునని" (150) పలికెను.

అందుకు శంతనుడు సమ్మతించి గంగను పరిగ్రహించెను. అప్పటి నుండి గంగాదేవి మనుష్య స్త్రీ రూపమును ధరించి భీష్మ జననము వఱకు నతనితో కాపురము సలిపెను.

3.1.1.1.1.1.2 తపతీ సంవరణ సంవరణము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది"పర్వము సప్తమాశ్వాసములో (70-88) గలదు. వరమును కోరి పొందినది సంవరణుడను రాజు. వరప్రదాత సూర్యభగవానుడు.

ఒకనాడు సంవరణుడు వేటకు నడివికి వెళ్ళెను. వేటలో రాజు నలసిపోయెను. అతని గుఱ్ఱములును డస్సినవి. మంచినీటికొఱకు

తచ్చాడుచుండగా కొండ దగ్గర కోమలి నొకదానిని రాజు చూచెను. దప్పికను మరచి యామెను తేరిపార చూడసాగెను. చివరకు నామెను ప్రశ్నించెను. ఆమె సమాధానముసుచెప్పకనే మటుమాయమయినది. ఈ హఠాత్పరిణామమునకు రాజు దిగ్భ్రాంతుడై నేలబడెను. అతని పట్లననురక్తయైన యామెయు దిగులుపడి కారణమును ప్రశ్నించినది అతడు "నన్ను గాంధర్వ వివాహంబున వరియింపుమని" (80) కోరెను. ఆ పర్వతసీమ యందుండి తపోనియమాదులతో సూర్యు నారాధింపుమని తెలిపి యామె యంతర్థానమయినది. వెంటనే రాజు మూర్ఛిల్లెను. పిమ్మట తెప్పరిల్లెను. సూర్యునారాధించుటకంటె, నుపాయార్థము కులపురోహితుడును, తపశ్శక్తి సంపన్నుడునగు వసిష్ఠుని నారాధించుట తగునని యట్లు చేసెను. పండ్రెండవదినమున వసిష్ఠుడా సీమకు వచ్చెను. సంవరణుని స్థితిని యోగదృష్టితో వసిష్ఠుడు గ్రహించగలిగెను. సూర్య ప్రీతికరములగు మంత్రములతో దిననాథుని ప్రస్తుతించెను. సూర్యుడు ప్రత్యక్షమయ్యెను. ఆ కర్మ సాక్షి వసిష్ఠాగమన కారణము నడిగెను. అంత వసిష్ఠుడు సంవరణుని గుణగణముల కీర్తించి, తపతిని సంవరణునికి భార్యగా నొసగుమని యడిగెను. సూర్యుడు వసిష్ఠుని మాటలనాదరించి

ఆ.వె॥ "వరుడు రాజ వంశకరుడు సంవరణుండ
యను గుణుండు దీని కనికరంబు
గారవమున నిచ్చి యా ఋషి తోడ బు
త్తెంచె దేవతి గురు కులాంచితునకు" (87)

సూర్యభగవానుని రథముపై వసిష్ఠుడు తపతిని తోడుకొని తెచ్చి విధివంతముగ సంవరణునకు వివాహమును చేసెను.

3.1.1.1.1.1.3 చిత్రాంగదార్జున పరిణయము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది"పర్వ మష్ట-మాశ్వాసములో (140-145) గలదు. వరమును కోరి పొందినవాడు. "అర్జునుడు" వరప్రదాత చిత్రవాహనుడను రాజు.

అర్జునుడు ద్వాదశమాన వ్రతమును చేయుటకు తీర్థములను సందర్శించుచు దక్షిణ భారతదేశమున నున్న మణిపూరు పురమును చేరెను. ఆ పురాధిపతియైన చిత్రవాహనుడు "అర్జునుని" పూజించెను. అప్పుడే అర్జునుడు చిత్రవాహనుని కుమార్తెయగు చిత్రాంగదను చూచెను. ఆమెను భార్యగా నపేక్షించెను. ఆ విషయము నాప్తులవలన చిత్రవాహనుడు తెలిసికొనెను. తన కూతురు నిచ్చి వివాహమును చేయుటకు తన యంగీకారమును అర్జునునికే తెలిపెను. తన వంశ చరిత్రను వివరించి తనకు కుమారుడు లేకుండుటను ప్రస్తావించి

తే.గీ॥ ఇందు బుట్టిన సుతుడు మా కిందు వంశ్య
వంశవిస్తారకుడు గావలయు నిదియ
యీ లతాంగికి సుంకు విట్లీగనోపు
దేని పెండిలి యగుమ యీ యింతి ప్రీతి (144) పలికెను.

అందుకు అర్జునుడు

వ॥ "చిత్రవాహను వచనంబున కొడంబడి చిత్రాం
గద వివాహం బయ్యెను" (145)

3.1.1.1.1.1.4 అగస్త్య లోపాముద్ర వరణము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య" పర్వము ద్వితీయాశ్వాసములో (324-333) గలదు. వరమును కోరి పొందిన వాడు అగస్త్యమహర్షి. వరప్రదాత విదర్భరాజు.

అగస్త్యమహర్షి వివాహము నొల్లక కాలహరణము చేయసాగెను. అతని చేతకు పితృదేవతలు పరితపించిరి. పితౄణమును తీర్చుమని యాదేశించిరి. అగస్త్యుడు సమ్మతించెను. పూర్వము తన తపశ్శక్తి వలన విదర్భరాజునకు లోపాముద్ర యను కుమార్తె కలిగియుండుట యామె యుక్తవయస్కురాలైన విషయ మా సమయమున మహర్షికి నవగతమయినది. కనుక రాజు కడకు వెళ్ళి "నాకు లోపాముద్ర నిచ్చునది" (328) అని యడిగెను. ఏమి చెప్పవలెనో రాజుకు తోచ-లేదు. పాణిగ్రహణమును చేసినచో కుమార్తె పడు బాధల నూహించి, పరితపించెను. చేయనిచో ఋషి శాపమును పెట్టునేమో యని భయ-పడెను. లోపాముద్ర యా విషయమును తెలిసికొని తండ్రి కడకు వెళ్ళి తా నా ఋషిని వివాహమాడుదునని చెప్పెను. అందు కామె తల్లిదండ్రులు సంతసిల్లిరి.

వ॥ "విధ్యుక్తంబుగా నక్కొమలి నగస్త్యునకు వివాహం
బు చేసిరి" (333)

తరువాత లోపాముద్ర నారి చీరలను ధరించి ఋషి వెంట నరణ్యమున కేగినది.

3.1.1 1.1.1.5 సత్యవతీ ఋచీక వివాహము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య" పర్వము తృతీయాశ్వాసములోను (131-133) తిక్కన భారతభాగము "అను-శాసనిక" పర్వము ప్రథమాశ్వాసములోను(104-107) నించుమించు సమానముగా నున్నది. వరమును కోరి పొందినవాడు ఋచీకుడను ముని. వరప్రదాత గాధియను రాజు.

కన్యాకుబ్జ దేశాధిపతి గాధి. అతని కుమార్తె సత్యవతి. భృగు మహర్షి పుత్రుడగు ఋచీకుడు గాధి కడకేగి సత్యవతిని తన కిమ్మని

యడిగెను. గాధి కేమియు తోచలేదు. కన్యాశుల్కముగ నొక చెవి నీలమును, నితరంగములు తెలుపును గలిగిన వేయి గుఱ్ఱముల నొసగుమని స్పష్టము చేసెను. ఋచీకుడు తదర్థము వరుణదేవుని ప్రార్థించెను. సంస్మరణ మాత్రమున నటువంటి తురగములు ప్రత్యక్షమగునని వరుణుడు వరమొసగెను. అట్లే కన్యాకుబ్జమున ఋచీకుడు కోరినంత గుఱ్ఱములు లెగూట నిలిచినవి. రాజు ముని శక్తికి నచ్చెరువుపడెను. మాట తప్పినచో తన్ను శపించునేమో యని కళవళ పడెను. చివరకు కన్యాశుల్కమును పరిగ్రహించి

> తే.గీ. "గాధి యమ్ముని పుత్రు శీఘ్రమున పెండ్లి
> సేసెను" (అనుశా-ప్ర.ఆ. 107)

3.1.1.1.1.1.6 సుదర్శనాగ్ని సంవరణము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వము ప్రథమాశ్వాసములో (44-58) గలదు. వరమును కోరి పొందినవాడు "అగ్ని దేవుడు". వర ప్రదాత మను వంశమున బుట్టిన దుర్యోధనరాజు.

దుర్యోధనుడు సకల జన క్షేమంకరముగ రాజ్యమును పాలించు చుండెను. అంత నర్మదానదికి దుర్యోధనునిపట్ల వలపు కలిగినది. వనితయై యెదుట నిలిచినది. వారిరువురికి "సుదర్శన" జనించినది. ఒక సమయమున దుర్యోధనుడు యాగమును చేయ సమకట్టెను. పరిచర్యలకు సుదర్శనను నియమించెను. అగ్నిదేవుడామె యంద చందములకు ముగ్ధుడయ్యెను. తన వలపు నామెకు బహిర్గతము చేసెను. కాని పెద్దల నడుగమని సుదర్శన బదులిచ్చెను. యాగాంత మున రాజు బ్రాహ్మణులకు భూరి దక్షిణలొసగుచుండ "అగ్ని దేవుడు" బ్రాహ్మణాకారమున వచ్చి "నాకు నీపె నృప నీదు పుత్రి గృప యేర్పడ దానము గాగ" (53) అని ప్రార్థించెను. అన్యవర్ణుడును,

దీనుడును నైన నతనికి తన కూతురు నిచ్చుటకు, రాజు సమ్మతించలేదు. తరువాత రాజు మరల మరియొక యజ్ఞమును చేయునప్పుడు యజ్ఞ-కుండమున "అగ్ని దేవుడు" వెలుగలేదు. అప్పుడు రాజును, ఋత్విజులు నాశ్చర్యపడిరి. తమ చేతలలోనేదియో లోపముకలిగినదని భావించిరి. భవ్యమంత్రములచే పావనుని ప్రస్తుతించిరి. అప్పుడా దేవుడా భూదేవతలకు నల్లన తన తెలంగెఱింగించెను. ఆ ఋత్విజు లా విషయము నా రాజునకు విన్నవించిరి. వెంటనే యా రాజు

> "గౌరవంబు సంతసము దలకొనగ నయ్యింతి బెండ్లి
> సేసెను" (58)

విప్రవేషమున "అగ్ని"సుదర్శనను వరియించెను. హోమకుండమున "అగ్ని" ప్రజ్వలించెను.

3.1.1.1.1.2 వనితా ప్రయత్నోపేత వరములు :

ఇట్టి వివాహములందు వివాహ ప్రయత్నములకు వనితలే సంసిద్ధులగుచుందురు. భర్తృప్రాప్తికై వగచుట, తపాదులతో సాధించుట వీనిలో కనిపించు సామాన్యలక్షణములు. ఆంధ్ర మహా-భారతములో నిట్టివి మూడుగలవు. 1. దేవయానీ యయాతుల పాణి గ్రహణము 2. దేవసేనా కుమారస్వాముల కళ్యాణము 3. ఇంద్రసేనా వివాహము.

3 1.1.1.1.2.1 దేవయానీ యయాతుల పాణిగ్రహణము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వము తృతీయాశ్వాసములో (153-169) గలదు. వరమును కోరి పొందినది దేవయాని. వరప్రదాతయయాతి.

దేవయాని శుక్రాచార్యుని కూతురు. శుక్రాచార్యుడు రాక్షసులకు గురువు. మరియు రాక్షసుల రాజైన వృషపర్వునికి పురోహితుడు, మంత్రికూడ. వృషపర్వుని కూతురు శర్మిష్ఠ. ఆమెకు వేయిమంది దాసీలు. దేవయాని శర్మిష్ఠలు సఖులు. ఒకానొక జలక్రీడాఘట్టములో శర్మిష్ఠ వేయిమంది దాసీలతో దేవయానికి దాసీయయ్యెను. యయాతి చంద్ర వంశపు క్షత్రియుడు. వేటకు వెళ్ళి, నీటికై వెదకుచు నామెను రక్షించెను. మరియొక పర్యాయము యయాతి వేటకు వెళ్ళెను. అదేరోజున దేవయాని తన దాసీలతో కలసి వనవిహారమునకువెళ్ళెను. యయాతి వారిని చూచెను. దేవయాని ప్రక్కన శర్మిష్ఠను గాంచెను. ఆమె యామాకిని కనుగొనెను. దేవయాని కల్పించుకొని శర్మిష్ఠను గురించి తెలిపి, యామె తన దాసి యని చెప్పెను. మరియు తన్ను రక్షించిననాడు తన దక్షిణపాణిని చేపట్టుట తాను మరచిపోలేదని పలికి

ఉ॥ "నన్ను వివాహమై నహుషనందన యీ లలితాంగిందొట్టి యీ
కన్నియ లందఱున్ దివిజ కన్యలతో నెనయైన వారు నీ
కున్నతి బ్రీతి సేయగ నృపోత్తమ నాసవు బోలి లీలతో
నిన్నరలోక భోగము లనేకములందుము నీవు" (161) అని

యడిగెను. క్షత్రియులు బ్రాహ్మణకన్యను వివాహమాడుట ధర్మ విరుద్ధమని యయాతి నిరాకరించెను. ధర్మాధర్మములను నడుపుచున్న శుక్రాచార్యుడు సమ్మతించినచో వివాహమాడుదువా? యని దేవయాని ప్రశ్నించెను. యయాతి అందుకు సమ్మతించెను. వెంటనే యామె తన తండ్రిని పిలిపించి విషయమును వివరించెను. అతడు కుమార్తెపై కపటించి

వ॥ "యయాతికి నీకును నయిన యీ వివాహంబునం
దపక్రమ దోషంబు లేకుండెడు మని వరం

బిచ్చి య య్యిరువురకుం బరమోత్సవంబున వివా
హంబు సేసెను." (169)

పిమ్మట యయాతి దేవయానితోఁబాటు సహస్రకన్య దాసీయుత శర్మిష్ఠను గూడ పిలిచికొని తన పురమునకు వెళ్ళెను.

3.1.1.1.1.2.2 దేవసేనా కుమారస్వాముల కళ్యాణము :

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్యపర్వము." పంచమాశ్వాసములో (174-192, 235-237) గలదు. వరమును కోరి పొందినది దేవసేన. వరప్రదాత ఇంద్రుడు.

దేవ దానవ సంగ్రామములో నొకపుడు దేవతలు పరాజితులైరి. దేవేంద్రుడు రాక్షస నిర్మూలనార్థము తగిన సేనానికొఱకు మానస పర్వతమున పరితపించసాగెను. అపుడే స్త్రీ యార్తనాదము విన బడినది. ఇంద్రు డచ్చటికి వెళ్ళి కేశి యను రాక్షసునితో పోరాడి, జయించి యా స్త్రీని రక్షించెను. ఆమె యెవరైనదియడిగి తెలిసికొనెను. ఆమె తనకు పినతల్లి కూతురని, దేవసేన యని తెలిసెను. అప్పుడు దేవసేనకు వరమొసగుటకు "ఇంద్రుడు" తన సంసిద్ధతను వ్యక్తము చేసెను. అంత దేవసేన ప్రథితపురుషుడగు భర్తను వెదకుమని కోరెను. ఆ కోరికనువిని, యామెకు భర్త యెవ్వడగునో యని ఇంద్రు డాలోచించెను. ఆ సమయము రౌద్ర నామకమై సోమ సూర్యసంగమ కారణమైన "అమావాస్య"యై యుండెను. కావున సూర్య సోమాగ్ని తేజసుతో పుట్టినవాడే యామెకు పతి యగునని నిశ్చయించెను. ఆమెను పిలిచికొని బ్రహ్మయొద్దకు వెళ్లి యామెకు తగిన వరుని కృపతో నొసగుమని ప్రార్థించెను. అట్టివాడు త్వరలో నుదయించ

నున్నాడని తెలిపెను. ఇంద్రు డా సమయమునకై వేచియుండెను. పరమశివుని దయతో "అగ్నిదేవు"నికి పుత్రోదయము కలిగెను. ఐదు రోజులు గడచెను. ఆఖరి రోజున ఇంద్రుడు దేవసేన నలంకరించి కుమారుని దగ్గరకు పిలిచికొని వెళ్లెను.

వ॥ "ఇక్కన్నియ భవదర్థంబై పరమేష్ఠిచేత సృజ
యింపం బడియెం గావున నివ్వర వర్ణిం బరిగ్ర
హింపుమని" (238) అడిగెను:

అందులకు కుమారస్వామి సమ్మతించెను. మంగళ తూర్య నాదములమధ్య దేవమంత్రి మంత్రములను చెప్పుచుండగా అగ్ని సాక్షిగ కుమారస్వామి దేవసేన పాణిని గ్రహించెను.

3.1.1.1.1.2.3 ఇంద్రసేనా వివాహము :

ఈ వృత్తాంతము "నన్నయ" భారతభాగము "ఆదిపర్వము" సప్తమాశ్వాసములో (259-265) గలదు. వరమును కోరి పొందినది నాళాయినియైన ఇంద్రసేన. వరప్రదాత పశుపతి.

నాళాయిని మౌద్గల్యుని భార్య. వారిది యనేకవేల సంవత్సరముల దాంపత్యము. కాని నాళాయినికి తృప్తి కలుగలేదు. మరు జన్మములో కాశిరాజు కుమార్తెగా జన్మించినది. కన్యగా చాలాకాలము గడచినది. చివరకు పత్యర్థము పశుపతి నర్థించినది. ఉగ్రతపము చేసినది. అప్పుడు ధర్మవాయు వాసవాశ్వినులు తమ యంశజులను వరింపుమని కోరిరి. చివరకు పశుపతి ప్రత్యక్షమయ్యెను. అప్పుడామె

వ॥ "నాకుం బతి దానంబు ప్రసాదింపుమని యర్థిత్వం
బున నేను మాఱులు వేడెను" (261)

అందుకు పశుపతి కరుణించి

ఉ॥ "నీకు దేహాంతరంబున నేవురు పతు లగుదు
రనెను" (261)

అప్పుడామె శివునితో "ఒక స్త్రీకి నొక భర్తయే యుండుట సహజముకదా. మరి పలువురు భర్తలగుట నెచ్చుటనైన కలదా? ఇది లోకవిరుద్ధమైన వర"మని తెలిపెను. అందుకు రుద్రుడు

కం॥ "నా వచనంబున నీ క
య్యేవురు పతులందు ధర్మ మెడవక యుండుం
గావున నిట్టి వరం బిం
దీవెర దళనేత్ర యిచ్చితిని దయతోడన్" (264)

అని పలికెను, మరుజన్మములో ఇంద్రసేనయే ద్రౌపదిగా జన్మించినది. ధర్మ వాయు వాసవాశ్వినుల యంశజులే ద్రౌపదిపతులు

3.1.1.1.2 పతి వరములు :

పతిని కోరు వరములు పతి వరములు. పతి యనగా భర్త. భర్త యనగా భరించువాడని యర్థము. వీటిని ప్రధానముగా పతి సాన్నిధ్య, భర్త్రు సందర్శనాలాలసత్వ, ప్రియ సమాగమ వరములని మూడు విధములుగ వర్గీకరించవచ్చును.

3.1.1.1.2.1 పతి సాన్నిధ్య వరములు :

ప్రాచీన హైందవ సాంప్రదాయములందు స్త్రీసదా పతి సాన్నిధ్యమును కోరుకొనుట కనిపించును. సుఖదుఃఖములందు సమ బాధ్యతను వహించు నిమిత్తమై స్థిరపడిన యాచారములలో నిది యొకటి కావచ్చును. ఆంధ్రమహాభారతమునందు వరప్రదాతల

దృష్ట్యా పతి సాన్నిధ్య వరములను దైవ శ్వశుర వరములని రెండు విధములుగా విభజించవచ్చును.

3.1.1.1.2.1.1 దైవ వరములు :

ఈ కోవకు చెందిన వరములలో దేవతామూర్తులే వరముల ననుగ్రహించుట సమానాంశము. ఈపతి సాన్నిధ్యము దేవత దేవతకు గాని, దేవత మానవమాత్రులకుగాని వరముగా ప్రసాదించ వచ్చును. కుమారస్వామి, ఇంద్రులు స్వాహాదేవి, ప్రభావతుల కిచ్చిన వరములు ఈ వర్గములో చేరును.

3.1.1.1.2.1.1.1 కుమారస్వామి వరము :

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్యపర్వము" పంచమాశ్వాసములో (258-260) గలదు. వరమును కోరి పొందినది స్వాహాదేవి. వరప్రదాత కుమారస్వామి.

అగ్నిదేవుని భార్య స్వాహాదేవి. ఆమెకు పతిమీద మమకార మెక్కువ. సర్వకాల సర్వావస్థలందును పతిని వదలకుండనుండవలయు నని యామె చిరకాలవాంఛ. కాని యామె కోరికను తీర్చు వారెవరును కానరాలేదు. ఇంతలో కుమారస్వామి గృహనియోగమునకు సమ కట్టెను. అప్పుడామె

తే.గీ. "పుత్ర వినుము మేను దక్షుని పుత్రి నన్ను
బావకున కిచ్చె మా తండ్రి బాల్యమునను
నన్ను నితడొల్ల డెంతయు నాకు బతికి
నెపుడు నెడలేని పొందుగా నీ వొనర్చు" (259)

అని కోరెను. కుమారస్వామి స్వాహాదేవి కోరికను కాదనలేకపోయెను.

ఈ వరములో నొక విశేషమున్నది. దేవతలకు మంత్రాహ్వానము గలదు. దేవ పత్నులకు కలదో లేదో విచార్యము. ఇతర పత్నులకు లేని గౌరవము "స్వాహ"కు మాత్రము దక్కుట యిందలి విశేషము.

3.1.1.1.2.1.1.2 ఇంద్రుని వరము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శల్యపర్వము ద్వితీయాశ్వాసములో (196-197) గలదు. వరమును కోరి పొందినది ప్రభావతి. వరప్రదాత ఇంద్రుడు.

ప్రభావతి భరద్వాజుని కుమార్తె. ఆమెకు దేవతలలో ఇంద్రుడే నచ్చినవాడు. అతడే తన భర్తగా నుండవలెనని నిశ్చయించుకొనెను. కనుక "ఇంద్రా"ర్థము తపము చేయసాగినది. ఆమె తపమునకు ఇంద్రుడు మెచ్చెను. కాని యామెను పరీక్షింపదలచెను. వసిష్ఠ మహర్షి యాకారములో వచ్చెను. ఆమె యతనికి నమస్కరించెను. తన కోరికను విన్నవించెను. అంత వసిష్ఠరూపధారియైన "ఇంద్రుడు" బదరీ ఫలముల నిచ్చి వండుమని యాదేశించెను. ఆమె శుచియై వండ మొదలిడినది. కాని యవి పచనముకాలేగు. కట్టెలుకాలినవిగాని పండ్లుడకలేదు. చివరకు తన కాలునే పొయిలో కట్టెగానుంచినది. ఆమె చేతకు సంతసించి

వ॥ "శుభాంగి నీదు నిష్ఠాతిశయుంబునకు మెచ్చితి భవ దభిమతం బిచ్చితిని తనువు
విడిచి త్రిదివమ్మునకు రమ్ము సర్వపాప హరంబై యాతీర్థంబు లోకత్రయ
ప్రఖ్యాతం బయ్యెడు మనియె" (197)

ఈ కథలో ఇంద్రుడు ప్రభావతి నేలుకొనెనా లేదా యన్నది

చిక్కుముడి. కాని మరణించిన వారు స్వర్గమును చేరుట మాత్రము తథ్యము. అద్దాన "ఇంద్ర సాన్నిధ్యము."

3.1.1.1.2.1.2 శ్వశుర వరము :

ఈ కోవకు చెందిన వరములలో "అత్తమామలు" తమ కోడలకు వరముల ననుగ్రహించుట సామాన్యాంశము. సుఖ దుఃఖములను సమపాళ్ళలో భార్యాభర్త లిద్దరును పంచుకొని జీవించవలెనని యత్త మామలు భావించి తదనుగుణముగా దంపతులకు వరముల నిచ్చుట ప్రత్యేకాంశము. ద్యుమత్సేనుడు కోడలి కిచ్చిన వరమీ వర్గమునకు చెందును.

ద్యుమత్సేనుని వరము :

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్యపర్వము" సప్తమాశ్వాసములో (200-210) గలదు. వరమును కోరి పొందినది సావిత్రి. వరప్రదాత ద్యుమత్సేనుడు.

సత్యవంతుడు ద్యుమత్సేనుని కుమారుడు. పైగా సావిత్రిభర్త. అతడొకనాడు సమిత్కుశ ఫలాహరణార్థ మడవి కేగదలచెను. కాని యా దినమే తనకు తుదిదినమని యతనికి తెలియదు. కాని యీరహస్యము సావిత్రికి మాత్రము తెలియును. కనుక పతితో తాను కాననములకు వచ్చునట్లు కోరుకొనెను. సత్యవంతునికి సావిత్రి యన్న వల్లమాలిన మమకారము. అప్పటికి మూడురాత్రులుపవాసమున్న భార్యను చూచి "అలసితివి వల"దని నివారించెను. కాని చివరకు సమ్మతించక తప్పలేదు. భర్త యనుమతిని పొందిన సావిత్రి యత్తమామల యనుమతిని కోరుకొనెను.

వ॥ "వనంబు నూడ వేడ్కయైనది మీరు నా కిష్వరంబు గృపసేయ వలయునని" (210) ప్రార్థించెను. వారు సమ్మతించిరి.

ఈ వరప్రదానములో రెండు విశేషములున్నవి. కోరుకున్న వ్యక్తి సావిత్రి. ఎపుడును తనకై యేదియు కోరని కోడలు. కోరుకొన్న కోరిక భర్త్రానుగమనము. కనుక నత్తమామలు సమ్మతించక తప్పలేదు.

3.1.1.1.2.2 భర్తృ సందర్శన లాలసత్వము :

కష్టములకు గురియై దూరముగా నున్న భర్తను దర్శించవలెనను నాతురత భార్యకుండును. అందుకై తపించుట భర్తృ సందర్శన లాలసత్వమగును. శచీదేవి ఉపశ్రుతి నారాధించి ఇంద్రుని చూచుట యీ వర్గమునకు చెందును.

ఉపశ్రుతి వరము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగపర్వము" ప్రథమాశ్వాసములో (166-171) గలదు. వరమును కోరి పొందినది శచీదేవి. వరప్రదాత "ఉపశ్రుతి."

ఇంద్రుడు వృత్రాసురుని సంహరించగా నతనికి బ్రహ్మహత్యా పాతకమంటుకొనినది. దేవతలు విష్ణుమూర్తి యాలోచనమేరకు "అశ్వమేధము"ను చేయగా నా పాపము తొలగినది. తరువాత "ఇంద్రుడు" "అమరావతి" నగరమునకు వెళ్ళి "ఇంద్ర" పదవిలో నున్న నహుషుని చూచెను. నహుషుని తేజోవిశేషములకు"ఇంద్రుడు" భయకంపితుడై యెవ్వరికిని తెలియకుండ దూరదేశమున దాగెను. భర్త రాకనునిరీక్షించు శచీదేవి "ఇంద్రుడు" కనబడకపోవుటచే శోకించి

నిశా సమయమున నుపశ్రుతి నారాధించినది. అప్పుడా "ఉపశ్రుతి అధిదేవత" శచీదేవితో

వ॥ "నీ సత్యంబు వలన నీ మగనిం గమదని చెప్పి యనంత రంబ సాకారయై పొడసూపెను" (171)

శచీదేవి యామెను "నీవెవ్వర"వని ప్రశ్నించెను. సమాధాన ముగా నామె శచీదేవితో

వ॥ "భవత్పాతివ్రత్య సత్య శౌచంబులకు బ్రియంబంది వచ్చితి నుపశ్రుతి నని చెప్పి నీ కుం బాకశాసనుం జూపెద రమ్మని" చెప్పెను. (171)

అప్పుడే శచీదేవిని తోడ్కొని హిమవంతమునకు నుత్తరమున మంజు మంతమను మహాశైలముపైకి వెళ్ళెను. దానియందు శతయోజన విస్తీర్ణమైన యొక్క సరోవరమునందు సొచ్చి యచ్చట నుల్లసిల్లు పంచవర్ణ కమనీయములగు కమలములలో నొక్క నాళమును ఛేదించి తాను యందు ప్రవేశించెను. ఇంద్రాణియు వెనుక చని, యానాళ మధ్యమున సూక్ష్మరూపమున నున్న సురపతిని చూచెను. ఆ "ఉప శ్రుతి" యదృశ్యమయ్యెను.

ఉపశ్రుతి ప్రయత్నముతో నాశీస్సులతో శచీదేవేంద్రుడు లొకటొ కలిసికొనగలిగిరి.

3.1.1.1.2.3. ప్రియాసమాగమ ప్యక్తి వరదము :

తాను ప్రేమించిన పురుషునితో వివాహము జరుగుటకు పూర్వమే మ్మరియొక పురుషుడు దౌర్జన్యముచే నామెను తీసికొనిపోవును. అప్పు డామె తాను ప్రేమించిన పురుషుని గురించి తెలిపి, యతని కడకు

పంపుమని ప్రార్థించును. అంబకు సత్యవతీ భీష్ముల వర మీ వర్గమునకు చెందును.

సత్యవతీ భీష్ముల వరము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగపర్వము" చతుర్థాశ్వాసములో (273-276) గలదు. వరమును కోరి పొందినది "అంబ." వర ప్రదాతలు సత్యవతీ భీష్ములు.

కాశీరాజు కుమార్తెలు "అంబ, అంబిక, అంబాలికలు." అతడు తన కుమార్తెలకు స్వయంవరమును చాటింపించెను. ఆ సందర్భము నందే విచిత్రవీర్యుని కొఱకు భీష్ముడు స్వయంవరమునకు నేతెంచెను. బలవంతముగ నా కన్యలను రథముపై నుంచుకొని వచ్చి సత్యవతికి సమర్పించెను. అప్పుడు "అంబ" భీష్మునితో

తే.గీ॥ "సౌంభపుర వల్లభుండైన సాళ్వు మీద
దలపు గలదు నా కతడును దగులు గలిగి
యుండు నా దెస నీవు ధర్మోత్తరుండ
వతని పాలికి దగ నన్ను ననుప వయ్య" (275)

అని ప్రార్థించెను. అంబ మాటలను భీష్ముడు సత్యవతికి తెలిపెను. ఆమెయు సమ్మతించెను. అప్పుడు భీష్ముడు వృద్ధాంగనల సాహాయ్యముతో నామెను సాళ్వుని దగ్గరకు పంపెను.

3.1.1.1.3 సంతాన వరములు :

ప్రాచీన హైందవ సంస్కృతిలో సంతానహీనులకు గౌరవము లేదు. మరియు "పున్నామ నరకప్రాప్తి" అను భయ మానాటి వ్యక్తులకు నుండెడిది. లౌకికముగా కూడ సంతానవంతుడైనప్పుడే పితౄ

ణము తీరునను నభి|ప్రాయము కూడ ప్రజలలో నున్నది. కనుకనే ప్రాచీన భారతేతిహాసములలో సంతానముకొఱకు తపన, తత్ప్రాప్తి కొఱకు మహాత్ముల సందర్శనము, దైవానుకూలమునకై తపము, యాగాదుల నిర్వహణములు సాగినట్లు తెలియుచున్నది.

ఆంధ్ర మహాభారతములోని సంతాన వరములను నాలుగు విధములుగా వర్గీకరింపవచ్చును. ఇవి 1. ప్రధాన దేవతలు, 2. ప్రముఖ దేవతలు, 3. ఋషులు, 4. రాజు లిచ్చిన సంతానవరములు.

3.1.1.1.3.1. ప్రధాన దేవత లిచ్చిన సంతాన వరములు :

సృష్టి స్థితి లయలనుబట్టి బ్రహ్మ విష్ణు మాహేశ్వరులు ప్రధాన దేవతలు. ఈ విషయములో హైందవులమధ్య నభిప్రాయ భేదము లేదు. విశ్వాసమునుబట్టి పై ముగ్గురిలో నెవరినైనను కొలిచి సంతానమును పొందుట పురాణేతిహాసములలో కన్పించును. ఈ దృష్టితో చూడగ "ఆంధ్ర మహాభారతము"లో బ్రహ్మ. మాహేశ్వరులను కొలిచి సంతానవంతులైన వారికథలు మాత్రము కనిపించును. స్థితికారుడైన విష్ణువును సేవించి సంతానమును పొందిన కథయొక్కటికూడ "ఆంధ్ర మహాభారతము"లో కనిపించుటలేదు. ఇది యొక ప్రత్యేకత.

3.1.1.1.3.1.1. బ్రహ్మ వరములు :

సృష్టి స్థితి లయములలో సృష్టి బ్రహ్మదేవుని కార్యము. అది చరాచర సృష్టి కావచ్చును. అయినను నిచ్చట మానవ, సర్ప, ఖగముల సృష్టియే ప్రాధాన్యము వహించును. ఈ దృష్టితో చూడగ "ఆంధ్ర మహాభారతము"లో బ్రహ్మను సేవించి సంతాన వరమును పొందిన వారి కథలు రెండు కనిపించుచున్నవి. ఇవి 1. పంకజాసనుడైన చతుర్ముఖ బ్రహ్మ యిచ్చిన నలకూబర జనన వరము.

2. కశ్యప ప్రజాపతి. ఇచ్చిన కాద్రవేయ, వైనతేయుల జననము.

3.1.1.1.3.1.1.1. నలకూబర జననము :

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్యపర్వము" షష్ఠాశ్వాసములో (270-271) గలదు. వరమును కోరి పొందినవాడు వైశ్రవణుడు. వర ప్రదాత బ్రహ్మదేవుడు.

బ్రహ్మదేవుని మానసపుత్రుడు పులస్త్యుడు. అతని పుత్రుడు వైశ్రవణుడు. అతడే బ్రహ్మ నారాధించి

వ॥ "తపంబు సేసి నలకూబరుం దను కొడుకును లోకపాలకత్వంబును ధనేశ్వరత్వంబును లంక యను పురంబును శంకరుతోడి సఖ్యంబును వరంబులుగా బడసెను"(271)

వైశ్రవణునకు నలకూబరుడు పుత్రుడగుట యిందలి విశేషాంశము.

3.1.1.1.3.1.1.2. కాద్రవేయ, వైనతేయుల జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" ద్వితీయాశ్వాసములో (2-4) గలదు. వరమును కోరి పొందిన వారు కద్రువ వినతలు. వరప్రదాత కశ్యప ప్రజాపతి.

కద్రువ వినతలు భర్తయగు కశ్యప ప్రజాపతిని పుత్రార్థినులై యనేక వేల సంవత్సరము లారాధించిరి. అందుకతడు సంతోషించి వారితో....

వ॥ 'మీ కోరిన వరంబు లిచ్చెద వేడుం డనెను" (4)
అప్పుడు వారు విడివిడిగ

తరలము "అనల తేజులు దీర్ఘదేహులునైన యట్టి తనూజులున్
వినుత సత్త్వుల గోరె గద్రువ వేవురం గడు వేడ్కతో
వినత గోరె సుపుత్రులన్ భుజవీర్యవంతుల వారి కం
టెను బలాధికులైన వారి గడింది వీరుల నిద్దరన్" (3) కోరిరి

ఈ వరప్రదానమున నొక విశేషమున్నది. వరప్రదాత యంతకు మునుపే సంతానముకొఱకు చాలకాలము తపమును చేసి పుత్రకామేష్టినిగూడ నిర్వర్తించి యుండుట యొక విశేషము (పద్యము 4). కనుక కాద్రనేయ వైనతేయ సంతానమునకు పుత్ర కామేష్టియు, భర్త కశ్యప ప్రజాపతి యనుగ్రహమును రెండు కారణములు కావచ్చును.

3.1.1.1.3.1.2. మాహేశ్వర వరములు :

పరమశివుడు లయకారకుడై నప్పటికిని మహాదేవ, మాహేశ్వర నామములు శివునకు తప్ప నితరులకు లేవు. అట్టి లయకారకుని నారా ధించి సంతాన వరములను పొందుట "ఆంధ్ర మహాభారతము"లో నేడు కథలలో కనిపించును. ఈ వరము లన్నిట మాహేశ్వరుని పర్యాయ నామములైన హరుడు, ఉమేశ్వరుడు, శివుడు, శంకరుడు రుద్రుడు-అను పేర్లు కనిపించును. మాహేశ్వర వరమువలన జన్మిం చిన వారి కథలు "ఆంధ్ర మహాభారతము"లో "ఆఱు" కలవు. ఇవి_ 1. శుకమహర్షి, 2. సగర పుత్రులు, 3. గాంధారి శతపుత్ర, 4. చిత్రాంగద, 5. భూరిశ్రవుని, 6. శిఖండి జననములు.

3.1.1.1.3.1.2.1. శుక మహర్షి జననము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతిపర్వము షష్ఠా

శ్వాసములో (247-254) గలదు. వరమును కోరి పొందినవాడు వేద వ్యాసుడు. వరప్రదాత శివుడు.

మేరు పర్వతమునందుగల కర్ణికారవనమునందు ప్రమథ గణములు పార్వతీ పరమేశ్వరులను సేవించుచున్న ప్రదేశమునకు సమీపమున వేదవ్యాసుడు పుత్రసంతానమును కోరి తపస్సును చేయుచుండెను. శివు డతని తపస్సునకు మెచ్చి ప్రత్యక్షమై యభీష్ట వరము నడుగుమనెను. వేదవ్యాసుడు భక్తి సంభ్రమముడై దండ ప్రణామమును చేసి

కం॥ "జల పవనాంబర వసుధా
సల సమ వీర్యుడగు పుత్రు నాకొసగంగా
వలయుననని" కోరెను (249)

వెంటనే శివుడు దయ తలచి

కం॥ "ఇచ్చితినని (249)
పలికి చనియె" (249)

తరువాత వేదవ్యాసు డగ్ని కార్యపరుడై "అరణి"ని తీసికొని మధించు టకు పూనుకొనెను. ఆ సమయమున "ఘృతాచి" అను పేరుగల అప్సరస స్త్రీ యతనికి కనబడెను. వెంటనే యతనికి శృంగారభావము కలిగెను. కాని ఘృతాచి వంచితబుద్ధియై చిలుకగా మారెను. కాని యతడు ధైర్యము కూడబెట్టుకొని "అరణి" కార్యమును సాగించెను. అయినను మన్మథుని విజృంభణముచే తను ఘృతాచీ మగ్నచిత్తు డగుటవలనను నతని శుక్లము "అరణి" యందుబడెను. అయినను "అరణి మథనము"ను విడువలేదు.

తే.గీ॥ "అయ్యరణి బుట్టి జనక సమాకృతియును
భూరి కాంతియు వెలుగంగ బొలిచె శుకుడు
యాగకాల సుసంభృత హవిరవాప్త
మహిత తేడస్కుడగు వహ్నిని చూడ్క. (251)

అప్పుడు మందాకినీదేవి మానవాకారమును ధరించి వచ్చి యా బిడ్డకు మంగళస్నానమును చేయించెను. ఆకాశమునుండి కృష్ణాజినమును, త్రిదండము నతని యెదుటపడెను. ఇంద్రాది దేవతలు గౌరవముతో వచ్చిరి. సతీసమేతుడై శివుడు వచ్చి యా బిడ్డ నుపవీతునిగా చేసెను. ఇంద్రుడు ప్రకాశించు కమండలము నిచ్చెను. అమరు లెన్నటికిని మాయని వస్త్రముల నిచ్చిరి. అతడు పుట్టినప్పు డతనిని వేదములు పొందెను.

3.1.1.1.3.1.2.2. సగర పుత్రుల జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము ఆరణ్యపర్వము తృతీయాశ్వాసములో (48-71) కలదు. వరమును కోరి పొందినవాడు సగరుడు. వరప్రదాత హరుడు.

వైదర్భి, శైబ్యలు సగరుని భార్యలు. వారికి సంతానము కలుగలేదు. కావున నతడు భార్యలతో కలిసి కైలాస పర్వతమునకు వెళ్ళి సంతానార్థియై శివునుద్దేశించి తపస్సును చేసెను. శివుడు ప్రత్యక్షమై మెచ్చి

వ॥ "వానికి వైదర్భియందు అఱువది వేవురు గొడుకులును శైబ్యయందొక్క కొడుకుంగా" వరం బిచ్చెను. (51)

తరువాత కొంతకాలమునకు సగరుని భార్య లిద్దరును గర్భిణులైరి. వైదర్భికి నొక "అలాబూ" ఫలము కలిగెను. శైబ్యకు నొక

కొడుకు పుట్టెను. అతనికి "అసమంజసుడు" అను పేరును పెట్టిరి. "అలాబూ" ఫలమును పారవేయుటకు పూనుకొనిరి. అప్పుడు "ఆకాశవాణి" నివారించి "దానిని నేతి కుండలో పెట్టి కాపాడుము. అఱువది యేవురు బలవంతులైన సుతులు పుట్టుదు"రని చెప్పెను. అట్లు జనించిన వారే సగరపుత్రులు.

3.1.1.1.3.1.2.3. గాంధారి శతపుత్ర జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" పంచమాశ్వాసములో (7-12, 93-101) గలదు. వరమును కోరి పొందినది గాంధారి. వరప్రదాత హరుడు.

గాంధారి గాంధార దేశాధిపతి కుమార్తె. ఈమె పుట్టుగ్రుడ్డిది కాదు. ఈ కన్య ధృతరాష్ట్రుని కన్ని విధముల తగినదని భీష్ముడు విదురునికి తెలియజేసెను. మరియు

కం॥ "ఈ కులము వివర్ధింపగ
నా కభిమత మేను వింటి నలినేక్షణ దా
నేక శత సుతుల బడయగ
నా కన్యక వరము వడసె నట హరుచేతన్" (9)

అని స్పష్టపరచెను. గాందారీ ధృతరాష్ట్రులకు వివాహమైనది. కాని కుంతికి తొలుత సంతానప్రాప్తి సిద్ధించినది. గాంధారికి నా యదృష్టము సంవత్సరకాలము తరువాత వఱకు లభించలేదు. కనుక నా మనస్తాపముతో గాంధారి యుదర తాడనమును చేసికొనినది. గర్భపాతమైనది. ఆవిషయమును కృష్ణద్వైపాయనుడు దివ్యదృష్టితో గ్రహించి వెంటనే ప్రత్యక్షమై "మనోహీనవై గర్భపాతమగునటుల చేయుట మంచిదికా" దని గాంధారిని మందలించి....

కం॥ "ఇమ్మాంసపేశి నేక శ
త మ్ముదయింతురు సుతులు ముదమ్మున నిధి త.
థ్య మింక నైన నతి య
త్నమ్మున రక్షింపు దీని నా వచనమునన్" (100).

అని గాంధారితో పలికి యా మాంసపుముద్ద నేకోత్తర శత ఖండములుగా విభాగించి వాటిని వేరు వేరుగ నేతి కుండలలో పెట్టి చల్లని నీటితో తడుపుచుండినచో

వ॥ "ఇందు నూర్వురు గొడుగులు నొక్క కూతురుం బుట్టుదు రని చెప్పి చనెను. (101) అట్లు జనించిన వారే దుర్యోధనాదులు.

3.1.1.1.3.1.2.4. చిత్రాంగన జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వ" షష్ఠ మాశ్వాసములో (142.143) గలదు. వరమును కోరి పొందినవాడు "ప్రభాకరుడు" అను రాజు. వరప్రదాత "ఉమేశ్వరుడు."

దక్షిణ భారతదేశములో మణిపూరు రాజైన ప్రభాకరునకు సంతానము కలుగలేదు. కొంతకాలము తరువాత "ఉమేశ్వరు" నుద్దేశించి భక్తితో తపస్సును చేసెను. అప్పుడు

వ॥ "పరమేశ్వరుండు వానికిం గరుణించి నీకు నొక్కపుత్రుం డుద్భవించు నీ కులంబు వారికెల్ల సంతానం బిట్లయగు నని వరం బిచ్చెను. (143)

అప్పటినుండి యా వంశములోని వారికి నొక్కొక్క పుత్రుడు మాత్రమే జన్మించుచుండిరి.కాని కొంతకాలము తరువాత చిత్రవాహను

డను రాజునకు మాత్రము పుత్రుడు పుట్టకుండ నొక్క కూతురు పుట్టెను ఆమె పేరు చిత్రాంగద. రాజు కూతురిని పుత్రీకరణ భావముతో పెంచెను.

3.1.1.1.3.1.2.5. భూరిశ్రవుని జననము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ద్రోణపర్వము చతుర్థాశ్వాసములో (275, 257-267) గలదు. వరమును కోరి పొందినవాడు సోమదత్తుడు. వరప్రదాత శివుడు.

వసుదేవుడు రూపగుణములచే ప్రసిద్ధుడు. దేవకి సౌందర్యరాశి. వీరిద్దరికి వివాహమును చేయవలయునని యా యాదవ వంశములో పుట్టిన శిని యను నతడు భావించెను. అందుకై దేవకి స్వయంవరమునకు వెళ్ళెను. చంద్రవంశజుడైన బాహ్లికుని కొడుకగు సోమదత్తుడు కూడ స్వయంవరమునకు వెళ్ళెను. శిని బలవంతముగా దేవకిని తీసికొని వచ్చు సమయమున సోమదత్తు డెదిరించెను. ద్వంద్వయుద్ధములో నతని కొప్పును శిని పట్టుకొని పడద్రోసి యతని నవమానించెను. ఈ యవమానభారముతో సోమదత్తు డింటికి వెళ్ళలేక పోయెను, శిని ప్రభృతులపై పగను తీర్చుకొనదలచి దైవసాహాయ్యమును కోరుటకై యరణ్యముల కేగెను. పెద్దకాలము హరు నుద్దేశించి తపస్సును చేసెను. కాని యీ కాల వ్యవధిలో శినియును నతని పుత్రుడును మరణించిరి. కనుక హరుడు ప్రత్యక్షమైనప్పుడు సోమదత్తుడు

వ॥ 'శిని మనుమని ననిం బడవైచి తన్నుం జాలు తనయు
నీవలయునని యడిగెను." (275)

అందుకు

వ॥ "అద్దీవుం డట్లు యగుం గాక యని యానతిచ్చి యంత
ర్హితు డయ్యెను" (275)

ఆ వర ప్రభావమున సోమదత్తునికి "భూరి శ్రవుడు" అను పేరు పుత్రుడు పుట్టెను. అతడే శిని మనుమడగు సాత్యకిని చంప ప్రయత్నించెను.

3.1.1.1.3.1.2.6. శిఖండి జననము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగపర్వము" చతుర్థాశ్వాసములో (368-372) గలదు. వరమును కోరి పొందినవాడు ద్రుపదుడు. వర ప్రదాత శివుడు.

"ద్రుపదుడు" అను రాజు సంతానములేని తన భార్య కోకిలా దేవి విషాదమును తొలగించుటకుగాను మరియు భీష్ముని మీదగల రోషముతోను శివునుద్దేశించి తపస్సును చేసెను. అప్పుడు శివుడు ప్రత్యక్షమై వరమును వేడుమనెను. ద్రుపదుడు

వ॥ "భీష్ము వధియించునట్టి వాని నొక్క పుత్రుని నొసగ
వలయు"నని కోరెను. (369)

శివుడు ద్రుపదుని కోరికను విని

తే.గీ.॥ "కూతురై పుట్టి పదపడి కొడుకు దనము
గాంచి భీష్ముని నాజి రంగమున జంపు
నట్టి యుజ్జ్వలాపత్యంబు పుట్టు నీకు
దప్ప దిది" అని యనుగ్రహించెను (370)

ద్రుపదుడు ప్రీతుడై తన భార్యకు నా విషయమునుచెప్పెను.

తరువాత "అంబ" చైతన్యము ద్రుపదుని భార్య యుదరమున ప్రవే శించెను. ఆమెకు పుట్టిన బిడ్డయే శిఖండి.

3.1.1.1.3.2. ప్రముఖ దేవత లిచ్చిన సంతాన వరములు :

బ్రహ్మ విష్ణు మాహేశ్వరులు గాక "అష్టదిక్పాలకులు"ను వారితో సమానమైనటువంటి లోకోపకారకులైన దేవతలును ప్రముఖ దేవతా పరిగణనములో చేరుదురు. సంతాన వరప్రదాతలలో "ఇంద్ర, యమ, వాయు దేవతలు "అష్టదిక్పాలకులు" కాగా, సూర్య, అశ్వినీ, సావిత్రీ మూర్తులు లోకోపకారకులైన దేవతలు.

3.1.1.1.3.2.1 ఇంద్ర వరములు :

ఇంద్రు డిచ్చిన సంతాన వరములు రెండు 1. అర్జున జననము 2. గాధేయ జననము.

3.1.1.1.3.2.1.1. అర్జున జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" పంచమాశ్వాసములో (112-122) గలదు. వరమును కోరి పొందిన వాడు పాండురాజు. వరప్రదాత "ఇంద్రుడు."

గాంధారీ ధృతరాష్ట్రులకు పుత్ర శతము పుట్టుటను పాండురాజు విని ధర్మరాజు, భీమసేన జననముతో, సంతృప్తిపడక ఎక్కువమంది పుత్రులను పొందదలచి ఋషులవలన దివ్య మంత్రోపదేశమును పొంది "కొడుకుం ద్రిలోక విజయుం బడయుదు"నని నిశ్చయించెను. కుంతిని కూడ నొక్క సంవత్సరకాలము వ్రతమును చేయుమని యాజ్ఞాపించెను. తానుగూడ "ఇంద్రుని" నేకాగ్రబుద్ధితో నేకాంతమున నేకపాదస్థితుడై తపమును సాగించెను. ఇంద్రుడు పాండురాజునకు ప్రత్యక్షమై

కం॥ పుత్రుడు నీ కుదయించు స
మిత్ర క్షయకరుడు బంధు మిత్రాంబుజ వ
న్మిత్రుం డని వరమిచ్చెను" (118)

పాండురాజు సంతోషించి కుంతితో "ధనము, విద్య, సంతానము లతో తృప్తిపడిన వారెవ్వరును లేరు. కావున నా కింకను పలువురు కుమారులు కావలయు"నని పలికి, "దేవతలసమూహములో ఇంద్రుడు పెద్ద. సర్వలోకములకు వల్లభుడు. కావున నతని ప్రసాదమువలన సురేంద్ర సమానుడైన ధర్మసమన్వితుని నా వంశము ప్రకాశించు నట్లుగ కుమారుని పొందు"మని నియోగించెను. కుంతి

వ॥ "తొల్లిటియట్ల దుర్వాసుం డిచ్చిన మంత్రంబున నింద్రు నారాధించిన దత్ప్రసాదంబున గుంతికి" (121)

కం॥ స్థిర పౌరుషుండు లోకో
త్తరు డుత్తర ఫల్గునీ ప్రథమ పాదమునన్
సుర రాజునంశమున భా
సుర తేజుడు పంశకరుడు సుతు డుదయించెను". (122)

అతడే "అర్జునుడు."

2.1.1.1.3.2.1.2. గాధేయు జననము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతిపర్వము ద్వితీయాశ్వాసములో (68) గలదు. వరమును కోరి పొందినవాడు కుశికుడు. వరప్రదాత "ఇంద్రుడు."

పూర్వము "జహ్నుడు"అను రాజుండెను. అతనికి "అజహ్నుడు" అను పుత్రుడు పుట్టెను. అతనికి "వల్లభుడు" అను సుతుడు పుట్టెను.

అతనికి "కుశికుడు" అను కొడుకు పుట్టెను. అతడు తపస్సును చేసి "ఇంద్రుని" మెప్పించి

సీ॥ "జగముల మేటి నా దగు పుత్రు
వేడెను" (68)

ఇంద్రుడు కుశికుని కోరికను మన్నించెను. పిమ్మట కుశికునకు పుత్రుడు పుట్టెను. అతడే "కౌశికుడు." గాధి కుమారుడగుటవలన గాధేయుడు.

3.1.1.1.3.2.2. యమధర్మరాజు వరములు :

యమధర్మరాజు ప్రదానము చేసిన సంతాన వరములు రెండు- 1. ధర్మరాజు జననము, 2. అశ్వపతి శతపుత్ర జననము.

3.1.1.1.3.2.2.1. ధర్మరాజు జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" పంచమాశ్వాసములో (64-93) గలదు. వరమును కోరి పొందినది కుంతి. వర ప్రదాత యమధర్మదేవత.

కిందమ ఋషి శాపమువలన పాండురాజునకు శారీరకసంపర్కం వలన పుత్రోదయము కలుగుటకు వీలులేదు. కాని సంతాన ప్రాప్తి విషయమున శాస్త్ర ప్రమాణమును, కల్మాషపాదుని ప్రవర్తనను. రెండింటిని నాలోచించి సంతానమును పడయు"మని పాండురాజు కుంతి నాదేశించెను. అప్పుడు కుంతి తనకు పూర్వము దుర్వాసమహర్షి చెప్పిన సంతాన లాభ మంత్ర విషయమును గురించి చెప్పి "ఏ వేల్పు నారాధించుమనెదవో యాజ్ఞ" నిమ్మని భర్త నడిగెను. "ధర్మమునకు స్థానమైన (యమధర్మరాజు) నారాధించు"మని పాండు

రాజు సలహా నిచ్చెను. కుంతి భర్తకు ప్రదక్షిణమును చేసి సమాహిత చిత్తయై

వ॥ "మహాముని యిచ్చిన మంత్రంబు విధివంతంబు చేసి ధర్ముని నారాధించిన నా ధర్ముండును యోగమూర్తి ధర్ముండై వచ్చి వరం బిచ్చినం గుంతియు దత్ప్ర సాదంబున గర్భంబు దాల్చెను (93)

అతడే ధర్మరాజు.

3.1.1.1.3.2.2.2. అశ్వపతి శతపుత్ర జననము :

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్యపర్వము" సప్తమాశ్వాసములో (218-240) గలదు. వరమును కోరి పొందినది సావిత్రి. వరప్రదాత యమధర్మదేవత.

సావిత్రి, తన భర్త సత్యవంతుని ప్రాణమును యమధర్మరాజు తీసికొని వెళ్ళుచుండగా నతని నామె వెంబడించి యతనిని పొగడుచు తన వాక్చాతుర్యముతో నతని నబ్బురపఱచుచు నతిభయంకరమైన దుర్గమమైన యరణ్యములో వెళ్ళుచు తన భర్త ప్రాణమును తన కిమ్మని ప్రార్థించెను. ఆమె మాటలకు నాశ్చర్యపడిన యమధర్మరాజు సత్యవంతుని ప్రాణము తప్ప వరము నడుగుమని పలికెను. ఆమె తన మామకు కంటి చూపును కోరెను. మరల నామె యమధర్మరాజును వెంబడించుచు ప్రార్థించెను. సత్యవంతుని ప్రాణమును తప్ప మరి యొక వరమును కోరుమనెను. తన మామకు శత్రువులచే పోయిన రాజ్యము తిరిగి దక్కునట్లు కోరెను. మరల సావిత్రి యమధర్మరాజును వెంబడించుచు ప్రార్థించెను. అతడు దయ దలచి సత్యవంతుని ప్రాణ

మును తప్ప నింకొక వరమును నడుగుమనెను. అప్పుడు సావిత్రి నమస్కరించి

> వ॥ "మా తండ్రి మద్రేశ్వరుం డపుత్రకుం డతనికి బుత్ర శత లాభం బగునట్లుగా బ్రసాదింపుమని యభ్యర్థించెను." (240)

వెంటనే యమధర్మరాజు

> వ॥ "అట్ల కానిచ్చితి నని పల్కెను" (240) వారిపేర్లు తెలియవు.

3.1.1.1.3.2.3. వాయుదేవుని వరము : భీమసేన జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" పంచమాశ్వాసములో (102-104) గలదు. వరమును కోరి పొందినది కుంతి. వరప్రదాత వాయుదేవుడు.

ధర్మరాజు జననముతో సంతృప్తిపడక పాండురాజు వాయుదేవుని దయచే నింకొక పుత్రుని జనియింపుమని తన భార్య కుంతిని నియోగించెను. కుంతియును తన భర్త చెప్పినట్లు

> వ॥ వాయుదేవు నారాధించి తత్ప్రసాదంబున గర్భంబు దాల్చి సంవత్సరంబు సంపూర్ణంబైన" (103)

కుంతికి వాయుదేవుని యంశమున మంచిలగ్నమున బలవంతుడగు పుత్రుడు పుట్టెను. శతశృంగ పర్వతము మీదనున్న మును లందరును సంతసించునట్లు దివ్యవాణి యా బిడ్డకు "భీమసేనుడు"అను పేరును పెట్టెను.

3.1.1.1.3.2.4. సూర్యుని వరము : కర్ణ జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము"

పంచమాశ్వాసములోను (17-27), "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య పర్వము" సప్తమాశ్వాసములోను (308-353), తిక్కన భారతభాగము "ఆశ్రమవాసపర్వము" ద్వితీయాశ్వాసములోను (93-103) నించుమించు నొకే విధముగా నున్నది. వరమును కోరి పొందినది కుంతి. మంత్రోపదేశకుడు దుర్వాసమహర్షి. వరప్రదాత సూర్యభగవానుడు

కుంతి భోజు నింట కుంతి దుర్వాసమహర్షికి చేసిన యతిథిమర్యాదలకు నా మహర్షి సంతసించి యామెకు పుత్రలాభ మంత్రోపదేశమును చేసి యుండెను. తరువాత నామె కన్యాత్వ చాపల్యముతో నాలోచించకుండ నా మంత్రశక్తిని తెలిసికొనదలచెను.

అట్లు జనించినవాడు కర్ణుడు. ఒకనాటి యుదయమున నామె సూర్యుని చూచి ప్రార్థించిన విషయములో కవిత్రయములో నీక్రింది విధముగ నున్నది.

నన్నయ భారతభాగము :

కం॥ "నాకు నిమ్ము ప్రి
యమ్మున నీయట్టి కొడుకు నంబుజమిత్రా" (ఆది-5ఆ 49)

అని కేలు మొగిచి మ్రొక్కెను. వెంటనే సూర్యభగవానుడు ప్రత్యక్షమయ్యెను. అతనిని చూడగ కుంతికి లజ్జాభయములు కలిగి తన తెలివిలేనితనమును మన్నించి వెడలిపొమ్మనెను. అప్పుడు సూర్యుడు

వ॥ "నీకు సద్యోగర్భమున బుత్రు డుద్భవిల్లు నీ కన్యాత్వంబును దూషితంబు గాదని వరం బిచ్చెను" (ఆది-5ఆ-25)

ఎఱ్ఱన భారతభాగము :
కుంతి సూర్యుని చూచి

వ॥ "దేవా భగత్సూనసుందరుండగు నందనుం గరుణింపవే యని మనంబునం గోరుచు మంత్రోచ్చారణంబు సేసెను" (అరణ్య-7 ఆ-326)

సూర్యుడు ప్రత్యక్షమయ్యెను. "నీ కిష్టమైన దానిని చేయుదు" ననెను. కాని కుంతి తన చాపల్యభావమును చెప్పి, వెళ్ళిపొమ్మనెను అప్పుడు కోపించి "నన్ను పిలిచిన కార్యమునకు సమ్మతించనిచో నిన్ను, నీ తల్లిదండ్రులను, దుర్వాసుని దగ్ధము చేయుదు"నని• పలికెను. మరియు

ఆ.వె.॥ "మత్సమాగమమున మదిరాక్షి నీదు క
న్యావ్రతంబు చెడదు; నందనుండు
నధిక తేజు డుదయ మగు నిన్ను లోక నిం
దయును బొందకుండు దధ్య మబల" (అరణ్య-7ఆ-328)

తరువాత నామెకు సంతానము కలిగెను.

తిక్కన భారతభాగము :

కుంతి సూర్యు నుద్దేశించి మంత్రోచ్చారణను చేసెను. సూర్యుఁడు ప్రత్యక్షమై

సీ॥ "అడుగు మిచ్చెద వరం బనెను" (ఆశ్రమ-2 ఆ-101)

అప్పుడు కుంతి తా నూరకనే పిలిచితిననెను. అందుకు సూర్యుడు కోపించి "నిన్నును నీకు మంత్రోపదేశమును చేసిన దుర్వాసుని శపింతు"ననెను. అప్పుడామె

సీ॥ "పుత్రకు నొసగు దేవ

తే.గీ.॥ కృప భవత్సుము" నని కోరెను (101)

సూర్యు డప్పు డామెతో

తే.గీ.॥ "తనయుండు పుట్టెడు మనియెను" (101)

మరియు

తే.గీ.॥ "నీకు గన్యాత్వ వికలత గాక యుండ
వరము నిచ్చితి ననుచు దివమున కరిగె" (103)

తరువాత నామెకు పుత్ర సంతానము కలిగెను.

కుంతీ సూర్య సంవాదములో దుర్వాసుని ప్రసక్తి నన్నయ భారతభాగములో కనిపించదు.ఎఱ్ఱన భారతభాగములోసూర్యుడు కుంతి తల్లిదండ్రులను, దుర్వాసుని దగ్ధము చేయుదునను వివరణ గలదు. తిక్కన భారతభాగములో సూర్యుడు దుర్వాసుని శపింతునను మాట గలదు. ఇతరత్ర మార్పు కనిపించదు.

3.1.1.1.3.2.5. అశ్వినీ దేవతల వరము :
నకుల సహదేవుల జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" పంచమాశ్వాసములో (128-133) గలదు. వరము నడిగి పొందినది మాద్రి. వరప్రదాతలు "అశ్వినీ దేవతలు."

కుంతికి పుట్టిన ముగ్గురు కొడుకులతో పాండురాజు వినోదించు చుండెను. అప్పుడు మాద్రి తనకు పుత్రజన్మము కలుగు నుపాయము లేకపోవుటచే తన జన్మ నిరర్థకమైనదని వగచెను. పుత్రోత్పాదనము దయసేయ గుంతీదేవికి నానతి యిమ్ము" అని భర్తను కోరెను. ఆ మాటలకు పాండురాజు సమ్మతించి కుంతిని పిలిచి, మాద్రి సంతాన

వాంఛితమును తెలిపి "సకలలోక కళ్యాణకారు లాశ్వినులు. కావున వారి నారాధించి యపత్యంబు పడయు" మంత్రమును మాద్రికి తెలుపు మని చెప్పి యాదేశించెను. కుంతి, భర్త యాదేశము ప్రకారము చేసెను. తరువాత మాద్రికి

తే.గీ.॥ కవల వారు సూర్యేందు ప్రకాశ తేజు
లాశ్వినుల యంశముల బుట్టి రమర గుణులు
వారలకు ప్రీతి నాకాశవాణి సేసె
నకుల సహదేవు లనియెడు నామ యుగము" (133)

3.1.1.1.3.2. సావిత్రీదేవి వరము :

సావిత్రి జననము :

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్యపర్వము" సప్తమాశ్వాసములో (170-171) గలదు. వరమును కోరి పొందినవాడు "అశ్వపతి." వరప్రదాత్రిని సావిత్రీదేవత.

మద్రదేశపు రాజైన "అశ్వపతి" సంతానకాంక్షతో పదునెనిమిది సంవత్సరములకాలము సావిత్రీదేవతను కొలిచెను.ఆ దేవత ప్రత్యక్షమై వరము నడుగు మనెను. అతడు వినమ్రుడై

సీ॥ "ఆత్మజు గోరెద ననెను" (170)

అప్పుడు సావిత్రీ దేవత

తే.గీ.॥ "కన్నియ పుట్టు నీ కనియె" (170)

ఆ మాటలను వినిన "అశ్వపతి," "ఓ దేవీ! నీ కృపచే నా కోరిక సఫలము కాకూడదా?" అని విన్నవించెను. అందు కా దేవత

వ॥ ఏను నీ మనోరథంబు తెఱంగు మున్న చతు

ర్మంబున కెతింగించిన నతండు గన్నియగా
న్నిర్దేశించె; నద్దేవుని యానతి యమోఘంబు
విను మక్కన్నియ కారణంబున నీకు నొక్క
విధంబునం బిదప బుత్రలాభంబు నగు
సంతసిల్లు మని యనుగ్రహించెను" (171)

తరువాత రాజు భార్య మాళవి గర్భవతియై కూతురుని ప్రసవించెను. ఆ బాలికకు "సావిత్రి" అని పేరును పెట్టిరి. సావిత్రి భర్త సత్యవంతుడు.

3.1.1.1.3.3. ఋషుల సంతాన వరములు :

ఋషి యను మాటకు "ద్రష్ట"యని యర్థము. వాడుకలో ఋషి ముని, యతి, వైరాగి, బైరాగి మొదలగునవి పర్యాయపదములుగా నున్నవి. వసిష్ఠాదులు ఋషులు. ఆంధ్ర మహాభారతములో సంతాన వరములను ప్రసాదించిన ఋషులు-నారద, భృగు, అగస్త్య, కృష్ణ ద్వైపాయన, వసిష్ఠ, ఋచీక, భరద్వాజ, యాజ, చండకౌశిక, దమ సోమక, దీర్ఘతమ ఋషులున్నారు.

3.1.1.1.3.3.1. సువర్ణష్ఠివి జననము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ద్రోణపర్వము ద్వితీయాశ్వాసములో (188-222) గలదు. వరమును కోరి పొందినవాడు సృంజయుడు. వరప్రదాత నారదమహర్షి.

సృంజయు డొక మహారాజు. నారదమహర్షి యతనికి పరమ మిత్రుడు. రాజు సంతానార్థియై బ్రాహ్మణ పూజలను చేయసాగెను. నారదుడు పలుమార్లు వచ్చెడివాడు. ఒక పర్యాయము బ్రాహ్మణ

ముఖ్యులు ప్రయత్న పూర్వకముగ "ఈ రాజు గారి కోర్కెను తీర్చు" మని నారదమహర్షి నడిగిరి. అతడు "భవ దీప్సిత మెయ్యది నాకు నేల జెప్పవు" అని రాజు నడిగెను. అప్పుడు రాజు

కం॥ "అం
చిత గుణుడు రూపసియు నగు
సుతు గోరుదు నెప్పుడు నేను సుర గుణవంద్యా" (190)

వ॥ "అక్కుమారుండును మూత్ర పురీష లాలాశ్రు స్వేదం
బులు సువర్ణంబు లగునట్టి వాడు గావలయు" నని
కోరెను. (191)

నారదు డట్టి వరము నిచ్చెను. ఆ వర ఫలితమువలన జన్మించిన వాడే సువర్ణష్ఠివి. వాని మూత్ర పురీష లాలాశ్రు స్వేదములు సువర్ణము లగుచుండెను. అట్లుండగా తరుణావస్థ నొందిన సువర్ణష్ఠివిని దొంగ లపహరించి యరణ్యమునకు తీసికొని వెళ్ళి, చంపి, కోసి, చూచిరి. కాని బంగారు లభించలేదు. ఆ శవము నక్కడనే వదలిరి. ఆ పాప ఫలితమువలన వారిలోనే వా రంతఃకలహములతో కొట్టుకొని మరణించిరి. పుత్రశోకముచే సృంజయుడు చాల దుఃఖించెను. నారదమహర్షి వచ్చి షోడశ రాజులచరిత్రను చెప్పి యోదార్చెను. పుత్రశోకమును భరింపజాలనని సృంజయుడు తెలుపగా నారదమహర్షి సువర్ణష్ఠివిని బ్రతికించెను.

### 3.1.1.1.3.3.2. మాంధాతృ జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్యపర్వము" తృతీయాశ్వాసములో (200 203) గలదు. వరమును కోరి పొందిన వాడు యువనాశ్వుడు. వరప్రదాత భృగుమహర్షి.

ఇక్ష్వాకు వంశస్థుడైన యువనాశ్వు డను రాజు పరాక్రమ ధర్మ శీలుడై వేయి "అశ్వమేధ" యాగములను చేసినను సంతానము కలుగలేదు. కావున రాజ్యభారమును ప్రధానమంత్రికి నప్పజెప్పి భృగుమహర్షి యాశ్రమమునకు వెళ్ళి పుత్రకాముడై పెద్దకాల మతని నుపాసించెను. భృగుమహర్షి కరుణించి పుత్రకామేష్టిని చేసి, దాని నుండి మంత్రపూత జలపూరితమైన కుండను పొంది దానిని రక్షించు చుండుమని ఋత్విజుల నియోగించెను. అంతకు ముందు రాత్రియందు జాగరణముచే కావలాయుండిన ఋత్విజులు నిద్రించిరి. అప్పుడు, దప్పికచేత నా నీటినంతటిని రాజు త్రాగెను. తెల్లవారిన తరువాత నా విషయమును భృగువు తెలిసికొని యువనాశ్వుని చూచి.

> వ॥ "నీకు బుత్రార్థంబుగా మదీయ తపోవీర్య లబ్ధంబైన యిమ్మంత్ర జలంబు నీ భార్య కీ నున్నచో నీ వధిక పిపాసా పరుండవై యుపయోగించి యకర్తవ్యంబు జేసితి దైవ కృతం బెవ్వరికి దప్పింప నశక్యంబు దీనం జేసి నీకు గర్భంబై యింద్ర సదృశుండైన పుత్రుం డుద్భవించు ననెను" (203)

రాజు తన పురమునకు మరలెను. పిమ్మట నూఱు సంవత్సరము లకు రాజు వామభాగమును ఛేదించుకొని తేజుడైన బాలుడు పుట్టెను ఆ బాలు దర్శనార్థము దేవేంద్రుడు దిగి వచ్చి వాని వదనమున జుట్టన వ్రేలు నుంచి "అమృతమయంబగు దీనిని త్రాగు"మనెను. ఇంద్రుని వచనముచే దేవతలందరు నా బాలునికి "మాంధాతృడు" అను పేరును పెట్టిరి.

3.1.1.1.3.3.3. లోపాముద్ర జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్యపర్వము" ద్వితీయాశ్వాసములో (326) గలదు. వరమును కోరి పొందినవాడు విదర్భరాజు. వరప్రదాత "అగస్త్యమహర్షి."

విదర్భరాజు పుత్రకాముడై "అగస్త్యమహర్షి"ని ప్రార్థించెను. ఆ మహర్షి రాజు కోరికను మన్నించి

క॥ "తన తపశ్శక్తి జేసి పుత్రకాముండైన విదర్భరాజున
కొక్క కూతుం బుట్టించెను" (326)

ఆమె పేరే లోపాముద్ర.

తరువాత కొంతకాలమునకు పితరుల పుణ్యగతికొఱకు విదర్భరాజు నడిగి యామెనే వివాహమాడెను.

3.1.1.1.3.3.4. దృఢస్య జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్యపర్వము" ద్వితీయాశ్వాసములో (333-355) గలదు. వరమును కోరి పొందినది లోపాముద్ర. వరప్రదాత యామె భర్త "అగస్త్యమహర్షి."

లోపాముద్ర అగస్త్యుల వివాహమైన తరువాత వారరణ్యములో నివసించుచుండిరి. లోపాముద్ర రాజు కూతురు. కావున నామెకు నార చీర లిష్టములేక తన భర్తకు చెప్పలేకుండెను. ఒకనాడత డామె యందమునకు మన్మథగోచరుడై యామెను ప్రీతితో సంగమించ దలచెను. అప్పు డామె భర్త యభిప్రాయము నెఱిగి, లజ్జావదనయై యుతనితో

కం॥ "మునినాథ నీవు ననులే

తన మాల్య విభూషణ ప్రసన్నుడవై నా
కొనరింపు ముపత్యోత్సా
దన మీ ఋతు వాసరములు దప్పక యుండన్" (327)

అని అడిగెను. ఇల్వలునివలన ననంత సంపద లార్జించి "అగస్త్యు" డాశ్రమమునకు చేరుకొనెను. అప్పు డామె తన భర్తను

కం॥ దేవర బోలెడు వాని మ
హా వీర్య గుణాఢ్యు నొక్క యాత్మజు బడయం
గా వలతు నపేత గుణుల్
వేవురు సుతులయ్యు నెందు విఫలము కాదే?" (353)

అని కోరెను, అగస్త్యుడా కోరికను విని

వ॥ "నీ కోరినట్లి గుణవంతు డయిన కొడుకు నీకు జన్మించు
నని" అనుగ్రహించెను. (354)

పిదప "అగస్త్యుడు" తపోవనమున కరిగెను.

లోపాముద్ర యేడేండ్లు గర్భమును ధరించి పుత్రుని కనెను. అతని పేరే దృఢస్యుడు.

3.1.1.1.3.3.5. ధృతరాష్ట్ర జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" చతుర్థాశ్వాసములో (218-256) గలదు. సత్యవతి ప్రోద్బలముతో వర ఫలితము ననుభవించినది "అంబిక." వరప్రదాత కృష్ణద్వైపాయన మహర్షి.

విచిత్రవీర్యుడు పుత్రలాభము కలుగక పూర్వమే మరణించెను. వంశము (కులము) నాశనమగుననియు వివాహమాడి సంతానమును

పొందుమనియు సత్యవతి భీష్ము నడిగెను. కాని యతడు సమ్మతించ లేదు. బ్రాహ్మణులు క్షత్రియ స్త్రీలతో సంగమించి క్షత్రియ కులము నాశనము గాకుండ చేయవచ్చునని బలిరాజు వృత్తాంతమును గురించి భీష్ముడు సత్యవతికి తెలిపెను. అంత సత్యవతి కృష్ణద్వైపాయనుని స్మరించెను. అతడు ప్రత్యక్షమయ్యెను. విచిత్రవీర్యుని భార్యలందు "దేవరన్యాయమున" సంతానమును బడయుమని సత్యవతి యాదేశించెను. "అంబిక, అంబాలిక" లొక్క సంవత్సరకాలముపాటు తాను చెప్పినట్లు వ్రతమును చేసి శుద్ధాత్ములైనచో వారికి ధర్మస్థితిగ సత్పురుషులు పుట్టుదురని కృష్ణద్వైపాయనుడు చెప్పెను. కాని సత్యవతి వినలేదు. సంతానమును పడయకున్నచో ప్రజలలో నరాజకత్వ మేర్పడునని నొక్కి చెప్పెను. చివర కతడు సమ్మతించెను. సత్యవతి యా విషయమును "అంబిక"కు చెప్పెను. ఆ రాత్రి కృష్ణద్వైపాయనుడు "అంబిక"ను చేరెను. అతని యాకారమునకు భయపడిన "అంబిక" కన్నులను మూసికొనెను. సంగమావస్థలో కనులను మూసికొనుటవలన "అంధ" పుత్రుడు జనించునని కృష్ణద్వైపాయనుడు సత్యవతికి చెప్పెను. అంబికకు పుట్టినవాడే ధృతరాష్ట్రుడు.

3.1.1.1.3.3.6. పాండురాజు జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాదము "ఆదిపర్వము" చతుర్థాశ్వాసములో (218-257) గలదు. సత్యవతి ప్రోదల్బముతో వర ఫలితము ననుభవించినది "అంబాలిక." వరప్రదాత కృష్ణద్వైపాయన మహర్షి.

విచిత్రవీర్యుని రెండవ భార్య "అంబాలిక." మొదటి భార్య "అంబిక"వలన సంతానము నాకాంక్షించిన సత్యవతి, యా విధముగనే

"అంబాలిక"వలన గూడ సంతాన ప్రాప్తి ననుగ్రహింపుడని కృష్ణ ద్వైపాయనుని కోరినది. దేవరన్యాయమునకు నొడబడుమని సత్యవతి "అంబాలిక" నాదేశించినది. అంబాలిక కృష్ణద్వైపాయనుని కపిల గడ్డమును, కపిల జడలను, కపిల కన్నులను, నల్లని పొడవైన శరీరమును చూచి తెల్లబోయినది. ఆ స్థితిలో "అంబాలికా కృష్ణ ద్వైపాయనుల సంగమము జరిగినది. అంబాలికా తనయుడు బల, గుణవంతు, వంశకరుడైనను పాండురోగపీడితు డగువని కృష్ణ ద్వైపాయనుడు సత్యవతితో చెప్పెను. అంబాలికకు పుట్టినవాడే పాండురాజు.

3.1.1.1.3.3.7. విదుర జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" చతుర్థాశ్వాసములో (218-259) గలదు. వర ఫలితము ననుభవించినది "అంబిక" దాసి. ఆంధ్ర మహాభారతములో విదురుని తల్లి పేరు కని పించదు. వరప్రదాత కృష్ణద్వైపాయన మహర్షి.

కృష్ణద్వైపాయన ననుగ్రహముతో"అంబిక"కుధృతరాష్ట్రుడును, "అంబాలిక"కు పాండురాజును జన్మించిరి. ముని ప్రభావమునకు నాశ్చర్యమొందిన సత్యవతి మరల సత్సంతానము కొఱకు కృష్ణ ద్వైపాయనుని స్మరించెను. అంగవిహీన, యనారోగ్య పీడితులైన ధృతరాష్ట్ర పాండురాజుల జననమునకు బాధను వ్యక్తము చేసెను. కృష్ణద్వైపాయనుని రెండవపర్యాయము "అంబిక" దగ్గరకు పంపెను. భయకంపితయైన "అంబిక" తన స్థానములో తన దాసిని నియోగిం చెను. అంబికా దాసి కృష్ణద్వైపాయనుల సంగమము జరిగినది. వారికి కలిగిన కుమారుడే విదురుడు.

3.1.1.1.3.3.8. అశ్మక జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" సప్తమాశ్వాసములో (130-133) గలదు. వరమును కోరి పొందినవాడు కల్మాషపాదుడు. వరప్రదాత వసిష్ఠ మహర్షి.

మదయంతీ కల్మాషపాదులు రాజదంపతులు. కల్మాషపాదునికి వసిష్ఠమహర్షి పెద్ద కొడుకైన శక్తివలనను, మరియొక పర్యాయ మొక బ్రాహ్మణునివలన రాక్షసుని వలె ప్రవర్తించు శాప మున్నది. అరణ్యములో పుత్రార్థులై సంగమించు బ్రాహ్మణదంపతులను కల్మాష పాదుడు చూచి బ్రాహ్మణుని తినెను. అప్పుడా బ్రాహ్మణుని భార్య "అంగిరసి నా భర్తవలె నీవును పంచత్వము నొందు" మనియు, వసిష్ఠ మహర్షివలన సంతానమును పడయుమనియు నాదేశించెను. కల్మాష పాదుడు 'అంగిరసి" శాపమునకు వగచెను. అతడు వసిష్ఠమహర్షిని "అయోధ్య"కు పిలిచికొని వెళ్ళి యాదరించెను. అతనిని

కం॥ "మనుకుల పవిత్ర బుత్రకు
నిన సన్నిభు నాకు బడయు మే నట్లయినన్
మునినాథ నీ ప్రసాదనం
బున బితరుల వలన ఋణ విముక్తుడ నగుదున్ (131)

అని యడిగెను. ఆ మహర్షి యందుకు సమ్మతించెను. వసిష్ఠ ప్రసాదమువలన మదయంతి గర్భిణియైనది. పంద్రేండ్లు గర్భమును మోచినది. చివరకు విసిగి యశ్మశకలముచే నుదరభేదనమును చేసి కొనినది. అప్పుడు పుట్టినవాడే "అశ్మకుడు."

3.1.1.1.3.2.9. జమదగ్ని విశ్వామిత్రుల జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్యపర్వము"

తృతీయాశ్వాసములోను (131-131), తిక్కన భారతభాగము శాంతి పర్వము ద్వితీయాశ్వాసములోను (68-72), "అనుశాసనిక పర్వము" ప్రథమాశ్వాసములోను (107-117) నించుమించు నొకే విధముగా నున్నది. వరమును కోరి పొందినది భృగుమహర్షి కోడలును, ఋచీకముని భార్యయునైన సత్యవతి. నన్నయ భారతభాగములో వర ప్రదాత భృగుమహర్షి. తిక్కన భారతభాగములో వరప్రదాత భృగు మహర్షి కొడుకైన ఋచీక ముని.

నన్నయ భారతభాగము :

ఋచీక ముని కన్యాకుబ్జ దేశపురాజైన గాధి కూతురగు సత్యవతి నిష్ఠముతో వివాహమాడి యచటనే యుండెను. కొడుకును, కోడలిని చూచుటకు భృగుమహర్షి యచటకు వెళ్ళెను. వా రతనిని గొప్పగ గౌరవించిరి. అందు కతడు సంతసించి కోడలితో

కం॥ "ఇ
ష్టంబుల నిచ్చెద వేడుము నీ
వలచు వరం బనెను" (అరణ్య-3 ఆ-134)

వెంటనే యామె

వ॥ దేవా! నీ ప్రసాదంబున నా కొక్క కొడుకును మజ్జనని కొక్కకొడుకు నుదయింపవలయునని ప్రొక్కెను"(135)

అప్పుడు భృగుమహర్షి యామెతో

వ॥ "నీ కోరిన యట్ల యగు శుచిస్నాతలయి నీవు మేడి ప్రానిం గౌగిలింపుము నీ జనని నశ్వత్థంబు గౌగలింపు మను" మనెను (135)

పిమ్మట నా తల్లీ కూతుండ్రు శుచిస్నాతలైరి. వారిద్దరికి నిర్ణ

యించినట్లు గాకుండ పొరబాటున తారుమారుగ కౌగిలించుకొనిరి. ఆ విషయమును భృగుమహర్షి తెలిసికొని సత్యవతితో "నీకు బ్రాహ్మణ కులములో పుత్రుడు పుట్టినను క్షత్రియునివలె ప్రవర్తించును. నీ తల్లికి క్షత్రియ కులములో పుత్రుడు పుట్టినను బ్రాహ్మణునివలె ప్రవర్తించి గొప్ప కీర్తివంతుడగు"నని చెప్పెను. ఆ మాటలను వినిన సత్యవతి కృతాంజలియై

వ॥ "క్షత్రియ భావంబు దన పుత్రునకుం గాక పౌత్రునకగు నట్లుగా శ్వశురువలన వరంబు వడసెను" (137)

ఆమెకు భృగుమహర్షి వర ప్రభావమువలన పుట్టినవాడే జమదగ్ని. జమదగ్ని ప్రవర్తన బ్రాహ్మణునివలె నుండెను. కాని యతని కొడుకైన పరశురాముని ప్రవర్తన భృగుమహర్షి వరప్రసాదమార్పు వలన క్షత్రియుని ప్రవర్తనవలె నుండెను. సత్యవతి తల్లికి పుట్టినవాడే విశ్వామిత్రుడు. అతడు క్షత్రియుడైనను రాజ్యపాలనను వదలి బ్రాహ్మణునివలె గొప్పగ తపస్సును చేసి బ్రహ్మర్షి యనిపించుకొనెను.

తిక్కన భారతభాగము :

ఋచీకుని మామయైన గాధికి పుత్ర సంతానము లేదు. కావున ఋచీకుడు తనకును, తన మామకును పుత్రసంతానము కలుగవలెనను వాంఛతో రెండు చరువు (హవ్యపు కుండ) లను కల్పించి సత్యవతికి వాటి మహిమను గురించి తెలిపి, యొకదాని నామెను, మరియొకదాని నామె తల్లిని యుపయోగించుమని తెలిపి నదీ స్నానమునకు వెళ్ళెను. వారిద్దరును శుచిస్నాతులై వారికి నిర్దేశించినట్లు గాకుండ తల్లి పొరపాటువలన వాటిని తారుమారుగ నుపయోగించిరి. నదీస్నానాంతరము

వచ్చిన ఋచీకుడు దివ్యబోధనచే నా విషయమును గ్రహించి సత్యవతితో "క్షత్రియాంతః కరంబగు గర్భమును ధరించిన దాన"వని తెలిపెను. వెంటనే సత్యవతి భర్తను పొగడి

వ॥ "ఎమ్మెయినైన గృపసేయురే సాధ్విదన్ (70) "క్రూరం
డగు కొడుకుం గనుట కోర్వ ననెను" (శాంతి 2 ఆ-71)
ఋచీకుడు తన భార్య ప్రార్థనకు ననుగ్రహించి యామెతో

వ॥ "అవ్విశేషంబు నా పుత్రునకు లేకుండెడు పౌత్రుని
యందావహిల్లెడు నీ కెట్లు ప్రియంబట్లు కాగలయది
యని" (71) అనెను

తరువాత సత్యవతికి పుట్టిన పుత్రుడే జమదగ్ని. అతని ప్రవర్తన బ్రాహ్మణ వర్తనమునకు తగినట్లుగ నుండెను. కాని యతని కుమారు డగు పరశురాముని ప్రవర్తన ఋచీకుని వరప్రసాద మార్పువలన క్షత్రియ వర్తనమునకు తగినట్లుగ నుండెను. సత్యవతి తల్లికి పుట్టిన వాడే విశ్వామిత్రుడు. అతడు క్షత్రియుడైనను రాజ్యపాలనను వదలి బ్రాహ్మణునివలె గొప్పగ తపస్సునుచేసి బ్రహ్మ, వసిష్ఠుచేత బ్రహ్మర్షి యనిపించుకొనెను.

జమదగ్ని విశ్వామిత్ర జనన విషయములో నన్నయ భారత భాగములో వరప్రదాత భృగుమహర్షి. అతడు "మేడి, అశ్వత్థ" వృక్షములను కౌగిలించుకొనుమనెను. తిక్కన మహాభారతములో వర ప్రదాత భృగుమహర్షి కొడుకైన ఋచీక ముని. అతడు చరువు (హవ్యపు కుండ)ల నుపయోగించుమనెను. భృగుమహర్షి ఋచీక మును లిద్దరును సత్యవతి కోరినట్లే యామె పౌత్రునికి క్షత్రియ ధర్మము సంతరించు నట్లనుగ్రహించిరి.

3.1.1.1.3.3.10. ప్రతర్ధన జననము :

ఈవృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనికపర్వము" ప్రథమాశ్వాసములో (119-131)గలదు. వరమును కోరి పొందినవాడు దివోదాసుడు. వరప్రదాత భరద్వాజ ముని.

వత్స దేశాధిపతి హైహయుడు.అతనికి వీతహవ్యుడని మరియొక పేరు. అతనికి పదిమంది భార్యలు. వారివలన వీతహవ్యునికి నూర్గురు కుమారులు కలిగిరి. కాని వారు దుష్టులు.వారు కాశీ రాజగు హర్యశ్వుని, తరువాత అతని కొడుకగు సుదేవుని చంపిరి. పిమ్మట వారుసుదేవుని కొడుకగు దివోదాసునిపై దండెత్తగా నతడు భరద్వాజ ముని నాశ్రయించెను. అప్పుడు భరద్వాజుడు

తం॥ "ఓడకు నీకొక
తనయుని గల్పింతు రిపు విహార నిపుణున్" (121)

వ॥ "అని పుత్రకామేష్టి సేసినం బ్రభవించిన పుత్రుం డప్పుడ పదుమూడేండ్ల ప్రాయంబు వాడయ్యె బ్రతర్ధన నామధేయుం డగు నక్కుమారుం డమ్మహాత్రుని యనుగ్రహంబున వేదంబులు ధనుర్వేదంబును వేగంబ యధిగమించి" (122)

చం॥ "ముని కృప నావహింపగ సముజ్జ్వల తేజము బొంది ప్రీతియై
జనకుడు యౌవరాజ్యపద సంగతు జేసెను" (123)

పిమ్మట ప్రతర్ధనుడు తండ్రి యనుమతిని బొంది యుద్ధమునకు వెళ్ళి వీతహవ్యుని కొడుకులనుచంపెను.తరువాత వీతహవ్యునిమీదికియుద్ధము

నకు వెళ్ళెను. అతడు పరిగెత్తుకొని వెళ్ళి భరద్వాజ ముని నాశ్రయించెను. అత డతనిని తన శిష్య వర్గమున కలుపుకొనెను. తరువాత ప్రతర్దనుడు వెళ్ళి మునికి తన విజయ విషయమును విన్నవించెను. ముని శిష్యులను చూపించెను. శిష్యులలో నున్న వీతహవ్యుని గుర్తుపట్టెను. ముని శక్తికి వీతహవ్యుని యుక్తికి ప్రతర్దనుడు సంతసంచెను.

3.1.1.1.3.3.11. ధృష్టద్యుమ్న ద్రౌపదుల జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" సప్తమాశ్వాసములో (6-21) గలదు వరమును కోరి పొందినవాడు ద్రుపదుడు. వర ప్రదాత యాజుడు.

ద్రుపదు డను రాజు యుద్ధములో "అర్జునుని" చేత నోడి, ద్రోణాచార్యునిచేత నవమానింపబడి విడువబడెను. అందుకు ద్రుపదుడు కోపించి రణరంగమున ద్రోణుని వధించునట్టి కొడుకును, "అర్జునునికి భార్య యగునట్టి కూతురిని పొందవలయునని నిశ్చయించుకొనెను. గంగాతీరమునందును వానప్రస్థ వృత్తిలోనుండి యనవరత వ్రత వ్యాసక్తులైన యాజోపయాజులలో నుత్తముడైన "ఉపయాజు"ని నుపాసించెను.

కం॥ "మునినాథ నాకు సత్పుత్ర
జననం బగు నట్టి క్రతువు సద్విధి గావిం
చిన గృత కృత్యుడ నగుదుం
గొను మిచ్చెద నీకు లక్ష గోధేనువుల్" (9)

అని కోరెను. కాని "ఉపయాజుడు" నిరాకరించి, ఫలితమును కోరి పనిని చేయు వారి దగ్గరకు వెళ్ళుమనెను. కాని వెళ్ళకుండ నొక

సంవత్సరకాల మతనినే సేవించెను. పిమ్మట "ఉపయాజుడు" ద్రుపదు నిని యాజుని దగ్గరకు వెళ్ళుమనెను. అట్లు ద్రుపదుడు యాజుని దగ్గరకువెళ్ళెను. ద్రోణుని గెలువగల కొడుకు కావలయునని ప్రార్థించెను. అప్పుడు యాజుడు

వ॥ "నీ కోర్కికిం దగిన యట్టి కొడుకునం గూతురుం బుట్టుదు రోడకుండు" మనెను. (17)

వెంటనే యాజుడు "ఉపయాజు"ని సహాయముతో ద్రుపదుని చేత పుత్రకామేష్ఠిని చేయించెను. అగ్నికుండమునుండి కత్తి, ధనుస్సు కిరీటములను గలిగిన పుత్రుడును, సుందరమైన పుత్రికయును పుట్టిరి, వారే ధృష్టద్యుమ్న, ద్రౌపదులు.

3.11.1.2.3.12. జరాసంధ జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము సభాపర్వము ప్రథమాశ్వాసములో (136-158) గలదు. వరమును కోరి పొందినవాడు బృహద్రథుడు. వరప్రదాత చండకౌశికుడు.

బృహద్రథుడు మగధ దేశాధిపతి. అతడపుత్రకుడు. తన యిద్దరి భార్యలతో కలిసి యరణ్యమునకు వెళ్ళి తపస్సును చేసికొను చుండెను. అచట చండకౌశికు డను మునిని చూచి భార్యలతో కలిసి భక్తితో నిరంతరము నియమపూర్వకముగ సపర్యలతో సేవించెను అందుకు ముని సంతోషించి మెచ్చి

వ॥ "నీ కిష్టంబు చెప్పు మిచ్చెద" ననెను (140)

పుత్ర సంతానము కావలయునని వినయభావముతో రాజు కోరెను. అందుకు ముని కరుణించి పరమధ్యానముకుళిత నయను

డయ్యెను. చిలుకచేత కొఱుకబడిన యొక మామిడిపండు గాలివలన ముని యెడియందు పడెను. ముని దాని నభిమంత్రించి రాజున కిచ్చి

వ॥ "ఈ ఫలంబు వలన నీ కొక్క పుత్రుం డుద్భవిల్లు" నని చెప్పెను (144)

రాజు భార్యలతో కలిసి పురమునకు వచ్చి యా పండును సమముగా రెండు ముక్కలుగా చేసి యిద్దరి భార్యల కిచ్చెను. పిదప పదవ మాసమందు నొక రాత్రి సమయమున నా యిద్దరి స్త్రీలకు బిడ్డలో కుడిభాగమొకరికి, ఎడమభాగమొకరికి పుట్టెను. ఆ బిడ్డముక్క (శకలము)లను వెంటనే బయట పారవేయుమని యా యిద్దరి స్త్రీలును చెప్పిరి. దాసీలట్లు చేసిరి. ఆ ముక్కలు కదలుచుండెను. రాత్రియందు చరించు "జర" అను రాక్షసి యా రెండు ముక్కలను తినవలయునని తలచి వాటిని రెండు చేతులతో తీసికొని యొకటిగ కలిపెను. వెంటనే యా బిడ్డ యేడ్చెను. అంతఃపురమందలి వృద్ధ స్త్రీలు వచ్చి యా పిల్లవానిని తీసికొనిరి. ఆ సంతోష విషయమును తెలిసికొని రాజు వచ్చెను. ఆ రాక్షసి మనుష్య స్త్రీ రూపమును ధరించి తన పేరును తా నా బిడ్డ రెండు ముక్కలను చూచిన, కలిపిన, బిడ్డ యేడ్చిన విషయ మంతటిని చెప్పెను. రాజు రాక్షసిని పూజించి పుత్రుని తీసికొనివెళ్ళెను. 'జర" అను రాక్షసి యా రెండు ముక్కలను సంధించుటచే నా బిడ్డకు "జరాసంధుడు" అను నామకరణమును చేసెను. ఆ రాక్షసికి నేటేట మహోత్సవమును చేయించుచుండెను. చండకౌశిక ముని కొంతకాలము తరువాత వచ్చి యా బిడ్డను చూచి గొప్పవాడగునని చెప్పెను.

3.1.1.1.3.2.13. దమయంతి జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్యపర్వము"

ద్వితీయాశ్వాసములో (8) గలదు. వరమును కోరి పొందినవాడు భీముఁడు. వరప్రదాత దమనుడు.

"భీముడు" అనుపేరుగల విదర్భరాజుకు సంతానము కలుగ లేదు. భార్యతో కలిసి వ్రతములను క్రమముగా చేసెను. తరువాత భార్యతో కలిసి "దమనుడు" అను ముని నుపాసించెను.

సీ॥ తద్వరమున
దమయంతి యను కూతు దమదాంతదమను ల
న్పుతులను బడసె" (8)

3.1.1.1.3.3.14. జంతు నామకాది శతపుత్ర జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్యపర్వము" తృతీయాశ్వాసములో (208-217)గలదు. వరమును కోరి పొందినవాడు సోమకుడు. వరప్రదాత యతని ఋత్విజుడు. ఆంధ్రమహాభారతములో నతని పేరు లేదు.

సోమకుడు రాజుగా నున్నప్పు డతనికి నూఱుమంది భార్యలు. కాని సంతానము కలుగలేదు. కావున నతడు మహామఖము నొనరించి "జంతుడు" అను నొక్క పుత్రుని పొందెను. ఆ బాలుని నారాజు నూరు మంది భార్యలును పరమప్రీతితో తమ తమ స్వంతపుత్రునివలె మన స్ఫూర్తిగా పెంచుచుండిరి. ప్రజలు గూడ నాశ్చర్యపడిరి. ఒకనా డా బాలుని కురుపుచీమ కుట్టెను. బాధను సహించలేక యా బాలు డేడ్చెను. అప్పుడు వాని దగ్గరకు రాజు భార్యలందఱును వచ్చి యేడ్చిరి. వారందరి యేడ్పును రాజు విని యంతఃపురమునకు వెళ్ళి పుత్రుని నోదార్చెను.తరువాత నా రాజు తన మంత్రులను,ఋత్విజుని

సమావేశపఱచి "నేనొకే కొడుకు నెట్లు నమ్మియుండగలను. భార్యలు నూఱుమంది యుండియు సంతానమల్పముగా నుండుట మీకును నుచితమేనా?" అని యడిగెను. అప్పుడు ఋత్విజుడు రాజుతో

తే.గీ.॥ "నీ భార్య శతంబునందు
బరగ నూర్వురు పుత్రులు బడయ నీకు
నభిమతంబేని దగు దగ దనక నీవు
కడగి మా చేయ బంచిన క్రతువు సేయు" (213)

వ॥ "ఈజంతుం బశువుగా వధించి తద్వపాహవ్యంబుల హవ్యవహునిం దనిపిన దాన నీనూర్వురు భార్యలకు నూర్వురు కొడుకులు పుట్టుదు రందగ్రజుండైన జంతుండు సౌవర్ణ లక్షణ లక్షిత సవ్యపార్శ్వుండై యుదయించు" నని తెలిపెను. (214)

అందుకు రాజు సమ్మతించెను. యజ్ఞమును చేయుటకు ఋత్విజుడు ప్రారంభించి రాజు కొడుకైన జంతుని పశువుగా వధియింపించి, వాని వపను (కొవ్వు (లేక) మెదడు) యజ్ఞములో వేల్చెను. అప్పుడా నూరుమంది స్త్రీలును యజ్ఞము దగ్గరకు వచ్చి పుత్ర స్నేహభావముతో చాల దుఃఖించిరి. ఆ సమయమున వారా యజ్ఞపు పొగను పీల్చుటచే వారు గర్భములను ధరించి నవమాసములు నిండిన తరువాత సంతోషముతో పుత్రులను కలిగియుండిరి. వారిలో కూడ మొదటివాడు జంతుడు. పూర్వమువలె నా నూరుగురు తల్లులు జంతుని తమ పుత్రులతోబాటు సమానముగా పెంచిరి.

**3.1.1.1.3.3.15. అంగరాజు నామకాది ద్వాదశ పుత్ర జననము :**

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము"

చతుర్థాశ్వాసములో (231_237) గలదు. వరమును కోరి పొందినవాడు బలి. వరప్రదాత దీర్ఘతముడు.

దీర్ఘతము డను పేరుగల ముని జన్మాంధుడు. అతని భార్య ప్రద్వేషిణి. సార్థక నామధేయ,ఆమె యొకనాడు కుమారులను పిలిచి దీర్ఘతముని గంగలో వదలుడని యాదేశించినది. తల్లియానతో వారు తండ్రిని కట్టెలకుకట్టి గంగలో వదలిపెట్టిరి,అతడు వేదములను చదువుచు ప్రవాహవేగమున కొట్టుకొని పోవసాగెను. అతడు గంగాభిషేకార్థము వెళ్ళిన "బలి" అను రాజుకు కనబడెను. ఆ రాజతనిని గొప్ప మునిగ భావించి, తన యదృష్టము కొలది కనబడెనని తలచి యొద్దునకు తీసికొని వచ్చి

వ॥ "ఏ నపుత్రకుండనై యెవ్విధంబునను సంతానంబు వడయ నేరకున్నవాడ నాకు సంతాన దానంబు దయ సేయుమని" అతని నడిగెను. (239)

అతనిని తన పురమునకు తోడ్కొని వెళ్ళి ఋతుమతియైన తన భార్యయగు సుదేష్ణను సమర్పించెను. కాని యామె దీర్ఘతముని యాకారమునకు నహస్యపడి తన దాది కూతురిని పంపెను. ఆమెకు నా మునివలన నేకాదశ పుత్రులు పుట్టిరి. వారందరును తన పుత్రు లేనా? యని రాజు ముని నడిగెను. కాదని దీర్ఘతముడు నిజమును చెప్పెను. మరల బలి సంతానముకొఱకు మునిని ప్రార్థించి తన భార్యను ముని దగ్గరకు పంపెను. అప్పుడు

వ॥ "దీర్ఘతముండును దాని యంగంబు లెల్ల నంటి చూచి వంశకరుండు మహాసత్త్వుండును నయ్యెడు కొడుకు నీకుం బుట్టునని యను గ్రహించెను" (237)

తరువాత నామెకు పుత్రుడు పుట్టెను. అతని పేరే "అంగరాజు." అతడు తరువాత రాజర్షి యయ్యెను.

3.1.1.1.3.4. మహారాజుల సంతాన వరములు :

సంతాన వరములను ప్రసాదించిన వారు వ్యుషితాశ్వుడు, యయాతి, భీమసేనులు. వీరిలో యయాతి షోడశ చక్రవర్తులలో నొకడు కాగా, వ్యుషితాశ్వుడు పౌరవవంశజుడు. భీముడు చంద్ర వంశజుడు.

వరగ్రహీతల దృష్టితో చూడగా వ్యుషితాశ్వుని భార్య భద్ర క్షత్రియ కాంత. యయాతివలన వరమును పొందిన శర్మిష్ఠ దాసిగా నమ్ముడుపోయిన రాక్షస రాజకన్య. భీమునివలన వరమును పొందిన హిడింబి రాక్షసాంగన.

3.1.1.1.3.4.1. సాల్వమద్రుల జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" పంచమాశ్వాసములో (78-84) గలదు. వరమును కోరి పొందినది భద్ర. వరప్రదాత యామె భర్తయైన వ్యుషితాశ్వుని శవమందలి దివ్యవాణి.

వ్యుషితాశ్వుడు పౌరవంశపురాజు. అతని భార్యపేరు భద్ర. రాజు భద్ర యందనవరతకామాతురుడై "అక్ష్మరుజాక్రాంతుడై యనపత్యుండై మరణించెను. భద్ర భర్తలేమికి, నపుత్రత్వమునకు మిక్కిలి వగచినది. కనుక ననుమరణమో పుత్రోదయమో కలిగించుమని దర్భాస్తరణశాయినియై భర్త శవమును కౌగిలించుకొని వగచినది. అప్పుడా శవమందుండి యొక దివ్యవాణి భద్రతో

కం॥ "విదితముగ నీకు వరమి
చ్చెద నోడకు లెమ్ము గుణ వశీకృత భువనుల్
సదమల చరిత్రు లాత్మజు
లుదయింతురు వగవకుండు ముదితేందుముఖీ" (840)

వ॥ "ఋతుమతిమయిన యష్టమ దివసంబున నేనిం జతుర్దశ దివసంబున నేని శుచివై శయనంబువ నుండి నన్ను దలంపు" మనెను. (841)

ఆమె యావిధముగ చేసి ముగ్గురు సాల్వులను, నలుగురు మద్రులను మొత్తము "ఏడుగురు" కొడుకులను పొందెను.

3.1.1.1.3.4.2. ద్రుహ్యుమ్వనుపూరుల జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" తృతీయాశ్వాసములో (169-181) గలదు. వరమును కోరి పొందినది శర్మిష్ఠ. వరప్రదాత యయాతి.

యయాతి క్షత్రియుడు, రాజు. అతని భార్య శుక్రాచార్యుని కూతురైన దేవయాని. దేవయానికి వివాహమగుటతో నామెతో శర్మిష్ఠయు దాసిగా వెళ్ళినది. దేవయాని యానతో యయాతి శర్మిష్ఠాది పరిగణనము నుద్యానవనములో నుంచెను. అప్పుడప్పుడు రాజా యుద్యాన వనవిహారమును చేసెడువాడు. అట్టి సందర్భములో ఋతుమతియైన శర్మిష్ఠయును యయాతియును పరస్పరము సందర్శించుకొనిరి. వారిలో శృంగారభావము లంకురించినవి. శర్మిష్ఠ యయాతిని పొగడి

వ॥ "అద్దేవయానిం బరిగ్రహించి నప్పుడ తద్ధనం బగుట

నేనును భవత్ప్రరిగ్రహంబు కావున నన్నుం గరుణించి నాకు ఋతుకాలోచితంబు బ్రసాదింపవలయు నని" అడిగెను (175).

అప్పుడు యయాతి తనకు శుక్రాచార్యుడు శర్మిష్ఠవిషయములో వడక తప్ప నితర యిష్టముల నన్నింటిని తీర్చుమని పెట్టిన షరతును జ్ఞాపకము చేసెను. కాని యామె పట్టువదలకుండ ధన, ప్రాణాపహరణములందు వధగ వచ్చిన బ్రాహ్మణుని విషయమందును. వధూజన సంగమమందును, వివాహవిషయమందును బొంకవచ్చునని మునులు చెప్పిన మాటలను తెలిపి, తనతో వివాహ విషయమున నసత్యదోషమతనిని పొందదని సలహా నిచ్చెను. అప్పుడు యయాతి యొడంబడి శర్మిష్ఠకు నభిమతము నొనరించెను. దానివలన నామె గర్భిణియై కొడుకును కనెను. ఆ సంబంధమంతటితో నాగకుండ తరువాత మరి యిద్దరు పుత్రులు పుట్టువరకు నుండెను. వారిపేర్లే వరుసగ "ద్రుహ్యువు అనువు, పూరువు"లు.

3.1.1.1.3.4.3. ఘటోత్కచ జననము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" షష్ఠాశ్వాసములో (219-227) గలదు. వరమును కోరి పొందినది హిడింబి. వరప్రదాత భీమసేనుడు.

భీమసేనుడు లాక్షగృహ దహనానంతర మరణ్య దారిలో నడ్డు తగిలిన హిడింబుడను రాక్షసుని చంపెను. అతని చేతకు పాండవులును హిడింబానుజయును సంతసించిరి. పిమ్మట పాండవుల వెంట హిడింబి వెళ్ళుచుండెను. అందుకు భీమసేనుడు నిరాకరించెను. హిడింబిని భయపెట్టెను.అప్పుడు ధర్మరాజు భీముని వారించి హిడింబుని పైగల కోపము

నబలయైన హిడింబిపై చూపవద్దనియు, నాపదలో నున్న వారిని రక్షించుట ధర్మపరాయణులకు పరమార్థమనియు తెలిపి హిడింబిపై నాత్మీయబుద్ధితో నుండుమని చెప్పెను. ఆ సమయమున హిడింబి ధర్మరాజ కుంతీదేవులకు మ్రొక్కి భీమునిపై నామెకు గల మదన భావమును తెలిపి, "మీరేమి చెప్పినను వాటినన్నిటిని చేయుదు" ననెను. మఱియు వారితో దగ్గరలోనే శాలిహోత్రుని తపఃప్రభావము వలననున్న కొలనులోని నీటిని త్రాగినచో నాకలిదప్పులుండవనియు నా వనము శీత వాతాప వర్షములవలన రక్షించుననియు, నచ్చట నుండినచో కృష్ణద్వైపాయన మహర్షి వచ్చి హితోపదేశమును చేయు ననియు భవిష్యత్కాల పనులను గురించి తెలిపెను. ఆ మాటలకు కుంతియును, పాండవులును విస్మయపడిరి. హిడింబి నాదరించిరి. కుంతి భీమునితో "నీ అన్నయును, నేనును చెప్పిన పనిని వెంటనే చేయుము. ఈమె పరమసాధ్వి. ఈమె నాదరించినచో మనకే మేలగును. కావున నీ వీమె కోరికను తీర్చు"మని హితమును పలికెను. భీముడు సమ్మతించెను. కుంతి హిడింబిని "నీవు శుచివై యుత్తమ స్త్రీ గుణములతో భీమునికి మనఃప్రియమును కలిగించుము. పగ లెల్లను మీ యిష్టము వచ్చినట్లు విహరించి రాత్రులందు మా దగ్గర నుండవలె"నని నియమించెను. అప్పుడు భీమసేనుడు

> వ॥ "పుత్ర జన్మంబగు నంతకు దీని మీ వచనంబున బరి
> గ్రహించెద నని వారల సమక్షంబున సమయంబు
> సేసెను" (227)

తరువాత వారికి పుత్రుడు సద్యోగర్భమున పుట్టెను. అతని పేరే ఘటోత్కచుడు.

3.1.1.1.4. భుక్తి వరములు :

భుక్తి యనగా "ఆహారము." ఆహారము భూలోకవాసులకు తప్పక యవసరము. దేవతల సహజాహారములను గురించి యెక్కడను ప్రస్తావించలేదు. కాకున్న హవిర్భాగము, అమృతపాన సేవనముల నాహారములుగా నా యా గ్రంథములలో వర్ణితములు. కాని భూలోకములో ననితరసాధ్యములైన పనులను చేయుటలో నాహార మవసర మనిపించును. ఆంధ్ర మహాభారతములో దేవతలకు పగను సాధింపు విషయములో నాహార మవసరమని కథలు కనిపించుచున్నవి. భుక్తి వరములను పొందినవారు అగ్ని, గరుత్మంతులు. అగ్ని దేవత, గరుత్మంతుడు దేవతుల్యుడు. భుక్తి వరాలు మూడు విధములు – జంతు, మనుష్య యితర భక్షణములు.

3.1.1.1.4.1. జంతు భక్షణములు :

ఆహారము రెండు విధములు – శాఖాహారము, మాంసాహారము. అయినను "ఆంధ్ర మహాభారతము"లో బలవంతముగా నొక దానిని వధించి యాహారముగా గ్రహించు కథలు రెండు. 1. గజ కచ్ఛప భక్షణము, 2. సర్పాశనము.

3.1.1.1.4.1.1. గజ కచ్ఛప భక్షణము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" ద్వితీయాశ్వాసములోను (64-78), తిక్కన భారతభాగము "అనుశాసనికపర్వము" ప్రథమాశ్వాసములోను (210-247) నొకే విధముగా గలదు. వరమును కోరి పొందినవాడు దేవతుల్యుడైన గరుత్మంతుడు. వర ప్రదాత యతని తండ్రి కశ్యప ప్రజాపతి.

గరుత్మంతుడు వినతా తనయుడు. అతడు తల్లి దాస్యమును పోకార్ప తలంచెను. సోదరులైన "ఉరగ"ల కోరికమేరకు "అమృత మును తేర సమకట్టెను. కాని గరుత్మంతు డప్పటికి బాల్యావస్థలో నున్నవాడు. కావున తండ్రి దగ్గరకు వెళ్ళి, తన ప్రయత్నమును, తన యాకలిని గురించి తెలిపెను. అప్పుడు కశ్యప ప్రజాపతి, ధనము కొఱకు నసూయబుద్ధితో నన్నదమ్ములైన విభావసు సుప్రతీకులు పరస్పరము శపించికొని గజకచ్ఛపములైన వృత్తాంతమును తెలిపి

వ॥ "అవి నీ కాహారంబు సు మ్మరుగుము కార్యసిద్ధి యు
య్యెడ మని" (68) పలికెను.

ఈ వరములో నొక విశేషమున్నది. చేయదగిన కార్యము సాహసోపేతము. దానికి బుద్ధి, భుజబలములు రెండును నవసరము. కనుక కశ్యప ప్రజాపతి దగ్గరకు వెళ్ళి తన యాకలిని విన్నవించెను.

3.1.1.1.4.1.2. సర్పాశనము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము ద్వితీయాశ్వాసములో (54-62, 106 117) గలదు. వరమును కోరి పొందిన వాడు గరుత్మంతుడు. వరప్రదాత "ఇంద్రుడు."

గరుత్మంతుడు వినతా తనయుడు. తల్లి దాస్యమును పోకార్చు టకు నతడు "అమృతము" నపహరించెను. అతని సాహసమున కెదు రొడ్డువారు లేకపోయిరి. ఇంద్రుని వజ్రాయుధము కూడ మొక్క బోయెను. ఓటమిని చెందిన "ఇంద్రుడు" గరుత్మంతునితో సఖ్యము నపేక్షించెను. గరుత్మంతు డంగీకరించెను. వరమును కోరుమని ఇంద్రుడు పలికెను. అమర శ్రేయస్సుకొఱకు "అమృతము"ను తీసి కొను నుపాయమును గరుత్మంతుడు తెలిపి

కం॥ "పుణ్యుఁడు లై
మా కిట్లు హితము జేసిన
యా కద్రువ పుత్రు లశన మయ్యెడు నాకున్" (115)

అని కోరెను. అందుకు ఇంద్రుఁడు సమ్మతించెను.

3.1.1.1.4.2. మనుష్యాహారము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" ద్వితీయాశ్వాసములో (54-62) గలదు. వరమును కోరి పొందినవాడు గరుత్మంతుడు. వరప్రదాత యతని తల్లియగు వినత.

గరుత్మంతుడు తన తల్లికిని, తనకును దాస్యమును తొలగించు కొనదలచెను. సర్పములు కోరినట్లు "అమృతము"ను తెచ్చుటకు పూనుకొని తల్లికి చెప్పెను. ఆమె కొడుకును దీవించెను. అప్పుడు గరుత్మంతుడు తన కాహారము నుపదేశింపుమని తల్లిని కోరెను. ఆమె యతనికి

కం॥ "విష నిధి కుక్షి కసంఖ్యము
నిషాద గణ ముండి ధారుణి ప్రజకు గడున్
విషమమును జేయుచు దాని ని
మిషమున భక్షించి చను మమిత విభూతి" (58)

అని చెప్పెను. మరియు నిషాద భక్షణావసరమున బ్రాహ్మణు లను పరిహరింపుమని యాదేశించెను. అట్లు గరుత్మంతు డనేక శత సహస్ర నిషాదగణమును కబళించెను.

3.1.1.1.4.3 ఇతరములు :

భూచర జలచరము లను నిర్దేశములేకుండ సూచించు భక్షణము లీ వర్గము.

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతిపర్వము ద్వితీయాశ్వాసములో (75–76) గలదు. వరమును కోరి పొందినవాడు "అగ్ని దేవుడు." వర ప్రదాత కార్తవీర్యార్జును డను రాజు.

హైహయ వంశజుడు కార్తవీర్యార్జునుడు. అతని భూభాగము సువిశాలము. అతని యానలేకుండ దేవతలును నతని రాజ్యమున నడుగిడలేరు. ఒకనాడు "అగ్ని దేవుడు" తన కాహార మిడుమని రాజును ప్రార్థించెను. అంత నతడు

కం॥ "గిరి నగ
రారణ్య గ్రామ ఖర్వటాదు" (75) ల
వాహారముగా ననుగ్రహించెను.

పైవరములను పొందిన వారిలో "అగ్ని" ఒక దేవత. గరుత్మంతుడు దేవతుల్యుడు.

3.1.1.1.5. పునరుజ్జీవన వరములు :

పునరుజ్జీవన మనగా మరల బ్రతుకుటయని సామాన్యార్థము. చనిపోయిన వారందరును మరల బ్రతికినచో బ్రహ్మ సృష్టికి విఘాతము కలుగును. కావున ప్రత్యేక పరిస్థితులలో మాత్రమే మరణించిన వారిని మరల బ్రతికించుట జరిగినది.

ఆంధ్ర మహాభారతములో నీ కోవకు చెందిన వరము లైదు కలవు. ఇవి వరుసగా మాతృ, పితృ, పతి, పుత్ర, భ్రాతృ పునరుజ్జీవనములు.

3.1.1.1.5.1. మాతృ పునరుజ్జీవనము :

కుటుంబములో నెక్కువ ప్రాధాన్యత తల్లికే. బిడ్డలను కంటికి

రెప్పవలె తల్లే చూచును. కావున తల్లి దగ్గర చనువెక్కువ.అద్దాన తల్లికి భయపడకపోయినను తల్లికి బాధ కలిగినప్పు డామెకు పుత్రుడు తన శక్తికొలది ప్రయత్నించి బాధను తొలగించును. బ్రతికించును.

జమదగ్ని ఋషివరము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్యపర్వము" తృతీయాశ్వాసములో (139-144) గలదు. వరమును కోరి పొందినది పరశురాముడు. వరప్రదాత యతని తండ్రియైన జమధగ్ని.

జమదగ్ని భార్య రేణుక. అతడు తన యైదుగురు కుమారులతో నరణ్యమునం దాశ్రమ మేర్పరచుకొని తపమును సాగించుకొను చుండెను. ఒకనాడు కుమారులు ఫలార్థము వనముల కేగిరి. రేణుకయు వారిని వెంబడించెను. కుమారు లడవిలో చాలాదూరమునకు కదలిరి రేణుక వనములో జలక్రీడలాడుచు సంయోగరతు లయిన చిత్రరథ దంపతులను చూసినది. చిత్రరథుని రూపమునకు మెచ్చి యతనితో వ్యభిచరించి యాపై ఆశ్రమమునకు మరలినది. జరిగిన వృత్తాంతము జమదగ్నికి తెలిసినది. ఇంతలో కుమారులును నాశ్రమమునకు చేరుకొనిరి. అంత రేణుకను చంపుడని జమతగ్ని వరుసగా మొదట నలుగురు కుమారుల నాదేశించెను. కాని వారు కిమ్మనకుండిరి. జమదగ్నికి కోపము హెచ్చినది. అడవిలో నజ్ఞాన ప్రవృత్తితో మృగ పక్షులవలె నుండుడని శపించెను. తరువాత జమదగ్ని పరశురాముని నాదేశించెను. అతడు తండ్రి యాజ్ఞకు బద్ధుడై తల్లిని చంపెను. అంత జమదగ్ని శాంతించెను. కుమారుని సాహసమునకు సంతసించి వరమును కోరుకొమ్మనెను. అంత పరశురాముడు

వ॥ "మదీయ జనని జీవించియుం యుండను నాకు దద్వధ

దోష నిష్కృతియు సహోదరులు శాప విముక్తులయి
యెప్పటి యట్లయుండను సమరంబుల నాక ప్రతిహత
శక్తియు దీర్ఘాయువుగా ప్రసాదింపుం డని తండ్రి
వలనం దన యభిమతంబులు వడసెను. (144)

ఈ వరములో రెండు విశేషములున్నవి. మొదటిది తల్లి తప్పు చేసినదయ్యు క్షమార్హము. రెండవది పరశురాముని ఉపాయము. అన్నలు తల్లిని చంప వెనుకాడి శాపగ్రస్తులయిరి. తాను సిద్ధముగా కున్న తనకు శాపము తప్పదు. పైగా జమదగ్ని తానే చంపుటకు సిద్ధము కాగలడు. కనుక పరశురాముడు తాను చంప సిద్ధపడెను. తండ్రి మనసు ఎరిగినవాడు కనుక తల్లిని బ్రతికించుకొనగలనను నమ్మకమతనికి కలదు. ఇది యతని యుపాయము.

3.1.1.1.5.2. పితృపునరుజ్జీవనము :

కుటుంబములో తల్లి తరువాత తండ్రికే ప్రాధాన్యత యెక్కువ. బిడ్డకు తల్లి ఆలనను చూడగా, తండ్రి పాలనను చూచును. తల్లి బిడ్డను శారీరకముగా పోషించగా, తండ్రి బిడ్డను మానసికముగా పోషించుచు లోకవర్తనమును తెలుపుచు లోకములో గౌరవస్థానమునకు చేర్చును. చిన్నప్పుడు తండ్రికి భయపడినను పెద్దయిన పిమ్మట తండ్రి బాధను తొలగించును. బ్రతికించును.

దేవతలవరము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్యపర్వము" తృతీయాశ్వాసములో (274-280) గలదు. వరమును కోరి పొందినవాడు "అర్వావసుడు" వర ప్రదాతలు దేవతలు.

రైభ్యుడుమహాముని. అర్వావస పరావసులు రైభ్యునికుమారులు. వారిరువురు బృహద్ద్యుమ్నుని సత్రయాగమున ఋత్వికులై యాగము చేయసాగిరి. ఒకరోజు తెల్లవారుజామున పరావసు డడవిలో నాశ్రమమునకు వెళ్ళుచుండెను. అపుడేదో యలికిడి యయినది. ఆ యలికిడిని విని పరావసుడు మృగమేదో యెదురు వచ్చుచున్నదని తలంచెను. ప్రాణభయముతో నద్దానిని చంపెను. కాని తేరిపార చూడగా నది మృగముకాదని తన తండ్రీ రైభ్యుడని తెలిసినది. చివరకు తండ్రికి తానే దహనసంస్కారమును చేసి జరిగిన వృత్తాంతము నన్నకు చెప్పెను. మరియు బ్రహ్మహత్యాదోషనివృత్తి వ్రతమును చేయుమని అర్వావసుని కోరుకొనెను. అతడు సమ్మతించి యట్లు చేయసాగెను. పరావసుడు తానొక్కడే సత్రయాగము చేయసాగెను. అర్వావసుడు బ్రహ్మహత్యా దోష నివృత్తి వ్రతమును పూర్తిచేసి తమ్ముని కడకు వచ్చెను. కాని తమ్ముడు "ఇతడు బ్రహ్మఘాతుకుడు. సత్రయాగమును వదలి యశుభమగు బ్రహ్మహత్యాదోష నివృత్తి వ్రతమును చేయవెడలుట యితని నేరము. కనుక యాగమును చేయ ననర్హు"డని రాజుకు చెప్పెను. రాజు "అర్వావసు"ని బలవంతముగా పంపించెను. అర్వావసుడు జరిగిన వృత్తాంతమంతయును దేవతలకు తెలిపెను. దేవతలు సంతోషించి వరమును కోరుకొనుమని యాదేశించిరి. అపుడు "అర్వావసుడు" సంతోషముతో

వ॥ "తన తండ్రియు భరద్వాజుండును యవక్రీతుండు
చెప్పటి యట్ల జీవించియుండను నిజ జనకుండు పరా
వసు చేత నిహతుండగుట వాని విస్మరింపను వలయు
నని ప్రార్థించెను." (280) దేవతల వరమువలన రైభ్య

భరద్వాజ అవక్రీతులు పునరుజ్జీవితులైరి.

ఈ వరములో మూడు విశేషము లున్నవి. మొదటిది తండ్రి పట్ల పెద్దకొరుకు కున్న ప్రీతి. రెండవది తమ్మునిమీద ప్రేమ. మూడవది తమ్ముడు తప్పు చేసినవాడైనను సత్రయాగమును సక్రమముగా నిర్వహించెనవెడి సంతృప్తి. ఈ వరములో పితృ పునర్జీవనముతో బాటు తన తండ్రికి మిత్రుడైన భరద్వాజ మునిని దుష్టుడైన యతని పుత్రుడగు "అవక్రీతు"ని పునరుజ్జీవన సంప్రార్థము కూడ కనిపించును.

3.1.1.1.5.2. పతి పునరుజ్జీవనము :

స్త్రీకి వివాహానంతరము సర్వస్వము పతియే యాధారము పతి యున్నప్పుడే యామెకు పుట్టినింట, మెట్టినింట సమాజములో గౌరవమెక్కువ. రూపగుణములు, సంపద యున్నను నామెకు గౌరవమును, మనశ్శాంతిని పరిపూర్ణముగా కలిగించలేవు. కావున పతిని బ్రతికించుకొనును.

యమధర్మరాజు వరము :

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్యపర్వము సప్తమాశ్వాసములో (240 252) గలదు. వరమును కోరి పొందినది సావిత్రి. వరప్రదాత యమధర్మరాజు.

సావిత్రి సత్యవంతు లాదర్శ దంపతులు. సావిత్రి పతివ్రత. ఆమె యమధర్మరాజు నర్థించి మూడువరములను పొందెను. అయినను నామె వెనుదిరిగి వెళ్ళలేదు. ఏడు మాటలను మాటలాడినంత నెటువంటి వారైనను సార్వజనులకు చుట్టము లగుదురనియు తాను చాల

మాటలను మాటలాడుటచే నతనికి చుట్టము నైతిననియు కావున మిత్ర మనోరథము నవశ్య కర్తవ్యముగా చిత్తగింపవలెననియు పలికెను. ఆమె మాటలకు ధర్ముడు

వ॥ "నీకుం బ్రసన్నుండ నైతి నభీష్టంబైన వరం బొక్కటి యిచ్చెద వేడుమని" (247) పలికెను.

ఇంతకు ముందువలె నిప్పుడు "అదియు నీ పతి ప్రాణములు తప్ప" అని యతడు చెప్పలేదు. కావున వెంటనే యామె

చం॥ "పతి రహితంబు దుస్సహము భర్తృవినాకృతయైన కాంత దూ
షిత యగు సర్వమంగళ విశేషము లందును గాన మత్ప్రియు
డతులిత కీర్తిశాలి సుగుణాఢ్యుడు సాళ్వసుతుండు లబ్ధజీ
వితుడుగ నిమ్ము ధర్మ పదవి పరిరక్షణ పుణ్యవీక్షణా (249)

అని వేడెను. ఆమె కోరికను విని యమధర్మరాజు సత్యవంతుని నవగత ప్రాణుని జేసెను.

3.1.1.1.5.4. పుత్ర పునరుజ్జీవనము :

పున్నామ నరకము నుండి రక్షించుకొనుటకేగాక సమాజములో గౌరవమును పొందుటకు,తమ రూపములను తమ బిడ్డలలో చూచుకొని యానందమును పొందుటకు, వృద్ధాప్యములో తమ కేడుగడగా నుండుటకొఱకే తల్లితండ్రులు పుత్రులను కోరి పొందుదురు. కావున వారిని బ్రతికించుకొందురు.

శంకరుని వరము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతిపర్వము తృతీ

యాశ్వాసములో (366-381) గలదు. వరమును కోరి పొందినది మర ణించిన యొక బాలుని తల్లితండ్రులు. వరప్రదాత శంకరుడు.

విదిశా పట్టణమున నొకపసి బాలుడు మరణించెను. ఆ పసిబాలుని తల్లిదండ్రులు శవమును కాటికి కొనిపోయిరి. దుర్భరవేదనతో విల పింపసాగిరి. వారి పెడబొబ్బలను విని యొక గ్రద్ధ వారిని సమీపించి సూర్యాస్తమయమును సూచించి కదలి వెళ్ళుడని యాదేశించినది. అంత జంబుక మొకటి పసిబాలుడు బ్రతుకవచ్చునని సూర్యాస్త మయము కాలేదని వారిలో వాశనురేకెత్తించినది. ఇట్లు గృధ్రజంబుక ములు మాటిమాటికి నిరాశాశలతో తల్లిదండ్రుల నూగించిరి. అంత సూర్యాస్తసమయమున శంకరుడు ప్రత్యక్షమై వారిని వరముకోరుడని యాదేశించెను. అపుడు వారు

కం॥ "బాల మరణ శోకంబున
దేలక యుంటంగగావు" (380) మని కోరిరి.

శివుడు వారి కోరికను మన్నించి

వ॥ "ఆ శిశువు ప్రాణంబు లొసంగి వీడు శతాయుష్మంప
న్నుండగు వాడని యానతిచ్చెను. (381)

మరియు గృధ్ర జంబుకములు కోరకనె వాటికి నాకలి లేనట్ల నుగ్రహించెను.

ఈ వరమున గుర్తింప దగ్గ యంశములు మూడున్నవి. మొద టిది యాహారమునకై గృధ్రజంబుకముల యాయాసము. రెండవది మాతాపితల యాక్రోశము. మూడవది భగవంతుని కరుణాస్వభావము

**3.1.1.1.5.5. భ్రాతృ పునరుజ్జీవనము :**

పురుషునికి భార్యాబిడ్డలమీద కంటె ముందుగా సోదరులపై

ప్రేమ యుండును. కుటుంబరీత్యా విడిపోయినప్పటికి, నా ప్రేమ తరుగదు. కలిసియున్నప్పుడు నా ప్రేమ యెక్కువగానే యుండును. "నా"అనేవారిలో మొదట సోదరులే. కావున సోదరుని బ్రతికించుకొనుము.

యమధర్మరాజు వరము :

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము అరణ్యపర్వము సప్త మాశ్వాసములో (456-459) గలదు. వరమును కోరి పొందినవాడు ధర్మరాజు. వరప్రదాత యమధర్మరాజు.

యక్షుడడిగిన ప్రశ్నల కన్నింటికిని ధర్మరాజు తగిన సమా ధానములను చెప్పెను. అందుకు యక్షుడు సంతసించెను. ధర్మరాజును దయాబుద్ధితో చూచి

> వ॥ "నీ తమ్ములం దొక్కని ప్రాణంబు లిచ్చెద వేడు
> మనెను" (456)

అప్పుడు ధర్మరాజు

> సీ॥ "శ్యామాంగు నా రక్తజలరుహనేత్రు సా
> లప్రాంశు నున్నత లలిత బాహు
> నకులుని బ్రదికింపు" (457) మని వేడెను.

యక్షుడు ధర్మరాజు కోరికను విని గొప్ప బలవంతులును నిష్ట మైనవారును నగు భీమార్జునులలో నొకరిని కోరకుండ నగనికంటె తక్కువవాడైన నకులు నెందుకు కోరితివని ప్రశ్నించెను. ధర్మరాజు తనతండ్రి పాండురాజుకు కుంతి, మాద్రియని యిద్దఱు భార్యలనియు వారిలో కుంతికి పెద్దకొడుకైన తాను జీవించియుండగా, మాద్రి కొడుకులలో పెద్దవాడైన నకులుడు బ్రతికియుండుట న్యాయమనియు

జనులు తనను ధర్మాత్ముడని పొగడుదురనియు. నెంత కష్టము వచ్చిననను ధర్మహానికి నోర్వలేననియు యక్షునికి చెప్పెను. ఆ మాటలకు యక్షుడు సంతోషించెను. ధర్మరాజు కోరకనే

వ॥ "నీదైన ధర్మజ్ఞతకు మెచ్చితి నీ తమ్ములందఱు లబ్ధ జీవితులయ్యెడు మనెను." (459)

ప్రాణము పోయిన వారివలె పడియుండిన యా నల్గురును వెంటనే నిద్రనుండి మేల్కొనినట్లు లేచి నిలిచిరి. ధర్మరాజు వారిని చూచి చాల సంతోషించెను.

3.1.1.2. వ్యక్తిసంబంధి వరములు :

ఒక వ్యక్తికి సంబంధించిన వరములు వ్యక్తిసంబంధి వరములు. ఏ వ్యక్తియైన సమాజములో గౌరవమును పొందుచు, తనకొక ప్రత్యేక స్థానముండి, తన పేరు స్థిరముగా నిలిచియుంచవలెనని కోరును. అందుకై ప్రయత్నించును. కొన్ని ప్రయత్నములలో నెదురీత యాడవలసి వచ్చును. కొన్ని ప్రయత్నములు సులభముగా నెఱవేరును. ఒక్కొక్కప్పుడు తనతోబాటు తనకు సంబంధమున్న వారి కొఱకుకూడ ప్రయత్నించి సఫలతను పొందవలసివచ్చును. వీటిని ప్రధానముగా విద్య, ఉపదేశ, మైత్రి, పదవి, కామరూపత్వ, భవిష్యత్కథన, విముక్తి వరములుగా వర్గీకరించవచ్చును.

3.1.1.2.1. విద్యావరములు :

తెలిసికొనునదెల్లయు విద్యయే. అయినను ప్రాచీనకాలమున "బ్రహ్మవిద్య" యొకటే విద్య. తక్కినవి విద్యానామకములు. విద్యావర ప్రదాత దేవత కావచ్చు. లేదా సమానులు కావచ్చు. గురుశుశ్రూష చేతగాని, పుష్కలమయిన ధనమును సమర్పించుటచేతగాని, యొక విద్య నొసగి మరొకవిద్య నేర్పదగును. ఆంధ్రమహాభారతములో

విద్యావరములు మూడు. ఇవి ఇంద్రదత్తమయిన వేదశాస్త్రవిద్య, సూర్యప్రసాదితమగు యజుస్సంప్రాప్తి, నలఋతుపర్ణుల అశ్వ, అక్ష విద్యలు.

3.1.1.2.1 1. ఇంద్రదత్తమైన వేదశాస్త్రగమ విద్య :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్యపర్వము" తృతియాశ్వాసములో (253-259) గలదు. వరమును కోరి పొందిన వాడు "అవక్రీతుడు." వరప్రదాత "ఇంద్రుడు."

తపోధనులైన రైభ్యభరద్వాజులు మిత్రులు. అమిత్రు లొక వనమున తపమును మొదలిడిరి. రైభ్యునికి "అర్వావస, పరావసులు పుత్రులు. వారు శ్రద్ధతో వేదాధ్యనమును చేసిరి. భరద్వాజునికి "అవక్రీతు"డొక్కడే పుత్రుడు. అతడు వేదాధ్యయనము చేయలేదు. పండితులు రైభ్యుని నతని యిద్దరు కొడుకులను పూజించుచుండగా "అవక్రీతుడు" సహించలేకపోయెను. తపోబలమున నఖిల వేదశాస్త్ర గమములను పొందదలచెను.సమిద్ధంబైన యగ్ని యందు హవిస్సును వేల్చుచు నుగ్రతపమును చేయుచుండెను. అతని తపస్సునకు "ఇంద్రుడు" సహించలేక యతని దగ్గరకు వెళ్ళెను. అతని తపోద్దేశ్య మును ప్రశ్నించెను. అవక్రీతుడు తన మనోరథమును వాచ్యము చేసెను. గురుముఖమున విద్యార్జనము సాగించవలయునుగాని తప ముతో పొందు విద్యవలన నెటువంటి సాధువులకైనను మదమాత్సర్య ములు కలుగునని తెలిపెను. పైగా విద్యాసముపార్జనమునకు తప ముపాయము గాదనియు వారించెను. కాని "అవక్రీతుడు" పట్టును వదలక తపస్సును చేయుచుండెను. ఇంద్రుడు వృద్ధ బ్రాహ్మణ వేషములో వెళ్ళి అవక్రీతునికి సమీపమున గంగానది ప్రవాహమునకు

నారథిని నిర్మించుచుండెను. అవక్రీతు డతనిని పరిహసించెను. అపుడు బ్రాహ్మణ వేషములో నున్న "ఇంద్రుడు" "అవక్రీతుని"తో "నీవలె నఘటనమానమైన పట్టుదలతో ప్రయత్నమును చేయుచున్నా"నని పలికెను. తన నిజరూపమును చూపి యిప్పటికైన నిరర్థకమైన ప్రయత్నమును మానుమని "అవక్రీతు"నికి సలహా నిచ్చెను. కాని "అవక్రీతుడు" ఎట్టు వదలలేదు.

వ॥ "నా యభిమతంబు సఫలంబు సేయవలయునని" (259) కోరెను.

ఇంద్రు డతని యభిమతమును తీర్చెను. అవక్రీతు డా విషయమును తన తండ్రికి చెప్పెను.

3.1.1.2.1.2. సూర్యప్రసాదితమగు యజుస్సంప్రాప్తి :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతిపర్వము షష్ఠాశ్వాసములో (134-140) గలదు. వరమును కోరి పొందినవాడు యాజ్ఞవల్క్యముని. వరప్రదాత సూర్యభగవానుడు.

యాజ్ఞవల్క్యముని సూర్యు నుద్దేశించి తపస్సును చేసెను. సూర్యుడు సంతసించి దయతో ప్రత్యక్షమై వరమిత్తునని చెప్పెను. అప్పుడు ముని "యజుస్సంప్రాప్తి గోరెద" (134) నని తెలిపెను. సూర్యుడతని కోరికను విని

సీ॥ "అట్లేని వాగ్దేవి నావహించెద విప్ర
తంబుగా జేయు మాస్యంబు విప్ర"(134) అని పలికెను

ముని సంతోషముతో తన నోటిని తెరచియుండెను. సరస్వతీ దేవి యతనినోట ప్రవేశించెను. పిమ్మట నా మునికి దాహము వేసెను.

అక్కడనే సూర్యుని తెలిసికొనలేక ముని కదలెను. కొంత సమయము నకు శరీరము చల్లబడునని సూర్యుడు చెప్పెను. అట్లు జరిగెను. అప్పుడు మునికి

కం॥ "భూసురవర వేదము ప్రతి
భాసిల్లుచు సంతత ప్రవృత్తి గలుగు ను
ల్లాసంబు బుద్ధి నొందు స
మాసన్నంబులగు సాంఖ్యమతయోగంబుల్" (136)

ఆ.వె. "యోగసాంఖ్యసిద్ధి నొందు నిష్ఠా వాప్తి
సనుము సమ్మదమున" (137) అనుమృదూక్తులను
పలికెను.

ముని చాల సంతసించెను. సూర్యుడు హస్తాచలమునకు వెళ్లెను. తరువాత ముని తన మందిరమునకు వెళ్ళి సరస్వతీదేవిని తలచెను. వెంటనే

కం॥ "వినుత స్వర వ్యం
జనభూషిత యుగ్గ భాగ సంస్ఫురదోంకా
ర నితాంత హృద్య మధు గ
ర్భ నిజాకృతి విశదముగ సరస్వతి తోచెన్" (139)

ముని యామె నత్యంత భక్తితో స్తుతించెను. అప్పటినుండి సూర్యప్రసాద లబ్ధయును, పంచదశశాఖా సమన్వితమును, నిఖి లోత్తరసంహితయునగు నాయజుర్వేదో మూర్తిని ముని ధరించెను. శిష్యులకు నధ్యయనమును చేయించుచుండెను.

3.1.1.2.1.3. నల, ఋతుపర్ణుల, అశ్వ, అక్షవిద్యలు :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్యపర్వము" ద్వితీయాశ్వాసములో (164-221) గలదు. వరమును కోరి పొందిన వాడు బాహుడను పేరుతో నుండిన నలమహారాజు. వరప్రదాత ఋతుపర్ణుడను రాజు.

ఋతుపర్ణుడు దమయంతి రెండవ స్వయంవరమునకు బయలు దేరి రథము నారోహించెను.అప్పుడు గుఱ్ఱములు మ్రొగ్గెను.గుఱ్ఱములు గమ్యమును చేరగలవా.యని ఋతుపర్ణుడు ప్రశ్నించెను. సమయము లోపల విదర్భపురమునకు పవనగతివలె వెళ్ళగలవని బాహుకుడు చెప్పెను. అప్పుడు ఋతుపర్ణుడు

వ॥ "అట్లయిన నీ హయతత్త్వ కౌశలం బెఱింగి నీకు నభిమతం బొనరింతునని" (169) పలికెను.

రథము కదలినది. బాహుకుని రథసారథ్యమునకు ఋతుపర్ణుడు వార్ష్ణేయుడును నాశ్చర్యపడిరి. దారిలో విభీతక వృక్షమును చూచిరి. ఋతుపర్ణు డా వృక్షములలో రెండు కొమ్మలలో గల పర్ణఫలములు పదివేలనియు, నొకటి తప్ప తక్కిన కొమ్మలలో రెండువేల తొంబదే నని చెప్పెను. వెంటనే బాహుకుడు రథమును నిలిపెను. వృక్షము నప్పుడే యురులచే పడద్రోసెను. ఆ కొమ్మలలోగల యాకులను ఫలములను లెక్కించెను. అవి ఋతుపర్ణుడు చెప్పిన సంఖ్యతో సరి పోయెను. అందుకు బాహుకు డాశ్చర్యపడి, "అవ్విద్య నాకు నుపదేశింపవలయునని" (175) కోరెను. అతని కోరికను వినిన ఋతుపర్ణుడు బాహుకునికి

కం॥ ఇది యక్ష హృదయ మనగా
విదితం బగు విద్య దీని విధ్యుక్తముఁగ
మది సెఱుగు నరుడు సంఖ్యా
విదుడగు దుష్కృత కళంక విషముక్తు డగున్" (176)

అనుచు "అక్షహృదయము నుపదేశించెను. బాహుకు డా విద్యను పొంది సంతుష్టుడయ్యెను. ఋతుపర్ణుడు కోకకనే కృతజ్ఞతా భావముతో

వ॥ "నీకు నశ్వహృదయం బిచ్చెద బరిగ్రహింపుమనెను" (178) అందుకు ఋతుపర్ణుడు.

వ॥ "అట్ల చేయుదు నది యంతకు నీయంద యుండునిమ్మ నా వలసినప్పుడు గొందు ననియె" (176)

తరువాత వారు విదర్భపురమునకు చేరిరి. అచ్చట దమయంతి ప్రజ్ఞాకౌశలముతో బాహుకుడే నలుడని గ్రహించెను. అతనిని పిలిపించి తండ్రికి విషయమంతటిని తెలిపెను. బాహుకుడు విషయ మంతటిని గ్రహించి యప్పుడే కర్కోటక సర్పమును తలంచెను. వెంటనే నలుడు తన పూర్వపురూపమును పొందెను. నలదమయంతులు సంతోషముతో కలిసిరి. ఆ విషయమును ఋతుపర్ణుడు తెలిసికొనెను. నలుని దగ్గరకు వెళ్ళి తన సంతోషమును తెలియబరచెను. తనతప్పును మన్నించుమని యడిగెను. కాని నలుడు ఋతుపర్ణుని నూరడించి యతనికి "అశ్వహృదయోపదేశంబు చేసెను" (221)

### 3.1.1.2.2. ఉపదేశ వరములు :

ఆంధ్ర మహాభారతములో నున్న యుపదేశ వరములనుబట్టి "జ్ఞానము, ఎఱుక, యోగము, దేవతాధ్యానము, తత్త్వజ్ఞానము, పరమాత్మ విషయమైన వివేచనము, పరమాత్మోపాసనము, బ్రహ్మో

పాసనము" మొదలైనవి ముఖ్యము. ఉపదేశ వరము లేదు గలవు. ఇవి

1. త్రికాలవేదిత్వము,
2. పుణ్యతీర్థమాహాత్మ్య కథనము,
3. క్షత్రియోచితధర్మకథనము,
4. తత్త్వోపదేశము,
1. నారాయణమూర్తి వరము,
2. నారదమహర్షి వరము,
5. పరమార్థ రహస్యోపదేశము,
6. మహనీయ బోధోపదేశము.

3.1.1.2.2.1. త్రికాలవేదిత్వము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతిపర్వము షష్ఠాశ్వాసములో (401-402) గలదు. వరమును కోరి పొందినవాడు వేద వ్యాసుడు. వరప్రదాత నారాయణమూర్తి.

వ్యాసుడు మహర్షి. వేదవిభజనమువలన నతడు వేదవ్యాసుడయ్యెను. కాని లోకవర్తనము తెలియనివాడు. అందువలన నతడు పాలకడలి తీరమున త్రికాలవేదిత్వము నబయతలచెను. నారాయణుని ప్రార్థించెను.

> వ॥ నారాయణ ప్రసాదంబునం జేసి సిద్ధ మనోరథుం-
> డయ్యెను." (402)

3.1.1.2.2.2. పుణ్యతీర్థమాహాత్మ్య కథనపదేశ వరము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్యపర్వము

ద్వితీయాశ్వాసములో (236-289) గలదు. వరమును కోరి పొందిన వాడు భీష్ముడు. వరప్రదాత పులస్త్య మహాముని.

పూర్వము భీష్ముడు గంగాతీరమున నధ్యయనవ్రతుడై సంతత వ్రతపరుడై తండ్రికి మేలు కలుగునట్లుగ శుభకర్మలు చేయుటకు పూనుకొనెను. ఆ సమయమున నతని పితృదేవతా భక్తికి పరమధర్మ చరితమునకు మెచ్చి యతనిని చూడవలయునని పులస్త్యుడను మహాముని వచ్చెను. భీష్ముడతి భక్తిభావముతో నతనిని దర్భాసనస్థునిచేసి యర్ఘపాద్యాది విధుల పూజించెను. అప్పుడా మహాముని భీష్మునితో

కం॥ పితృదేవ భక్తి బుణ్య
వ్రతచర్యను నీవ యొల్ల వారికి నత్యు
న్నతుడవు" (238) అని ప్రశంసించెను.

మఱియు "నీ యిష్టంబు సెప్పు యే నమోఘ దర్శనుండవని" (239) పలికెను. ఆ మాటలకు భీష్ముడు సంతోషించి

చం॥ "ధరణి ప్రదక్షిణంబుగ ముదంబున గుమ్మరి తీర్థసేవనా
పరులగుచున్న ధన్యులు శుభస్థితి నెట్టి ఫలంబు నొందంగాం
తురు? బహుతీర్థ కీర్తనముతో నెఱిగింపుము దీని" (235)
అని కోరెను.

భీష్ముని కోరికను వినిన పులస్త్య మహాముని యఖిల పుణ్యతీర్థ మహత్త్వమును గురించి భీష్మునకు వివరించెను.

3.1.1.2.2.3. క్షత్రియోచిత్ర ధర్మోపదేశము :

ఈ వృత్తాంతము భారతభాగము శాంతిపర్వము ద్వితీయాశ్వాస

ములో (241-250) కలదు. విష్ణు సాక్షాత్కారమునకై ప్రయత్నించిన వాడు మాంధాతృడు కాగా నా ప్రయత్నమునుండి విరమింపజేసి క్షత్రియోచిత ధర్మోపదేశమును చేసినవాడు ఇంద్రుడు.

మాంధాతృడు రాజు. క్షత్రియుడు. సద్గుణవంతుడు. అతడు విష్ణు సందర్శనార్థము మహాధ్వరమును చేయ సమకట్టెను. యాగము కొనసాగినది. విష్ణువు ప్రత్యక్షము కాలేదు. కాని "ఇంద్రుడు" ప్రత్యక్ష మయ్యెను. మాంధాతృడును నితర రాజులును "ఇంద్రు"నికి నమస్కరించిరి. ఇంద్రుడు మాంధాతృని తలంపు నడిగెను. మాంధాతృడు

కం॥ సాంసారిక వ
ర్తన ముడుపుము భైక్షచరణ తత్పరత మనం
బున దృఢముగ నొందింపుము
నను జరితార్థునిగ జేయు" (246) మని యడిగెను.

అపుడు "ఇంద్రుడు" "నీవు రాజువు. సద్ధర్మములన్నిటికంటె నృపధర్మము మేలు. ఈ ధర్మపాలనమువలన నుత్తమగతులు కలుగు" నని యాశ్వాసించెను. అట్లే రాజుల నందరిని చూచి "భిక్షాచరణ మర్హముకాదు. మీరు రాజులై రాజ్యపాలనము చేయుట యుక్త"మని యాదేశించెను. మాంధాతృడును, నితర రాజులును వారి ప్రయత్నమును మానిరి.

3.1.1.2.2.4. తత్త్వోపదేశ వరములు :

3.1.1.2.2.4.1. నారాయణమూర్తి వరము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతిపర్వము షష్ఠాశ్వాసములో (349-353, 377-390) గలదు. వరమును కోరి పొందిన వాడు నారదమహర్షి. వరప్రదాత నారాయణమూర్తి.

బదరికాశ్రమమున నారదమహర్షి నారాయణమూర్తిని భక్తితో కొలిచి

సీ॥ "ఎద్ది సిద్ధి కారాధనీయ
మానతి యిమ్మని" (349) ప్రార్థించెను.

నారాయణమూర్తి కృపతో విని

సీ॥ "ధ్రువం బచ
లం బింద్రియాగోచరంబు సూక్ష్మ
మనుపమ మన సర్వమున కంతరాత్మయై
వెలుగు తత్త్వముదక్క వేఱ కలదె

తే॥ యరయ నారాధ్యమై యజు డాది గాగ
సకల భూతంబులకును బూజ్యంబు దాన
యనివెను" (349)

ఆ తత్త్వమును గురించి తెలుపుమని నారదమహర్షి కోరెను. నారాయణమూర్తి తత్త్వమును గురించి ఈ క్రింద తెలిపిన విధముగ నుపదేశించెను.

క్షేత్రజ్ఞుడను వా డింద్రియముల కందడు. ప్రాణములన్నియు తెగినను నతడు తెగడు. త్రిగుణరహితుడు అఖిలమునకు "ఆత్మ" యని, "సర్వసాక్షి" యని, "అజుడని," "నిష్కలు"డని తెలియును. అతడే జీవుడు, వాసుదేవుడు, సంకర్షణుడని పిలువబడును. వారే మనోఽహంకారములు. వరుసగా "ప్రద్యుమ్న, అనిరుద్ధులని పేర్లుంచబడిరి. ఇదంతయును నారాయణమూర్తితో కూడినదే. అతడిరువది తత్త్వ కోటికి నాథుడై "పంచవింశకాభిఖ్యు"డనియు, పరమపురుషుడనియు,

సేర్లను కలిగియుండును. అతడు తప్ప పరమము మరేదియు లేదు. ఏకాంతికు డెవ్వని చూచి నిత్యానందమును పొందునో యా పరమాత్ముడే నారాయణమూర్తి. భూతాత్మకమైన యఖిల ధాతుచయము నారాయణమూర్తిలోనే యున్నది. జీవ శరీరములు బహుభావా కలితములు. జీవుని చూచితి ననుట నారాయణమూర్తి మాయా విలసనము. జీవుడు నారాయణమూర్తిలో కలిసియున్నాడు. కావున నెవడు భక్తి యుతుడై నారాయణమూర్తిని పొందునో వాని కతడు ముక్తిని ప్రసాదించును. నారాయణమూర్తి వలననే యాదిత్య మరుద్వసు రుద్రాది దివిజగణమును, బ్రహ్మయును, చతుర్వేదములును నాయా విశేష గౌరవమొందును. నారాయణమూర్తి బ్రహ్మను సృష్టించి జగత్సృష్టికై యతనిని నియమించి తా నేకాకియై మధ్యస్థ వృత్తితో దివ్యభవ్యమగు సహాయముగ సంచరించును. ఒక్కొక్కప్పుడు జగద్ధితముగా వరాహాది జన్మలెత్తెను. తరువాత గూడ శ్రీకృష్ణావతారమెత్తి నరునితో కలిసి భూభారమును తొలగింతుననియు, నా జన్మలోనే బాణాసురునితో యుద్ధమునకు దిగునపుడు మహాదేవునితో పోరాడవలసి వచ్చుననియు తెలిపెను.

2.1.1.2.2.4.2. నారదమహర్షి వరము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతిపర్వము షష్ఠాశ్వాసములో (295 316) గలదు. వరమును కోరి పొందినవాడు వేదవ్యాసముని కొడుకైన శుకుడు. వరప్రదాత నారదమహర్షి.

వేదవ్యాస మహర్షికి "సుమంత, వైశంపాయన, జైమిని, పైలులు శిష్యులు. వారు గురువు దగ్గర నధ్యయనమును చేయునపుడు బ్రహ్మ నినాదము కలిగెడిది. వారధ్యయనమును ముగించుకొని గురువు దగ్గర సెలవును పొంది వెళ్ళిరి. తరువాత నొక

నాడు నారదమహర్షి వేదవ్యాసుని యాశ్రమమునకు వెళ్ళెను. బ్రహ్మ నినాదము లేకపోవుటకు కారణమును వ్యాసుని నడిగెను. శిష్యులు వెళ్ళిరని సమాధానమును చెప్పెను. అప్పుడు నారదమహర్షి వేదవ్యాస మహర్షితో "నీవైన నా వ్రతమును సెల్లించుచుండవలయును గదా!" అని పలికెను. వేదవ్యాస మహర్షి తన కొడుకైన శుకునితో కలిసి యప్పు డధ్యయనమును మొదలుపెట్టిరి. అంత హోరుగాలి వీచినది. వా రధ్యయనమును మానిరి. గాలి తగ్గిన తరువాత వేదవ్యాసమహర్షి గంగానదీ స్నానమునకు వెళ్ళుచు శుకుని నధ్యయనమును చేయు మని చెప్పెను. నారదముని వినునట్లుగ శుకు డొకడే కొంతసే పధ్య యనమును చేసెను. నారదముని మెచ్చి శుకునితో

వ॥ "నీకు మే లొనర్చెద నిష్టంబు సెప్పు మనెను" (910)

శుకుడప్పుడు నారదమునిని

వ॥ "ఈ లోకంబునం బుట్టిన వానికి హితం బెయ్యది దానిం జెప్పవే" (910) యని కోరెను.

నారదముని శుకునికి

తత్త్వ ప్రకారమును, ధర్మములను గురించి చెప్పెను. నారదుని హితమును వినిన శుకుడు యోగసిద్ధి పొంద దలచెను.

గంగానది దగ్గర స్నానమును చేయుచుండిన తండ్రి దగ్గరకు వెళ్లెను. వినతుడై "యోగసిద్ధిని పొందుటకు వెళ్ళుచున్నా"నని తండ్రికి చెప్పెను. అతడు సంతసించెను. వెంటనే శుకుడు తండ్రికి ప్రదక్షిణ మును చేసి బయలువెడెను.

3.1.1.2.2.5. పరమార్థ రహస్యోపదేశము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగపర్వము" ద్వితీయాశ్వాసములో (2-106) గలదు. వరమును కోరి పొందినవారు ధృతరాష్ట్ర విదురులు. వరప్రదాత సనత్సుజాతుడు.

సంజయుడు రాయబారిగా "ఉపప్లావ్యము" నందున్న పాండవుల దగ్గరికి వెళ్ళెను. ఒకరోజు సాయంకాలమునకు వెనుదిరిగి హస్తినకు చేరెను. ధృతరాష్ట్రుని నిందించెను. మరుసటిరోజున సభలో రాయబార విశేషములను గురించి తెలుపుదునని చెప్పి యింటికి వెళ్లెను. సంజయుడేమి చెప్పునోయని ధృతరాష్ట్రు డాలోచించి కలతచెందెను. శరీరము వేడెక్కెను. నిద్రరాకపోవుటచే నా రాత్రివేళ విదురుని పిలిపించుకొనెను. విదురుడు ధృతరాష్ట్రునికి ధర్మరాజుయొక్క మానసిక ప్రవర్తనను గురించి చెప్పెను. పైగా విదురుడు కొన్ని హితభాషణములను నయానయముల విధమును, నీతివాక్యములను చెప్పి పాండవులకు వారి రాజ్యభాగము నిమ్మని యాదేశించెను. కాని ధృతరాష్ట్రుడు పరమార్థ దృష్టిని గురించి తెలుపుమని విదురుని నడిగెను. పరమార్థమును గురించి తాను చెప్పలేననియు, పురాణ పురుషుడైనను కుమారుడైన సనత్సుజాతుడు చెప్పగలడనియు విదురుడు తెలిపెను. అంత విదురుడు సనత్సుజాతుని స్మరించెను. అతడు ప్రత్యక్షమయ్యెను. అతనిని విదుర ధృతరాష్ట్రులు గౌరవించిన పిమ్మట విదురుడు సనత్సుజాతునికి ధృతరాష్ట్రుని చూపి

కం॥ "దేవా దేవర కృప నీ
భూవల్లభు డముల తత్త్వబోధకమై సౌ

ఖ్యావహ మగు వాక్యచయము
దా విన గోరుటయు మిమ్ము దలచితి భక్తిన్ (105)

సనత్సుజాతు డా రాత్రివేళ పరమార్థము నుపదేశించెను. రాత్రి గడచినది.

3.1.1.2.2.6. మహనీయబోధోపదేశము :

ఈవృత్తాంతము తిక్కన భారతభాగము భీష్మపర్వము ప్రథమాశ్వాసములో (5-8) గలదు. వరమును పొందినవాడు సంజయుడు. వరప్రదాత వేదవ్యాసుడు.

దుర్యోధనాదులును పాండవులును యుద్ధమును చేయుటకు కురుక్షేత్రమున సైన్యములను నిలిపిరి. ఆ సమయమున ధృతరాష్ట్రుడు సంజయుని తనదగ్గర నుంచుకొని కొడుకుల దుర్వినయనమునకు నిర్వేదము నొంది చింతించుచుండెను. అప్పుడు వారు తలచకనే నారి దగ్గరకు త్రికాలవేదియగు వేదవ్యాసుడు ప్రత్యక్షమయ్యెను. వారి గౌరవమును పొందెను. కాలము సమీపించినదనియు, కావున యుద్ధము సమకూరినదనియు, దీనికొఱకు బాధపడవలదనియు ధృతరాష్ట్రునికి తెలిపెను. మరియు ధృతరాష్ట్రుడు కోరకనే యుద్ధమును చూచుటకు దివ్యదృష్టి నిచ్చెదనెను. ఆ మాటలకు ధృతరాష్ట్రుడు

చం॥ "ఘోరముగ నన్నలు దమ్ములు బోరు క్రూరతం
గనుగొన జాల నేను వినగా వలతుం దదనుగ్రహంబు సే
సిన గడు లెస్స" (7) అని కోరెను.

వేదవ్యాసుడు ధృతరాష్ట్రుని కోరికను విని

చం॥ "చిత్తమునం గరుణించి సంజయు
బనిచె మహారణంబు పరిపాటి మెయిన్‌సకలంబుజెప్పగన్" 7

వ॥ "ఇట్లు ధృతరాష్ట్రునకు గయ్యంబు తెఱంగు వినిపింప నియోగించి యా హత నందనునకు నారెండు దెఱంగుల వారి దివారాత్ర ప్రవర్తనంబులు గనునట్లును రహస్య ప్రకార భాషణంబులు వినునట్లును మనోవృత్తంబు తెలుంగు నట్లునుం గా వరం బిచ్చి యతి శీఘ్ర గమనంబు నొసంగి భారత సమర ధరణిం దిరిగినను శస్త్రాస్త్రంబు లెవ్వియుం దాకకుండు నట్టి ప్రభావంబు బ్రసాదించిదివ్యుల యాలాపంబులు రూపంబులుం దలంపులుం దేటపడు నట్టి మహనీయ బోధంబును గలుగ ననుగ్రహించెను." (8)

### 3.1.1.2.3. మైత్రీ వరములు :

మైత్రి యనగా స్నేహము. స్నేహము సమానుల మధ్య రాణించును.ఈ స్నేహమును సహజము,వ్యాజమని విభజించవచ్చును. కారణవశమున చేయు స్నేహము వ్యాజస్నేహము. ఇవి ఇంద్ర వృత్రుల, అగస్త్యవింధ్యులు, అర్జున అంగారవర్ణుల మైత్రీ వరములని వర్గీకరించవచ్చును.

### 3.1.1.2.3.1. ఇంద్రవృత్రుల మైత్రి :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగపర్వము" ప్రథమాశ్వాసములో (132-141) గలదు. వరమును కోరి పొందినవాడు వృత్రాసురుడు. వరప్రదాతలు దేవమునులు.

వృత్రాసురుడు వరగర్వితుడు. బలవంతుడు. ఇంద్రుడు త్రిలోకాధిపతి. విష్ణుసఖుడు. వారిరువురు సఖులై యుండదగునని మునుల యాకాంక్ష. అందువలన వృత్రాసురేంద్రులు సమాన బలులగుటవలన విజయ మెవ్వరికిని రాదనియు సట్టితటి బాధపడకుండునట్లుగ శత్రుత్వమును మాని మిత్రులుగ నుండుట మంచిదని వృత్రాసురునికి మునులు హితబోధ చేసిరి. అంత నతడు కీర్తికి నాశపడుతమ యిద్దరికిని సఖ్యము కుదురదనెను. మునులు మరల సత్పురుష సాంగత్యము కలిగినప్పుడు నిరాకరించుట నీతికాదు. మహేంద్రుడు సకలలోక సమ్మత సద్భావ్యుడు. కావున నతని తోడి చుట్టరికమును చేయుట మంచిదని నొక్కి చెప్పిరి. అప్పుడు వృత్రాసురుడు తానొక్క పద్ధతి చెప్పెదననియు, దానికి మునులు కాదనకుండ సమ్మతించి ఇంద్రునకును తనకును మైత్రిని కూర్చెదని ఫలికి యందును నేను వధ్యుండ గాకుండవలయు" (137) నని కోరెను. మును లా మాటలను విని

> వ॥ "దానికిం నొడంబడి యప్పరంబు లొసంగి వృత్ర వజ్ర ధరులకు మిత్రభావం బొనరించి మగుడం జని యత్తెఱంగు వాసవున కెఱింగించి నిజనివాసంబుల కరిగిరి. (137) అప్పటి నుండి వృత్రేంద్రులు సఖులై యుండిరి.

3.1.1 2.3.2. అగస్త్య వింధ్యుల మైత్రి :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్యపర్వము" తృతీయాశ్వాసములో (21-32) గలదు. వరమును కోరి పొందినవారు వేల్పులు. వరప్రదాత "అగస్త్య" మహర్షి.

సూర్యుడు తన నిత్యకృత్యముగ ప్రతిదినము మేరుపర్వతమునకు ప్రదక్షిణమును చేయుచుండెను. ఒక పర్యాయము వింధ్య పర్వత మా సంఘటనను చూచెను. గర్వముతో సూర్యు నడిగెను. దానికి సమాధానముగ సూర్యుడు విధినియోగముతో తా నెల్లప్పుడును "అమర" భూధరమైన మేరుపర్వతము చుట్టును తిరుగుదును. కాని యిష్టప్రకారము ప్రవర్తించగూడదని తెలిపెను. అందుకు వింధ్య పర్వతము కోపించి సురాద్రియైన మేరు పర్వతముపై పగబూనెను. సూర్యచంద్రాదులు పశ్చిమదిక్కునకు వెళ్ళకుండునట్లుగ చాలపొడవు పెరిగి మేఘమార్గమును కప్పెను. అద్దాన సూర్యచంద్రుల ప్రయాణము నిలిచిపోయెను. పగలు రాత్రి తేడా తెలియకుండ నన్ని జగములును చీకటి మయమయ్యెను. అప్పుడు "అమరులు" వింధ్య పర్వతము దగ్గరకు వెళ్ళిరి. దాని పెరుగుదలను నివారించలేకపోయిరి. అగస్త్య మహాముని దగ్గరకు వెళ్ళి వింధ్యపర్వతముయొక్క పెరుగుదలను తెలిపి

కం॥ "భువ నోపద్రవమై య
వ్యవహారం బయ్యె వింధ్యవర్ధనమున న
ద్దివసకర రజనికరగతు
లవిహత మగునట్లు సేయు మమర మునీంద్రా (27)

వ॥ "అని దేవతలు ప్రార్థించిరి." (28)

అగస్త్య మహాముని వారి ప్రార్థనను విని భార్యయైన లోపాముద్రతో కలసి వింధ్యపర్వతము దగ్గరకు వెళ్లెను. వింధ్యుడు పూజించెను. పిమ్మట దక్షిణదిశకు వెళ్ళవలయును దారి నిమ్మని యడిగెను. అప్పుడా పర్వతము తన పెరుగుదలను తగ్గించి భూమికి

సమానమై యతనిని వెళ్ళుమని తెలిపెను. అప్పుడు అగస్త్యుడు వింధ్య పర్వతముతో

కం॥ "నా మగుడి వచ్చు నంతకు
భూమిమీధర యీ ప్రకారమున నుండుము నా
తో మైత్రి చేయు మని లో
పాముద్రాధీశ్వరుండు పలికి ముదమునన్ (131)

వ॥ "దాని నొడంబఱచి దక్షిణ దిశకుం జని
లోకంబులకు హితంబుగా నంద యుండెను." (32)

అగస్త్యమహర్షి వచ్చునంతవరకు వింధ్య పర్వతము పెరుగకుండ నట్లేయున్నది.

3.1.1.2.3.3. అర్జున అంగారవర్ణుల మైత్రి :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" సప్తమాశ్వాసములో (39-157) గలదు. వరమును కోరి పొందినవాడు "అంగారవర్ణుడు" అనుపేరుగల గంధర్వుడు. వరప్రదాత "అర్జునుడు"

ఏకచక్రపురము నుండి కుంతి, పాండవులు ద్రౌపది స్వయం వరమునకు వెళ్ళుచుండిరి. వారికి నొకనాటి యర్ధరాత్రమున గంగా నది యొడ్డున అంగారవర్ణు డడ్డు తగిలెను. అర్జునుడతనితో యుద్ధము నకు దిగి తన యాగ్నేయాస్త్రముతో నతని రథమును కాల్చెను. అతనిని ధర్మజున కప్పగించెను. అంత "అంగారవర్ణుని" భార్య ప్రార్థనపై ధర్మరాజు "అంగారవర్ణుని" వదలెను. అప్పుడు "అంగార వర్ణుడు."

వ॥ "నీ పరాక్రమంబునకు మెచ్చితి నీ తోడి సఖ్యంబు నా

కభిమతం బయిన యది.... .... నీవు నాకు నాగ్నే
యాస్త్రం బిచ్చునది మఱి మహా జవ సత్త్వంబులు గామ
వర్ణంబులు గామగమనంబులు నయిన గంధర్వ హయం
బుల మీ కేవురకుం జెఱు నూఱేసి యిచ్చెద" (51) నని
కోరెను.

ఆ మాటలకు "అర్జునుడు"

ఆ.వె.॥ "అనలాస్త్ర
మనఘ నీవు గొనుము హయము లిమ్ము" (54)

వ॥ "నీ తోడ బద్ధ సఖ్యంబు జేసెద" (55) నని పలికెను.
మరియు "అర్జునుడు" ఆగ్నేయాస్త్రము నిచ్చుటయేగాక హయముల
వలసిన వేళ కొనిపోయెదనని పలికెను.

3.1.1.2.4. పదవీ వరములు :

బాధ్యతాయుతమైన కార్యనిర్వహణనకు ననేకులచే నియమింప
బడిన స్థానమును పదవి యనవచ్చును. ఆంధ్రమహాభారతములోని
పదవీ వరములను నాలుగు విధములుగా వర్గీకరింపవచ్చును. ఇవి
ఇంద్ర, మహారాజ, యౌవరాజ్య, సైన్యాధ్యక్ష పదవీ వరములు.

3.1.1.2.4.1. నహుషుని ఇంద్రాధికారము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగపర్వము"
ప్రథమాశ్వాసములో (141-140) గలదు. వరమును కోరి పొందినవారు
దేవతలు. వరప్రదాత నహుషుడను రాజు.

ఇంద్రుడు వృత్రాసురుని చంపి "అమరావతి"ని చేరెను. కాని
యతనిని భూతసంఘము "బ్రహ్మహత్య తగదని" నిందించెను. పైగా

భూతసంఘము నిందించుటతో ఇంద్రైశ్వర్యము నశించిపడి. అపుడు "ఇంద్రుడు" నిషధాచలమున దాగెను. త్రిలోకాధిపతి లేకపోవుటతో దేవతలందరును నాందోళనను జెందిరి. ఆ స్వర్గమందే చంద్రవంశజుడును, ననేక క్రతువులను చేసినవాడునునగు నహుషుడుండెను. మనుజుడైనను తమకు కావలియై సురరాజ్యమును పాలించుటకు తగినవాడు నహుషుడొక్కడేయని దేవతలందరును భావించిరి. వారతని దగ్గరికి వెళ్ళి, ఇంద్రుని గురించి తెలిపి,

కం॥ "రమ్మింద్ర పదవి సేకొని
మమ్మెల్లను నరయు మని" (145) వేడిరి.

కాని యాపదవికి తానుతగనని నహుషుడు తొలుతనిరాకరించెను.అయినను వారు ప్రార్థనంబు సేసిరి. యమ, వరుణాది దేవతలు వారి వారి శక్తి ప్రభావ దర్పముల నా మానవరాజునకు పంచి యిచ్చిరి. అంత నహుషుడు బలవంతుడయ్యెను. ఆ నహుషుని దేవతలు పట్టాభిషిక్తుని చేసిరి.

3.1.1.2.4.2. మహారాజ్యాధికార వరము :

శ్రీకృష్ణుని వరము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్యపర్వము" ప్రథమాశ్వాసములో (384) గలదు. వరమును కోరి పొందినవారు పాండవులు. వరప్రదాత శ్రీకృష్ణుడు.

పాండవు లరణ్యవాసమును గడుపుచు కామ్యక వనములో నుండిరి. అప్పుడు అర్జునుడు పాశుపతాస్త్రము కొఱకు వెళ్ళెను. తరువాత శ్రీకృష్ణు డనేక రాజులతో కలిసి పాండవుల కడకు వెళ్లెను.

పాండవులు వారిని గౌరవించిరి. శ్రీకృష్ణుడు ద్రౌపది పరాభవమునకు చాల దుఃఖించెను. దర్మరాజు తప్ప మిగిలిన పాండవులు తమ బాధను తెలిపిరి. అప్పుడు శ్రీకృష్ణుడు దుర్యోధనునిపై కోపించి

> వ॥ "మీకు నిట్లు సేసిన దుర్యోధనాదుల దూషించి గజపురంబున ధర్మరారాజు రాజ్యాభిషిక్తుం జేయుదు ననియు రాజసూయంబు సేయు నా డింద్రప్రస్థంబున నైన విభూతికంటె విశేష విభూతి గావింతుననియు ద్రుపద సృంజయ కేకయ ధృష్టద్యుమ్న బలదేవ సాంబసాత్యకి ప్రభృతుల సమక్షంబునం బలికెను." (384)

ఈ వరములో రెండంశము లున్నవి. ధర్మరాజు తాను మరల రాజు కావలెనని కోరలేదు. అతని యిష్టాయిష్టములు పాండవులకు తెలియవు పునఃరాజ్యాధికారమున నిలుపుదుననిచెప్పినవాడు శ్రీకృష్ణుడు. అందులకు బాధ్యతను వహించినవాడును శ్రీకృష్ణుడే

3.1.1.2.4.3. యౌవరాజ్యాధికార వరములు :

ఆంధ్రమహాభారతములో యౌవరాజ్యాభిషేక వరములు మూడున్నవి. వీటిలో సుత యౌవరాజ్య పదవీ స్వీకార వరములు రెండు. దౌహిత్ర యౌవరాజ్య పదవీ స్వీకార వరమొకటి.

3.1.1.2.4.3.1. సుతయౌవరాజ్య పదవీ వరములు :

సుతు డనగా కుమారుడు. తన కుమారుడు రాజు కావలెనని తలంచుట, కోరుట, వర మడుగుట యిందలి విశేషము. ఇట్టివి రెండు 1. కైకేయి దీక్ష, 2. శకుంతల యాకాంక్ష,

3.1.1.2.4.3.1.1. కైకేయి దీక్ష :

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగను "అరణ్యపర్వము" షష్ఠాశ్వాసములో (296 - 304) గలదు. వరమును కోరి పొందినది కైకేయి. వరప్రతాత దశరథుడు.

దశరథుడు తన పెద్దభార్య కుమారుడును పుత్రులలోకెల్లా పెద్ద వాడును నైన శ్రీరామునికి యౌవరాజ్య పట్టాభిషేకమును చేయదల చెను. ఆ విషయమును మంథర కైకేయికి తెలిపి, దానివలన భవిష్య త్తులో నెన్నియో కష్టములు వచ్చునని దుర్బోధను చేసెను. వెంటనే కైకేయి దశరథుని దగ్గరకు వెళ్ళి, యేకాంతముగ కూర్చొని ప్రణయ పూర్వకముగ

కం॥ "ధరణీశ తొల్లి నాకుం
గరుణించిన వర మొకండు గల దది మదిలో
బరికించి యివ్వ దొసగుము
చిరముగ సత్యవ్రతంబు సెల్లింపు తగస్" (300)

అని కోరెను. అప్పుడు దశరథు డామెతో

వ॥ "అతి దుష్కరంబులైన వానినైనను భవత్ప్రియార్థంబు
సేసెద నెయ్యది సెప్పుమని" (301) పలికెను.

వెంటనే యామె

తే.గీ.॥ "యౌవరాజ్య పదంబున యందు భరతు
నధిప యభిషేక మొనరింపు మడవి లోన
నొలసి పదునాల్గు వర్షంబు లుండ నాన
తిమ్ము రాముని నురువర మిమ్మదియ నాకు" (302)

అని కోరెను,

దశరథు డామె కోరికను విని స్పృహను కోల్పోయి క్రింద బడెను. శ్రీరాము డా విషయమంతటిని తెలిసికొని "తన జనకుడు సత్య ప్రతిజ్ఞుండు గావుత"మని పలికి వెంటనే సీతాసమేతుడై యరణ్యమునకు బయలుదేరెను. వారి వెంట లక్ష్మణుడును వెళ్ళెను. వరము కోరినది తల్లి బాగా పాలించినవాడు సవతి కుమారుడు.

3.1.1.2.4.3.1.2. శకుంతల యాకాంక్ష :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" చతుర్థాశ్వాసములో (51-61)గలదు. వరమునుకోరి పొందినది శకుంతల వరప్రదాత "దుష్యంతు" డను రాజు.

దుష్యంతుడు తన్ను గాంధర్వ వివాహమాడుమని శకుంతల నడిగెను. ఆమె తన తండ్రి కణ్వమహాముని నడిగి పాణిగ్రహణము చేయుమని తెలిపెను. మరల దుష్యంతుడు గాంధర్వ వివాహమున కట్టి నియమములు లేవని తెలిపెను. అప్పుడు శకుంతల

చం॥ "నరనుత నీ ప్రసాదమున నా కుదయించిన నందనున్ మహీ
గురుతర యౌవరాజ్యమునకున్ దయతో నభిషిక్తు జేయగా
వరము ప్రసన్న బుద్ధి ననవద్యముగా దయసేయు నెమ్మితో
నిరుపమకీర్తి యట్లయిన నీకును నాకునుసంగమం బగున్ (60)

అని కోరెను. ఆ మాటలను వినిన దుష్యంతుడు—

వ॥ "కోరిన వరం బిచ్చి గాంధర్వ వివాహంబున నభిమత
సుఖంబు లనుభవించి యక్కోమలిని వీడ్కొనెను" (61)

3.1.1.2.4.3.2. దౌహిత్ర యౌవరాజ్యాధికారము :

దుహిత యనగా కూతురు. దౌహిత్రు డనగా కూతురుకు కలిగిన

కుమారుడు. తన మనుమనికి రాజ్యాధికారము కావలెనని కోరుట యిందలి విశేషము.

దాశరాజాకాంక్ష :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" చతుర్థాశ్వాసములో (170-191) గలదు. వరమును కోరి పొందినవాడు దాశరాజు. వరప్రదాత శాంతనవుడు.

శంతనుడు తన కుమారుడగు గాంగేయునికి యౌవరాజ్యాభిషేకమును చేసి నాలుగు సంవత్సరముల కాలముపాటు కొడుకుతో వినోదము ననుభవించెను. తరువాత నొకనాడు యమునా నదీ తీరమునకు వేటకు వెళ్ళెను. అచట సత్యవతి (యోజనగంధి)ని చూచి మరులుగొనెను. దాశరాజు దగ్గరకు వెళ్ళి సత్యవతిని తన కిచ్చి వివాహమును చేయుమని యడిగెను. అప్పుడు దాశరాజు తన దౌహిత్రుడు శంతను తరువాత రాజు కావలననియు, దీనికి సమ్మతించినచో వివాహమాడుమని యడిగెను. దానికి శంతనుడు సమ్మతించక మరియొక దానిని వేడు మిచ్చెద ననెను. కాని దాశరాజు మరియొక దానిని కోరకుండ దానినే కోరెను. చేయునది లేక శంతనుడు నిరాశతో పురమునకు వెళ్ళి చింతా నిమగ్నుడయ్యెను. గాంగేయుడు కారణము నడిగెను. శంతనుడు సమాధానమును డొంక తిరుగుడుగా తెలిపెను. గాంగేయుడు వృద్ధామాత్య పురోహిత సుహృజ్జనములతో విచారించి విషయమును గ్రహించెను. సైన్యముతోబాటు దాశరాజు దగ్గరకు వెళ్ళెను. సత్యవతిని తన తండ్రికి నిచ్చి వివాహమును చేయుమని యడిగెను

దాశరాజు శంతను నడిగిన విధముగనే యడిగెను. వెంటనే గాంగేయు డచట నుండిన యందఱు వినునట్లుగా

చం॥ "వినుడు ప్రసిద్ధులైన పృథివీపతు లిందఱు నే గురు ప్రయో
జనమున జేసితిన్ సమయసంస్థితి యీ లలితాంగి కుద్భవిం
చిన తనయుండ రాజ్యమును జేయగ నర్హుడువాడ మాకు నె
ల్లను బతివాడ కౌరవకుల స్థితికారు డుదార సంపదన్" (187)

అని పలికెను. మరల దాశరాజు దేవవ్రతుని "నీకు పుట్టబోవు పుత్రులు నీవంటి వారు కారుగదా!" అని యడిగెను. దానికి దేవవ్రతుడు మరల

కం॥ "ధృ బూని బ్రహ్మచర్య
వ్రత మున్నతి దాల్చితిని ధ్రువంబుగ ననప
త్యత యైనను లోకము లా
యతి బెక్కులు గలవు నాకు నను భావ్యములై" (190)

అని పలికెను.

ఈ రెండు వరములందును నొక విశేషమున్నది. యౌవరాజ్యాధికారమును కోరినవారు భవిష్యద్దృష్టి కలవారు కావడ మొక ప్రత్యేకత. కైకేయి కోరికలో పునరావృతవరాభిలాష యున్నది. దాశరాజు విషయములో నట్టిదిలేదు.

### 3.1.1.2.4.4. సైన్యాధ్యక్ష పదవీ స్వీకార వరములు :

రాజ్యక్షేమమునకు సైన్యము పట్టుగొమ్మ. ప్రాచీనకాలమున రథ, గజ, తురగ, పదాతి దళములే సైన్యము. ఈ చతురంగ బల సైన్యమును నడుప గలిగినవాడు, ప్రతిపక్షుల వ్యూహములను పసిగట్టి ఛేధింపగలిగినవాడు, సమర్థుడైన సైన్యాధ్యక్షుడే. రాజ్యాధికార

గౌరవము కొన్ని వేళల వంశ పారంపర్యము. సైన్యాధ్యక్ష పదవి యట్టిదికాదు. అది పౌరుషాధీనము. ఇట్టి పరములు రెండు విధములు. 1. దేవ సైన్యాధ్యక్ష పదవీ స్వీకారము, 2. కౌరవ సైన్యాధ్యక్షపదవీ స్వీకారము.

3.1.1.2.4.4.1. దేవ సైన్యాధ్యక్ష పదవీ స్వీకారము :

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్యపర్వము" పంచమాశ్వాసమాలో (222-232)గలదు. వరమును కోరి పొందినవారు మహామునులును, ఇంద్రుడును. వరప్రదాత కుమారస్వామి.

కుమారస్వామి పుట్టిన యాఱవ రోజున మహాముని అందరు నతని భక్తితో పూజించిరి. కృతాంజలులై యతనిని

ఉ॥ "పుట్టిన యాఱు నాళులకు బొంపిరివోయి జగంబు లన్నియున్
దట్టుడవై జయించితి ముదంబున నీదు మహత్త్వ మెంతయుం
జిట్టలు గాదె యిట్టి యవిజేయుడ వింద్ర పదంబు నీక కా
బట్టము గట్టి యేలుము కృపన్ మము నెల్లను వహ్ని సం
భవా" (223)

అని కోరిరి. ఇంద్ర పదవిలో నుండు వా రేమి చేయవలయు నని కుమారస్వామి వారి నడిగెను. తేజోబలములతో లోకపాలనము చేయుట సూర్యచంద్ర పంచభూతములకు స్థైర్యము కాకుండ నట్లుగ శిష్టరక్షణ దుష్టశిక్షణలను చేయుట "ఇంద్ర" కృత్యములుగా మహామునులు తెలిపిరి. ఆ సమయమున నచట నుండిన "ఇంద్రుడు" కూడ

వ॥ "ఏను దేవేంద్ర పదవి నుండ నోడుదు" (227) నని పలికెను.

కాని యందుకు కుమారస్వామి సమ్మతించలేదు. తాను తన భుజబలముతో "ఇంద్రు"నికి నేకష్టము రాకుండ చూచెదననియు పలికెను. అందుకు "ఇంద్రుడు" సంతసించెను.

చం॥ ......."సురసేన కెల్లను నాయకుండవై
ఘనభుజ నీవు సత్కృప జగద్భయమోచన మాచ
రింపవే" (229)

అని కోరెను. అందుకు కుమారస్వామి సమ్మతించెను. తాను శత్రువుల నందరిని చంపి సర్వలోక రక్షణ గావింతునని మాట నిచ్చెను. వెంటనే ఇంద్రుడు ప్రీతుడై మునులతో కలిసి కుమార స్వామిని నఖిల సేనాధిపతిగా నభిషేకించెను.

కుమారస్వామి వయసులో చిన్నవాడు. చిన్నవానిని సైన్యాధ్యక్షునిగా చేయుట తగదు. కాని స్వామి వరపుత్రుడు. కారణజన్ముడు. దేవతలకు సైన్యమున్నది. కాని వారి సైన్యము నొక త్రాటిపై నడుపగలిగినవాడు లేడు. కనుక స్వామి యాధిపత్యమును గౌరవించుట సమంజసము.

3.1.1.2.4.4.2. కౌరవ సైన్యాధ్యక్ష పదవీ స్వీకారము :

భారత యుద్ధములో పాల్గొనిన సైన్యము కేవల మిరువురి రాజుల సైన్యము కాదు. నేడున్న భారత, పాకిస్తాన్, ఆఫ్ఘనిస్థాన్ మొదలగు దేశములలో నాడుండిన యందటి రాజుల సైన్యము పాల్గొనినది. అందులో దుర్యోధనునికి 11 అక్షోహిణులు. ధర్మరాజుకు 7 అక్షోహిణులు. భీష్మ, ద్రోణాచార్యులు మానసికముగా పాండవ పక్షపాతులని దుర్యోధనునికి తెలియును. కాని భౌతికముగా తనవారే.

తన వైపుండిన రాజు లందరిలోకెల్ల వయసు, వీరత్వ, యుద్ధనైపుణ్యములలో వరుసగా భీష్మ ద్రోణులే శ్రేష్ఠులు. అందులో భీష్ముడు ఆకాశగంగా తనయుడు, కాగా ద్రోణుడు కుంభజుడు. కావున మొదట భీష్ముని పిమ్మట ద్రోణుని సైన్యాధ్యక్షులుగా దుర్యోధనుడు నియమించెను.

అంత పెద్ద సైన్యమునకు సైన్యాధ్యక్షు డొకడే చాలడు. విభాగాధిపతులుకూడ నవసరము. కావున ద్రోణాదులను విభాగాధిపతులుగా నియమించెను,

3.1.1.2.4.4.2.1. భీష్ముని యంగీకారము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగపర్వము" చతుర్థాశ్వాసములో (142-155) గలదు. వరమును కోరి పొందినవాడు దుర్యోధనుడు. వరప్రదాత భీష్ముడు.

దుర్యోధనుడు తన పదునొకండు "అక్షోహిణు"లకు ద్రోణాదులను నాయకులుగా నియమించెను. పిమ్మట వారందరిని భీష్ముని దగ్గరకు పిలిచికొని వెళ్ళెను. దేవతల సైన్యమునకు నాయకుడైన కుమారస్వామివలె నక్షత్రములకు చంద్రునివలె తన సైన్యమును సంరక్షించుమని ప్రార్థించెను.

తే. గీ.॥ "సర్వసేనాధి పత్యంబు నిర్వహింప
నీవు దక్క నిందొక్కరు నీవ యరసి
పంపుమా కలడేని రక్షింపు మమ్ము
బూని పట్టంబు దాల్చుము పొడిచి గెలుము" (146) అని

కోరుకొనెను.

భీష్ముడు తనకు నిరుపక్షముల వారును సమానులనియు, వారిని చంపుటకు చేయి యాడదనియు, సేనాధిపత్యమునకు పూనుకొనెదననియు, తన నెదిరించగల వారొక్క అర్జునుడు తప్ప మఱెవ్వరును లేరనియు, నందరిని తరిమి చంపుదుననియు, పాండవులను చంపుటకు మాత్రము చేయాడదనియు, నది యప్పటి మాటనియు పలికెను. ముందుగా కర్ణునిగాని, తననుగాని యుద్ధమునకు పంపుమనియు నప్పుడే తాను సేనాధిపతిగా నుండుగుననియు చెప్పెను. అప్పుడు కర్ణుడు తాను ముందుగ యుద్ధమునకు రానని తెలిపెను. ఆ మాటలను విని భీష్ముడు సర్వసేనాధిపత్యమునకు పూనుకొనెను.

3.1.1.2.4.4.2.2. ద్రోణుని యంగీకారము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ద్రోణపర్వము ప్రథమాశ్వాసములో (60-75) గలదు. వరమును కోరి పొందినవాడు దుర్యోధనుడు. వరప్రదాత ద్రోణాచార్యుడు.

పదిదినములు పోరాడి భీష్ముడు "అంపశయ్య"పై వ్రాలెను. మఱునటిరోజు నుదయమున కర్ణుని సలహాప్రకారము దుర్యోధనుడు తగిన రాజులతో ద్రోణుని దగ్గరకు వెళ్ళెను. అతనినిస్తుతించి తనవెంట వచ్చిన రాజుల నందరిని చూపి ద్రోణుని సర్వసేనాధిపత్యంబు నిర్వహింపవలయునని ప్రార్థించెను. అప్పుడే దుర్యోధనుని వెంట వచ్చిన రాజులుకూడ ద్రోణుని నట్లు కోరిరి. వెంటనే దుర్యోధనుడు

కం॥ "సేనా సముదయవర్తకు
గా నిను నే బడిసి నపుడ కౌంతేయులు నా
చే నడగ రెట్లు భీష్ము వి
హీనుల మమ్ము గావు మెల్ల విధములన్"(71)అని వేడికొనెను 72

వారి ప్రార్థనను వినిన ద్రోణు డచట నున్న యందరిని చూచి తన్నింతగా పొగడుటతో "ఛాగాదన కియ్యకొంటి" నని తన సమ్మతిని తెలియజేసెను. మరియు

శా॥ "భవ్యం బైన బలాధి పత్యమునకుం బట్టంబు గట్టుండు న
న్నవ్యాకీర్ణ గజాదియై మెఱయు సైన్యశ్రేణి బాలించి కౌ
రవ్యోత్సాహము బెంచి మార్కొనిన వీరవ్రాతముం ద్రుంచి నా
దివ్యాస్త్రంబులబంచి పాండవుల దీప్తిన్ మాయజేయించెదన్ 74

అని కౌరవులకు నాశాభవము కలిగించెను.

వెంటనే దుర్యోధనుడు బంగారు కలశములలోని పవిత్ర జలములతో ద్రోణుని సేనాధిపతిగా నభిషేకించెను.

3.1.1.2.4.4.2.3. అతిరథమహారథుల అక్షోహిణీ నాయకత్వము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగపర్వము" చతుర్థాశ్వాసములో (139-141) గలదు. వరమును కోరి పొందినవాడు దుర్యోధనుడు. వరప్రదాతలు ద్రోణాదులు.

దుర్యోధనుడు పాండవులతో యుద్ధమును చేయ నిశ్చయించెను. తన పదనొకండు "అక్షోహిణు"లకు నాయకులుగా వరుసగ ద్రోణాచార్య, కర్ణ, అశ్వత్థామ, బాహ్లిక, శల్య, కృప, భూరిశ్రవ, శకుని, కృతవర్మ, కాంభోజ, సైంధవులను చేయగోరి వారిని పిలిపించెను. యుద్ధమునకు సిద్ధమయిన విషయమును వారికి చెప్పి

చం॥ .... .... "వినయంబు ప్రార్థన సేసి మీర లీ
యొనరిన సైన్యముల్ పదునొకింటికి ప్రాభవ మాచరింప జొ
చ్చిన సకలంబు నొప్పు నభిషేకము గైకొను డుత్సవంబునన్
(140)

అని ప్రార్థించెను. వారందరు దుర్యోధనుని ప్రార్థనను విని

కం॥ .... .... .... "జొ గా
కని సంతస మంద నధిపు డభిషేకించెన్" (141)

3.1.1.2.5. కామరూపత్వ వరములు :

కామ మనగా "ఇచ్ఛ, కోరిక" అని విశేష్యపరముగా, "ఇచ్ఛ వచ్చినట్లు" అని విశేషణపరముగా నర్థము లున్నవి. కామరూపత్వ మనగా "ఇష్టము వచ్చిన ప్రాణిరూపమును ధరించుట"అని యర్థము. బ్రహ్మాదుల నుద్దేశించి స్వార్థ నిస్స్వార్థములతో తపస్సును చేసిన మానవులెవ్వరును కామ రూపత్వములను కోరలేదు. రాక్షసులే కోరిరి. వారు సుందోపసుందులు, రావణుడు. ఈ వరములు బ్రహ్మ దత్త మగుట విశేషము.

3.1.1.2.5 1. సుందోపసుందుల కామరూపత్వము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వ"మష్టమా శ్వాసములో (95-98)గలదు. వరమును కోరి పొందినవారు "సుందుడు, "ఉపసుందుడు" అనుపేరుగల రాక్షస సోదరులు. వరప్రదాత బ్రహ్మ

ఆ ట్లిదితి పుత్రుడైన హిరణ్యకశిపుని వంశమున "ఇసుంభుడు" పుట్టెను. అతనికి "సుందుడు," "ఉపసుందుడు"అను నిద్దరు కొడుకులు పుట్టిరి. వారు నియతాత్ములై తపముచే సర్వమును పొందవచ్చునని నిశ్చయించిరి. వింధ్యాచలమున హఠయోగము నపలంభించి తపమును చేసిరి. వారి తపోఽగ్ని ధూపమునకు దేవతలు జడిసి బ్రహ్మ దగ్గరకు వెళ్ళి విన్నవించిరి. బ్రహ్మ సుందోపసుందుల తపస్సునకు మెచ్చి సన్నిహితుడై వారి కిష్టమైన వరము నిచ్చెద వేడుమనెను. వారు నమస్కరించి

వ॥ "దేవా మా యిష్టంబు దయసేయు మీ కిష్టం బేని మాకు గామరూపత్వమును, గామగమనత్వంబును, సకలమాయాన్వితంబును నన్యులచేత నవధ్యత్వంబును నమరత్వంబునుం బ్రసాదింపు డని కోరిరి. (97)

అమరత్వమును దక్క తక్కిన కోరికలనెల్ల తీర్చెను.

3.1.1.2.5.2. రావణుని కామరూపత్వము :

ఈ వృత్తాంతము 'ఎఱ్ఱన" భారతభాగము "అరణ్యపర్వము" షష్ఠాశ్వాసములో గలదు. (276.2781) వరమును కోరి పొందిన వాడు రావణుడు. వరప్రదాత బ్రహ్మ.

వై శ్రవణుడు తపశ్శక్తిచే దివ్యవైభవము నందెనని దశముఖుడు తెలిసికొనెను. కావున నతడు మాత్సర్యబుద్ధి గలవాడై బ్రహ్మనుద్దేశించి హఠయోగము నవలంబించెను. నిశ్చలబుద్ధితో వాయుభక్షకుడై తపస్సును చేయుచు వేయేసి సంవత్సరములకొక తలవంతున నగ్నియందు వేల్చుచు పదవ తలనుకూడ నరుకుటకు సిద్ధమయ్యెను. అప్పుడు బ్రహ్మ ప్రత్యక్షమై నివారించెను. ముందు ఖండించిన తొమ్మిది తలలు పూర్వమువలె నుండునట్లొసంగి

వ॥ "అమరత్వంబు దక్క నొండు నీ కభిమతం బగునది యెయ్యది యైనను నడుగుమని" (279) పలికెను.

అప్పుడు రావణుడు

శా॥ "దేవా యేను సమస్తదేవ పితృ దైతేయాహి గంధర్వ రక్షో విద్యాధర యక్షజాతులకు నక్షోభ్యుండగా బ్రీతితో నీ విశ్వంబున గామరూపగతి నాత్మేచ్ఛా విహారుండ గానీవే" (280) అని కోరెను,

బ్రహ్మ వాని కా వరముల నిచ్చెను.

3.1.1.2.6. భవిష్యత్కథన వరములు :

భవిష్యత్కాలములో జరుగబోవు విషయములను చెప్పుటయే భవిష్యత్కథనము. ఈ భవిష్యత్కథనములు దేవతలకు నాపద కలిగినపుడే చెప్పబడినవి. వీటిని సృష్టికర్తయైన బ్రహ్మయే చెప్పుట ప్రత్యేకత. ఇట్టివి నాలుగు కలవు. 1. ఖాండవదహనము, 2. భూలోక వాస్తవ్యుల మరణము, 3. త్రిపురాసుర సంహార వృత్తాంతము" 4. సజల సముద్ర వృత్తాంతము.

3.1.1.2.6.1. ఖాండవ దహనము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" అష్టమాశ్వాసము (240-250)లో కలదు. వరమును కోరినవాడు అగ్ని దేవుడు. వరమిచ్చినవాడు బ్రహ్మ. ఖాండవదహనము పరవిషయము

శ్వేతకి యొక రాజర్షి. అతడు శతవార్షిక సత్రయాగమును చేసెను. ఆ యాగమున నిరంతర ఘృతపానమువలన "అగ్ని" దేవునికి మాంద్యరోగము వచ్చినది. పైగా తేజోహీనత, దప్పిక కలిగెను. అతడు బ్రహ్మ కడకు వెళ్ళి తన బాధను తెలియజేసెను. ఇతర యుపాయములచేత వ్యాధి తీరదని ఖాండవవనమును దహింపుమని యుపాయము నొసగెను. "అగ్ని" యా ప్రయత్నముపకు సిద్ధపడగా "ఇంద్రుడు" డడ్డుకొనెను. ఏడుసార్లు ప్రయత్నించి "అగ్ని" విఫలుడయ్యెను. చివరకు బ్రహ్మ కడకేగి తన వ్యర్థ ప్రయత్నమును దైన్యముగా తెలుపుకొనెను. అంత నతడు కరుణించి

వ॥ "ధావి కార్యం బప్పుడు దలంచియు గొంత కాలంబునకు

నరనారాయణు లను నాది మునులు నరక లోకంబున దేవ హితార్థం బర్జున వాసుదేవులయి జన్మించి యీ ఖాండవ సమీపంబున విహరింతురు వారు భవత్ప్రార్థితులై తమ యస్త్రబలంబున నఖిలవిఘ్నంబుల నపనయించి నిరాకులంబున నీకు ఖాండవోపయోగంబు ప్రసాదింతు రనెను" (250)

కొంతకాలమునకు "అగ్ని" దేవుడు నరనారాయణ రూపావతారులైన కృష్ణార్జునలను ప్రార్థించి ఖాండవ వనమును దహించి తన మాంద్యమును పోగొట్టకొనెను.

3.1.1 2.6.2 మర్త్యుల మరణము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" సప్తమాశ్వాసములో (267-269) గలదు. వరమును కోరి పొందినవారు అమరులు. వరప్రదాత బ్రహ్మ.

ద్వాపర యుగములో (పాండవుల జననమునకు ముందు) నొక పర్యాయము వైవస్వతుడు (యమధర్మరాజు) నైమిశారణ్యమున సత్రయాగము చేయుచు ప్రాణులను చంపకుండ నుండెను. దాని వలన మానవులు మరణములేకుంద ప్రవర్తింపసాగిరి. దానిని సహింపనోపక ఇంద్రాది దేవత లందఱు బ్రహ్మ దగ్గరకు వెళ్ళి

వ॥ "భట్టారకా! మర్త్య మర్త్యులయి వర్తిల్లు వా రయిన వారికిని మాకును విశేషం బెద్ది యని దుఃఖించిరి" (267)

వారి గోడును వినిన బ్రహ్మ వారితో

కం॥ 'ఎంతకు గృతకార్యుండగు

నంతకు డీ రంతకును భయం బందక ని
శ్చింతమున నుండు డాతం
డంతము నొందించు దొంటి యట్టుల నరులన్" (268)

కం॥ "ఆ వైవస్వతు వీర్యము
మీ వీర్యము దాల్చి సూర్య మితతేజులు దా
రేవు డుదయింతు రాతని
కావించు విధానమునకు గారణ మగుచున్" (269)

అని తెలిపెను. ఆ మాటలను వినిన వారు సమాధానపడి వెళ్ళిరి.

3.1.1.2.6.3. త్రిపురాసుర సంహార వృత్తాంతము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము కర్ణపర్వము ప్రథమాశ్వాసము (265-268)లో కలదు. వరప్రదాత బ్రహ్మ కాగా వరానుగ్రహీతలు దేవతలు.

త్రిపురాసురులు పురములను నిర్మించుకొని దేవ, పితృ, ముని జనులను పీడింపసాగిరి. అంత "ఇంద్రుడు" దేవతా సైన్యముతో త్రిపురాసురునిపై దాడికి వెడలెను. కాని యోడిపోయెను. చివరకు పరిజనముతో బ్రహ్మ కడకేగెను. రాక్షస వధోపాయమును ప్రార్థించెను. బ్రహ్మ వారి మొరనాలకించి

ఉ॥ "ఏచిన యా పురత్రయము నేకశరంబున రూపు మాపగా
జూచిన బోవు గాని పెఱచొప్పున బోవదు సంగరోన్ముఖుం
డై చనుదెంచెనేని మదనాంతకుచే నది సెల్లు నొండ్లను
న్గోచర మట్టి యింతలు పనుల్ సను దమ్మహితాత్ము పాలికిన్
(266)

అని భవిష్యత్కథనమును సూచించెను. దేవతలుకూడా ననేకసంవత్సర ములు మహేశు నుద్దేశించి తపమును చేసిరి. త్రిపురాసుర సంహార కాలమును నిర్ణయించువాడు శివుడనుట భవిష్యత్కథనము.

3.1.1.2.6.4. సజల సముద్ర వృత్తాంతము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము అరణ్యపర్వము తృతీయాశ్వాసము (43 46)లో కలదు. వరప్రదాత బ్రహ్మ. వరా నుగ్రహము పొందినవారు అమరులు.

కాలకేయ సంహారార్ధము సముద్రమును పానము చేయుడని దేవతలు "అగస్త్యు"ని కోరిరి. దేవతల విన్నపమాలించి "అగస్త్యుడు" సముద్రజలమును పానము చేసెను. దేవతలకు కాలకేయుల యునికి తెలియగా వారిని చంపిరి. ఆపై సముద్రమును జలసంపూర్ణము చేయుడని దేవతలు "అగస్త్యు"ని వేడిరి. కాని "అగస్త్య" మహర్షి జలము జీర్ణమగుటతో తన యశక్తతను తెలియజేసెను. పిమ్మట వారు బ్రహ్మదేవుని కడకేగి తమ కోరికను విన్నవించుకొనిరి. బ్రహ్మయు చింతించి చివరకు వారితో

ఆ. వె.॥ "వపధి బెద్దకాలమున భగీరథు డను
వాడు నించు గాని వసుధ నొరులు
పూని దీని నింపగా నోవరు" (46) అని

తెలిపెను. తర్వాత చాలాకాలమునకు భగీరథుడు జన్మించి, గంగను భూమికి తెప్పించి సముద్రమును జలపూర్ణము చేసెను.

**3.1.1.2.7.** విముక్తి వరములు :

ఆపత్కరమున నొక స్థితినుండి బయటపడుట విముక్తి. ఆ

విముక్తి దాస్యము కావచ్చును లేదా శిక్షారూపమైన రజ్జుబంధనము కావచ్చును లేదా తగుదునమ్మా యని యొకరితో తలపడి యోడిపోగా శత్రువులమధ్య చిక్కుకొని బయట పడవచ్చును. ఇట్టి విముక్తి వర ములు రెండు రకములు. 1. దాస్యవిముక్తి, 2. బంధ విముక్తి వరములు.

3.1.1.2.7.1. దాస్యవిముక్తి వరములు :

సమానులైన వారేదేని యొక కారణమున మరొకరికి లోబడు టయే దాస్యులగుట. ఇది జీవన్మరణముతో సమానము. ఈదాస్యము నకు తమ చేతలే ప్రధానమగుచుండును. ఇట్టివి భారతములో రెండు గలవు. 1. వినతాదాస్యము, 2. పాండవుల దాస్యము.

3.1.1.2.7.1.1. వినతా దాస్యము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" ద్వితీయాశ్వాసములో (47-119) కలదు. తల్లి దాస్యవిముక్తికి నుపా యమును కోరినవాడు గరుత్మంతుడు. దాస్యవిముక్తికి నుపాయమును సూచించినవారు కాద్రవేయులు.

కద్రూవినతలు సవతులు. వినత కుమారుడు గరుత్మంతుడు. కద్రువ కొడుకులు సర్పములు. విధివశమున వినతా గరుత్మంతులు కద్రువకు దాస్యులైరి. ఒకనాడు గరుత్మంతుడు తల్లితో దాస్య కారణము నడిగెను. తల్లి సమస్తమును తెలియజేసి నీవలన దాస్యము తొలగునని తెలియజేసెను. అంత గరుత్మంతుడు కాద్రవేయుల కడకు వెళ్ళి

కం॥ మా యీ దాస్యము పాయును

పాయము సేయుడు నన్ను బ్రనుపుం డీష్టం
బేయది దానిన తెత్తు న
జేయుడనై యమర వరులచే గొనియైనన్" (52)

అని కోరెను. అంత వారు

చం॥ .... .... "నీ దయిన దాస్యము బాచి కొనంగ నీకు జి
త్తము గల దేని భూరి భుజ దర్పము శక్తియు నేర్పడంగ మా
కమృతము దెచ్చి యిమ్మనిరి" (54)

అందుకు గరుత్మంతుడును వల్లెయని, తల్లి యనుమతిని పొంది, "అమృతము" నపహరించి "ఇంద్రుని" వజ్రాయుధమునకు లోనుగాక తన మాటను నిలబెట్టుకొనెను. అమృత సమర్పణముతో వినతా గరుత్మంతుల దాస్యము తొలగిపోయినది.

3 1.1.2.7.1.2. పాండవుల దాస్యవిముక్తి :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము సభాపర్వము ద్వితీయాశ్వాసములో (254-264) కలదు. వరము ననుగ్రహించిన వాడు ధృతరాష్ట్రుడు. వరఫలితమును పొందినది ద్రౌపది.

ధర్మరాజు దుర్యోధనునితో జూదమాడియోడిపోయెను. ద్రౌపదికి తీరని యవమానము జరిగినది. ఈ వార్తలను విదురునివలన వినిన ధృతరాష్ట్రుడు దుర్యోధనుని మందలించెను. పిదప ద్రౌపదిని పిలిపించి యామె ననునయించెను. ఆపై వరము లిత్తును కోరుకొనుమని యాదేశించెను. అంత ద్రౌపది

ఆ.వె.॥ "కరుణతోడ నాకు వరము ప్రసాదింప
బుద్ధి యేని లోక పూజితుండ

మను విభుండు ధర్మతనయుండు దాస్యంబు
వలన బాయవలయు వసుమతీశ (259)

అని కోరెను. మరల రెండవ వరమును కోరుకొనుమనగా ధర్మజు నలువురు తమ్ములవారి యాయుధ విముక్తి వరమును కూడ కోరు కొన్నది. ధృతరాష్ట్రుడు ద్రౌపది కోరికను మన్నించెను.

3.1.1.2.7.2. బంధవిముక్తి వరములు :

అపకారము చేసిన వారి నడ్డగించుట, బంధించుట, శిక్షించుట లోకములో పరిపాటి. ఆ విధముగా చేసిన వారిపై సానుభూతిని ప్రకటించి వారిని విడిపింప ప్రయత్నించుటకూడ లోకములో గలదు. ఇదియే బంధవిముక్తి యగును. ఇట్టివి రెండు గలవు. 1) సుయోధన 2) సుశర్మ బంధవిముక్తి వరములు.

3.1.1.2.7.2,1. సుయోధన బంధవిముక్తి :

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "ఆరణ్యపర్వము" పంచమాశ్వాసములో (424-433) కలదు. వరమును కోరినవాడు ధర్మరాజు కాగా వరప్రదాత గంధర్వుడగు చిత్రసేనుడు.

పాండవులు "అరణ్యవాసము"ను చేయువేళ దుర్యోధనుడు తన డాబు దర్పమును ప్రకటింప పరివారముతో నడవికేగెను. అచ్చట గంధర్వరాజగు చిత్రసేనునితో కయ్యమునకు కాలుదువ్వెను. అతడు దుర్యోధనాదులను బంధించెను. ఈ విషయము ధర్మరాజునకు తెలిసినది. కౌరవులకు తగినశాస్తి జరిగినదని భీమాదులు మురిసిపోయిరి. కాని ధర్మరాజు పరులు దండెత్తినప్పుడు కౌరవపాండవ విభేదముండ కూడదనియు విడివడిగా నున్నప్పుడే యుండవచ్చుననియు నాశ్వా

సించెను. పిదవ భీమార్జునులు చిత్రసేనునితో పోరాడి వారినందరిని బంధించి ధర్మరాజు కడకు తెచ్చిరి. ధర్మరాజు చిత్రసేనునితో

వ॥ "వీ డెట్టి యపరాధంబు సేసినను నది యంతయు
సహించి మాకుంగా వీని విడుపవలయునని ప్రార్థించెను
(433)

ఆపై దుర్యోధనాదులకు బుద్ధి జెప్పి విడిచిపెట్టెను.

3.1.1.2.7.2.2. సుశర్మ బంధవిముక్తి :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము విరాటపర్వము తృతీయాశ్వాసములో (200-237) గలదు. వరమును కోరి పొందినవాడు కంకుభట్టయిన ధర్మరాజు. వరప్రదాత విరాటరాజు.

దక్షిణ గోగ్రహణ యుద్ధములో సుశర్మ విరాటరాజును విరథునిగా జేసి, పట్టుకొని బంధించి, తనరథముపై నుంచుకొనెను. అప్పుడు కంకుభట్టుని వేషములో నుండిన ధర్మరాజు సలహాపై భీమ, నకుల సహదేవులు సుశర్మను జయించి బంధీచేసి, విరాటుని విడిపించి ధర్మరాజు దగ్గరకు పిలిచికొని వెళ్ళిరి. విరాటుడు వారిని విడివిడిగ సాహసికముగా మెచ్చుకొనెను. ఆ నలుగురు లేనిచో తన సైన్యము శత్రుపక్షములోని వారిసెవ్వరిని కొట్టలేరని చెప్పి కంకుభట్టునితో

ఉ॥ "కావున మీకు దంతి హయ కాంచన రత్నవిభూషణంబులున్
దేవ నితలంబినీ జన సదృశ్య మృగాక్షులు నాదిగాగ నా
నా ధవైభవంబులు మనంబుల వాంఛలకుం దగంగ
కేవిధి నీగువాడ ఋణ మెయ్యది యేనియు వేడు డిచ్చెదన్"
(233)

అని పలికెను. అప్పుడా నలుగురును విరాటుడు ప్రియముతో తమ్ము గౌరవించుటయే ధనమని చెప్పిరి. పెరవారని భావించక మన్నింపుమనియు తెలిపిరి. అప్పుడే కంకుభట్టు విరాటుని

కం॥ "తగ నొక్కటి వేడెద నిను
జగతీశ్వర యిచ్చుటొప్పు సరథ గజాశ్వం
బుగ విడిన వుచ్చు మిపుడ
త్రిగర్తపతి నిదియు నాకు బ్రియ మెబ్భంగిన్" (236)

అని వేడెను. మరియు నగరవాస్తవ్యులకు విజయ వార్తను తెలుపుడని కోరెను. విరాటుడట్లు చేసి సుశర్మను విడిచిపుచ్చెను.

3.1.1.3. రక్షణానుబంధి వరములు :

ఆత్మరక్షణ మవశ్యకర్తవ్యము. పరరక్షణ మానుషంగికమైన ధర్మము. ఆత్మరక్షణ, పరరక్షణమునకై చేయు ప్రయత్నము లన్నియు రక్షణానుబంధి వరములే.

3.1.1.3.1. రక్షక వరములు :

రక్షకు డనగా కాపాడువాడని యర్థము. "దిక్కులేని వారికి దేవుడే దిక్కు" అని సామెత. తన ప్రయత్నములన్నియు వ్యర్థము కాగా వ్యక్తి "అతీతశక్తి"కడ మోకరిల్లును. ఆ యతీతశక్తి త్రిమూర్తులు కావచ్చును. ప్రముఖ లేదా యితర దేవతలు కావచ్చును. రక్షణను కోరువారు దేవతలుగాని, మానవులుగాని కావచ్చును.

3.1.1.3.1.1. ప్రధాన దేవతల వరములు :

3.1.1.3.1.1.1. బ్రహ్మ వరములు :

బ్రహ్మ సృష్టికర్త. సృష్టికర్తయైనవాడు తన సంతతి బాగోగు

లను చూచుట కర్తవ్యము. ఈ దృష్టితో దేవతలకు మానవులకు నిచ్చిన వరములిందు చేరినవి. ఇట్టివి మూడు. 1. దేవగణాధిక్య వరము, 2. మృత్యు దేవతానుగ్రహము, 3. ప్రజా సంరక్షణ వరము.

3.1.1.3.1.1.1.1. దేవగణాధిక్య వరము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనికపర్వము" ద్వితీయాశ్వాసము (178-181)లో కలదు. వరప్రదాత బ్రహ్మ కాగా వరానుగ్రహమును పొందినవారు దేవతలు.

పూర్వము మర్త్యలోకవాసులు ధర్మవర్తనులై యుండిరి. స్త్రీలు కల్లకపటము తెలియక సాధ్వులై యుండిరి. అందువలన మానవులకు దైవత్వము సులభముగ దక్కెడిది. ఇది దేవతలకు కంటగింపైనది. వారసూయతో తమ బాధను బ్రహ్మకు తెలియజేసిరి. వారి చిత్త వృత్తిని బ్రహ్మ గ్రహించి వారికి ప్రియము కలుగుటకు

వ॥ "అతివల మాయావతులం గావించి వారికి గామం బగ్గ లంబుగా జేసినం బురుషులు వారి చిక్కులం బడి రోషాది దుర్గుణ దూషితులను (180) చేసెను.

అందువలన మానవులకు దైవత్వము బహుదూరమైనది.

ఇచట దేవతల దైవత్వమునకు నెట్టి లోటును రానీయక బ్రహ్మ కాపాడుట రక్షణము. మానవులుకూడ దేవతలయినచో నచట దేవతలకు ప్రత్యేక ప్రాధాన్యత యుండదు. దేవతా పక్షపాతియైన బ్రహ్మ దేవతల కోరికను మన్నించుట తప్పుగాదు.

3.1.1.3.1.1.1.2. మృత్యు దేవతానుగ్రహము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ద్రోణపర్వము ద్వితీయాశ్వాసము (165-178)లో కలదు. మృత్యువు వరమును కోరగా ననుగ్రహించినవాడు బ్రహ్మ.

బ్రహ్మ దేహమునుండి మృత్యువు పుట్టినది. ప్రాణులను చంపుమని బ్రహ్మ యానతిచ్చెను. కాని మృత్యువు నంద, కౌశిక నదీ తీరములలో తపమును చేసినది. బ్రహ్మ ప్రత్యక్షమై తపమునకు కారణము నడిగెను. ప్రాణుల చంపలేనని తన యశక్తతను మృత్యువు తెలిపెను. అంత బ్రహ్మ దీనివలన నధర్మము రాదనియు పైగా తానును హరుడును వరముల నిత్తుమనియు పలికెను. వెంటనే మృతు దేవత

వ॥ "దేనా! దేవర యాజ్ఞ దలమోచి చేయుదానం గాక యొక్క విన్నపం బవధరింపుము లోభంబును క్రోధంబును నీర్ష్యయు నసూయయు జంతువుల శరీరంబుల వికృతిం బొందింపవలయు" (175) అని కోరెను.

బ్రహ్మ మృత్యువు కోరిక ననుగ్రహించెను.

3.1.1.3.1.1.1.3. ప్రజాసంరక్షణ వరము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతిపర్వము ద్వితీయాశ్వాసములో (257-259) గలదు. వరమును కోరి పొందినవారు జనులు. వరప్రదాత బ్రహ్మ.

పూర్వము మానవులకు నధిపతి, రక్షకుడెవరును లేరు. కావున జనులొక పర్యాయము తమలో తాము సమయమును చేసికొని, క్రూర

తను, దొంగతనమును, మోసమును, అంకును సహించకుండ నుండ వలెననియు నొకవేళ నట్లు చేసిన వ్యక్తి నందరును శాసించవలయు ననియుం మాటలాడుకొనిరి. (సమయమును చేసుకొనిరి.) తమ కధి పతిగ నొకరిని నుంచుకొనవలెనని నిర్ణయించిరి. ఆశపడకుండ కొంత కాలము ప్రవర్తించిరి. కాని బహుకారణములవలన విషణ్ణులై బ్రహ్మ దగ్గరికి వెళ్ళి

సీ॥ ....“మాకు రక్షకుడుగ మహీపు డొకడు

తే.గీ.॥ వలయు రూపింపు మాతని గొలిచి బ్రదుకు
వార మని” (257) వేడిరి.

బ్రహ్మ వారిపై కరుణించి “మనువును నిరూపించెను.” (257)

3.1.1.3.1.1.2. విష్ణుమూర్తి వరములు :

విష్ణుమూర్తి జగత్పాలకుడు. పాలకుడు తన పాలితుల కే కష్టము వచ్చినను తొలగించును. ఈ దృష్టితో దేవతలకు మానవులకు నిచ్చిన వరము లిందు చేరినవి.

3.1.1.3.1.1.2.1. అసుర సంహారము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము అనుశాసనికపర్వము ప్రథమాశ్వాసము (338 345)లో కలదు. వరప్రదాత విష్ణుమూర్తి కాగా వరానుగ్రహమును పొందినవాడు బ్రహ్మ.

పూర్వము మంధర పర్వత మథనము జరిగినది. ఆ సమయ మున దేవదానవులకు కలహము పెరిగినది. ఆ కొట్లాటలో దేవతలు డస్సిపోయిరి. వారు బ్రహ్మదేవుని శరణుజొచ్చిరి. బ్రహ్మ “భక్త వత్సల పరమాత్మ పద్మనేత్ర” అనుచు నారాయణుని స్మరించెను. అంత జలద స్వన గంభీరధ్వని వినబడినది.

కం॥ "నే నిదె మిమ్ముఁన్

గెలిపింపగ వచ్చితి" (342) అని "ఆకాశవాణి" విశదము చేసినది. అంత పంచాయుధధారియైన వైకుంఠవాసుడు ప్రత్యక్షమై యసురలను ద్రుంచెను. ఈ సంఘటనను చూచిన దేవత లాశ్చర్యగ్న పడిరి. అతడెవరో, దేవతలకు నంతుబట్టలేదు. అంత బ్రహ్మ యతడు వైకుంఠుడని, విష్ణువని విశదము చేసెను.

3.1.1.3.1.1.2.2. వైన్యసార్వభౌమత్వము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతిపర్వము ద్వితీయాశ్వాసములో (205 215) గలదు. వరమును కోరి పొందినవారు దేవతలు. వరప్రదాత విష్ణుమూర్తి.

బ్రహ్మ నూఱువేల యధ్యాయములుగల నీతిశాస్త్రమును పుట్టించెను. దానిని వరుసగ విరూపాక్ష, ఇంద్ర, బృహస్పతులు కుదించిరి. శుక్రాచార్యులు సహస్రాధ్యాయములకు సంగ్రహించెను. పిమ్మట దేవతలు విష్ణుమూర్తి దగ్గరకు వెళ్ళి దానిని గురించి చెప్పి

వ॥ "దీని నధిగమింపను దదీయాచారంబు నడవను శక్తుండగు వాని నొక్కరుని నిర్దేశింపవలయు నని యభ్యర్థించిరి." (205)

విష్ణుమూర్తి

వ॥ "నిజతేజోమయుండుగా నొక్కమానసపుత్రు నిర్మించి విరజుండను పేరిడెను." (205)

ఆ విరజుడు భూమికి ప్రభువుగా నుండుటకు సమ్మతించలేదు. అతని కొడుకగు కర్దముడు కూడ రాజ్యపాలనను చేపట్టక తనస్సునకు

వెళ్ళెను. అతని పుత్రుడగు "అనంగుడు" దండనీతిని (నీతిశాస్త్రమును) బాగుగా తెలిసికొని భూప్రజలను పాలించెను. తరువాత నతని పుత్రుడగు 'నీతి" ప్రజలకు రాజయ్యెను. అతని పుత్రుడగు వేనుడు మాతామహుదోషమువలన రాగద్వేషములచే ప్రజలకు విరుద్ధుడయ్యెను. మహామునులు కుశలతో వేనుని దక్షిణయూరువును మథించిరి. అప్పుడు నల్లగ, పొట్టిగ, ఎఱ్ఱని కనులతో నకుబ్జముగ పుట్టిన పుత్రునికి మునులు నిషీదు డను పేరును పెట్టిరి. వానిని పాలనాస్థానమున నుంచక వర్జించిరి. తరువాత మునులు వేనుని దక్షిణ బాహువును కుశలతో మథించిరి. అప్పుడుజ్జ్వల కవచ శరశరాసన భాసమానుడును, వేద వేదాంగ ధనుర్వేద పారగుడును, సుందరరూపముతో పుత్రుడు పుట్టెను. సకల ధర్మనీతి యతని నాశ్రయించెను. అతడు మునులకు నమస్కరించి తాను చేయవలసిన పనిని గురించి వారి నడిగెను. అప్పుడు సురలును మునులును సంతసించిరి. ఆ వైన్యాభిధానుని నభినందించిరి. ధర్మముగ ప్రవర్తించుచు, శ్రుతులను, వర్ణములను రక్షించుచు, భూమి యందలి ప్రజలను కాపాడుమని చెప్పిరి. బ్రాహ్మణులు సహాయులుగా నుండినచో నట్లుచేయుదునని యతడు తెలిపెను. వా రందులకు సమ్మతించిరి.

ఆ సమయమున వాత్సల్యబుద్ధితో విష్ణు విధాతలు వచ్చిరి. వాడును, మునీశ్వరులును నా వైన్యుని నఖిలధరణీ సామ్రాజ్యాభిషేకమును చేసిరి. అతనికి శుక్రాచార్యుడు పురోహితుడు. వాలఖిల్య మునులందరు సారస్వత గణమంత్రులు. గర్గుడు సాంవత్సరికుడు. అంతకు ముందు నుండి కష్టదశలో నుండిన భూమిని వైన్యుడు రక్షించెను. అతనికి "ఇంద్రుడు" తన వైభవమును, మేరుపర్వతము తన హిరణ్యమును, కుబేరుడు తన సంపద్గురుతను నిచ్చిరి. అతడు తలచి

నంతనే రథ కరి తురగ భటావళులు సమకూరెను. ఆ విధముగ వైన్యుడు మహనీయ ప్రభుత్వ పదవిని చేపట్టి శాస్త్రోక్తమార్గమున దండనీతి పరిపాలనను, ధర్మ తాత్పర్య సమీచీనముగ నాచరించెను. అతని కాలములో "ఊర"గాదులవలన భయము కలుగలేదు. ఒకరి వలన మరియొకరికి పొందిక కుదిరెను. శరీరమునకు గాని, మనస్సునకు గాని, రోగములు కలుగలేదు. ఆ విధముగ భూమియందలి యప్పటి ప్రజలు సస్య సంపదను కల్గి జీవించిరి. బ్రాహ్మణుల యొక్క నాశనమైన శక్తిని నభివృద్ధి చేయుటయందును, ప్రజలందరికిని సంతోషమును కలిగించుటయందును నాసక్తిని చూపుటచే "రాజు" అను పేరతనికి నేర్పడెను. అతని సంతాన జాతులందరును నా తరువాత రాజత్వమును వహించి దండనీతిని పాలించిరి.

3.1 1.3.1.1.3. మాహేశ్వర వరములు :

విష్ణుమూర్తివలె మహేశ్వరుడు పూర్తిగా జగత్పాలనలో నిమగ్నుడు కాడు. అయినను బ్రహ్మాది దేవతలు జ్ఞాపకము చేసినప్పుడు బ్రహ్మాది దేవతలకును, మానవులకును కలిగిన నుపద్రవములను తొలగించును. ఇతడిచ్చిన రక్షణ వరములు రెండు 1) యాగ పునరుద్ధరణ, 2) ప్రజాసంరక్షణ వరములు.

3.1.1.3.1.1.3.1. యాగ పునరుద్ధరణ వరము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతిపర్వము పంచమాశ్వాసము (496)లో కలదు. వరప్రదాత శివుడు కాగా వరానుగ్రహమును పొందినవారు దేవతలు.

ఈ విషయము జనకరాజునకు పరాశరముని యుపదేశించిన

ధర్మ ప్రకారమును భీష్ముడు ధర్మరాజుకు తెలిపిన ఘట్టములో నున్నది.

పూర్వము మానవులు ధర్మవర్తనులే. కాని క్రమముగా వా రధర్మమార్గచరితులైరి. అపుడే వారిలో దానవులు జన్మించిరి. వారు మర్త్యులకంటే హీనముగా ప్రవర్తించిరి. దానితో వేదములు నశించెను క్రతువులు లేకపోయెను. దేవతలకు హవిర్భాగము కరువయ్యెను. వారందరు కూడగట్టుకొని పురహరుని కడకేగిరి. వారి మొరను మహా దేవుడోపికతో వినెను. కోపము వచ్చినది. వెంటనే త్రిశూలమును ప్రయోగించెను. అది దైత్యావిష్టభావము నణచెను. మహామునులు శివుని కీర్తించిరి. అప్పుడు మర్త్యులు భయపడి వేదయజ్ఞములపట్ల ననురక్తిని పెంచుకొనిరి.

3.1.1.3.1.1.3.2. ప్రజాసంరక్షణ వరము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము అనుశాసనికపర్వము చతుర్థాశ్వాసము (435 438)లో కలదు. వరప్రదాత శివుడు కాగా వరానుగ్రహమును పొందినవాడు బ్రహ్మ.

ఒకప్పుడు క్రూర భూతములు జనులను మారణహోమము చేయసాగెను. జన్తుల యునికి మనికి యసాధ్యమయ్యెను. బ్రహ్మ శివుని దగ్గరికి వెళ్ళెను. ఇందులకు ప్రతీకారము చేయుమని ప్రార్థిం చెను. అంత శివుడు నిశ్చింతంబుగా నొక్కెడ నుండి లోకరక్షణము చేయదలచెన్. అతని దృష్టిలో శ్మశానము శుచిస్థానము. కనుక నందే నివాసము చేయుచు ప్రజలను పాలింపగడగెను

3.1.1.3.1.2. ముఖ్యదేవతల వరములు :

ప్రధాన దేవతలు ముఖ్యాది దేవతలను, మానవులను రక్షింతురు. ముఖ్యదేవతలు తమకంటె తక్కువ దేవతలను, మానవులను రక్షింతురు. సూర్యదేవుడు కుంతి, ద్రౌపదులను ; బృహస్పతి శచీదేవిని రక్షించుట యిందలి విషయములు.

3.1.1.3.1.2.1. సూర్యుని వరములు :

3.1.1.3.1.2.1.1. కుంతి కన్యాత్వ రక్షణ :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" పంచమాశ్వాసములోను (17 27) "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య పర్వము" సప్తమాశ్వాసములోను (308-353) తిక్కన భారతభాగము "ఆశ్రమవాస"పర్వము ద్వితీయాశ్వాసములోను (93-103) నించుమించు సమానముగా నున్నది. వరమును పొందినది కుంతి. వరప్రదాత సూర్యభగవానుడు.

కుంతిభోజు నింట కుంతి దుర్వాసమహర్షికి నతిథి మర్యాదలను చేసెను. అందు కతడు సంతసించి యామెకు పుత్రలాభ మంత్రము నుపదేశించెను. తరువాత నామె కన్యాత్వచాపల్యముతో నాలోచించకుండ నా మంత్రశక్తిని తెలిసికొనదలచెను. అట్లు పుట్టినవాడు కర్ణుడు.

ఒకనాటి యుదయమున నామె సూర్యుని చూచి మంత్రోచ్ఛారణ చేసెను. సూర్యుడు ప్రత్యక్షమయ్యెను. అతనిని చూడగా కుంతికి లజ్జాభయములు కలిగెను. తన తెలివిలేని తనమును మన్నించి వెడలిపొమ్మనెను. అప్పుడు సూర్యుడు

నన్నయ భారతభాగములో

వ॥ "నీకు సద్యోగర్భము బుత్రుడుద్భవిల్లు నీ కన్యాత్వం బును దూషితంబు గాదని వరం బిచ్చెను. (ఆది-పం.ఆ 25)

ఎఱ్ఱన భారతభాగములో

ఆ. వె.॥ "మత్సమాగమమున మదిరాక్షి నీదు క
న్యావ్రతంబు చెడదు; నందనుండు
నధికతేజు డుదయమగు నిన్ను లోకనిం
దయును బొందకుండు దథ్యమబల" (అరణ్య
స. ఆ-338)

తిక్కన భారతభాగములో

తే.గీ.॥ "నీకు గన్యాత్వ వికలిత గాక యుండ
వరము నిచ్చితి ననుచు దివమున కలిగె"
(ఆశ్రమ-ద్వి-అ. 103)

3.1.13.1.2.1.2. ద్రౌపది పరాభవ రక్షణ :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము విరాటపర్వము ద్వితీయాశ్వాసము (88-130)లో కలదు. మాన రక్షణకు ప్రార్థించిన వనిత ద్రౌపది. అనుగ్రహించినవాడు సూర్యభగవానుడు.

విరాటనగరమున ద్రౌపది మారుపేరు మాలిని. ఆమె సైరంధ్రిగా నుండెను. ఒకనాడు సుదేష్ణ కీచకు నింట నుండి మదిరారసమును తెమ్మని యానతిచ్చెను. మాలిని యయిష్టతో బయలుదేరెను. హరిని స్మరించుచు కదలెను. సూర్యుని చూచి యెట్టి కీడు కలుగకుండా కాపాడుమని చేతులెత్తి నమస్కరించెను. అప్పుడు సూర్యుడు ద్రౌపదీ రక్షణకు

నొక రాక్షసుని పంపెను. అత డదృశ్యాకారుడై ద్రౌపదిని వెంబడిం చెను. కీచకు నింటిలో ద్రౌపది భంగపడినది. అప్పు డదృశ్యములో నున్న రాక్షసుని బలము ద్రౌపదిలో ప్రవేశించినది. ద్రౌపది కీచకుని తోసివేసి మందిరమును దాటినదివి. రాటుని కొలువువైపు పరువు లెత్తి నది. కీచకుడు వెంటబడెను. అందరు చూడగా నామెను పట్టుకొని కాలితో తన్నెను. అప్పుడు

వ॥ "పాంచాలి రక్షకుండైన రాక్షసుం డతనిడొల్ల వేసెను." (129)
ఇతరు లెవ్వరు తన్ను చూడలేనంత తొందరగా ద్రౌపది కదలి చనెను.

3.1.1.3.1.2.2. బృహస్పతి వరము :
శచీదేవి రక్షణ :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగపర్వము" ప్రథమాశ్వాసములో (148-205) గలదు. వరమును కోరి పొందినది ఇంద్రుని భార్య శచీదేవి. వరప్రదాత బృహస్పతి.

వృత్రాసురుని చంపుటచే ఇంద్రునికి బ్రహ్మహత్యాపాపము వచ్చెను. అద్దాన నతడు "ఇంద్ర" పదవిని వదలి యెవరికి తెలియ కుండ దాగెను. పిమ్మట దేవతల ప్రార్థనపై నహుషుడు ఇంద్ర పదవిని చేపట్టెను. తరువాత నతడు మన్మథాధీనుడయ్యెను. ఒకనాడు "ఇంద్రుని" భార్యయగు శచీదేవిని చూచి మన్మథావేశపరుడయ్యెను. ఇంద్ర పదవిలో నున్న తనను చూచుటకునెందుకు రాలేదని యామెకు కబురంపెను. కాని యామె భయము నొంది వెంటనే

కం॥ .... .... .... .... "దేవే
జ్యుని సదనమునకు శరణం
బనుచుం జనెను" (151)

బృహస్పతి యామెకు శరణ మిచ్చెను. గౌరవించెను. తన ప్రయత్నమువలన ఇంద్రుడు వచ్చునని యూహించెను. నహుషు డా విషయమును తెలిసికొనెను. బృహస్పతి చేసిన పని న్యాయమైనది కాదని మునుల, దేవతలతో చెప్పెను. ఇంద్ర పదవిలో నున్నవారు, పరస్త్రీని పొందుట మంచిదికాదని వారు తెలిపిరి. అట్లైన "ఇంద్రుడు" అహల్యను కోరినప్పుడతని కెందుకు బుద్ధిమాటలను చెప్పలేదని నహుషుడు వారిని గద్దించెను. వారు భయపడి శచీదేవిని పిలిచికొని వచ్చుటకు బృహస్పతి దగ్గరకు వెళ్ళిరి. విషయమును చెప్పిరి. శరణ మిచ్చిన వారికి శక్తియుండి రక్షింపనిచో నూర్ధ్వలోకము లుండవని బ్రహ్మ చెప్పిన వాక్యమును బృహస్పతి వారికి తెలిపెను. మంచి మాటలతో నహుషుని దగ్గర కొంత గడువును తీసికొని రమ్మనియు నా గడువులోపల ఇంద్రునికి నభ్యుదయము కలుగు పద్ధతి నాలోచింతు మని శచీదేవికి చెప్పెను. ఆమె యట్లు చేసెను. దేవతలు విష్ణుమూర్తి సలహాపై హయమేధమును ఇంద్రుని పేరుతో చేసి, విష్ణువుకు ప్రియ మొనర్చిరి. ఇంద్రునికి బ్రహ్మహత్యాపాపమును పోగొట్టిరి. శచీదేవి ఉపశ్రుతి నారాధించెను. ఆమె శచీదేవికి ఇంద్రుని చూపించెను ఇంద్రుని సలహామేరకు శచీదేవి నహుషుని మునివాహనుడై తన దగ్గరకు రమ్మనెను. అతడట్లు వచ్చుచుండెను. శచీదేవి మరల బృహస్పతిని

వ॥ "శరణాగత నైన నన్ను రక్షింపు మని" (182) వేడెను. బృహస్పతి యామెతో

కం॥ "ఆ నహుషువలన నాపద
రానీ నతనికి నాతురత గావింపం

బూని యొనర్చెద మేలిమి
దానను ముని వాహనత గతస్థైర్యు డగుస్" (183)

కం॥ "వెరవున నీ పతి యునికియు
నరసెద నని యూఱడించెను" (184)

వెంటనే ఇంద్రుని వెదకుమని అగ్నిదేవుని పంపెను. వేలిమిని చేసెను. దాని ప్రభావమేమో నహుషుని మోచి విసిగిన మునులతని దగ్గర గోష్ఠి వినోదమును చేయుచుండిరి. ఆ సమయమున గోసం ప్రోక్షణమునందు చెప్పబడిన బ్రాహ్మణములైన మంత్రములు తనకు ప్రమాణములు కావని నహుషుడు చెప్పెను. మరియు నా విషయమును తప్పులు పట్టిన "అగస్త్యమహర్షి"పై కోపించి యతని తలను తన్నెను. అందుకు నా మహర్షి కోపించి "ఇంద్ర" పదవిభ్రష్టుడవై బహువత్సరములు భూలోకమున పాము రూపమున నుండు" మని నహుషుని శపించెను. నహుషుడు శాప ప్రభావమును వెంటనే పొందెను. పై విధముగ బృహస్పతి శచీదేవిని రక్షించెను.

3.1.1.3.1.3. మహర్షి వరము :

మహర్షులును మానవులకు కలుగు ప్రత్యేక కష్టములను తొలగింతురు. అందులో నా మహర్షుల సంబంధ మున్నపుడు వారివలన కలుగు కష్టములను చరితార్థమగునటుల తొలగింతురు.

పరాశరమహర్షి వరము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వముత తృతీయాశ్వాసములో (83 - 44) గలదు. వరమును కోరిన వని" మత్స్యగంధి. వరప్రదాత పరాశరమహర్షి.

పరాశర మహర్షికి మత్స్యగంధి పైమనసు కలిగెను. ఆతని కోరి కను నామెతో తెలిపెను. మునిమాటనుసమ్మతించనిచో నతడుకోపించి శపించునేమో యనిభయపడినది. ఉభయ తారకముగా తనయాందో శనను.

తరలము॥ కనువు మీవ్వాల వల్చు జాలరిదాన నట్లును గాక యే
నగఘ కన్యక గన్యకావ్రత మంతరించిన సెట్లు మ
జ్జనకు నింటికి బోవ నేర్తు ప్రసాద బుద్ధి యొనర్చు న
న్మునిగణోత్తమ నాకు దోష విముక్తి యెట్లగు నట్లుగన్(40)

అని వ్యక్తముచేసినది.

అప్పుడా ముని సంతోషంచి "కన్యాత్వంబు దూషితంబుగా కుండునట్లు" (41) శరీరసౌగంధ్యంబు యోజనంబులంగోలె జనులకు నేర్పడునట్లును, నామె కోరకనే యనేక దివ్యాభరణ భూషితమగు నట్లును సంగమమున కనుకూలముగ నా ప్రదేశమంతయు చీకటిమ యమగునట్లుచేసెను.

3.1.1.3.1.4 మహీపతి రక్షక వరము:-

చిన్న పాలకులు తాముచేయబోవు కార్యమునకు సహాయమును చేయుమని సంబంధమున్న గొప్పపాలకులను, వారికి సంబంధించిన వారిని కోరుట సహజము.ఏదోకారణమును చెప్పి వారు తిరస్కరింతురు. సంబంధములేని యితరుల సహాయమును పొందుచున్నప్పుడు తమ కవమానము కలిగినదని పూర్వము తిరస్కరించిన వారు బాధింతురు. అట్టిదే యీ రక్షక వరము. ఇంద్రునిబారి నుండి మరుత్తుడను రాజును బృహస్పతి తమ్ముడైన సంవర్తుడు రక్షించెను.

సంవర్తుని వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అశ్వమేధ"పర్వము ప్రథమాశ్వాసములో (64-99) గలదు. వరమును కోరిపొందిన వాడు మరుత్తుడను రాజు.వరప్రదాత సంవర్తుడు.

మరుత్తుడనురాజు యజ్ఞమునుచేయదలచెను. దేవతల గురువైన బృహస్పతిని 'ఉపద్రష్ట" గా రమ్మని ప్రార్థించెను. కాని బృహస్పతి తిరస్కరించెను. పిమ్మట నారద మహర్షిసలహాపై మరుత్తుడు బృహస్పతితమ్ముడైన సంవర్తునిని ప్రార్థించెను. అతడంగీకరించెను. ఈ విషయమును బృహస్పతితెలిసికొనెను.చాలక్రుంగిపోయి కృశించెను.ఆ విషయమును ఇంద్రుడుతెలిసికొని,బృహస్పతిని"ఉపద్రష్ట"గా నుంచు కొనుమని"అగ్ని" దేవునిద్వారా రెండు పర్యాయములు మరుత్తునికి తెలియబరచెను. కానిమరుత్తుడు వినలేదు.తరువాత "ఇంద్రుడు" గంధర్వ రాజగుధృతరాష్ట్రుని పంపెను. అయిననుమరుత్తుడువినలేదు. వెంటనే ఇంద్రునివజ్రాయుధమువచ్చుజాడ (శబ్దము) వినబడెను. అప్పుడు మరుత్తుడు సంవర్తునుని

కం॥ "కులిశము వచ్చుచు నున్నది
యలు కొందెడు నా మనంబు ననఘచరిత స
భ్యులు సంత్రాసము నొందిరి
తలకొని రక్షింపవలయుదయ మెమ్మెల్లన్"(93)అని వేడెను.

సంవర్తును డందుకు సమ్మతించెను.సంస్తంభ విద్యచే వజ్రాయుధము నణచుదునని తెలిపెను. అయినను వజ్రాయుధము సమీపించెను అప్పుడు మరల మరుత్తుడు

ఆ.వె॥ భిదుర మెవ్విధమున భీతి దొఱంగుదు" (95)

నని ప్రార్థించెను.

సంవర్తునుడు మెల్లగ నవ్వుచు

ఆ.వె॥. "దాని సరకు గొనక తగు వర మడుగు నా

తపముపేర్మి నిత్తు ధరణినాథ (95) అని పలికెను.

మరుత్తుడు తనయజ్ఞపు హవ్యభాగములను తీసికొనుటకు ఇంద్రాది దేవతల నాహ్వానించుమని వరమును కోరెను. వెంటనే సంవర్తునుడు ఇంద్రాది దేవతల నాహ్వానింతునని పలికి

వ॥ "దివ్యుల నవ్వజ్రంబు వారించెను" (99).

ధృతరాష్టుని పంపివేసెను. దేవేంద్రుని దేవతలను పిలిచెను.

3.1.1.3.1.5 పుర రక్షక వరములు :—

ఆంధ్ర మహాభారతములో పుర రక్షకవరములు రెండు 1. మాహిష్మతీ పుర రక్షణ 2. గిరి వ్రజపుర రక్షణ

3.1.1.3.1.5.1. మాహిష్మతీ పురరక్షణ :–

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము సభాపర్వము ప్రథమాశ్వాసములో (254–258) కలదు. వరమును కోరినవాడు నిషధుడు. వరప్రదాత అగ్ని దేవుడు.

నిషధుడు నీలవంశజుడు. మాహిష్మతీ పురపాలకుడు. ఒకపర్యాయము "అగ్ని దేవుడు" బ్రాహ్మణ వేషధారియై పిదాధ్యయనమును చేయుచుండెను. ప్రమాదవశంబున పారదారికుడయ్యెను రాజ నియోగు

లీ విషయమును తెలిసికొనిరి. ఆ బ్రాహ్మణుని రాజునెదట నిలిపిరి. రాజు దండింపబోయెను. అగ్ని నిజరూపంబు చూప నిషధుడు భయపడి శరణువేడెను. అగ్ని వరమిత్తు వేడుమని కోరెను.

తే. గీ॥ "ఇప్పురంబు జయింపగ నెవ్వరేని
వత్తు రుద్ధతు లయి శత్రువరులు వారు
దర్పమేది నీచేత నిర్ధగ్ధులై వి
హీను లవునట్లుగా వర మిమ్ము నాకు" (257)

అని కోరెను. అగ్ని సమ్మతించెను.

3.1.1.3.1.5.2. గిరివ్రజపుర రక్షణ

ఈ వృత్తాంతము నన్నయ భారత భాగము సభాపర్వము ప్రథమాశ్వాసములో (172-176) గలదు. వరమును కోరిపొందినది "ఔశీనరి" యను శూద్రాంగన. వర ప్రదాత గౌతముడు.

శ్రీకృష్ణుడు జరాసంధుని చంపించదలచెను. భీమార్జునులతో కలిసి బ్రాహ్మణవేషములో నడచి జరాసంధుని పురమైనగిరివ్రజపురము చుట్టునున్న కొండపైకి చేరెను. అప్పుడు శ్రీకృష్ణుడుభీమార్జునులకు నా పురముయొక్క గొప్పదనమును తెలుపుచు

వ॥ "ఇందు దొల్లి గౌతముం డౌశీనరి యను శూద్ర యందు గాక్షీవాదులను సృజియించె నట్టి గౌత మానుగ్రహంబు నను నీ దుర్గబలంబుననుం జేసి యిమ్మాగధుల నెవ్వరును జయింప నోపరు" (176)

అని తెలిపెను.

3.1.1.3.2. అజేయవరములు

జయాపజయములు దైవాధీనములు మరణమునకు భయపడిన వాడును, నితరులకంటె నధికుడనినిరూపించుకొనుటకు తాపత్రయపడు వాడును, తాను "అజేయుడుగా" నుండ ప్రయత్నించును. ఇవి "అజేయవరములు. ఇట్టివి రెండు 1) ఉమేశ్వరవరము 2) తాతల వరము

3.1.1.3.2.1. ఉమేశ్వరుని వరము

ఈ వృత్తాంతము నన్నయ భారత భాగము సభావర్వము ప్రథమాశ్వాసములో (160-162) గలదు. వదమునుకోరి పొందినవాడు జరాసంధుడు. వరప్రదాత ఉమేశ్వరుడు.

ధర్మరాజు రాజ సూయ యాగమునుచేయవలెనని శ్రీకృష్ణుని యనుమతి నడిగెను. అప్పుడు శ్రీకృష్ణు డనుమతి నిచ్చి జరాసంధుని చంపి నప్పుడే రాజసూయ యాగము నిర్విఘ్నముగ జరుగును.లేనిచో జరుగదని చెప్పెను. దానికి కారణమును చెప్పుచు

ఉ॥ అమ్మగధేశు నుగ్రబలు నాయుధ యుద్ధమునన్ జయింపగా
నిమ్మహి నోప రెవ్వరు నుమేశ్వరు డట్టి వరమ్ము వానికిన్
నెమ్మిన యిచ్చెన్" (162) అని తెలిపెను.

కావున నంతటి వరప్రభావము గలవాని నాయుధములతోజయించుట కష్టము. భీమునికిగల గొప్పభుజ బలపరాక్రమముచే నతడు జరాసంధుని జయించ గలడని తెలిపెను.

3.1.1.3.2.2 తాతల వరము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారత భాగము "అరణ్య" పర్వము చతుర్థాశ్వాసములో (380,401) గలదు. వరమును కోరిపొందిన వాడు "దుంధుడు" అను రాక్షసుడు. వరప్రదాత లతని పితామహులు

పాండువు లరణ్యవాసములో నుండిరి. వారిని చూచుటకు మార్కండేయ మహాముని వెళ్ళెను. వారతనిని గౌరవించిరి. అతడు ధర్మ రాజుకు గలిగిన సందేహములను నివృత్తి చేయు చుండెను. ఆ పరంపర లో కువలయాశ్వునికి దుంధు మారు డను పేరెట్లువచ్చె నని ధర్మరా జడి గెను. దానికి సమాధానముగ ముని యిట్లు వివరించెను.

ఉదంకముని పాంచజన్యధరు నుద్దేశించి తపస్సును చేసెను. విష్ణుమూర్తి ప్రత్యక్షమయ్యెను. కోరిన వరముల నిచ్చెను. త్రిలోక హితార్థ మొక కార్యమును చేయుమని మునికి తెలిపెను. మధుకైటభు లను నసురుల తనయుడు దుంధుడు. అతడు జగములకును ప్రద్రవ మును చేయును. వానిని వధించుటకై ఇక్ష్వాకు వంశజుడైన కువల యాశ్వరాజును ఉదంకముని కలియపలెను. ఆ రాజును విష్ణుమూర్తి ప్రసాదలబ్ధమైన యోగబలము వలనను "ఉదంక" ముని నియోగ బలము వలనను, దుంధుని కువలయాశ్వరాజు చంపునని చెప్పెను. కొంత కాలము తర్వాత దుంధుడు

వ॥ "మహాబల పరాక్రమ సంపన్నుడై నిజ తపోబలబునం బితా మహు వలన వరంబువడసి దేవదానవగంధర్వాదులకు నజ య్యుండై చరియించు చుండెను. సముద్ర వాలుకా పులిన తలంబునందు మహా వివరంబు గావించుకొని సుఖంబున నిద్రించు చుండెను ........ వాని వదన నిశ్వాసపవనంబు సధూమ దహన జ్వాలాభీలంబయి సంవత్సరంబున కొక్క

మూఱు వెలువడిభూనభోంతరం బెల్లను నిరంతసికతారజః పటలంబుదూటుకొనంజేయు దదీయ వేగంబున దత్పమీపభూమి శైల కాననంబు లేడుదిపంబుల దాక గంపించు చుండెను (384) ఉదంకముని కువలయాశ్వుని ప్రేరేపించెను. అతడు వానిని చంపెను

3 1.1.3.3. ఆయుధ వరములు :-

ఆయుధమనగా ఖడ్గాది యుద్ధసాధనమని యర్థము. ఖడ్గాదులు సామాన్యములు, కానిమహిమోపేతములును- దైవ దత్తములునైనయాయుధములు యసాధారణ యాయుధములు. ఇట్టి "ఆయుధ" వరములు "ఐదు" ప్రధానముచేపిన వారి దృష్టతో ప్రధానముగా నివి రెండు రకములు. 1. తపోదేవత వరములు 2. ఇతర దేవతల వరములు.

3.1.1.3.3.1 తపోదేవత వరములు :.

ఇచ్చట నిర్దిష్టమైన దేవత నామము కనబడదు. తపోబలమే యిందుకు సాధకము. అనుగ్రహించినది తపోదేవత. ఇట్టివి రెండు 1) సుదర్శనచక్ర ప్రదానము 2) సేనాకాంచన ప్రాప్తి

3.1.1.3.3.1.1 సుదర్శన చక్రప్రదానము :-

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము సౌప్తిక పర్వము ద్వితీయాశ్వాసములో (47-50) గలదు. సుదర్శన చక్రమును పొందిన వాడు శ్రీకృష్ణుడు. వరప్రదాత తపోదేవత.

సుదర్శన చక్రమును తనకిచ్చి ప్రతిగ తన బ్రహ్మశిరోనామ

కాస్త్రమును తీసికొను మని "అశ్వత్థాను" శ్రీకృష్ణుని నడిగెను. బదులు లేకుండగనే సుదర్శన చక్రమును తీసికొనుమని శ్రీకృష్ణుడు చెప్పెను. అశ్వత్థామ దానిని రెండుచేతులతో నెత్తలేకపోయెను. అప్పుడు శ్రీకృష్ణుడు "అశ్వత్థామ"తో

తే॥గీ॥ '"అధిక నిష్టమై బ్రహ్మచర్య వ్రతంబు
తోడ రుక్మిణీయుతముగా దుహిన శైల
తటము నందు బండ్రెండు వత్సరము లుగ్ర
తప మొనర్చి యిమ్మహిత సాధనము వడసి" (49)

వ॥ దివిజ దానవ గంధర్వాది సమస్త భూతంబులు నాతోడి
యెత్తు రాకుండెడు నట్టి దోర్వీర్యంబున వెలసి వర్తిల్లు
నట్టిది దీని మహత్త్వంబు" (50)" నని చెప్పెను.

3.1.1.3.3.1.2 సేనాకాంచన ప్రాప్తి :-

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అశ్వమేధ" పర్వము ప్రథమాశ్వాసములో (18-26) గలదు. సేనా కాంచనములను పొందిన. వాడు కరంధముడు. వరప్రదాత తపోదేవత.

ఖనీనేత్రు డను రాజ కుమారుడు కరంధముడు. అతడు దాన తత్పరుడు. ఆకారణమున నతడు నిరుపేద యయ్యెను. సైన్యము బలహీనమైనది. శత్రువు లారహస్యమును పసిగట్టిరి. అతని రాజ్యము మీదికి దండెత్తిరి. కరంధము డోడిపోయెను. అడవిపాలై యుచటతపము గావించెను. తపస్సుచే మహాశక్తివంతుడయ్యెను అపుడు.

కం॥ భట తురగ సామజ రథో
ద్భట సేనా సముదాయములు బహూళ రుచి సము

త్కట కాంచన రాశులు న
చ్చట బొదమెం జూడ నక్కజం బగు భంగిన్" (23)

ఆపై సైన్య ధన బలములతో కరంధముడు విరోధులను జయించి పునఃపట్టాభి షిక్తుడయ్యెను.

3.1.1.3.3.2. ఇతర దేవతల వరములు :

తపోదేవత కాక మిగిలినవారు యితర దేవతలు. శివుడు, అగ్ని, వరుణ దేవత లిచ్చిన వరము లింగు చేరును.

3.1.1.3.3.2.1. శివుని "దండ" ప్రదానము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతిపర్వము తృతీయాశ్వాసములో (116-120) గలదు. వరముమ కోరి పొందినవాడు బ్రహ్మ. వరప్రదాత శివుడు.

పూర్వ మొకప్పుడు బ్రహ్మయొక యధర్వమును చేయదలచెను. ఆత్మసదృశుడైన ఋత్విజునికొఱకు వెదకెను. కాని యతడెక్కడను కనబడలేదు. అప్పుడు బ్రహ్మయే గర్భమును ధరించెను. వేయి సంవత్సరముల పిదప తుమ్మగా నపుడు పుత్రుడు వెలువడెను. క్షుతము (తుమ్ముట) వలన పుట్టుటచే నతడు క్షుతుడను పేరుతో పిలువబడెను. బ్రహ్మ యా క్షుతుని ఋత్వజునిగ నుంచి క్రతువును చేయుచుండెను. పూర్వము జగత్పాలనకొఱకు విష్ణువే దండమై యుండెను. ఆ దండము తన కిష్టము వచ్చునట్లు నడచునట్టిది. అది బ్రహ్మ క్రతువు సమయమున నంతర్హితమయ్యెను. కార్యకార్యా తంత్రభేదము కలిగెను. దానివలన భూమి కలతను చెందెను. అమర్యాదకరముగ

దండము వర్జించెను. అప్పుడు బ్రహ్మ విష్ణువుకడకు వెళ్ళి, ప్రార్థించి యతనిని రుద్రుని దగ్గరకు పిలిచికొని వెళ్ళి

కం॥ .... .... "నీ సంఖుం డీతడు వ
చ్చిన కార్యము గృపతోడను
విను మని దండంబు తెఱంగు వినిపించె దగన్" (117)

దండాభావమువలన జగములు కలతను చెందిన విషయమును వినిన మహాదేవుడు

వ॥ "నిజ ప్రభావంబు దండంబుగా గల్పించి దండనీతి కాశ్రయుండై పరగుచుండెను." (118)

అప్పుడే భవుడు విద్యలను 18 భాగములుగా విభజించెను. మరియు

వ॥ "దండంబును దండనీతి ప్రపంచంబు లయిన యవ్వి ద్యలను విష్ణు వశగతంబులు సేసెను." (120)

3.1.1.3.3.2.2. అగ్నిదేవుని ధనుర్బాణ ప్రదానము :

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వ" మష్ట మాశ్వాసములో (233 - 240, 250 - 283) గలదు. ధనుర్బాణములను కోరినవాడు "అర్జునుడు." వాటిని ప్రసాదింసినవాడు "అగ్నిదేవుడు."

పాండవులు "ఇంద్రప్రస్థము"ను రాజధానిగా రాజ్యము నేల సాగిరి. ఒక వేసవినాట శ్రీకృష్ణార్జునులు ఖాండవ వనసమీపమున కరిగిరి. అచ్చట "అగ్నిదేవుడు" తటస్థపడెను. వా తనిని గౌరవించిరి. ఖాండవవనమును కాల్చుటకు "అగ్ని" వారి సహాయము నడిగెను. అందుకు "అర్జునుడు," "ఇంద్రుని" శిలావర్షమును తట్టుకొనగలిగిన

బలమున్నను తనకు ధనువులేదని యసహాయతను ప్రకటించెను. రథము లేకపోవుట, శ్రీకృష్ణుడు నిరాయుధుడై యుండుటను స్పష్టము చేసెను. అగ్నిదేవుడు వెంటనే వరుణదేవుని స్మరించెను. అతడు ప్రత్యక్షము కాగా

వ॥ "తల్లి నీకు సోముం డిచ్చిన బ్రహ్మనిర్మిత కార్ముకంబు నక్షయ తూణీరయుగళంబును గంధర్వజ హయంబులం బూన్చిన రథంబు నియ్యతిరథుం డయిన యర్జునున కిమ్ము సుఱిచక్రంబును గదయును వాసుదేవునకిమ్మని పంచెను." (252)

వరుణు డట్లను గ్రహించగా కృష్ణార్జునులు సహాయపడిరి.

3.1.1.3.3.2.3. వరుణదేవుని గదా ప్రదానము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ద్రోణపర్వము తృతీయాశ్వాసములో (88-91) గలదు. గదాయుధమును పొందినవాడు శ్రుతాయుధుడు. దానిని ప్రసాదించినవాడు వరుణదేవుడు.

వరుణదేవుని కుమారుడు శ్రుతాయుధుడు. అతడు వీరుడు. కుమారుని ప్రతాపములకు తండ్రి సంతసించి యొక గదను ప్రసాదించెను; ఆ గద నిచ్చు వేళ

వ॥ "దీని ధరించినవాడు రిపుల కజయ్యుండగుం బోటె క్కించు కొనని వాని మీద బ్రయోగించిన వానిన మరలి వధియించు నని చెప్పెను" (88)

కాని శ్రుతాయుధు డనాలోచితముగా శ్రీకృష్ణుని మీదికి దండె

త్తెను. అప్పుడు కృషుడు యుద్ధమునకు సిద్ధముగాలేడు.అద్దాన గద వెనుదిరిగి వచ్చి శ్రుతాయుధుని తాకెను. అతడు మరణించెను.

3.1.1.3.4. అస్త్ర వరములు :

లోహాది నిర్మితము శస్త్రమని, సమంత్రక ప్రయోగాత్మకము "అస్త్ర"మని వ్యవహారము. ఇవి విశిష్టములని, దివ్యాస్త్ర శస్త్రములని రెండువిధములు.

3.1.1.3.4.1. విశిష్టాస్త్ర వరములు :

దేవతాధీనమై క్వాచిత్కముగా నియమనిష్ఠలతో ప్రయోగార్హము విశిష్టాస్త్రము. ఇట్టివి "ఆంధ్ర మహాభారతము"లో నాలుగు కలవు. ఇవి 1) బ్రహ్మాస్త్రప్రాప్తి, 2) నారాయణాస్త్రప్రాప్తి, 3) పాశుపతాస్త్ర వరము, 4. సమ్మోహనాస్త్ర వరము.

3.1.1.3.4.1.1. బ్రహ్మాస్త్ర ప్రాప్తి :

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్యపర్వము" షష్ఠాశ్వాసములో (276-283) గలదు. వరము ను కోరి పొందినవాడు విభీషణుడు. వరప్రదాత బ్రహ్మ.

రావణ కుంభ కర్ణవిభీషణులు సోదరులు. వారు వైశ్రవణుని తపోబలమును, నద్దాన పొందిన వైభవమును విని తామును తపమును చేయసాగిరి. ఖర, శూర్పణఖలు సేవలను చేయసాగిరి. విభీషణుడు వరాహార వృత్తితో జపాధ్యయనాసక్తితో తపముమ చేసెను. అంత బ్రహ్మ ప్రత్యక్షమయ్యెను. అప్పుడు విభీషణుడు

కం॥ "పర మాపద యైనపుడును
దుర్గతంబులు నా మనంబు దొడఁరిమియున్న భా

సుర మగు బ్రహ్మాస్త్రంబును
గరుణింపవె యని" (282) కోరెను

బ్రహ్మ యా వరము నిచ్చి యతని ధర్మబుద్ధిని మెచ్చుకొని, కోరకనే యతనికి "అమరత్వము" నిచ్చెను.

3.1.1.3.4.1.2 నారాయణాస్త్ర ప్రాప్తి :

ఈ వృత్తాంతము తిక్కన భారత భాగము ద్రోణపర్వము పంచ మాశ్వాసములో (391) గలదు. వరమును కోరిపొందిన వాడు ద్రోణాచార్యుడు. వర ప్రదాత నారాయణ మూర్తి

ద్రోణాచార్యుడు నారాయణ మూర్తి నారాధించెను. అతడు ప్రత్యక్షమై యేమి వరము కావలయునో కోరుకొనుమనెను. అప్పుడు ద్రోణాచార్యు డన్నింటి కంటె మిన్న యగు నారాయణాస్త్రమును కోరు కొనెను.

నారాయణు డా యస్త్రమును ప్రసాదించి పునః ప్రయోగంబున కర్తంబు గాదనియు, నట్లు ప్రయోగించిన వారినే వధియించుననియు నానతిచ్చెను. ద్రోణు డా "అస్త్రమును" కుమారునకు ప్రసాదించెను. తరువాత కురుక్షేత్రసమరమున మరణించెను.ఈ మరణమునకు పాండవుల వంచకత్వమే కారణమని "అశ్వత్థామ" దృఢముగ నమ్మి నారాయణాస్త్రమును ప్రయోగించెను. కానిదాని వలన బాధ కలుగకుండు నట్లు దానికి ప్రతి విధానమైన సామజ హయరథముల నుండి దిగి నిరాయుధులైన వారిని నా యస్త్రమేమియు చేయదను నుపాయ మును శ్రీకృష్ణుడు పాండవ సైన్యమునకు నప్పుడే తెలిపెను. వారంద

రును నట్లుచేసిరి. అప్పుడా యస్త్రము శాంతించెను. దానిని మరల ప్రయోగించుమని దుర్యోధనుడు "అశ్వత్థామ" నడిగెను. అప్పుడు "అశ్వత్థామ"

వ॥ "అది పునః ప్రయోగంబున కర్హంబు గా దట్లయినం బ్రయోగింబన వారిన వధియించు నిట్లగుట గురునకు వరదాన కాలంబునం గేశవుం డానతిచ్చె" (39) నని తెలిపెను.

3.1.1.3.4.1.3 పాశుపతాస్త్రప్రాప్తి :-

ఈ వృత్తాంతము నన్నయభారత భాగము "అరణ్య" పర్వము ప్రథమాశ్వాసములో (300-331) గలదు. వరమును కోరిపొందిన వాడు "అర్జునుడు". వరప్రదాత శివుడు.

పాండవుల యరణ్యవాస సమయములో "అర్జునుడు" పాశుపతాస్త్రము కొఱకు శివునుద్దేశించి తపమును చేసెను. శివుడు కరాతవేషమున క్రీడిని పరీక్షించెను. చివరకు స్వస్వరూపమును చూపెను. అర్జునుని పూర్వవృత్తాంతమును పూసగ్రుచ్చినట్లు విశదము చేసెను. పైగా తాను మాయము చేసినగాండీవమును "అక్షయ" తూణీరములను నను గ్రహించెను. పిదప నభీష్టమైన వరము నిత్తునని తెలిపెను. అంత "అర్జునుడు" రౌద్రరూపకమైన దివ్యాస్త్రమగు పాశుపతాస్త్రమును మరియు బ్రహ్మశిరోనామ శాస్త్రమును కోరెను. శివుడును కరుణించి విశుద్ధాత్ముడైన

వ॥ "పార్థునకు మంత్రధ్యాన జపహోమ పూర్వకంబుగా

సంధాన మోక్ష సంహార సహితంబుగా బాశుపతాస్త్రం బిచ్చి దీనికి నసాధ్యం బెద్ది" మును లే దల్పుల యందు ప్రయుక్తంబైన జగత్సంహారము సేయు" (329) నని చెప్పియిచ్చెను.

ఈ వరప్రదానమున నొక విశేషమున్నది. అర్థించిన వాడు అర్జునుడు. అనుగ్రహించిన వాడు శివుడు. అడిగినంతనే యిచ్చుట భక్తవాత్సల్యమున కుదాహరణము. ఈ సందర్భమున శివుడు అగ్రి హానుగ్రహంబు" చెప్పుట (331) "అస్త్రవిద్యా" ప్రాముఖ్యమును విశదపఱచుటయే.

**3.1.1.3.4.1.4.** సమ్మోహనాస్త్ర ప్రాప్తి :-

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగ" పర్వము చతుర్థాశ్వాసములో (338-340) గలదు. వరమును కోరిపొందిన వాడు భీష్ముడు. వరప్రదాతలు "అష్టవసువులు" (సురభూసురులు).

భీష్మ పరశురాములు శిష్యాచార్యులు. అంబ విషయమై వారిరు వురికి సమరము 23 దినములు సాగెను. భీష్ముడలసిపోయెను. పరశు రాముని జయింపలేనని నిరాశచెందెను. అంత రాత్రి యేకాంతముగా దర్భశయ్యపై కూర్చొని మనస్సులో "అష్టవసువు"లను తలంచెను. వా రతని కోరికను మన్నించి

తే॥గీ॥ ................"రాము జయించు నట్టి
శరము సుమ్మని మోహనాస్త్రంబు "(339) నచ్చిరి

**3.1.1.3.4.2** దివ్యాస్త్రశస్త్ర వరములు :-

ఈ వర్గములో హర, అర్జునాదు లనుగ్రహించిన "అస్త్ర" వర ములు చేరును.

3.1.1.3.4.2.1. హరుని దివ్యాస్త్రదానము :-

ఈ వృత్తాంతము తిక్కనభారత భాగము కర్ణపర్వము ప్రథమాశ్వాసములో (295_307) గలదు. వరమును కోరిపొందిన వాడు పరశురాముడు. వరప్రదాతహరుడు

పరశురాముడు నిష్ఠాగరిష్ఠుడు. అతడు శివునుద్దేశించి తపమును చేసెను. పరమశివుడు ప్రత్యక్షమయ్యెను. అపుడు పరశురాముడు దివ్యాస్త్రములను కోరెను. శుచియైన వేళ "అస్త్రములు" తమంతట తాము దక్కునని శివుడు పలికెను. పరశురాముడు సమ్మతించి శివశుశ్రూషా వరమును కోరెను. ఆపై నియమానుసంధానుడై శివుని నారాధించెను. శివుడును సంతుష్టుడై తనకును పరశురామునకు గల ననుబంధమును పార్వతి కెరుకపరచెను. అప్పుడే దేవతలు తాము దానవుల వలన నెదుర్కొను బాధలను విశదీకరించిరి శివుడు దానవ నిర్మూలనమును కావింపుమని పరశురాముని నాదేశించెను అస్త్రవంతుడను కాకున్నచో పోరాడలేనన్న పరశురాముడు తనయశక్తతను తెలియజేసెను. శివుడుతనమీద తలంపు నిలుపుమని యాదేశించెను. సమరమున పరశురాముడు క్షతగాత్రుడై మరలి వచ్చెను. అంత శివుడు

కం॥ "కొను మని దివ్యం బగు న
స్త్రనికాయము శాస్త్రచయము" (306) నను గ్రహించెను.

3.1.1.3.4.2.2 అర్జునుని అనలాస్త్రప్రదానము :-

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" సప్తమాశ్వాసములో (39_157) గలదు. వరమును కోరిపొందిన వాడు "అంగారపర్ణు" డను పేరుగల గంధర్వుడు. వరప్రదాత అర్జునుడు.

ఏక చక్రపురము నుండి ద్రౌపది స్వయంవరమునకుకుంతీ,పాండవులు వెళ్ళుచుండిరి. వారికి దారిలో నొకనాటి యర్ధరాత్రమునగంగానది యొడ్డున "అంగారవర్ణు" డడ్డు తగిలెను. అపుడు "అర్జును" డతనితో యుద్ధమునకు దిగి తన యాగ్నేయాస్త్రముతో నతనిరథమును కాల్చి వేసి యతనిని ధర్మజున కప్పగించెను. అతని భార్య ప్రార్థనపై ధర్మరాజతనినిగివదలెను. అప్పుడు అర్జునునితో "అంగార వర్ణుడు బద్ధ సఖ్యమును చేయగోరెను. ప్రతిగా మహాజవ సత్త్వములును, కామవర్ణములును, కామగమనములును నైన గంధర్వహయముల నైదుగురికిని నూఱసి యిచ్చెదనని పలికెను. అర్జును డా కోరికనువిని

ఆ. వె॥ .... .... .... ...." అనలాస్త్ర.

మనకు నీవు గొనుము హయము లిమ్ము (54)

వ॥ నీతోడ బద్ధ సఖ్యంబు జేసెద" (55) నని పలికెను

ఈ వరములో రెండంశములున్నవి. మొదటిదిక్షత్రియధర్మము రెండవదిస్నేహధర్మముక్షత్రియ ధర్మము ప్రకారము నుక్షత్రియుడే వస్తువు నూరకనే యితరుల దగ్గర నుండి గ్రహింపరాదు. స్నేహ ధర్మములో "ఆదాన ప్రదానము"లు ముఖ్యము. కనుక నొకరికి చెందినది మరి యొకరికి చెందునని న్యాయము.

3.1.1.3.5. పరికర ప్రదాన వరములు :-

పరికర మనగా బాగుగా నుపకరించున దనిసామాన్యార్థము వ్యక్తికిసమూహమునకు నుపకరించునదేదియైననునది పరికరమే. ఆ పరికర సమీకరణకు ననేకకారణములు కావచ్చును. 1. నిత్యావసరార్థము 2. ఆశ్రితపోషణార్థము, 3. శత్రుజయార్థము, 4. పాలనా

ర్థము, 5. అలంకారార్థము కావచ్చును.

3.1.1.3.5.1. నిత్యావసరార్థము :-

మానవ మనుగడకు నవసరమైన వాటిలో మొదట జలము, తరువాత "అగ్ని" యవసరము. ఈ జలాగ్నులు మనుగడకే గాక దైవకార్యార్థమునకును నవరసరము. నిత్యావసరార్థము ప్రార్థించిన వరములు రెండుకలవు 1. ఉదకసంప్రార్థనము 2. అరణి ప్రదానము.

3.1.1.3.5.1.1 ఉదక ప్రదానము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అశ్వమేద" పర్వము తృతీయాశ్వాసములో (21-70) గలదు. వరమును కోరి పొందినవాడు ఉదంకుడనుముని. వర ప్రదాత శ్రీకృష్ణుడు

భీష్ముని యపర క్రియలకు వచ్చిన శ్రీకృష్ణుడు ధర్మరాజాదుల కడ సెలవుగైకొని ద్వారకకు బయలుదేరెను. దారిలో "ఉదంక"మున్యాశ్రమమున నిలిచి మునిని దర్శించెను అతనినిమునిగౌరవించెను. భారత యుద్ధప్రస్తావన తరువాత ముని శ్రీకృష్ణుని విశ్వరూపమును చూపుమనికోరెను. చూపిన పిమ్మటనేదైన వరమును కోరుమని శ్రీకృష్ణుడే పలికెను. అప్పుడు ముని

వ॥ "దేవా యిది మరుదేశం బిచ్చట జలంబు దుర్లభంబు
నాకు జలసన్నిధి యెప్పుడుంగలుగ బ్రసాదింపుము"
(53) అని కోరెను.

శ్రీకృష్ణుడతని కోరికను విని

కం॥ — — — "నన్ను దలపగ
నననఘ దొరకును జలంబు లని పలికి" (54)

వెళ్ళిపోయెను. తరువాత కొంత సమయమునకు మునికి దప్పిక వేసి శ్రీకృష్ణుని తలచెను. వెంటనే ధనుర్బాణయుత హస్తుడును, దిగంబరుడును, మలిన దేహుడును నై శరీరమునుండి జలము కారుచుండిన యొక మాతంగుడు కనిపించెను. అతని చుట్టును కుక్కలుండెను. తన శరీరమునుండి కారుచుండిన జలముతో దప్పికనుతీర్చుకొనుమని దిగంబరుడుమునికి చెప్పెను. కానిముని సమ్మతించలేదు. మునిమీద కృపతో వచ్చినట్లు తెలిపినీటిని త్రాగుమని మరల దిగంబరుడు చెప్పెను. ముని కోపముతో నదలించెను. దిగంబరుడును కుక్కలును మాయమయ్యెను ముని యాశ్చర్యపడెను. శ్రీకృష్ణుడే దిగంబరుని వేషములో వచ్చి యుండునని తలచెను. అప్పుడే శ్రీకృష్ణుడువచ్చెను. తాను మునికి "అమృతము" నిమ్మని దేవేంద్రుని నడిగితిననియు, కానిమానవులకు దైవత్వము వలదని ఇంద్రుడు చెప్పెననియు, కాని తాను మరల రెండవ పర్యాయ మడిగితి ననియు, నప్పుడు "ఇంద్రుడు" తాను చండాలుని వేషములో వెళ్ళుదును, ముని"అమృతమును స్వీకరించడు దీనికి సాక్షినీవే" అని తనకు చెప్పి, ముని దగ్గరకువచ్చెననియు నిక తరువాతి విషయముతెలిసినదే కదా యని శ్రీకృష్ణుడుమునికి చెప్పెను. మరియు తా నిచ్చిన వరము వృథాకాకుండ జలమెప్పుడు నుండునట్లు చేసెదనని పలికె.

చం॥ "అనఘ జలంబు నీ వలసి నప్పుడ మేఘములీ మరుస్థలం
బుననొసగున్ భవద్యశము వొంపిరి వోవన్" (87)
అని పలికెను.

ముని ప్రీతుడయ్యెను. శ్రీకృష్ణుడు మాయమయ్యెను. అప్పటి నుండి

యా మరుదేశమున నా "ఉదంకమేఘము" లొక్కొక్క పుణ్యతిథు లందు కలిసి క్రమము తప్పకుండ నద్భుతముగ వర్షమును కురియు చుండెను.

3.1.1.3.5.1.2 అరణి ప్రదానము

ఈ వృత్తాంతము ఎఱ్ఱన భారత భాగము "అరణ్య" పర్వము సప్తమాశ్వాసము (459-464)లో కలదు. వర ప్రదాత యక్షుని రూపము లోని యమధర్మరాజు కాగా వరానుగ్రహమును పొందినవాడు ధర్మరాజు

జూదములో నోడిన పాండవులు నియమానుసారము "అరణ్య వాసమును" చేయుచుండిరి. యమధర్మరాజు, ధర్మరాజు ధర్మజ్ఞతను పరీక్షింపదలచెను. అందులకై యతడొక లేడిరూపమును ధరించి యొక బ్రాహ్మణుని "అరణి" ని కొమ్మునకు తగిలించుకొని పరుగిడెను. ఆ యరణిని తెచ్చి పెట్టుమని యా బ్రాహ్మణుడు పాండవుల నర్థించెను. వారు కొంతదూరము వెంటాడిరి. ఫలితము లేకపోయెను. వారొక చెట్టు నీడను చేరిరి. దాహము వేసెను. నీటికొరకు వరుసగా నకుల, సహదేవ అర్జున, భీములు వెళ్ళి తిరిగిరాలేదు. చివరకు ధర్మరాజు వెళ్ళి సోదరుల దుస్థితిని గమనించెను. అప్పుడు యక్షరూపములోని యమధర్మరాజు కొన్ని ప్రశ్నలను వేసెను. ధర్మరాజు వాటి కన్నిటికిని సమాధానము నొసగెను. పిదప ధర్మరాజు కోరికపై తాను యమధర్మరాజునని పరిచయము చేసికొని- "నన్నాశ్రయించిన జనంబులు దుర్గతిని పొందరు, కావున నభిమత వరమునిచ్చెద వేడు" మని యాదేశించెను. అంత ధర్మరాజు నమస్కరించి.

వ॥ దేవా మదీయాశ్రమ వాసుండైన భూసుర ముఖ్యునరణి యొక్క హరిణంబు చేత నపహృతం బయ్యెనతనికిం

గర్మలోపంబు గాకుండ నయ్యరణిం గరణింపవే యని (463) కోరెను.

ఆ యరణి మాయమగుటకు తానే కారకుడ నని ధర్మరాజు చిత్త వృత్తి నరయుటకై నట్లు చేసితినని యమధర్మరాజు పలికి "అరణి" నను గ్రహించెను.

3.1.1.3.5.2 ఆశ్రిత పోషణార్థము :-

ఆశ్రితులను పోషించుట రాజ ధర్మము. కాని యడవిలో నాశ్రితులను పోషించుట చాల కష్టము. వంట పాత్రలును నాహారపదార్థములును లభ్యముకావు. కావున వాటిని పొందుట యావశ్యకము. ఈ కార్యనిర్వహణార్థము ధర్మరాజు పొందిన పరికరములలో తామ్రస్థాలి యొకటి.

తామ్రస్థాలి ప్రదానము :-

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య" పర్వము ప్రథమాశ్వాసములో (35-43) గలదు. వరమును కోరిపొందిన వాడు ధర్మరాజు. వర ప్రదాత సూర్యభగవానుడు.

జూదములో నోడిన పిదప పాండవులు "అరణ్య" వాసమునకు కదలిరి. కొందరు ప్రజలు కూడ వారి ననుసరించిరి. అపుడు ధర్మరాజు "ఆశ్రితుల, అనుచరుల" పోషణ మెట్లని దిగులు పడెను. తన దుఃఖమును పురోహితుడగు ధౌమ్యునితో చెప్పకొనెను. అప్పడాతడు భీమ్మ, కార్తవీర్యాదుల కథలను ప్రస్తావించెను. సూర్యు నారాధించుమని యుపాయమును సూచించెను. అట్లే ధర్మరాజు "అష్టోత్తరశతనామములతో సూర్యు నారాధించెను. సూర్యుడు ప్రత్యక్షమై

వ॥ "ఈ పండ్రెండేండ్లును వన్యఫలమూల శాకంబులు నీ

మహానసనంబున ద్రుపద రాజపుత్రిచేత సాధితంబులై
యక్షయంబులైన చతుర్విధాహారంబు లగునని యొక్క
తామ్రస్థాలి యిచ్చి వరం బిచ్చెను" (43)

3.1.1.3.5.3. శత్రు జయార్థము :-

స్నేహ వైరములు లోకసైజములు.ఒకరికి మరొకరి పట్ల వైరము కలిగిన వేళ వినాశబుద్ధి జనించును. వినాశములో తమ్ము తాము రక్షించుకొనుటకు నుపాయము నాలోచింతురు. అట్టి వానిలో పురనిర్మాణము, మరణించిన వారు బ్రతుకవలెనను నాశ, యితరుల దగ్గరనున్న శక్తుల నపహరించుట జరుగును. ఇట్టివి నాలుగు గలవు. 1) కూపఖననము, 2) త్రిపుర నిర్మాణము 3) మయుని పుర నిర్మాణము 4) కర్ణునికవచ కుండల ప్రదానము.

3.1.1.3.5.3 1 కూపఖననము :-

ఈ వృత్తాంతము తిక్కన భారత భాగము కర్ణపర్వము ప్రథమాశ్వాసములో (264-265) గలదు. వరమును కోరిపొందిన వాడు హరి యను రాక్షసుడు. వరప్రదాత బ్రహ్మ.

హరి తారకాసురుని మనుమడు. తారకాక్షుని కుమారుడు. తారకాక్షుడు బంగారుపట్టణమున యధేచ్ఛగా రాజ్యమునేలుచుండెను. హరి బ్రహ్మనుద్దేశించి తపమ్ము చేసెను. ఎవరైనను యుద్ధములో చనిపోయునయెడల వాడు పదుగురగునట్లుగ నొక బావికావలయునని కోరెను. బ్రహ్మ హరి కోరికనుతీర్చెను.

3.1.1.3.5.3.2. త్రిపురనిర్మాణము :-

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము కర్ణపర్వము ప్రథమా

శ్వాసములో (257-267) గలదు. వరమునుకోరి పొందిన వారు విద్యున్మాలి, తారకాక్ష, కమలాక్షులు. వరప్రదాత బ్రహ్మ

తారకు డొక రాక్షసుడు. అతనిని దేవసేనాని కుమారస్వామి సంహరించెను. తండ్రి మరణమునకు తారకుని కుమారులు-విద్యున్మాలి, తారకాక్ష కమలాక్షులు ఖిన్నులైరి. ముగ్గురును కలిసి బ్రహ్మ సాక్షాత్కారమునకై తపమునుచేసిరి. బ్రహ్మ ప్రత్యక్షమై వరములను కోరుమని పలికెను. వారందరు నొక్క మాటగా

> వ॥ "మాకు ముప్వురకు మూడు పురంబు లెల్ల సుఖంబులుం గలిగి కామగమనంబులై దేవ దానవ యక్షోరగాది జాతులకుం జెఱుపరాక విలసిల్లు నట్లుగా నొసంగు మేము భవత్ప్రసాదంబు పెంపున నిర్భయులమై పెం పొంది సంచరించెదము" (261) అని వరమును కోరిరి.

బ్రహ్మ వారికోరికను మన్నించుచు సమాప్తి దశనుకూడ సూచించు డని వారినే యడిగెను. వారు మూడుపురములెప్పుడు దగ్గరకువచ్చునో బలవంతుడైన వాడెపుడు చెఱుపదలచునో యపుడ చెడునని తెలియ జేసిరి. బ్రహ్మయప్పుడు

> వ॥ "మీరు పురత్రయంబును సంపాదించు కొనుం డే నమ్మహానుభావంబులం బొందునట్లుగా నిచ్చితి నని (264) పలికి యంతర్ధానమయ్యెను.

3.1.1.3.5.3.3. మయుడు పురనిర్మాణము :-

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము కర్ణపర్వము ప్రథ

మాశ్వాసములో (2౯2_263) గలదు. వరమును కోరిపొందిన వారు విద్యున్మాలి, తారకాక్షుడు, కమలాక్షుడు. వరప్రదాత రాక్షసశిల్పి, విశ్వకర్మ, మయుడు.

విద్యున్మాలి, తారకాక్షుడు,కమలాక్షుడు తారకాసురుని పుత్రులు. వారు బ్రహ్మవరముతో పురనిర్మాణమునకు పూనుకట్టిరి. తత్సహాయార్థము రాక్షసశిల్పిమయుని వేడిరి. తపశ్శాలియగు మయుడు బంగారు, వెండి, ఇనుములోహములతో కూడిన పురములను నిర్మించెను. మొదటిది దేవలోకమునందును, రెండవది యంతరిక్షమునందును, మూడవది భూలోకమునందును సంచరించు సామర్థ్యము గలదు. బంగారు పురమునకు తారకాక్షుడు, వెండి పురమునకు కమలాక్షుడు. "అయో" పురమునకు విద్యున్మాలి రాజులైరి. పురత్రయ విహారముతో జగత్తు నాక్రమించుకొనిరి. వారి కెల్లవిధముల మయుడు సహకరించుచుండెను.

3.1.1.3.5.3.4. కర్ణుని కవచ కుండల ప్రదానము :-

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య పర్వము సప్తమాశ్వాసములో (358.375) గలదు. వరమును కోరిపొందిన వాడు ఇంద్రుడు. వరప్రదాత కర్ణుడు.

ఇంద్రుడు పాండవ పక్షపాతి. పైగా అర్జునుని తండ్రి. కర్ణుని వలన "అర్జును" న కెట్టివినాశనము కలుగకుండుటకై "ఇంద్రు"డొక పన్నాగమును పన్నెను. బ్రాహ్మణ వేషధారియై కర్ణుని కడకేగి కవచ కుండలమును దానముగా నడిగెను. వచ్చిన వాడు "ఇంద్రు" డని కర్ణుడు గ్రహించెను. అప్పుడు

వ॥ "దేవా యట్లయిన నఖిల శత్రుఘాతిని యైన నీ యమోఘశక్తి నాకుం గృపసేసి కవచ కుండలంబుల గొనుమని" (369) అభ్యర్థించెను.

ఇంద్రుడు తన "శక్తి" యాయుధ మొక శత్రువును మాత్రమే చంపి వెంటనే తనదగ్గరకు చేరునని స్పష్టము చేసెను. కర్ణుడందుకు సమ్మతించెను. ఆపత్కాలమున తప్పవ్యర్థముగా ప్రయోగించిన నపాయమగునని కూడ "ఇంద్రుడు" హెచ్చరించెను. కర్ణుడా షరతులకు లోబడి కవచకుండలములను దానముగా నిచ్చెను.

3.1.1.3.5.4. పాలనార్థము :-

డాబు దర్పము రాజులకెట్లో సిరిసంపదలు రాజ్యముల కవసరము. సిరిసంపలకు సభాభవనము చక్కని ప్రదర్శనశాల. అది సామంతుల కేంద్రము విదేశీయులురాకకు స్వాగతశాల. సకలసుఖదుఃఖములకు న్యాయశాల. దానికై సంపద వ్యక్తమైన సభను నిర్మించుట యానాటి రాజుల ధర్మము. అట్టివి రెండుకలవు, 1) మయనిర్మిత సభాంగణము 2) భగదత్తుని ఉపాయనములు.

3.1.1.3.5.4.1 మయనిర్మిత సభాంగణము :-

ఈ వృత్తాంతము నన్నయభారత భాగము సభాపర్వము ప్రథమాశ్వాసములో (2-14) గలదు. వరమును కోరిపొందిన వారు పాండవులు. వరప్రదాత మయుడు.

ఖాండవవన దహన సందర్భములో "అర్జునుడు" మయునకు శరణము నొసగెను. అందులకతడు కృతజ్ఞుడై "అర్జుననకు ప్రియ

మమును కలిగింపవలెనని తలంచెను. ధర్మరాజునిండు కొలువులోనుండగా మయుడు వచ్చెను. తాను దానవ విశ్వకర్మననియు, నవేక విధముల శిల్పకళా కుశలుడననియు, నిష్టమైన దానిని నిర్మించి యిచ్చెదన నియు తెలిపెను. అప్పుడు "అర్జునుని" సలహా మేరకు శ్రీకృష్ణుడు

చం॥ "కురుపతికిన్ యుధిష్ఠిరునకున్ సకల క్షితిపాల సేవ్యసు
స్థిర విభవాభిరామున కతి ప్రమదంబుగ రత్నరాజి సుం
దరమగు దానినొక్క సభ ధాత్రికపూర్వకముగా నొనర్చి చె
చ్చెర గొనితమ్ము (5) అని యాదేశించెను.

మయుడట్లే పదు నాలుగు నెలలతర్వాతనొక సభను రాక్షసులచే మ్మోయించుకొని వచ్చి ధర్మరాజునకు సమర్పించెను.

3.1.1.3.5.4.2 అర్జునునికి భగదత్తుని ఉపాయనవరము :-

ఈ వృత్తాంతము నన్నయభారత భాగము సభాపర్వము ప్రథమాశ్వాసములో (229-234) గలదు. వరమును కోరిపొందిన వాడు "అర్జునుడు". వరప్రదాత భగదత్తుడు.

ధర్మరాజు రాజసూయ యాగమును చేయ తలపెట్టెను. నలుగురు తమ్ములను నాలుగు దిక్కులకు పంపెను. అర్జునుడు "ఉత్తరము" వైపు కదలెను. ఎందరో రాజులను జయించి కప్పములను గొనెను. ఆపై ప్రాగ్జ్యోతిష్యమును సమీపించెను. ఆ పురాధి పతి నరకాసురుని కొడుకగు భగవత్తుడు. అర్జునునకు భగదత్తునికి నెనిమిది రోజులసమరము సాగినది. భగదత్తు డోడిపోయెను. తానింద్ర సఖుడగుటచే అర్జుననితో యుద్ధమును చేయుట తగదని పలికి

కం॥ "ఏ నోడితి జెప్పు మెచ్చి యిష్టము నీకున్" (231) అనెను.

అంత "అర్జునుడు" నిరంతర ధర్మశీలుడగు ధర్మరాజు రాజసూయ యాగమునకు కానుక లొసగుమని యాదేశించెను. భగదత్తుడంగులకు సమ్మతించెను.

3.1.1,3.5.5. అలంకారార్థము :-

ప్రాచీన హైందవ నాగరికతలో "అలంకారము" స్త్రీలకే కాదు, పురుషులకు కూడ విధేయమే. అలంకారములో సౌమంగల్యము ప్రధానాంశము. పైగా విశిష్టవ్యక్తి దత్తములైన "అలంకారము" లకు మహిమలుండుటయు సహజమే. ఇవి రెండు 1) ఇంద్రకుండలములు. 2) పౌష్యమహాదేవి కుండలములు.

3.1.1.3.5.5 1 ఇంద్రకుండలములు :-

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము విరాట పర్వము చతుర్థాశ్వాసములో (104-168) గలదు. వరమును కోరిపొందిన వాడు "అర్జునుడు". వరప్రదాత "ఇంద్రుడు"

బృహన్నల వేషములో నుండిన "అర్జునుడు" "ఉత్తర గోగ్రహణము" నకు రథసారథిగా వెళ్ళదలచెను. రథనాగలపై నధివపించెను రథికునిగా "ఉత్తరుడు" రథము నధిరోపించెను. బృహన్నల రథమును శమీవృక్షము కడకు తోలుకొని వెళ్ళెను. చెట్టుపైకెక్కి యాయుధముల నందివ్వుమని ఉత్తరుని చెప్పెను ఉత్తరు డందిచ్చిన గాండీవ, అక్షయ తూణీరతనుత్రాణ, కృపాణములను తీసికొనెను. నియతాత్ముడై "అధిదేవత"లకు ప్రణమిల్లి, భక్తి భావముతో వాటినిధరించి,

ప్రకాశవంతమైన గొప్పయాకారమును పొందెను. పిమ్మట పూర్వము

కం॥ "బలరిపు డిచ్చిన కుండల
ములు నుష్ణీణంబు జిత్తమున భక్తిమెయిం
దలప నవి వచ్చెను" (164)

వాటిని ధరించెను. మహారథికు డయ్యెను. ఉత్తరుని సారథిగా నుండు మని చెప్పెను. ఉత్తర గోగ్రహణమునకు బయలు దేరెను.

3.1.1.3.5.5,2 పౌష్యమహాదేవి కుండలము :-

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వము ప్రథమాశ్వాసములోను (92-112), తిక్కన భారతభాగము "అశ్వమేధ" పర్వము తృతీయాశ్వాసములోను (87-112) గలదు. కథాభాగ మించు మించుసమానము. వరమును కోరిపొందినవాడు ఉదంకుడను ముని. వరప్రదాతలు పౌష్యమహారాజు, నంని భార్య.

ఉదంకముని గురుదక్షిణార్థము పౌష్యమహారాజు భార్యకుండలములకై రాజుకడకు వెళ్ళియర్థించెను. ఆరాజు మునికోరికను సమ్మతించెను. అంతఃపురముననున్న తనభార్యను కోరుమని యాదేశించెను ఉదంకుడంతః పురమునకు వెళ్ళెను. కాని యామె కనబడలేదు. అతడు వెనుదిరిగి రాజు కడకు వచ్చి విషయమును చెప్పెను. ఆచమించి వెళ్ళిన కనబడునని రాజుతెలిపెను. ఉదంకు డాచమించి యంతఃపురమునకు వెళ్ళెను, రాజు భార్యకనబడెను. తనయభిమతమును తెలిపెను. ఆమె తనకుండలముల నిచ్చి, తక్షకనాగేందుృడీ కుండలముల నపేక్షించెను. కావున జాగ్రత్తగా తీసికొని వెళ్ళుమని చెప్పెను.

నన్నయ్య,తిక్కన భారత భాగములలో నీ కథ పట్లకొన్ని మార్పులున్న వి నన్నయ భాగము ప్రకారము ఉదంకుడు పైల శిష్యుడు. తిక్కన భాగము ప్రకారము గౌతమ మునిశిష్యుడు. నన్నయ భాగములోని రాజుపేరు పౌష్యమహారాజు. తిక్కన భాగములోని రాజుపేరు సౌదాస రాజు. మునియడుగగానే రాజుభార్య నమస్కరించి యిచ్చుట నన్న యలో కనిపించగా, భర్తవనుపున కుండలముల నిచ్చుట తిక్కనలో కనిపించును.

3.1 1.4. మనస్తత్వానుబంధి వరములు :-

మంచికి. చెడుకు మనసే మూలకందము. తనకోసము, తనవా రికోసము వ్యక్తిపూనుకొనే స ప్రయతములలో మను కీలకస్థానమును వహిస్తుంది. అది "అనుమతి"కావచ్చు ను"అభయము"కావచ్చు కృపకా వచ్చు, సందేహ నివృత్తి కావచ్చు. సమయరూప ప్రార్థనము కావచ్చు కృతజ్ఞత కావచ్చు.

3.1.1.4.1 అవతరణ :-

అవతరణమనగా దిగుట అని అర్థము. దేవతలు మర్త్యవాసుల ప్రార్థన నాలించి దిగుటయు అవతరణమే.మహాభారతమునగల గంగా వతరణ మిట్టిది.

గంగావతరణము :-

ఈ వృత్తాంతము నన్నయభారత భాగము "అరణ్య" పర్వము తృతీయాశ్వాసములో (76 84) గలదు. వరమును కోరిపొందినవాడు భగీరథుడు. వరప్రదాతలు ఆకాశగంగాదేవి, నీలకంఠుఖ

కపిల మహాముని క్రోధవీక్షణములతో సగరు డను రాజపుత్రులు దగ్ధులైరి. వారి వంశమున భగీరధుడు జనించెను. అతడు వారికిస్వర్గ లోకప్రాప్తి కలుగు నట్లు చేయదలచెను. అందుకై హిమ వత్పర్వ తముకు వెళ్ళి ఆకాశగంగా దేవినుద్దేశించి హర తపశ్చర్యను సాగిం చెను. "అతని తపస్సునకు మెచ్చిన "ఆకాశగంగాదేవి" ప్రత్యక్షమై "నీయిష్టమును చెప్పు" మనెను. అప్పుడు భగీరధుడు నమస్కరించి తనయుద్దేశ్యమును చెప్పి

సీ॥ "కావవ దేవి యుద్దేవ పథము
నం దుండి వసుమతి కొందంగ జనుదేర
వలయు" (80) ననికోరెను.

అప్పుడు "ఆకాశగంగా" దేవి యతనికి

సీ॥ ............... "మహీవలయమునకు

ఆ. వె॥ నేను వచ్చు నప్పుడు నా నిరంతర జలౌ
ఘంబు దాల్ప నీలకంఠు డోపు
గాని యొరులు దాల్పగా నోప రయ్యుమా
నాథు కరుణ బడయు నన్ను దాల్ప" (80)

అని తెల్పెను.

వెంటనే భగీరథుడు కైలాస పర్వతమునకు కదలెను. ఈశ్వరు నుద్దే శించి యచట చాలకాలము తపస్సును చేసెను. అతనికి శివుడు సన్ని హితుడై.

వ॥ "నీవు భూలోకంబునకు గంగావరతరణంబు సేయు మేను
గంగ ధరియించెద" నని (81) వలికెను.

భగీరథుడు మరల "ఆకాశగంగ" నారాధించెను. అమెయతనిపై కరుణించి యాకాశము నుండి తరంగ సమూహములతో క్రిందకుదూకెను. ఆ నీటిని శివుడు జడల సమూహము గల తనతలపై ధరించెను అప్పుడు సురముని సిద్ధఖేచరులు వచ్చి యాదృశ్యమును చూచి యాశ్చర్యపడిరి. ఆకాశగంగ శివుని తలపై నుండి మెల్లగా భూమి మీదకు వచ్చి ప్రవహించుచు దగ్ధమైన సాగరులభస్మమును.తడిపెను దానివలన సాగరులకు పుణ్యలోకములు కలిగెను.

3.1.1.4.2 అనుమతి వరములు :-

"అనుమతి" అనగానొకపనినిచేయ సమ్మతించుటయని భావము. ఆంధ్ర మహాభారతములోని "అనుమతి" వరములను మూడు వర్గములుగా విభజింపవచ్చును. ఇవి. 1 యాగానుమతి 2) సమరానుమతి 3) మరణాను మతి వరములు.

3.1.1.4.2.1, యాగానుమతి వరము :-

ప్రాచీనకాలమున యజ్ఞయాగాదులకు ప్రాధాన్య మెక్కువ యజ్ఞయాగాదులనుచేయ పెద్దలను కోరుట పిన్నల సంప్రదాయము.

ధర్మరాజు యాగానుమతి :-

ఈ వృత్తాంతము నన్నయ భారత భాగము సభాపర్వము ప్రథమా శ్వాసములో (87-109) గలదు. వరము ను కోరి పొందిన వాడు ధర్మరాజు. వరప్రదాత శ్రీకృష్ణుడు.

పాండురాజు పితృలోకమున నుండెను. అతనికి హరిశ్చంద్రాదులవలె స్వర్గమున సుఖముననుభవింపవలెనను కోరికను తన కుమారు

డగు ధర్మరాజుకు తెలుపుమని నారదునితో పాండురాజు స్పష్టము చేసెను. నారదు డీ వార్తను ధర్మరాజునకు తెలియ జేసెను. అ మాట లను వినిన ధర్మరాజు పితృదేవతలకు మేలగు నట్లు సత్క్రతువులను చేయవలయునని తలంపు తనకును కలదు దనియు, కానియది నిరా టంకముగా నేరవేరునా? యను ననుమానమున్న దనియు చెప్పెను. అప్పుడు పురోహితుడగు ధౌమ్యాదులు రాజసూయ యాగమును చేయు మని ధైర్యమును చెప్పిరి. ధర్మరాజు వారి మాటలనువిని రాజసూయ యాగము నిర్విఘ్నముగ నెరవేరవలయునన్నచో వాసుదేవుడోపును గాని యన్యుల కశక్యమని పలికెను. వెంటనే శ్రీకృష్ణుని పిలిచికొని రమ్మని ద్వారకకు నాప్తచరులనుపంపెను. శ్రీకృష్ణుడు వచ్చెను. ధర్మ రాజతనిని గౌరవించెను. అందరి సమక్షమున తన తండ్రి పాండురాజు సందేశమును, నేతత్కార్యార్థము నారదుడు వచ్చుటనుచెప్పెను. పైగా తాను గూడ రాజసూయ యాగమును చేయుతలంపుతో నున్నట్లు విశదపరచి, శ్రీకృష్ణుని

ఆ.వె|| .... .... ....నీ నియోగ
కాంక్ష నున్నవాడ గమలాక్ష యని" (108)
చేతుల జోడించెను.

అప్పుడు శ్రీకృష్ణుడు

కం|| "కురు వృషభ సర్వ గుణముల
సురుచిర తేజమున రాజసూయాఖ్య మహా
ధ్వరమునకు నీవ యర్హుడ
వరిసూదన శౌర్యు లయిన యనుజుల బలిమిన్. (109)

అని ధర్మరాజునకు విశ్వాసమును కలిగించెను. తరువాత ధర్మరాజు నాజ్ఞతో భీమార్జు నతకుల సహదేవులు నలుదిక్కులకు కదలి, ధన కనక వస్తువాహనాదులను తెచ్చిరి. శ్రీకృష్ణుడును చేదోడు వాదోడై యాగ్గ మును పరిసమాప్తి చేయించెను.

3.1.1.4.2.2 సమరానుమతి వరములు :-

సమర మనగా యుద్ధము. సమానుల మధ్యసమరమునకు నను మతి యవసరములేదు. కాని కురుపాండవ సమర మట్టిదికాదు. పెంచి పెద్దచేసిన వారితో కయ్యము. విద్యాబుద్ధుల నేర్పినవారితో కయ్యము. కనుక సమరానుమతి యవసరము. ఈ యనుమతిని ప్రసాదించినవారు భీష్మ ద్రోణానులు.

3.1.1.4.2.2.1 ధర్మరాజునకు భీష్మ ద్రోణ కృపాచార్యుల సమరానుమతి

ఈ వత్తాంతము తిక్కన భారతభాగము భీష్మపర్వము ప్రథమా శ్వాసములో (150-161) గలదు. వరమున్ను కోరిపొందిన వాడు ధర్మ రాజు. వర ప్రదాతలు భీష్మ ద్రోణులు

కురుక్షేత్రమున రెండుసైన్యములును యుద్ధమునకు సిద్ధమై నిల్చెను. అప్పుడెవ్వరికిని చెప్పకుండ ధర్మరాజునడచి యెదుటిపక్షమున నున్న భీష్ముని దగ్గరకు వెళ్ళెను. అతని వెంట శ్రీకృష్ణభీమార్జున నకుల సహదేవులు వెళ్ళిరి. ధర్మరాజు భీష్ముని పాదములకు నమస్కరించి

ఆ. వె॥ అనఘ నీ కెదిర్చి యనిసేయు వాడనై
మఱి ప్రసన్నుఁ గొనఁగ నిన్నుఁ గాన

నెమ్మి వచ్చినాఁడ నీచేత దీవన
వడసి చనియెద నేను బగఱ గెలుతు" (156) ననివేడెను.

ఆ మాటలకు భీష్ముడు సంతసించి యిట్లురాకున్నచో శాపము నిచ్చెడ వాడనని పలికెను. పాండవుల పక్షమున యుద్ధమును చేయుఁటతక్క మరి యే వరమునైన నిచ్చెదను చేఁడుమనెను. అప్పుడు ధర్మరాజు భీష్ముని రారాజు పక్షమై రణమును చేయుచు తనకు హితమగు కార్యమును మనస్సులో తలంపుమని కోరెను. ఆ మాటలకు భీష్ముడు సమ్మతించెను. పిమ్మట ద్రోణాకృపాచార్యు లనుమతినిచ్చిరి.

3.1.1.4.2.2.2 కర్ణునకు భీష్ముని సమరానుమతి

ఈ వృత్తాంతము తిక్కనభారత భాగము భీష్మపర్వము తృతీయాశ్వాసములోను (449-453), ద్రోణపర్వము ప్రథమాశ్వాసములోను (39-51) గలదు. వరమును కోరిపొందినవాడు కర్ణుడు. వరప్రదాత భీష్ముడు.

భీష్ము డంపశయ్య మీద పరుండి యుండెను. దుర్యోధనాదులును, పాండవులును వెళ్ళపలుకరించి వెళ్ళిరి. పిమ్మట నేకాంతముగ కర్ణుడు భీష్ముని దగ్గరకు వెళ్ళెను. భక్తివినయ భావములతో భీష్ముని పాదములకు నమస్కరించి

ఆ. వె॥ "అలుక దక్కి నన్ను నధిక వాత్సల్యశీ
తలము గాగ జూచి తగిన మాట
లాడవే మహాత్మ" (441) అని ప్రార్థించెను.

అప్పుడు భీష్ముడు గౌరవముతో కర్ణుని తన దగ్గరకు పిలిచెను. ఒక్క

చేతిలో నతనిని కౌగలించుకొనెను. అచట మన్న భటులను దూరముగ వెళ్ళుడని చెప్పి కర్ణునితో

కం॥ "నీదెస గోపించుతు నె కుల
భేదముగా బలుకుటయును బిడ్డల జెఱుపం
గా దని కినియుదు లే దన
రా దలతును నిన్ను నిష్ఠురంపు బలుకులన్" (443)

"అదిశిక్షగాని రోషంబు గాదు" (444) అని చెప్పెను. అప్పుడే భీష్ముడు కర్ణుని జన్మరహస్యము నతనికే చెప్పి, శ్రీకృష్ణుని సహాయమున్న పాండవులవైపు వెళ్ళుమనెను. దానికి సమాధానముగా నీ యుద్ధసమయములో పాండవుల వైపువెళ్ళుట మంచిది కాదనియు, సర్వము దైవాధీనమనియు కర్ణుడు తెల్పి

శా॥ "నీ వింకన్ వను వొండు షల్కక ధరానీకంబు పై బంపు మ
త్సేవా ధర్మము నిర్వహించెద" (451) అని ప్రార్థించెను

కర్ణుని ప్రార్థనను విని భీష్ముడు

చం॥ ................"అంతకు జాలు తెలుంగవే సుయో
ధనునకు నెప్డు నీదు భుజదర్పము కాదె సహాయమెద్ది యా
తనికి ప్రియంబుదానిన యుదాత్తమతిం దగనాచరింపు నీ
మనమున సంతసిల్లు మమమానము దక్కు మనుజ్ఞ
యిచ్చితి న్ (425)

వ॥ "అని తెలి వొంది పలికెను" (453)

3.1.1.4.2.3 మరణానుమతి పరము :-

శివుని యాజ్ఞలేక చీమైన చావదని సామెత. భగవంతుని యాజ్ఞ

లేక ప్రాణి యనుగతి బాయవీలులేదు. కాని భీష్మునికి "ఇచ్ఛా మరణ" మున్నది! కురుపాండవుల వైరముతో భీష్ముడు క్రుంగినాడు. అంప శయ్యపై పరుండినాడు. ఇక భగవత్స్వరూపుడైన శ్రీకృష్ణుని యాజ్ఞ కొఱకువేచి యుండి మరణానుమతిని కోరినాడు.

భీష్మునకు శ్రీకృష్ణుని యనుమతి :-

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వము పంచమా శ్వాసములో (461-468) గలదు. వరమును కోరి పొందిన వాడు భీష్ముడు. వరప్రదాత శ్రీకృష్ణుడు.

ఉత్తరాయణ పుణ్యకాలము వచ్చెను. అంతధర్మరాజు గాంధారీ ధృతరాష్ట్రులను, కుంతిని, శ్రీకృష్ణుని, సాత్యకిని, తనతమ్ముళ్ళను, విదు రుని, సంజయుని, ధౌమ్యుని, నితర వృద్ధబ్రాహ్మణులను పిలిచికొని భీష్ముని దగ్గరకు వెళ్ళెను. అతనికి తామువచ్చినట్లు తెలిపి నమస్క రించెను. భీష్ముడందరిని పలుకరించెను. ధృతరాష్ట్రుని నోదార్చి నీతి వాక్యములను తెలిపెను. శ్రీకృష్ణునిచూచి స్తుతించి, నమస్కరించి

ఆ.వె॥ బలము నీవ నాకు భక్తుడ నీ యెడ
నాలు బిడ్డ లేని యట్టివాడ
గావు నన్ను నధిక కారణ్యమున నిమ్మ
నుట్టు గమలదళ మనోజ్ఞ నయన" (463)

అని ప్రార్థించెను.

శ్రీకృష్ణుడు భీష్ముని నాదర భావముతో చూచి

వ॥ "నీకు నేననుజ్ఞ యిచ్చితి వసువులం బొందుమనెను" (468) భీష్ముడు శ్రీకృష్ణుని మాటలను విని పరమా నందపడెను. పాండు

నందనులను, ధృతరాష్ట్రుని, నితరులను చూచి "మీచేతననుజ్ఞాతుడను గదా" అని యడిగెను. అందరిని భీష్ముడుకౌగలించుకొనెను. సత్యమును నిత్యముపాటించి బ్రదుకుడని చెప్పి బ్రహ్మరంధ్రమున ప్రాణమును విడిచెను,

3.1.1.4.3 అభయ వరములు :-

అభయమనగా భయములేమి. అనగా భయపడకుమని చూపెడు హస్తముద్ర. అభయ ప్రదానముచేయువారు దేవతలు కావచ్చును, లేదా విశిష్టవ్యక్తులు కావచ్చును. ఇట్టివి ఆంధ్ర మహాభారతములో "ఆఱు" గలవు. ఇవి బ్రహ్మ, ఇంద్ర, అగ్ని, ధర్మరాజు, అర్జునవరములు

3.1.1.4.3.1 బ్రహ్మవరములు :

దేవతల భయమును పోగొట్టుట, చార్వాకుని సంప్రార్థనమునకు "సై" అనుట బ్రహ్మయిచ్చిన వరములు.

3 1.1.4.3.1.1 దేవతల సంప్రార్థనము :-

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతిపర్వము ద్వితీయాశ్వాసము (198-205)లో కలదు. వరమును కోరినవారు దేవతలు కాగా "అనుగ్రహించిన" వాడు బ్రహ్మ.

కృతయుగమున మానవులు ధర్మపరులై జీవించుచుండిరి. వారికి రాజరక్షణము లేదు. కాని వారిలో దైన్యమేర్పడగా క్రమముగా లోభ కామాదులు పెరిగినవి. వేద విధ్వంసకులై విచ్చలవిడి సంచరింప సాగిరి. ఈ పరిస్థితికి దేవతలు దిగులుచెందిరి. బ్రహ్మకడకు వెళ్ళి

వ॥ మనుజ లోకంబున వేదంబులు ధర్మంబులుం బొడవడంగిన
నధ్వర రాహిత్యంబున నేమును దుర్బలులమై
భయంబంది వచ్చితిమి రక్షింపుమని (203) కోరిరి.

దానికి బ్రహ్మ ప్రతి విధానమును చేసెదనని నూరువేల యధ్యాయములతో నీతిశాస్త్రమును రచించి దేవతలకిచ్చెను. ఇంద్రుడా గ్రంథమును "ఐదు"వేల యధ్యాయములకు కుదింపగా శుక్రాచార్యుడు వేయి యధ్యాయములకు పరిమితముచేసెను. ఇదియు మానవుల శక్తికి చాలదని సంక్షిప్తరూపము చేసిరి. ఈ సంక్షిప్త గ్రంథములతో మానవులు యాగాదులనుచేసి దేవతలను సంతృప్తి పరచిరి.

3.1.1.4.3.1.2 చార్వాకుని సంప్రార్థనము

ఈ వృత్తాంతము తిక్కనభారత భాగము శాంతి పర్వము ప్రథమాశ్వాసములో (369) గలదు. వరమును కోరిపొందిన వాడు చార్వాకుడు అను పేరుగల రాక్షసుడు. వరప్రదాత బ్రహ్మ

కృతయుగమున "చార్వాకుడు" అనుపేరుగల రాక్షసుడు బ్రహ్మనుద్దేశించి తపస్సును చేసెను. బ్రహ్మప్రత్యక్షమయ్యెను. అప్పుడు చార్వాకుడు "అఖిల భూతముల వలనను నభయంబు వేడెను" (369) బ్రహ్మదేవుడతని వేడికోలునువిని

వ॥ "భూదేవతల కనిష్టంబులైన పనులు సేయకుండు వాడవు సేచితేని యదియ నీకు దుది యని పలికి యవ్వరం బొసంగెను (369).

3.1.1.4.3.2 ఇంద్రవరము :-

ఇంద్రుడు త్రిలోకాధిపతి. సమస్తచరాచర ప్రకృతినిరంజించుట యతని కర్తవ్యము. సురభిమాత కోరికనుమన్నించుట ఇంద్రవరము.

సురభిమాత సంప్రార్థనము :-

ఈ వృత్తాంతమునన్నయ భారత భాగము అరణ్య పర్వము

ప్రథమాశ్వాసము (82-86)లో కలదు. పరప్రదాత ఇంద్రుడు కాగా "అనుగ్రహమును" పొందినది సురభిమాత.

సురభి గోమాత అ సురభి తన సంతానమునకు కలుగు కష్టము లను చూచి యెద్దులలో బలహీనమగు నెద్దులను కట్టిమానవులు చాల పీడించుచున్నారని తనబాధను ప్రకటించు కొనినది. అంత "ఇంద్రుడు" నీకు నీప్రధాన సంతానమునకు వజ్రాయుధబాధలేదుకదా యనియను నయించెను. కాని యావులకు నెద్దులకు నాహారము లేకుండుటనుసురభి గుర్తుచేసినది. అప్పుడు ఇంద్రుడా మాటలకు నవ్వి

వ॥ వర్షంబున దృణవర్ధనంబు సేసి దుర్బల బలీవర్థంబులకు బలము గావించెను" (86)

3.1.1.4.3.3 అగ్ని వరము :-

దేవతలలో "అగ్ని"కి నగ్రతాంబూలమున్నది."అగ్ని ముఖాపై దేవాః" అని శ్రుతిః అ "అగ్ని"ని ప్రార్థింపగా నభయమిచ్చుట అగ్ని వరము.

సహదేవసంప్రార్థనము

ఈ వృత్తాంతము నన్నయభారత భాగముసభాపర్వము ప్రథ మాశ్వాసములో (246 260 గలదు. అభయమొసగిన వాడు "అగ్ని" ఫలమునసుభవించిన వాడు సహదేవుడు.

ధర్మరాజు రాజసూయ యాగమును చేయతలపెట్టెను. తమ్ములు నలుగురు నలుదిక్కులకు కదలిరి, సహదేవుడు దక్షిణపై పు కదలెను. అతని విజయపరంపరలో సుమిత్ర, శూరసేన, దంతవక్త్ర, జంభక, విందానువిందు లోడిపోయిరి. చివరకు సహదేవుడు "మాహి

ష్మతీ" పురమునకు చేరెను. అంతమంటలు మింట దాకినవి. సహ దేవుడు చలించెను, దర్భశయనుడై అగ్ని సూక్తములతో

సీ॥ "నీతదర్థంబులై నిఖిల వేదంబులు
వర్తిల్లు లోకపావనము లగుచు
బావనంబులలోన బావనుండవు నీవ
యజ్ఞంబులును నీవ హవ్యవాహ
ధర్మనిత్యండైన ధర్మజు కావించు
క్రతువు భవత్ప్రీతి కరము గాదె
దానికి విఘ్నంబు దలచుట ధర్మమె
వరద వైశ్వానర వాయుమిత్ర" (259)

అని నుతించెను. అగ్ని దయాళుడై మంటల నుపసంహరించుకొనెను. నీలు డీ దృశ్యమును గాంచెను. సహదేవునికి నతిథి సత్కారముల జేసి కానుక లిచ్చి పంపెను.

3.1.1.4.3.4 జంతుజాల సంప్రార్థనము

ధర్మరాజు వరము :-

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగములో "అరణ్య" పర్వము షష్ఠాశ్వాసమున (98-101) కలదు- వరమునడిగినది ద్వైతవనమందలి జంతుజాలము. అభయమిచ్చిన వాడు ధర్మరాజు.

పాండవులు తీర్థయాత్రలను ముగించుకొని ద్వైత వనమున నిరువది నెలలు వసించిరి. ఆ కాలమున వారు ప్రతిదినము వేటాడు చుండెడివారు. భయంకర మృగయావ్యాపారములో సాధు జంతువుల కును మరణము తప్పలేదు. ఒక రోజు ధర్మరాజు నిదుర పోవుచుండెను,

అప్పుడొక కలవచ్చినది. ఆ కలలోవనమందలి జంతువులన్నియువచ్చి కన్నీటిని కార్చుచు

సీ॥ ధర్మాత్మ మీరు నిత్యంబు గడగి
చంపంగ జంపంగ సమసి యల్పావశే
షము లయ్యె నిప్పుడస్మత్కులంబు

తే.గీ॥ లేము బీజమాత్రముధక్కి యిట్లు వనరు
చున్న వారము మీరింక నొందు గడకు
నరిగి మము గావరే కరుణార్థబుద్ధి" (98) నని ప్రార్థించెను.

అంత కలలోనే ధర్మరాజు

తే.గీ॥ అట్ల గా కని వాని కభయ మిచ్చెను" (198)
కల కరిగిన తర్వాత ధర్మరా జీ వృత్తాంతమును తమ్ములతో చెప్పివారి నొడంబరచి కామ్యక వనమునకు కదలెను.

3.1.1.4.3.5 సైనికకులసంప్రార్థనము

అర్జునుని వరము

ఈ వృత్తాంతము తిక్కనభారత భాగము విరాట పర్వము. పంచమాశ్వాసము (221-226) లో కలదు. వరప్రదాత "అర్జునుడు" కాగా అభయమును పొందిన వారు సైనికులు.

పాండవులు విరాటుని నగరమున "అజ్ఞాత" వాసమును గడుపు చుండిరి. ఇంతలో కౌరవులు "ఉత్తరదక్షిణ" గోగ్రహణములకు సమ కట్టిరి. ఉత్తర గోగ్రహణ సందర్భములో సారథి యెవరును లేక పోయిరి. చివరకు బృహన్నల "ఉత్తరు" నికి సారథియయ్యెను. కౌరవ

సైన్యమును జూచి ఉత్తరుడు భయపడగా చివరకు "అర్జును" డే యుద్ధమును నడిపివిజయమును పొందెను. ఇంతలో విరాటనగసముున సుధేష్ణాదులు కలవర పడసాగిరి. అర్జునుడు రథమును వేగముతో నడుపుమని యాదేశించెను. విజయగర్వము, పుర తిరోగమనము జత కాగ "ఉత్తరుడు" రథమును వేగముగా నడపెను. కాని సైనికు లా వేగమును నను సరించ లేకపోయిరి. వారు "అర్జునుని" చూచి

తే. గీ॥ "....................భయమున

ప్రాణ దానంబు వేడిరి (225)

వారి వేడి కోలునువిని "అర్జునుడు" "అభయహస్త" మిచ్చివారి వ్యధనుతీర్చెను.

ప్రధాన సేనానిని నెట్టిపరిస్థితిలోను సైనికు లనుసరింప వలెనని నియమము. అట్లనుసరింపక పోయిన యెడలసైనికులు శిక్షార్హులు.కనుక "అర్జునుడు" సైనికులకు నభయ మిచ్చుటతగినది.

3.1.1.4.4 కృపా వరములు ;-

కృపయనగా కనికరము, దయ అని యర్థములు. ఆంధ్ర మహాభారతములలో కృపావరములు 19 కలవు.వీటిని దైవ,మహర్షి,మర్త్యుల కృపావరము లని వర్గీకరించ వచ్చును. కృపకు బీజ భూతమైనది సంప్రార్థనము. ఈ సంప్రార్థనము లోకముకొఱకో, తనవంశము వారికో, తనకో కావచ్చును. ఎదుటి వ్యక్తి ప్రార్థనతో వారి నాదరించుట వారి కోరికను తీర్చుటయిందలి సహజతత్త్వము

3.1.1.4.4.1 దైవ కృపావరములు:-

భగవత్కృప యవ్యాజమైనది. సద్యఃఫలితము నిచ్చెడిది

కరుణా తరంగితమైనది. ఇట్టివి "ఆఱు" కలవు. నరనారాయణుల మాహేశ్వర, శ్రీకృష్ణ, ఇంద్ర, అగ్ని, గరుత్మంతుని కృపావరములు

3.1.1.4.4.1.1 నరనారాయణుల వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము భీష్మపర్వము ద్వితీయాశ్వాసము (262-269)లో కలదు. వరమునుకోనవాడు బ్రహ్మ కాగా వరప్రదాతలు నరనారాయణులు

మానస సరోవర సమీపమున బ్రహ్మ కొలువు తీరి యుండెను. అప్పుడచటికి మణిగణోజ్వలమైన విమానమొకటి వచ్చినది. ఆ విమానమున నరనారాయణు లుండుట తెలిసికొని, బ్రహ్మలేచి నమస్కరించి ప్రస్తుతించెను. నారాయణుని ప్రక్కన గల నరుని కూడా గుర్తించి ప్రస్తుతించెను. మర్త్యలోక మా సమయమున మహాసురలచే పీడితమని తెలిపి యాలోకమును కాపాడుట కొఱకు నారాయణుని

కం|| ——— - "నీవు కరుణా

యత్తమతిం బుట్టవయ్య యదువంశమునన్ (267)

అని వేడెను. మరియు

కం|| "నర సఖుడ నీవు సఖుడును

నర లోకమునన్ జనించి నానా, దైత్యే

శ్వరుల దెస బీడ లుడపుము

ధరణీ భారంబు వాయ తాత్పర్యమునన్ (268)

వ|| "అని వేడి కొనెను" (269)

నారాయణుడు సంతోషముతో చూచి

వ|| అట్లయయ్యెడుం గాకయని యానతిచ్చి యంతర్ధానమ

య్యెను" (269)

పిమ్మట నా నరనారాయణులే శ్రీకృష్ణార్జునులుగా నవతరించిరి.

3.1.1.4.4.1.2 మాహేశ్వర వర ము:-

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వము చతుర్థాశ్వాసములో (442) కలదు, కాపాడుమని కూయిడిన వాడు చంద్రుడు కాగా కృపావర్షమును కురిపించిన వాడు శివుడు.

దక్ష ప్రజాపతి యొకసారి యాగమునుచేయ నమకట్టెను. దేవ తల నందరిని నాహ్వానించెను. కాని శివుని పిలువలేదు. సతీదేవి కిని యుటతో శివుడుయజ్ఞసీమకు వెళ్ళెను. యాగమును ధ్వంసము చేయ సాగెను. యజ్ఞవాటిక సర్వనాశనముయినది. అక్కడి వా రందరు పలాయనము చిత్తగించిరి. ఆ తొక్కిసలాటలో శివుని కాలిక్రింద పూర్ణ చంద్రుడు "వంకర" యయ్యెను. కాలి క్రింద నలగిన చంద్రుడు శరణమును వేడెను. అపుడు శివుడు తన కాలక్రింద నలగిన చంద్రుని వికృతాకారమునకు బాధపడెను. తనదురితముపోగార్ప నా చంద్రుని తలపై నిడికొనెను.

3.1.1.4.4.1.3. శ్రీకృష్ణ వరములు :-

శిశుపాలుని యపరాధశత క్షమాపణ, మృతజన్ముడైన పరిక్షితుని బ్రతికించుట యీ భాగమున చేరును.

3.1.1.4.4.1.3.1 సాత్వతికి:-

ఈ వృత్తాంతము నన్నయభారత భాగము సభాపర్వము ద్వితీయాశ్వాసములో (52-68) లో కలదు. క్షమనర్థించినది సాత్వతి క్షమాభిక్షను పెట్టిన వాడు శ్రీకృష్ణుడు.

తమఘోషుడు చేది వంశాధిపతి. అతనిభార్య కృష్ణుని మేనత్త సాత్వతి. ఆ దంపతులకు విచిత్రశిశువు కలిగెను. లలాటమున నేత్రము మరియు నాలుగు చేతులు. శిశుదర్శనముతో తల్లిదండ్రులు భయపడిరి అపుడు "ఆకాశవాణి" వీని నెవరెత్తుకొనినప్పుడు వికృతాకారము తొలగునో యతని వలన మరణము కలుగునని చాటినది. ఒకరోజు కష్ణుడు మేనత్త యింటికి వచ్చెను, అత్త బిడ్డను బలరాముని చేతికి నందించినది. మార్పులేదు. శ్రీకృష్ణుని చేతికి నొసగగా వికృతా కారము తొలగినది. అంత సాత్వతి

కం॥ కుపథ ప్రవృత్తు డయి వీ
డపనయమున నీ కనిష్టు డయినను ఁగరుణా
నిపుణుడవై నీ మఱదికి
నపరాధ శతంబు సైపు మయ్య యుపేంద్రా" (59)

అనికోరుకొనెను. శ్రీకృష్ణుడట్లు "అపరాధశదము" క్షమింతునని వాగ్దానమును చేసెను.

3.1.1.4.4.1.3.2 కుంత్యాదులకు

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అశ్వమేధ" పర్వము తృతీయాశ్వాసము (166-200) లో కలదు. కృపావరమును కోరినవారు కుంతి, ద్రౌపది, సుభద్ర, ఉత్తరలు. వరప్రదాత శ్రీకృష్ణుడు.

ఉత్తర విరాట రాజు కుమార్తె. అభిమన్యుని భార్య. కురుక్షేత్ర సమరానంతరము ఉత్తరకు మగబిడ్డ పుట్టెను. అందరు సంతోషించిరి కాని ఆ శిశువులో చలనము లేకపోవుటచే "మృతశిశు" అని గుర్తించి

బాధపడిరి. అశ్వత్థామ "అస్త్రప్రయోగమే" మృతశిశువు జననమునకు కారణమని కుంతి బాధపడినది. కుంతి, సుభద్ర, ద్రౌపది, ఉత్తరులు బిడ్డను కాపాడుమని శ్రీకృష్ణుని ప్రార్థించిరి. ఉత్తర  చాలవిలపించి మూర్ఛపోయినది. ఈ కలకలమును,విపత్తును దర్శించిన శ్రీకృష్ణుడు పాదప్రక్షాళనము కావించుకొని వచ్చెను. బిడ్డను శయ్యమీద నుంచుడని యానతిచ్చెను. విరోధుల పట్ల నబద్ధము చెప్పని వాడనైనచో, ధరణీసుర కులముపట్ల ప్రీతి కలిగిన వాడనైనచో, నరుని యెడ విరోధము లేకున్నచో.ధర్మార్థము సమస్త కార్యములనుచేసిన వాడనైనచో

తే.గీ॥ "మహిత సత్యంబుఁ బరమధర్మము గాఢ
నిర్మల బ్రహ్మచర్యంబు నిత్య సుప్ర
తిష్ఠింబులై నాయందుఁ దేజరిల్లు
నేని నిబ్బాలునకు జీవ మిపుడ వచ్చు" (194)

అని పలుకగానే బిడ్డకనులు తెరిచి చూచెను.అంతఃపుర జనులు సంప్రీతులైరి.

3.1.1.4.4.1.4 ఇంద్రవరములు

కద్రువ కోరికను, నాడీజంఘుని కోరికను మన్నించుట యీ భాగమునచేరును.

3.1.1.4.4.1.4.1. కద్రువకు

ఈ వృత్తాంతము నన్నయ భారత భాగము "ఆది" పర్వము ద్వితీయాశ్వాసము (4.47) లో కలదు. దయావరమును కోరిన వారు కద్రువ కాగా వరప్రదాత ఇంద్రుడు.

కద్రువ వినతలు సవతులు, విధివశమున వినత కద్రువకు దాసి

యయ్యెను. వినత కుమారుడైన గరుత్మంతుడు కూడా కద్రువసంతా నము నకుదాస్యమును చేయక తప్ప లేదు నాగ సంతానమును మోయుట విహారమునకు పిలుచుకొని పోవుట యతని కృత్యములు. ఒకనాడతడు సూర్యమండలము వరకు సెగిరెను. ఆ సూర్యగ చండ కిరణముల వేడమికి పాములు మాడినేలమీదపడి మూర్ఛపోయినవి. ఈ దృశ్యమును చూచినకద్రువదు కడుపుమండినది. ఇంద్రుని నారాధించినది

చం॥ నర సుర సిద్ధ కింపురుషనాగ నభశ్చర ముఖ్యులెల్ల నీ
కరుణయ వేచి మంద్రడు త్రిజగంబులు నీ కులిశాభిరక్షణ
స్ఫురణనచేసి సుస్థిరత బొందు బురందర సర్వలోక సుం
దర శరణంబు నా కగుము దానవసూదన పాకశాసనా"

(46)

పర్జన్యప్రసాదంబున మహా వృష్టిని కురిపించి పాములను కాపాడినది

3.1.1.4.4.1,4.2. కొంగకు

ఈ వృత్తాంతము తిక్కన భారత భాగము శాంతి పర్వము తృతీయాశ్వాసములో (472_523) కలదు. బ్రాహ్మణుని బ్రతికించుమని కోరెనదికొంగ.వరప్రదాత ఇంద్రుడు.

ఒక బ్రాహ్మణుడు కులవృత్తిని వదలి,బోయవనితను పెండ్లాడెను ఒకనాడు వ్యాపారముచేయు వైశ్యులతో కలిసి వెళ్ళుచుండెను. అరణ్యములో మదపుటేనుగు వెంటాడినది. ఆబ్రాహ్మణుడు భయపడ్డి మఱ్ఱిచెట్టుకడకు చేరెను. అక్కడ నాడీజంఘుడను పేరుగల కొంగని బ్రాహ్మణునికి సకల మర్యాదలను చేసెను. నాడీ జంఘుని మిత్రుడు రాక్షసరాజు. కనుక కొంగ బ్రాహ్మణునికి తన మిత్రుని గురించి తెలియ

చేసెను. బ్రాహ్మణుడు రాక్షసరాజు కడకు వెళ్ళగానతనిని గౌరవించెను కార్తీకపున్నమి వేళ వేయి బ్రాహ్మణులతో కలిసి బంగారు పళె ములో తానును భుజించెను. ఆ రాక్షసరాజు బ్రాహ్మణులకు బంగారు పళ్ళెముతో పాటు మణులనుగూడ దానమొసగెను. బ్రాహ్మణుడు సాయంవేళ నరణ్యమున మర్రిచెట్టు దాపునకు వచ్చెను. కొంగమును పటివలె మర్యాదను చేసెను. కాని బ్రాహ్మణుడు కృతఘ్నుడై కొంగ మాంసము మంచిదని కొట్టి, చంపి,యీకలను పేగులను వదలి మాంస మును మాత్రము గైకొని వెళ్ళెను.

రాక్షస రా జెప్పటివలె మిత్రుని కొఱకు యెదురు చూసెను. కాని కొంగ రాలేదు. భటులను వెదుక పంపెను. వారు కొంగయీకలను పేగులనుచూచి, వెంటాడి బ్రాహ్మణునిపట్టుకొని వచ్చిరి. రాజునకు పట్ట రాని కోపము వచ్చినది.

బ్రాహ్మణుని చంపి తినుమని యాదేశించెను. కాని వా రాతనిని చంపి కుక్కలకు వేసిరి. కుక్కలు కూడ తినలేదు. రాజు కొంగ కళే బరమునకుదహన సంస్కారము చేసెను. అప్పేళ ఇంద్రుడు వచ్చెను. రా జతనిని గౌరవించెను. వచ్చినవాడు నాడీజంఘుడని భావించెను. కానిఇంద్రుడుతాను కొంగను కాననియు, నగ్నిసంస్కారానంతరము గోపు దూడకు పాలిచ్చుననియు, పాలనురుగు గాలిలో యెగిరి కొంగ భస్మముపై పడుననియు, కొంగ బ్రతుకు ననియుచెప్పెను.

బ్రహ్మయాజ్ఞచే ఇంద్రు డా బ్రాహ్మణుని పాశనిబద్ధునిగా చేసి యుండెను. నాడీజంఘు డా విషయమును తెలిసికొనెను. తన వలన నా బ్రాహ్మణునకు మరణము కలిగినందుకు బాధపడి కొంగ

కం॥ వాని విడుపు గోరి వేడె వరముగ నింద్రున్" (520)

ఇంద్రుడు కొంగ మంచితనమును చూచి ముగ్ధుడై బ్రాహ్మణుని బ్రతికించి విడచిపుచ్చెను.

3.1.1.4.4.4.1.5 అగ్ని దేవుని వరము :-

ఈ వృత్తాంతము నన్నయ భారత భాగము "ఆదిపర్వ" మష్టమాశ్వాసములో (296-313) కలదు. కృపావరమును కోరినది మందపాలుడు. వరప్రదాత అగ్ని దేవుడు.

మందపాలుడు తపోభిలాషి. అతడనేక సంవత్సరములు తపమును చేసెను. యోగముతో దేహమునుపదలి పుణ్యలోకమునకు చేర యత్నించెను. కాని వీలుపడలేదు. సంతాన రాహిత్యమే యవరోధమని దేవతలు పలికిరి. కనుక మంద పాలుడు భూలోకమునకు తిరిగి వచ్చెను.తక్కువ కాలములో నెక్కువ సంతానమును పొందుటకు"పక్షి" జన్మము తగునని "పక్షి" అయ్యెను. మరొకపక్షిని రమించెను. ఆ పక్షివలన జరితారి, సారిసృక్వ, స్తంభమిత్ర, ద్రోణు లను కుమారులను కనెను. వారి యాలనాపాలనను తల్లికివదలి తనమొదటి భార్య లపితతో విహరించుచుండెను. ఒకరోజు మందపాలుడు "అగ్ని" ని దర్శించెను.

కం॥ "నీ వఖిల ధర్మమూర్తివి
నా వీర్యప్రభవు లయిన నలుగురు సుతులన్
లావు కల గరుణ గావుము
పావక భువనోపకార పర్యాప్తమతీ" (301)

అని కోరుకొనెను. అగ్ని సమ్మతించెను. ఖాండవ వనమును కాల్చువేళ

నలుగురును "అభయమభయ" మని ప్రార్థించిరి. అంతఅగ్ని మంద పాలుని ప్రార్థనను తలంచి

వ॥ "అన్నలువురు శార్ఙకులు నున్న వృక్షంబు భక్షింపక పరి
హరించెను" (313)

3.1.1.4.4.1.6 గరుత్మంతుని వరము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము ద్వితీయాశ్వాసము (55-84) లో కలదు. కరుణించుమని ప్రార్థించిన వారు బ్రాహ్మణ దంపతులు. కాపాడుటకు సంసిద్ధతను వ్యక్తముచేసిన వాడు గరుత్మంతుడు.

కద్రూవినతలు సవతులు. విధివశమున వినత కద్రువకు దాసియైనది దాస్యమును బాయుటకు "అమృతము"ను తెమ్మని కద్రువ సంతాన మాదేశించినది. గరుత్మంతుడు సమ్మతించెను. తన తల్లితో నీవిషయమును తెలిపి "అమృతము"ను తెచ్చుటకు తగిన బలము కలుగు నాహారమును సూచింపుమని కోరెను. అంత తల్లి సముద్రమధ్యమున నొక దీవియందున్న నిషాదుల సమూహమును భక్షింపుమని యానతిచ్చెను కాని బ్రాహ్మణులను మాత్రము భక్షింప వలదని యాదేశించెను. అట్లె గరుత్మంతుడు నిషాదుల నందరిని మింగెను. కాని యొక బ్రాహ్మణుడు మ్రింగుడు పడలేదు. తల్లిమాట గరుత్మంతునకు గుర్తురాగా-నా కంఠమున విప్రుడున్నచో వెలుపలికి రావలయునని కోరెను. అవిప్రుడు

ఉ॥ "విప్రుడ నున్నవాడ నపవిత్ర నిషాది మదీయభార్య యీ
స్త్రీ ప్రియ దీని బెట్టి చనుదెంచుట ధర్మమె" (63) అని
పలికెను,

అపవిత్రులైనను విప్రసంపర్కముచే నందరు పూజ్యులని గరుత్మంతు డాదేశించెను.

ఈ యనుగ్రహముతో నిషాది సహితుండై బ్రాహ్మణుడు బయటకు వచ్చెను.

3.1.1.4.4.2. మహర్షి కృపావరములు :-

అత్రి, అగస్త్య, గౌతమమహర్షు లను గ్రహించిన కృపావరములిందుచే రును.

3.1.1.4.4.2.1 అత్రి మహర్షి వరము

ఈ వృత్తాంతము తిక్కనభారతభాగము "అనుశాసనిక" పర్వము పంచమాశ్వాసము (347)లో కలదు. వరప్రదాత అత్రి కాగవరాను గ్రహమును పొందినవారు దేవతలు

పూర్వము దేవదానవ సమరము సాగినది. రాహువు దానవ పక్షము వాడు. సూర్యచంద్రులు దేవ పక్షమువారు. రాహువు తన" అస్త్రవిద్యా కౌశలముతో సూర్యచంద్రులను మూర్ఛిల్ల జేసెను. వారు మూర్ఛిల్లిరి. అప్పుడే వెలుగుపోయిచీకటి కమ్ముకొన్నది. దేవతలు దిగాలుపడిరి. దేవతలు "అత్రి" మహాముని దగ్గరకు పరుగులెత్తి కాపుమని వేడిరి. అతడు దయతలచి

సీ॥............"చంద్రార్కతనువు

ఆ.వె॥ అక్షతములు చేసి యసుర సైన్యంబు రూపుమాపెను"

(347)

3.1.1.4.4.2.2 అగస్త్యమహర్షివరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అశ్వమేధ" పర్వము చతుర్థాశ్వాసములో (261-271) కలదు. క్షమమ కోరినవాడు ఇంద్రుడు క్షమించినవాడు అగస్త్యమహర్షి

అగస్త్యమహర్షి యొకసారి 12 సంవత్సరముల యాగమును చేయ నిర్ణయించెను. ఎందరోఋత్విక్కులు విచ్చేసిరి కాని యా సమయమున "ఇంద్రుడు వర్షమును కురిపించలేదు. ఓషధులెండి పోయెను యాగమెట్లుసాగునోయని యా ఋత్విక్కులుతమలో తామఃమాటలాడుకొనసాగిరి. అంత "అగస్త్యుడు" ఉత్తర కురుభూములనుండి పంటలను తెత్తునని పలికెను.వచ్చిన ఋత్విక్కులు తమకుగా తపమును వ్యర్థము చేయవలదని కోరిరి.ఇంద్రుడు "అగస్త్య"ని దృఢదీక్షకు సంతసించెను ఋత్విక్కుల యాగ ప్రవృత్తికి మెచ్చుకొనెను.వర్షమును కురిపించెను అనవసరముగా అగస్త్యమహర్షికిబాధనుకలిగించినందుకు"నన్నుం గావవే"(269)అని ప్రార్థించెను.అంతఅగస్త్యుడు ఇంద్రుని గారవించిశాంతి సద్వచనలీల ప్రమోద మొనర్చెను.

ఈ క్రోధశాంతిలో ప్రత్యేకత యున్నది. తన సాహాయ్యము లేక "అగస్త్యుడెట్లు యాగమును చేయగలడోయని "ఇంద్రుని" ధీమా• కోపగించుకొనిన తనను వేడుకొనునేమో యనునాశ. ఈ రెండును వ్యర్థముకాగా తనను శపించునేమో యని ఇంద్రుని భయము. చివరకు పాదాలపై పడుట "అగస్త్యాదులు గౌరవించుటతో కథ సుఖాంతము

3.1.1.4.4.2.3. గౌతమ మహాముని వరము

ఈ వృత్తాంతముతిక్కన భారత భాగము "అశ్వమేధ"పర్వము

తృతీయాశ్వాదములో (81-104) గలదు. కీడురాకుండునట్లుగ వర
మును కోరినది అహల్య. కాపాడినవాడు. గౌతమ మహాముని

గౌతముని భార్య అహల్య. శిష్యుడు ఉదంకుడు. ఉదంకుడు చగువరి. కాగా
చివరలో తనకుమార్తె నిచ్చి వివాహమును చేసెను. ఉదంకుడు "గురుదక్షి
ణను తీసికొనుమని గౌతముని నడిగెను-ఏమియు వలదని గౌతముడు పలికెను
అంత "అహల్య" సౌదాసరాజు భార్యకుండలములను తెమ్మని యడిగెను.
ఉదంకుడు కదలి చనెను. కాలము గడచినది. ఉదంకుడు రాడాయెను
గౌతముడు "ఉదంకు" డెక్కడని యడిగెను. కుండలములను తీసి
కొనిరా పెళ్ళెనని "అహల్య" చెప్పెను. అపుడు గౌతముడు సౌదాసునికి
రాక్షస ప్రవృత్తి కలిగెనేని ఉదంకుని భక్షించునని తెలిపెను. ఈ
మాట తెలియుటతో అహల్య చాల నొచ్చుకొన్నది.

సీ॥ ఎఱుగ నిట్లగుట మునీశ్వర నామీది
దయ చిగురొత్త నాతనికి గీడు
రాకుండ నట్లుగా జేకొని కావవే" (87)

అని ప్రార్థించినది. గౌతముడు తానే యెడరు రానీక కాపాడుదునని
పలికెను.

3.1.1.4.4.3 మర్త్యకృపా వరములు

యయాతి, కంకుభట్టు, కర్ణ, అర్జున, అభిమన్యుల కృపావరము
లిందు చేరును.

3.1.1.4.4.3.1 యయాతివరము:-

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వము

తృతీయాశ్వాసము (134-143)లో కలదు. రక్షింపుమని కోరుకొన్న
కోమలి దేవయాని. దయ చూపిన వాడు యయాతి రాజు

వృషపర్వుని కూతురు శర్మిష్ఠ. శుక్రాచార్యుని కూతురు దే
యాని. వారిరువురు చెలికత్తెలే. కానియొకానొక సమయమున వారి
వు కి వాదము పెరిగినది. శర్మిష్ఠ దేవయానిని నూతిలో త్రోసినది. తా
చెలికత్తెలతో నంతఃపురమున కేగినది. ఆదేసమయమున యయా
వేటకు వచ్చెను. అతడు దప్పికకు తట్టుకొనలేక నూతికడ కేగెన
అచ్చట దేవయానిని జూచెను. తాను శుక్రునికూతురునని పరిచయవ
చేసికొనెను.

వ॥. "ప్రమాద వశంబున నిన్నూతం బడి వెలువడ నేరకున్న
దానను నన్నుద్ధరించి రక్షింపుమని (143)

కోరినది. యయాతి యామెను రక్షించి తన పురమునకు వెళ్ళె

3.1.1.4.4 3.2 కంకుభట్టునికృపా వరము

ఈ వృత్తాంతము తిక్కన భారత భాగము విరాట పర్వవ
పంచమాశ్వాసములో (244-278) గలదు. క్షమను యాచించిన వా
విరాటుడు. క్షమించిన వాడు కంకుభట్టు నామధేయుడైన ధర్మరా

ఉత్తర గోగ్రహణమునకు "ఉత్తరబృహన్న"లు కదలి చని
దక్షిణ గోగ్రహణమును ముగించుకొని విరాటుడు పట్టణమునకుచేరె
ఆ సంతోషముతో జూదమాడదలంచి కంకుభట్టును పిలిచెను. జూదవ
నాడు వేళవిరాటుడు తనకుమారుని మూడు మార్లు . పొగడెన
ఉత్తర గోగ్రహణ విజయము బృహన్నలదని కంకుభట్టు పలికెన

విరాటునికి పట్టరాని కోపము వచ్చునది. కంకుభట్టునిపై సొరెలను విసిరెను. ఆ సొరెలు నొసటకు తగిలినవి. రక్తము స్రవించినది. అక్కడున్న ద్రౌపదిరక్తబిందువులు క్రిందబడకుండ తడిగుడ్డతో తుడిచినది. ఇంతలో ఉత్తరుడు రానే వచ్చెను. జరిగిన సమరవృత్తాంతమును స్పష్టముచేసెను. కంకుభట్టు గాయమును చూచి యిదేమని యడిగెను. విరాటుడు జరిగిన విషయమును చెప్పెను. కంకుభట్టుని క్షమాభిక్షను వేడుమని ఉత్తరుడు తండ్రినాదేశించెను. అప్పుడు కంకుభట్టునప్పుచు

వ॥ నాకు నలుక యొక్కడిది యితండును గీడు తెరుపు వాడుగా డిది యొక్క పొద్దు నయ్యెంగాని" (278) అని సమర్థించెను.

3.1.1.4.4.3.3. కర్ణుని కృపాపరము :-

ఈ వృత్తాంతము తిక్కనభారత భాగము "ఉద్యోగ" పర్వము చతుర్థాశ్వాసము (58-71) లో కలదు. వరప్రదాత కర్ణుడు కాగా సాక్షికముగా వరఫలితమును పొందిన తల్లి కుంతి.

శ్రీకృష్ణ రాయబారము విఫలమైనది. మరుసటి రోజు కర్ణుడు భాగీరథినదికి ననుష్ఠాన నిమిత్తము వెళ్ళెను. కుంతియునతనిని ననుసరించెను. కర్ణుడు జపమును.ముగించెనుకుంతిని జూచితనసూత గోత్రమును నామాదికములను చెప్పెను. అంత కర్ణుడు తన సంతానమని దుర్యోధనపక్షమును వదలిపాండవ పక్షమునుచేరుమని కుంతికోరినది. కానికర్ణుడు సమ్మతించలేదు.

ఉ॥ ..........."పాంవుల్
సేపడి రేని జంప నఱసేయక చెప్పెద సవ్యసాచిపై
గోపము పెద్ద వాడు సమకూరిన బిట్టిఱ జంపుదుం
జుమీ" (63)

అని యయాచితము గానే పలికెను.

3.1.1.4.4.3.4 అర్జునుని కృపావరములు

మహిమను, గొప్పదనమును కోల్పోయి యోటమి దశలోనున్న శత్రువులపై, శరణన్న వారిపై అర్జునుడు కృపను చూపెను. ఇట్టివి నాలుగు. అశ్వత్థామ, శకునిపుత్ర, దుస్సలపుత్ర మయులపై కృపను చూపెను.

3.1.1.4.4.3.4.1 అశ్వత్థామ సంరక్షణము

ఈ వృత్తాంతము తిక్కనభారతభాగము సౌప్తిక పర్వము ద్వితీయాశ్వాసములో (60-64) కలదు. కనికరించినవాడు అర్జునుడు. కనికరమునకు పాత్రుడయిన వాడు "అశ్వత్థామ"

అశ్వత్థామ "అపాండవము" ను సేసెదనని బ్రహ్మశిరోనామకాస్త్రమును ప్రయోగించెను. అంత శ్రీకృష్ణుడర్జునునితో ప్రతిక్రియగా శిరోనామకాస్త్రమును ప్రయోగించుమని యాదేశించెను. అర్జునుడు రథమునుండి దిగి గురువగు ద్రోణునిస్మరించి ధనువు గైకొని బాణమున్ను సంధించి

వ॥ "తొలుత గురు నందను నకుం గీడు పొందకుండవలయు
సని ప్రార్థించి పదంపడి నాకును సోదరులకును శుభం
బయ్యెడు మని" (64)

బాణమును వదలెను. ఉభయాశాస్త్రములు ఢీకొనెను.అశ్వత్థామకు అర్జున సోదరులకు నెట్టి బాధలు కలుగలేదు.

3.1.1.4.4,3.4.2 శకుని పుత్ర సంరక్షణము

ఈ వృత్తాంతము తిక్కనభారతభాగము "అశ్వమేధ" పర్వము చతుర్థాశ్వాసము (116-127) లో కలదు. శరణను (లేక) కృపను కోరినది శకుని భార్య.వరప్రదాత అర్జునుడు.

శకుని దుష్ట చతుష్టయములోని వాడు. పాండవుల కనేక కష్టములను కల్పించినవాడు. అతడు కురుక్షేత్ర సమరమున మరణించెను. యుద్ధానంతరము ధర్మరాజు "అశ్వమేధ" యాగమును చేసెను. తురగ రక్షణమునకై "అర్జునుడు" కదలెను. దారిలో శకుని కుమారుడు గుఱ్ఱమును పట్టెను. అర్జునుడు తగదనివారించెను. కానియతడు వినక కయ్యమునకు కాలుదువ్వెను. ఇంతలో శకుని భార్య "అర్జును"ని శరణు వేడినది. అర్జునుడు కాదన లేక పోయెను. ఆమెను మెచ్చుకొని మంత్రులను గౌరవించెను. శకుని కుమారునికి బుద్ధిమాటలను చెప్పెను.

3.1.1.4.4.3.4.3 దుస్సలపౌత్రసంరక్షణము :

ఈ వృత్తాంతము తిక్కనభారతభాగము "అశ్వమేధ" పర్వము చతుర్థాశ్వాసము (38-49)లో కలదు. శరణను లేక కృపను కోరినది దుస్సల. వరప్రదాత అర్జునుడు

కురుక్షేత్ర సంగ్రామానంతరము ధర్మరాజు "అశ్వమేధ"యాగమును చేసెను. తురగరక్షణార్థము "అర్జును" డేగెను. దారిలో నొక

బాలునితో సమరమ్ము భీకరమ్ముగా సాగినది. ఆ బాలుడు కౌరవుల చెల్లెలైన దుస్సలకు సైంధవునికి పుట్టిన మనుమడు. సమరము పట్టుతప్పుచుండగా దుస్సల పరుగు లెత్తుచు వచ్చి, బాంధవ్యము నెరుక పరచి బాలుని కావుమని కోరినది.

సీ॥ [illegible] తండ్రి
లేని యా శిశువుపై మానితంబైన నీ
యక్కటి కరపు జూపడర జేయు
మాశ్రిత వత్సల యనుచు నబ్బాలుని
శరణాగతుని జేసి శరణు శరణు
కృప నన్ను రక్షింపు కీర్తియు ధర్మంబు
జేకొను మని" (47) కోరుకొనెను. అర్జునుడు దుస్సల కోరికను మన్నించెను.

3.1.1.4.4.3.4.4 మయ సంరక్షణము :-

ఈ వృత్తాంతము నన్నయ భారత భాగము "ఆది" పర్వ మష్టమాశ్వాసము (268-292) లో కలదు. శరణాగతము లేక కృపను కోరినది మయుడు. వరప్రదాత అర్జునుడు.

అగ్ని దేవుడు ఖాండవ వనమును దహింప సాగెను. శ్రీకృష్ణార్జునులు "అగ్ని"కి బాసటగా నిలిచిరి. ఈ దహన కాండ జరుగకుండ ఇంద్రుడడ్డు పడెను. ఆ వనములో మయుడను పేరుగల రాక్షసుడుండెను. వనమందలి మంటలు మయుని చుట్టు ముట్టెను. మయుని చంపుటకు కృష్ణుడు సిద్ధమయ్యెను. మయుడు "అర్జునుని మరుగు జొచ్చెను.

త్పరుడు ధనంజయుడు మయుని ప్రాణఘు గాచెన్ (291)

### 3.1.1.4.4.3.5. వీరాభిమన్యు వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ద్రోణపర్వము ప్రథమాశ్వాసాంతములోను (391-394) ద్వితీయాశ్వాస మాదిలోను(2-18) కలదు. తన కోరికను మన్నించుమని వేడినవాడు ధర్మరాజు కాగా సమ్మతించినవాడు అభిమన్యుడు.

కౌరవులకు ద్రోణుడు రెండవ సైన్యాధిపతి. అతని మహాపక్షి నాటి యొద్ధవ్యూహము విచిత్రము. అర్జునుని సుదూర ప్రాంతములకు తరలించుట, పద్మవ్యూహము పన్నుట యానాటి ప్రణాళికాంశములు. అర్జునుడు సంశప్తకుల నెదిరింప కదలిచనెను. ద్రోణుడు పద్మవ్యూహమును పన్నెను. అద్దానిని భేదింప పాండవ సైన్యము ప్రయత్నించి విఫలమైనది. అపుడు ధర్మరాజు "అభిమన్యు" నితో పద్మవ్యూహ ఛేదనము చేయుమని వేడికొనెను. తనకు ఛేదనము తెలియును కాని పునరాగమనము తెలియదని "అభిమన్యుడు" చెప్పినను ధర్మరాజు

కం॥ "తెలిపి గొని నీవు పొచ్చిన
బలుదన జొచ్చె ఛేదము రిపులు పెల్లగిల్లగ నం
దలమును మా కిది యెంతయు
నుఱునట్టి వరంబు దీని నొసగుము పుత్రా" (7)

అని కోరుకొనెను. భీముడును, "అభిమన్యు"ని ప్రోత్సహించెను. చివరకు వారి మాటలకు తలయొగ్గి "అభిమన్యుడు" పద్మవ్యూహమున

ప్రవేశించెను. సైంధవు డడ్డు కొనుటతో ధర్మరాజాదు లనుసరింప లేక పోయిరి.

3.1.1.4 5. ఉపశాంతి వరములు :-

"తన కోపమే తన శత్రువు" అని ప్రసిద్ధి. అరిషడ్వర్గములలో క్రోధమునకు రెండవస్థానము. క్రోధించుట మానవులకే కాదు దేవత. లకు కూడ సహజమే. కాని కొందరి కోపము ప్రార్థనతో చల్లబడును. కొందరి కోపము ప్రత్యామ్నాయపద్ధతితో చల్లబడును. ఇట్టి క్రోధశాంతి వరములు "ఆంధ్రమహాభారతములో 15 గలవు. ఇవి బ్రహ్మ, రుద్ర, శ్రీకృష్ణ, కుమారస్వామి, ఇంద్ర, పులస్త్య, జమదగ్ని, పరశురామ, పరాశర, ఔర్వ, భీష్మ, అష్టమహిషిజన,గాంధారీధృతరాష్ట్రుల క్రోధో పశాంతి వరములు.

3.1.1.4.5.1 బ్రహ్మ క్రోధోపశాంతి :-

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ద్రోణపర్వము ద్వితీయాశ్వాసము (160-165)లో కలదు. క్రోధశాంతిని కోరినవాడు శివుడు అనుగ్రహించినవాడు బ్రహ్మ.

బ్రహ్మ సృష్టికర్త. అతనికి సృష్ట్యధి కారమున్నది. కాని విలయాధికారములేదు. కనుక భూభార మధిక మయ్యెను. భూదేవి పరితపించినది. బ్రహ్మకు విన్నవించినది. అపుడు బ్రహ్మకోపగించెను అతని నుండి మహాజ్వలనము పుట్టెను. భూతసమూహము కాలిపోసాగెను. అపుడు పరమ శివుడు బ్రహ్మను శరణుజొచ్చెను. బ్రహ్మశివునితో

క॥ నీ కోరికి యప్రతిహత

మే కార్యము గోరి వచ్చి తెలిగింపు మనే

యాకొర కామ హర యది
సేకొని యీ క్షణము యేను జేసెద నని (161) పలికెను.

అపు డభవుడు బ్రహ్మతో సృష్టికర్తపై లయము చేయుట తగదనెను.

వ॥ "నాకుం గా లోకంబులం గరుణాలోకంబున
నాదరింపు మనెను" (163)

వెంటనే బ్రహ్మ తన కోపము నుపసంహరించెను. అగ్ని చల్లారెను.

3.1.1 4.5.2 రుద్రక్రోధోపశాంతి

రుద్రుని క్రోధమును బ్రహ్మ రెండు సందర్భములలోను, పార్వతీదేవి యొక్క సందర్భములోను నుపశమింపజేసిన విషయము లీభాగమున చేరును.

3.1.1.4.5.2.1 గోవులపై రుద్రక్రోధశాంతి :-

ఈ వృత్తాంతము తిక్కనభారత భాగము "అనుశాసనిక" పర్వము తృతీయాశ్వాసములో (21-25) కలదు. కోపగించుకొన్నవాడు శివుడు కాగా శాంతింపజేసిన వాడు బ్రహ్మ.

సురభిసంతానము సౌరభేయము. ఆ సంతానము హిమగిరి యుపరితలమున సంచరించు చుండెను. అపుడొక లేగదూడ తల్లిదగ్గర పాలు త్రాగు చుండెను. ఆ పాలనురుగు గాలికెగిరి తపోనిష్ఠుడయిన శివుని తలపై పడెను. శివునికి తపోభంగము కాగా కోపగించెను. మూడవ నేత్రమును తెరచెను. ఆ ముక్కంటి చిచ్చునకు సురభిసంతానములలో నొకటి కపిల వర్ణత్వమొందెను. దేవత లాశ్చర్య మొందిరి. బ్రహ్మయు

విషయమెరిగి శివుని పాదాల పైబడి

సీ॥ అమృత సిక్తుడ వైతి వఖిలేశ గోవుల
కెంగిలి లే దిందు డెట్టు లమృత
మొసగు నట్టుల గోవు లొసగు దుగ్ధంబుల
దద్వత్స పీతదుగ్ధంబు శుచియ
గాన కోపంబు దక్కి కరుణింపు మని కోరెను (24)

శివుడు శాంతుడయ్యేను. వృషభమును వాహనముగా నెన్నుకొనెను.

3.1.1.4.5.2.2 దక్షాధ్వరసంగోద్భవ క్రోధోపశాంతి

ఈ వృత్తాంతము తిక్కనభారతభాగము శాంతిపర్వము పంచమాశ్వాములో (437-443) కలదు. కోపగించిన వాడు శివుడుకాగా శాంతింపజేసినవాడు బ్రహ్మ.

ఒకసారి దక్షుడు యాగమును చేయ సమకట్టెను. దేవతల నందరిని నాహ్వానించెను. కాని పెద్దయల్లుడైన శివుని పిలువలేదు. ఈ విషయమును భర్తద్వారా సతీదేవి విన్నది. ఈ యవమానము తనదిగా భావించుకొని కోపగించుకొనినది. శివు డాయె కోపమును గ్రహించెను యాగ భంగమునకై ప్రమథగణమును పంపెను వారు యాగమును పాడుచేసిరి. యాగాగ్ని గగనమునకు మృగరూపమున బారినది. శివుడు విజృంభించెను. అతని నొసట చెమట పట్టెను. ఆ చెమట బిందువులు నేలపడగా పెద్దమంటలు లేచెను. ఆ మంటలనుండి ఘోరాకారము గల పురుషుడు పుట్టెను. దేవతలు మునులు పరుగు లెత్తిరి. బ్రహ్మ శివుని చూచి

కం॥ ...............“విసయో
త్వరముగ మ్రొక్కెదు నమరులు
పరి కల్పించెదరు నీకు భాగము భక్తిన్ (440)

వ॥ “స్వామీ కోపం బుపసంహరింపుము.” (441)
అని కోరెను. శివుడు శాంతుడయ్యెను. చెమట నుండి పుట్టిన యతడు “జ్వరము”ను పేరుతో ప్రశస్తుడగునని బ్రహ్మ చెప్పెను.

3.1.1-4.5.2.3 భార్గవ శిక్షోద్భవ క్రోధోపశాంతి :-

ఈ వృత్తాంతము తిక్కన భారత భాగము శాంతిపర్వము పంచమాశ్వాసములో (469-472) కలదు. కోపమును ఉపసంహరించుమని కోరిన దేవత పార్వతి. కోపమునుపసంహరించుకొన్నవాడు శివుడు

భార్గవుడు యోగి. తనయోగబలముతో కుబేరుని మోసపుచ్చెను. ఎంతయో ధనమును గ్రహించెను. ఈ మోసమును గ్రహించిన కుబేరుడు శివునితో మొఱపెట్టుకొనెను. శివుడు కోపించెను. శూలముతో పొడువబోయెను. భార్గవుడు భయపడి పారెను. తుప్పలలో దాగ తల చెను. ఇంతలో శివుడు వచ్చుచు రాగా భార్గవుని మ్రింగెను. శిశ్న రంధ్రము తప్ప తక్కిన రంధ్రములను బంధించెను. భార్గవుడన్ని రంధ్రములు మూయబడియుండుట గ్రహించి శిశ్నరంధ్రము నుండి వెలుపలికి వచ్చెను. అంతశివుడు కోపముతో చంపబూనుకొనెను. అప్పుడు పార్వతి

కం॥ నీ కడుపున జన్మించుట
నాకుం గొడుకయ్యె-(474) అని సమర్థించినది

శివుని కోపము తగ్గినది. శిశ్నమునుండి నిర్గమించుట వలన నతడు శుక్రుడయ్యెను.

3.1.1.4.5.3 శ్రీకృష్ణ క్రోధోపశాంతి :-

ఈ వృత్తాంతము తిక్కనభారత భాగము భీష్మపర్వము ద్వితీయాశ్వాసమున (139-162) తృతీయాశ్వాసములో (254-270) కలదు కోపగించిన వాడు కృష్ణుడు కాగా శాంతింపచేసినవాడు అర్జునుడు

కురుక్షేత్రమున కురుపాండవసమరము మొదలయినది.మూడవ నాడు భీష్ముడు శ్రీకృష్ణార్జునుల నొప్పించెను. అర్జునుడు తానేమియు చేయలేక పోయెను. అంత శ్రీకృష్ణుడు చక్రమును చేబట్టిభీష్ముని దిక్కుకు కదలెను. అర్జునుడుకూడ వెంబడి వెళ్లిపాదములను పట్టుకొని

ఉ॥ కోపము సంహరింపు యదు కుంజర పాండవకోటి కెల్లనుం
దేపవు గావె నీ విటు లధీరత బూనికి దప్పినం బ్రతి
జ్ఞాపరుడైన ధర్మసుతు శౌర్యము ధైర్యముః బాహువీర్యముఃన్
రూ పటి పోక కాదె యనురూపమె నీ కిది లోకనాయకా

(160)

అనికోరుకొనెను. అంతియగాక శ్రీకృష్ణుడే సంహరించిన ప్రతిజ్ఞాభంగమగునని తెలిపెను. శ్రీకృష్ణుడు శాంతించెను

మరియు తొమ్మిదవ నాడు కూడ భీష్ముడు భీషణముగ యుద్ధము చేసి శ్రీకృష్ణార్జునులను, తురగములను నొప్పించెను. అప్పుడు శ్రీకృష్ణుడు కోపించి మునికోల నెత్తికొని రథము నుండి దిగి భీష్ముని మీదకువెళ్ళుచుండెను. విషయమును గ్రహించినఅర్జునుడు ప్రార్థించెను

వినలేదు. వెంటనే వెనుక నుండి శ్రీకృష్ణుని పాదములను గట్టిగ పట్టుకొని.

ఉ॥ "కయ్యము సేయ నే నని యకల్మషబుద్ధి బ్రతిజ్ఞసేసి నీ
వియ్యెడ దప్పితేని జగ మేమను నించుక సేపుపోరులన్
డయ్యుటదప్పనావయిగడంగిన భీష్మునిపాటు సూతురా
వయ్య రథంబుమీది కిటు లాశ్రిత మానము
వీటిబుత్తురే" (269)

వ॥ "అని ప్రార్థించెను" (170)
వెంటనే శ్రీకృష్ణుడు శాంతించి రథము కడకు వచ్చెను.

3.1...4.5.4. కుమారస్వామి క్రోధోపశాంతి :-

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారత భాగము "ఆరణ్య" పర్వము పంచమా శ్వాసములో (214-220) కలదు. కోపించిన వాడు కుమార స్వామి కాగా కోపశాంతికి వేడినవాడు ఇంద్రుడు

కుమారస్వామి తారకాసుర సంహారార్థము జనించిన వాడు. అయినను "ఇంద్రుడు"కుమారస్వామిని తనకు ప్రతిస్ఫర్థిగా తలంచెను అతనిని చంప తలంచెను సప్తమాతృకలను పంపెను. కాని వారు స్వామి తేజమునకు నిలువలేక పోయిరి.అభయమును వేడిరి. ఇంద్రుడు దేవతలలో కలసి యెదిరించెను. కుమారస్వామి విజృంభించెను. అతని ముఖము నుండి "అగ్ని" జ్వాలలు రేగెను. దేవతలు చేతుల జోడించి

కం॥ నీ కింకరులము మమ్ముం
జేకొని కృప గావు మనుచు శిఖినందను న
స్తోక బలు శరణు వేడిరి" (219)

అట్లే ఇంద్రుడు కూడ విశాఖుని విజృంభణమును తట్టుకోలేక అగ్ని సంభవుని క్రోధశాంతిని వేడెను.

3.1.1.4,5.5 మహేంద్ర క్రోధోపశాంతి :-

ఈ వృత్తాంతము తిక్కనభారతభాగము "అశ్వమేధ" పర్వము ప్రథమాశ్వాసములో (99-104) గలదు. కోపగించు కొన్నవాడు ఇంద్రుడు కాగా, కోపశాంతి చేసిన వాడు మరుత్తుడను రాజు

మరుత్తుడు యజ్ఞయను చేయదలచెను. ఉపద్రష్టగా దేవతల గురువైన బృహస్పతిని వేడెను. కాని యతడు తిరస్కరించెను. పిమ్మట నారదమహర్షి సలహాపై బృహస్పతి తమ్ముడైన సంవర్తుని వేడెను. అతడు సమ్మతించి, యాగము సు మొదలిడెను. సంవర్తనుడు సమ్మతించిన యీ విషయము తెలిసి బృహస్పతి చాల కృశించెను. గురుదేవుని చింత ఇంద్రునికి తెలిపెను. బృహస్పతినే "ఉపద్రష్ట" గా నుంచుకొనుమని మరుత్తుని దగరకు అగ్నిదేవునిని రెండు పర్యాయములు పంపెను. కాని మరుత్తుడు వినలేదు. తరువాత ఇంద్రుడు ధృతరాష్ట్రుడను పేరుగల గంధర్వరాజును పంపెను. అయినను సమ్మతించలేదు. వెంటనే వజ్రాయుధమును ప్రయోగించెను, మరుత్తుడు సంవర్తుని శరణువేడెను. అతడు మంత్రబలముతో వజ్రాయుధము నాపివేసి మరుత్తునిని రక్షించెను. పైగాపరము నడుగుమని మరుత్తుని తో పలికెను. ఇంద్రుని, నితర దేవతలను నాహ్వానించి హవ్యభాగము లను తీసికొనునట్లుచేయుమని వరము నడిగెను.సంవర్తునుడు"ఇంద్రా" దుల నాహ్వానించెను. వారు కదలి వచ్చిరి. మరుత్తుడు వారికి నర్ఘ్య

పాద్యాది పూజనములను గావించెను. పిమ్మట నతడు ఇంద్రునికి నమస్కరించి

> వ॥ దేవా నీవు విజయంజేపి నా జన్మంబు సఫలంబు సేసితి కృతార్థుండ నైతిం గృపాధామ నామీది యలుకమాని నన్నుం జల్లని చూడ్కిం జూడు మని ప్రార్థించి సంవర్తుం జూపి యిత్తాపసపతి బృహస్పతి స్వరూపంబ కావునం గ్రతు యాజకుండగా బ్రతిగ్రహించితి నని విన్నవించెను" (99)

మరుత్తుని ప్రార్థనను విన్న ఇంద్రుడు బృహస్పతి సంవర్తునులు సమానులే యని పలికెను. తనకు కోపములేదని పలికెను.

3.1.1.4.5.6 పులస్త్యు క్రోధోపశాంతి

ఈ వృత్తాంతము ఎఱ్ఱన భారతభాగము "అరణ్య" పర్వము షష్ఠాశ్వాసములో (271-272) కలదు. కోపగించినవాడు పులస్త్యుడుకాగా శాంతించుమని ప్రార్థించినవాడు వైశ్రవణుడు

బ్రహ్మకుమారుడు పులస్త్యుడు. పులస్త్యుని కుమారుడు వైశ్రవణుడు. వైశ్రవణుడు పులస్త్యుని లెక్కించలేదు. తాతనే యారాధించెను. తండ్రికి కోపమువచ్చినది. అతని శరీరము నుండి "విశ్రవసుడు" పుట్టెను. తన్ను నిర్లక్ష్యము చేసిన వైశ్రవణునికి కీడుచేయుమని యానతిచ్చెను. ఈ వ్యవహారమంతయు పసిగట్టిన వైశ్రవణుడు తండ్రి దగ్గరకు వచ్చి

> వ॥ మహాత్మా యేను నీకుం బుత్రుండ నయ్యెద నాకుం గరుణింపు మని యతనిం బ్రసన్నునిం జేసి నృత్తగీత

విద్యా విశారదు లయిన రాక్షసస్త్రీలం బుష్పోత్కటయు
మాలినియు పాకయు నను వారి ముగ్వుర నవ్విశ్రవరు
నకు బ౯చారికలంగా నిచ్చెను" (271)

వారు విశ్రవసుని సంతోష పెట్టిరి

3.1.1.4.5.7. జమదగ్ని క్రోధోపశాంతి

ఈ వృత్తాంతము తిక్కన భారత భాగము "అనుశాసనిక" పర్వము తృతీయాశ్వాసములో (255-265) కలదు. కోపగించిన వాడు జమదగ్నికాగా శాంతింపజేసెన వాడు సూర్యుడు

జమదగ్ని భార్య రేణుక.ఒకసారి యాదంపతులు విల్లంబులతో కదలిరి. జమదగ్ని బాణమును వేయగా రేణుక మరల తెచ్చియిచ్చెడిది. అప్పటికిమధ్యాహ్నమయినది, రేణుక యలసిపోయినది.బాణమును తెచ్చుటలో నాలస్యమయినది. అంతియగాక చెట్టు పట్టున నెండకు నిలిచినది. అలస్యమునకు జమదగ్ని కారణమునడిగెను. రేణుక యెండ తీవ్రతను గుర్తుచేసినది. జమదగ్ని కరకరమండుచు "నాఅస్త్రబలముచే సూర్యుని పొడిసెద" నవెను. సూర్యు డీ మాటను వినెను.మారు వేషమున వెళ్ళుట న్యాయమని బ్రాహ్మణవేషధారియైచనెను. సూర్యుని వలన ప్రకృతికి మేలనియు, యాగములు జరుగుననియు, దేవతలకు బలము కలుగుననియు వివరించెను. కాని జమదగ్ని శాంతించలేదు. అంత సూర్యుడు స్వస్వరూపముతో సాక్షాత్కరించి జమదగ్నితో

చం॥ ——————— - ——————— - —————"ఏ
నినుడ సహింపు నావలన నెగ్గులు గల్గినయేని నీకు నె
మ్మనముదయామయుం బనిసమస్తజగంబులుఁసంస్తుతింపగా
విని ముదమందుదున్ శరణు వేడెద గావుమునన్ను
నీశ్వరా" (262)

అని వేడెను. జమదగ్ని శాంతుడయ్యెను. సూర్యుని గౌరవించెను. పిదప మానస వృత్తితో గొడుగును, పాదరక్షలను సూర్యుడు సృష్టించి యిచ్చెను.

3.1.1 4.5.8 పరశురామ క్రోధోపశాంతి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగ" పర్వము చతుర్థాశ్వాసములో (349–358) కలదు. క్రోధశాంతికి ప్రయత్నించిన వారు జమదగ్ని, గంగాదేవులు. కోపపడినవాడు పరశురాముడు.

అంబనిమిత్తమై భీష్మ పరశురాములకు సమరముసాగినది. గురువని మన్నించి భీష్ముడు మోహనాస్త్రమును ప్రయోగింపలేదు. చివరకు బహ్మాస్త్రమును ప్రయోగించెను. పరశురాము డోడిపోయెను. కాని యా యోటమి పరశురాముని క్రుంగదీసినది. ఇంతలో జమదగ్ని వచ్చి శాంతవచనముల తేర్చి

కం॥ వినుము వసుమూర్తి యీతం
డనన్య సామాన్య తేజు డాహవ భూమిన్
మనకు జయింప వశమె భీ
ష్ముని విప్రుని కగునె రోషమును మత్సరమున్ (356)

తే.గీ.॥ సమర ముద్ధుగ్ను నారాయణ సఖుడు నరుడు
సవ్యసాచి నా నింకొక జన్మ మొంది
యితని వధించు గాని తక్కితర జనము
లకు నసాధ్యుండు భీష్ము డాలంబులోన" (357)

అని పలికిరి. కాని పరశురాముడు సమ్మతించ లేదు. పరశురామునికి బుద్ధి గరిపినట్లే జమదగ్ని, గంగాదేవులు భీష్మునిననునయింప తల

చిరి. గంగయు పునః పరశురామునిననునయించినది. చివరకు పర
స్పరము బ్రహ్మాస్త్రముల నుపసంహరించిరి.

3.1.1.4.5.9. పరాశర క్రోధోపశాంతి

ఈ వృత్తాంతము నన్నయ భారత భాగము "ఆది" పర్వము
సప్తమాశ్వాసములో (132-155) కలదు.

వరమును కోరిన వారు పులస్త్యాది మహర్షులు. వరప్రదాత పరా
శరుడు.

పరాశరుడు వసిష్ఠుని మనుమడు. "శక్తి" కుమారుడు. తన
తండ్రి రాక్షసుల వలన మరణంబు నొందెనని పరాశరుడు తెలిసికోపిం
చెను. కనుక రాక్షస వినాశార్థము సత్త్రి యాగమును మొదలిడెను.
మంత్రిబలము వలన బాలవృద్ధరాక్షస గణము హాహాకారములతో వేల
సంఖ్యలో మంటలో పడి యాహుతి యయిరి. అంత పులస్త్య, పులహ
క్రితుమహర్షులు వసిష్ఠాశ్రమమునకు కదలిరి. అట నాల్గప "అగ్ని" వలె
ప్రకాశించు పరాశరుని చూచిరి.

కం॥ ..............."అందఱు బ్రార్థిం
చిరి రాక్షస మారణంబు సేయకు మనుచున్" (154)

ఆ మాటలకు పరాశరుడు సమ్మతించెను. సత్రియాగము నుపసంహ
రించెను. ఆ యాగాగ్నిని హిమవదుత్తర ప్రాంతమున పారవేసెను.
ఆ "అగ్ని" వృక్షలతాదులను కాల్చెను.

3.1.1.4.5.10 ఔర్వుని క్రోధోపశాంతి

ఈ వృత్తాంతము నన్నయ భారత భాగము "ఆది" పర్వము
సప్తమాశ్వాసములో (139-149) కలదు. సర్వజనోపద్రవమును

కలిగించవలదని కోరిన వారు పితృ దేవతలు. వరప్రదాత ఔర్వుడు.

భృగు వంశస్థులు తపస్సంపన్నులు. కావున వారికి నాయుర్బల మెక్కువ. ఈ కారణమున వారికి "ఇహ"లోక వాసము నిర్వేదమును కలిగించెను. కనుక వా రాత్మహత్య చేసికొన దలచిరి. అట్లయిన పుణ్య లోకములు రావని సంశయించిరి. తమ్మెవరైన చంపిన బాగుండునని భావించిరి. ఇహలోకవాసము దుర్భరమగుటను వారు భార్యాసుతులకు కూడా తెలుపలేదు. చివరకుకార్తవీర్యార్జునునియాగములనుచేయుమని దానధర్మముల గావించుడని ప్రోత్సహించిరి. ఈ విధముగ ధనాగారము శూన్యమయ్యెను. దాన ధర్మరూపములో భృగువంశస్థులే యా సంపదను హరించిరి. కార్తవీర్యుని తర్వాత నతని పుత్రులైన కృతవీరులు పాలనమునకు వచ్చిరి. వారు భృగువంశస్థులపై కోపగించిరి. తండ్రి సంపద నీయవలసినదిగా బెదిరించి చంపిరి. చనిపోయిన వారు పితృ లోకమునకు వెళ్ళిరి. కాని యొక స్త్రీ తప్పించుకొనినది. ఆమె గర్భస్థ శిశువును తన "ఊరువు" నందు దాచినది. అతడే ఔర్వుడు. అతడు పెరిగి పెద్దవాడయ్యెను. తల్లివలన సమస్తమును తెలిసికొనెను. కృత వీరులపై పగ బట్టెను. సకల లోక ప్రళయార్థము ఘోర తపమును చేసెను. అంతనతని పితృదేవతలు ప్రత్యక్షమై

వ॥ "నీవు దీనికింగా సర్వజనోపద్రవంబు సేయ వలవ దిది
మా కభీష్టం బని" (141) తెలిపిరి.

తపము నిలిపినచో అగ్ని తన్ను కాల్చివేయునని ఔర్వుడు తన బాధను వ్యక్తము చేసెను. అంత వారు "మహోగ్ర కలుష వహ్ని జలధిలోన వదులుమని యాజ్ఞ నిడిరి. ఔర్వు డట్లు చేసెను.

3.1.1.4.5.11 భీష్మ క్రోధప శాంతి

ఈ వృత్తాంతము తిక్కవ భారతభాగము "ఉద్యోగపర్వము" చతుర్థాశ్వాసములో (340-355) గలదు. క్రోధమును మానుమని కోరిన వారు నారద మహర్షి, అష్టవసువులు. మన్నించిన వాడు భీష్ముడు.

అంబ విషయమై పరశురామ భీష్ములకు 23 దినముల పాటు యుద్ధము సాగెను. 23వ రోజు రాత్రి భీష్ముడు "అష్ట వస్తువుల" నారాధించెను. అతనికి స్వప్నములో వారు మోహనాస్త్రము నిచ్చిరి. మరునాడా మోహనాస్త్రమును భీష్ముడు పరశురామునిపై ప్రయోగింప దలచెను, అప్పుడు నారద మహర్షి వెళ్ళి

కం॥ గురునకు నవమానము ని
ష్ఠుర వృత్తిం జేయుట తగ దని" (350) పలికెను.

మరియు నప్పుడచ్చటికి వచ్చిన వస్తువులను చూపించి బుద్ధుల గఱప వారు వచ్చిరని చెప్పెను. ఆ "అష్టవస్తువులు" భీష్మునితో

కం॥ "నారదముని త్రైలోక్య స
మారాధ్యుం డితని పలుకు లాగమ వాక్యో
దారములు వినుము వీనిం
గ్రూరత వాటింప దగదు గురు విషయమునన్" (354)

అని తెలిపిరి.

వారి మాటలను వినిన భీష్ముడు క్రోధమును మాని పరశురామునిపై సమ్మోహనాస్త్రమును వేయలేదు.

పెద్దల మాటలను గౌరవించుట యిందలి ప్రత్యేకత.

3.1.1.4.5.12 అష్టమహిషీ జనోపశాంతి :-

ఈ వృత్తాంతము భారతభాగము మౌసల పర్వము (192-205) లో కలదు. కోపగించిన వారు కృష్ణుని దేవేరులు, కాగా శాంతింపజేసిన వాడు అర్జునుడు.

అర్జునుడు కాననములో బలరామ కృష్ణుల శవములను గాంచెను. అచ్చటనే వారికి దహన క్రియల నాచరించెను. అదేరోజు రాత్రి ద్వారకకు చేరెను. బలరామ కృష్ణుల మరణవార్తను తెలిపిన రుక్మిణి మొదలైన వారు తొందరగా తెములరని బలరామ కృష్ణుల నిర్యాణమును చెప్పలేదు. పట్టణ మంతయు కదలు నప్పటికి సూర్యోదయమైనది. అప్పుడా సముద్రము పొంగి ద్వారకానగరమును ముంచి వేసినది. ప్రయాణములో బోయ లడ్డగించి సర్వస్వమును దోచుకొనిరి. అర్జునుని ప్రతాపము వ్యర్థమైనది. ఇంద్రప్రస్థపురమునకు చేరిన తర్వాత "అర్జునుడు" బలరామ కృష్ణుల నిర్యాణమును విశదము చేసెను. ద్వారకలో దాచినందుకు నాలస్యముగా మరణవార్తను చెప్పినందుకు వారు కోపగించిరి. సముద్రము ద్వారకను ముంచివేయునని తెలియుటచే తాను దాచితినని తన్ను దయతో చూడుడని ప్రార్థించెను.

కం॥ ———— —"ఇంక నుచితా
చారంబులు నడపుటయు యిచట గృత్యము దు
ర్వారం బగు విధి చేతకు
నేరికి నడ్డుపడ వశమె యేల యులదురన్" (203)

అని యోదార్చిరి. చివరకు చితిని పేర్చి రుక్మిణి జాంబవతులు "అగ్ని" ప్రవేశమును చేసిరి. సత్యభామ మాత్రము తపమున కేగినది.

3.1.1.4.5.13. ధృతరాష్ట్ర గాంధారుల క్రోధోప శాంతి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శల్య పర్వము ద్వితీ శ్వాసములో (469_475) గలదు. వరమును కోరి పొందిన వాడు కృష్ణుడు. వర ప్రదాతలు గాంధారీ ధృతరాష్ట్రులు.

భీముడు దుర్యోధనుని తొడలను విరగ గొట్టెను. కురుక్షేత్ర సమ రము సమాప్తమైనది. శ్రీకృష్ణుడు తన తమ్ముడగు సాత్యకిని, పాం డవులను మాత్రము విశ్రాంతికని చెప్పి కొంచెము దూరమున నున్న "ఓఘవతి" తీరమునకు పిలుచుకొని వెళ్ళెను. దుర్యోధనుని యూరు భంగ యోటమి గాంధారికి తెలియక మునుపే యామె నోదార్చుట మంచిది. లేనిచో నామె శపించునని ధర్మరాజు భావించెను. అందుకే ధర్మరాజు శ్రీకృష్ణుని కరిపురమునకు పంపెను. శ్రీకృష్ణుడు వెళ్ళ నప్పటికే యచటికి వేదవ్యాసముని వచ్చి గాంధారీ ధృతరాష్ట్రులతో మాట్లాడుచుండెను. శ్రీకృష్ణుడు వెళ్ళి ధతరాష్ట్రుడికి చెప్పవలసిన విష యమును చెప్పి

వ॥ పాండవులు కల్మషాయత్త చిత్తులు గామియు మీరు
ఎఱి లేమియు విచారింపు మేను ప్రమొక్కి వేడికొనియెద
వారల దెస గోపంబు లేకుండ వలయు" (369)
నని పలికెను.

వెంటనే గాంధారి వైపు తిరిగి యామెను పొగడెను. దుర్యో ధనుని వలననే యింత కష్టము దాపురించెనని చెప్పి

వ॥ పాండవుల వలనం దప్పు లే దని యెఱుంగుదు గాదె
వారల కలుగ కుండునది నీ వలిగి చూచినం

త్రిలోకంబులు భస్మీభూతంబు లగు నట్టి తపః ప్రభావంబునం బ్రసిద్ధవు గావున నిన్నుం బ్రార్థించెద నని పల్కెను" (372). గాంధారి శ్రీకృష్ణుని యనునయ పూర్వక ప్రార్థనను విని శ్రీకృష్ణునితో

వ॥ "అది యంతయు నీ చెప్పి నట్టిద యని" (372) పలికెను. మఱియు నెక్కువ బాధ కలుగుటచే నామె ముఖమునకు చీర నడ్డము పెట్టుకొని యేడ్చెను. అప్పుడు మరల శ్రీకృష్ణ డామె నోదార్చెను. పిమ్మట వారి సనుమతిని పొంది శ్రీకృష్ణుడు పాండవుల యొద్దకు వెళ్ళెను.

3.1.1.4.6. సహాయ వరములు

ఆంధ్ర మహాభారతములోని సహాయ వరములను ప్రధానముగా నాలుగు వర్గములుగా విభజించ వచ్చును.

1. సమరమున ప్రత్యక్ష
2. సమరమున పరోక్ష
3. సారథ్య
4. ఇతర సహాయ వరములు

3.1.1.4.6.1. సమరములో ప్రత్యక్ష సహాయములు

యుద్ధమున ప్రధాన వ్యక్తులకు తదితరులు చేయు సహాయము లీ వర్గమున చేరును. ఇవి దుర్యోధనార్జులకు శ్రీకృష్ణ; దుర్యోధన; ధర్మరాజులకు శల్య; అర్జునకు సాత్యకి సహాయములు.

3.1.1.4.6.1.1. దుర్యోధనార్జునులకు శ్రీకృష్ణ సహాయము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగ" పర్వము ప్రథమాశ్వాసములో (6-77) గలదు. సమర సహాయ్యమును కోరిన వారు దుర్యోధనార్జునులు కాగా సమ్మతించిన వాడు శ్రీకృష్ణుడు.

సంధి ప్రయత్నములు వ్యర్థము కాగా సమరము సన్నద్ధమైనది. కౌరవ పాండవులు బలసమీకరణకు సన్నద్ధులయ్యిరి. అందులో భాగముగా దుర్యోధనార్జునులు ద్వారకకు కదలిరి. అపుడు శ్రీకృష్ణుడు నిదురించు చుండెను. ముందుగా చేరిన దుర్యోధనుడు కృష్ణుని తల వైపు కూర్చొనెను. పిమ్మట వచ్చిన అర్జునుడు కృష్ణుని పాదముల కడ కూర్చొనెను. కొంత సమయమునకు శ్రీకృష్ణుడు లేచి మొదట "అర్జునుని" పిమ్మట దుర్యోధనుని జూచెను. వారిని గౌరవించెను. వారే పనిపై వచ్చిరో యడిగెను. మొదట దుర్యోధనుడు.

ఉ॥ ————————"కయ్యము సేయ వగన్ సహాయముం
గోరి భవత్ప్రకాశమునకుం జనుదెంచితి మేము వీరు నీ
కారయ నొక్కరూప హృదయంబున జేర్చిన బాంధ
వంబునన్" (69)

అని కోరెను. మరియు తాను ముందుగా వచ్చినట్లు తెలిపి "లోక ధర్మమునను సరించి సహాయపడుమని ప్రార్థించెను. అంత కృష్ణుడు- "నీవిటమున్నె వచ్చినప్పటికి పార్థుని తొలుత జూచితిని. ఇద్దరికి సహాయపడుట నాధర్మము. నిరాయుధుడనైన తానొక వైపున నాయుధ ధారులైనపదివేల మంది యనుచరు లొక వైపున పోరాడుదురని విశదము చెప్పెను.

కం॥ ఈ రెండు దెఱంగు లందు నెయ్యది ప్రియ మె
వ్వారికి జెప్పుడు దొలితొలి
గోరికొనన్ బాలునికి దగుం బాడిమెయిన్ (75)

అని పలికెను. అర్జునుడు కృష్ణుని కోరికొనగా దుర్యోధనుడు పదివేల సుందినిని కోరుకొనెను.

3.1.1.4.6.1.2 దుర్యోధనునకు శల్య సహాయము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ఉద్యోగ పర్వము ప్రథమాశ్వాసము (91-103)లో కలదు. యుద్ధ సాహాయ్య మడిగిన వాడు దుర్యోధనుడు కాగా సమ్మతించిన వాడు శల్యుడు.

శల్యుడు మద్రదేశాధిపతి. పాండవులకు మేనమామ వరుస. కనుక శల్యుడు "ఉపప్లావ్యము" నందున్న పాండవుల కడకు పయనము సాగించెను. ఈ విషయము తెలిసిన దుర్యోధనుడు శల్యుని సైన్యమునకు చక్కని యేర్పాట్లను చేసెను. శల్యుడు సంతోషించెను. సదుపాయములను సమకూర్చిన వారు పాండవులని తలచి వారిని పిలుపుడని యాదేశించెను. అప్పుడే దుర్యోధనుడు శల్యుని కడ నిల్చి యిదంతయును తన యేర్పాట్లని విశదీకరించెను. శల్యుడు సంతసించి యిష్ట వరమును కోరుకొను మనెను. దుర్యోధనుడు -

కం॥ "———— నాకు న
మాత్యుడవై పూని నడుపు మత్సైన్యంబున్" (95)

అని ప్రార్థించెను, పాండవులును ధార్తరాష్ట్రులును తన కొకటియే యగుట వలన దుర్యోధనుడు కోరినట్లు చేసెదనని నమ్మకమును కలిగించెను.

3.1.1.4.6.1.3 ధర్మరాజునకు శల్య సహాయము

ఈ వృత్తాంతము భారతభాగము "ఉద్యోగ"పర్వము ప్రథమాశ్వాసములోను (104-115-215-216) భీష్మపర్వము ప్రథమాశ్వాసములోను (1F1) కలదు. కోరిన వాడు ధర్మరాజు. కాగా కోరిక మన్నించిన వాడు శల్యుడు.

శల్యుడు సుజనుడు. అతనికి కురు పాండవుల పట్ల నేకాభిప్రాయమే కలదు. పాండవులు ఉప ప్లావ్యములో నుండగా శల్యుడు వారిని కలిసి కొనుటకై వెళ్ళెను. దారిలో దుర్యోధనుడు శల్యునికి నన్ని సన్నాహములను చేసెను. కాని చివరకు పాండవుల కడ చేరెను ధర్మరాజు శల్యునితో కర్ణునకు సారథివి కమ్మని యదియ వరమని యడిగెను. పైగా

వ॥ "సమర సమయంబున నిరాకరించి పలికి కర్ణు చిత్తంబునకుం గలంక పుట్టించి పార్థు రక్షింప వలయు నకృత్యం బని యనుమానింపక మత్రార్థనంబున నెల్ల భంగుల నివ్విదం బనుష్టింప వలయు నని యభ్యర్థించెను"

(ఉద్యోగ-ప్ర.అ.110)

శల్యుడు సమ్మతించుచు తాను కర్ణసారథియయినను పార్థుని కాచెదనని "భరోసా" యిచ్చెను.

యుద్ధమునకు భీష్మాదుల నుండి యనుమతిని ధర్మరాజు తీసికొను నపుడు కర్ణునకు శల్యుడు సారథి యగుట సంభవించునని పలికి,

వ॥ "కయ్యంబు నప్పుడు కర్ణుతేజంబు దూలం బలికి యతని జిక్కువఱుప వలయు నని వరంబు గోరెను." (భీ-ప్ర.అ.161)

అందుకు శల్యుడు "అట్లు చేయుదునని పలికెను." (161)

### 3.1.1.4.6.1.4 అర్జునునకు సాత్యకి సాహాయ్యము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ద్రోణ పర్వము తృతీయాశ్వాసము (278 307)లో కలదు. సహాయమును కోనవాడు ధర్మరాజు కాగా సమ్మతించిన వాడు సాత్యకి.

అర్జునుడు జయద్రధుని సంహరించెదనని ప్రతిన చేసెను. సమరము భీకరముగా సాగినది. ఆ నాటి యుద్ధములో శ్రీకృష్ణుని పాంచజన్యము మాత్రము వినబడినది. అర్జునుని దేవదత్తము వినబడలేదు. ఈ పరిస్థితిలో ధర్మరాజు దిగులొందెను. అర్జునునకు నేదో యాపద వాటిల్లెనని భయపడెను. సహాయముగా వెళ్ళుమని సాత్యకిని

కం॥ కురు బలము సొచ్చి నీ దగు
శరముల దర్పంబు సూపి చయ్యన జని య
న్నరు గైకొని నా యుల్లము
పరితాపము దీర్పవే నృపాలుడు మెచ్చన్" (290)

కోరెను. "అర్జును" న కెట్టి యాపదయు రాదని సాత్యకి పలుమార్లు చెప్పెను. ప్రస్తుతము ధర్మరాజు రక్షణ మవశ్య కర్తవ్య మనెను. కాని తనకు రక్షణగా ధృష్టద్యుమ్నుడున్నాడనియు కిరీడికి సహాయముగా సాత్యికిని వెళ్ళుమనియు బలవంతము చేసెను. సాత్యకి వెళ్ళక తప్ప లేదు.

### 3.1 1.4.6.2 సమరమున పరోక్ష సహాయ వరములు

పాలకులకు కష్టమును కలిగించు దుష్టులను, మరణ మాసన్నమైనపుడు దుష్టులతో కలిసి యున్న సజ్జనులను, వీలు లేక దుష్టుల పక్షమున మండి విజృంభించి పోరాడుచున్న గొప్ప వారిని వధించుటకు

పరోక్షముగ సహాయపడు విషయము ఈ భాగమున చేరును. ఇట్లు సహాయపడిన వారు శివ కేశవులు, శ్రీకృష్ణ, అగస్త్య మహర్షులు.

3.1.1.4.6.2.1. ఇంద్రునికి శివ, కేశవుల వరములు

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము పంచమాశ్వాసములో (423-427) గలదు. వృత్రాసురునిపై విజయమునకు ఇంద్రుని ప్రోత్సహించిన వారు దేవ ఋషులు. వర ప్రదాతలు శివ కేశవులు.

పూర్వము దేవేంద్ర వృత్రాసుర సమరము భీకరముగా సాగినది. ఉజ్జ్వల రథమునెక్కి ఇంద్రుడసురుని పైకి నరిగెను. కాని లాభము లేక పోయినది. అసురుడు మహాబలమును వినియోగించెను. ఇంద్రుడు మూర్ఛితుడయ్యెను. దేవతలు వసిష్ఠాది మునులును ఇంద్రుని మూర్ఛనుండి తేర్చిరి. సమరమును చూచుటకు బ్రహ్మ, హరి రుద్రులు వచ్చిరనియు పోరుకు సిద్ధము కమ్మని వసిష్ఠుడు ఇంద్రుని ప్రోత్సహించెను. అప్పుడు

చం॥ "—————— దేవగురు డప్డు మునీంద్రులు దాను నమ్మరు
త్పతి విజయము గోరి హరు బ్రార్థనసేయు దదీయతేజము
ద్ధత చటుల జ్వరం బగుచు దైత్యపతిం బొదివెన్ సురేశ్వరో
ద్యత కులిశంబు బొందె హరి దత్పమయంబున" (424)

ఆ సమయమున రుద్రుడు వృత్రాసురుని

కం॥ "— — — —అబ్బలము నా
ఘన తేజము చేత నడగు గడగు" (426) మని ఇంద్రుని ప్రేరేపించెను. హర తేజముతోను, వజ్రాయుధమునందు చేరిన హరి సాహాయ్యముతోను, "ఇంద్రుడు" వృత్రాసురుని సంహరించెను.

### 3.1.1.4.6.2.2. అశ్వత్థామకు మహేశ్వర వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము సౌప్తిక పర్వము ప్రథమాశ్వాసములో (94-134) కలదు. వరమును కోరినవాడు అశ్వత్థామ కాగా వర ప్రదాత శివుడు.

కురుక్షేత్ర సమరము ముగిసినది. పాండవులు జయించిరి. కౌరవులలో దుర్యోధనుడు తక్క యితరులు మరణించిరి. దుర్యోధనుని చెలికాడగు "అశ్వత్థామ "అపాండవము" చేసెదనని ప్రతిన పలికెను. ఆ మాట ప్రకారము పాండవ శిబిరమునకు చేరెను. అచట నొక భూతమును దర్శించెను. ఆ భూతముపై బాణములను ప్రయోగించెను. కాని యా భూతము బాణములను మ్రింగెను. అప్పుడతనికి ననేక జనార్ధనులు కనబడిరి. అంత "అశ్వత్థామ" నిరుత్తరుడయ్యెను. పశ్చాత్తప్తుడయ్యెను. భూతాధిపతిని కొలిచిన తన కష్టము తీరునేమో యని తలించి ప్రార్థించెను. అంత బంగారు వేదిక కనబడినది. కాని యా వేదిక మంటలతో వెలుగు చుండెను. అందాత్మాహుతిని చేసికొన నిశ్చయించెను. అపుడు ప్రథమ గణము సాక్షాత్కరించెను. ధనుర్బాణములను వేదికలో వేసెను. చాలక తాను "అంగీరస" గోత్రజుడనని యూర్ధ్వబాహుడై యగ్నిలో దుమికెను. కాని శరీరము కాల లేదు. శివుడు మెచ్చుకొనెను.

వ॥ "మహనీయ ఖడ్గం బవ్విప్రుని చేతి కిచ్చుచు నతం
డెఱుంగ కుండ దేజోరూపంబున నతని తనువున
నావేశించెను" (134)

3.1.1.4.6.2.3. శ్రీకృష్ణుని వరము భీష్మ వధార్థము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము భీష్మ పర్వము ద్వితీయాశ్వాసములో (4-21) గలదు. వరమును కోన వాడు ధర్మరాజు. వరప్రదాత శ్రీకృష్ణుడు.

కురుక్షేత్ర సమరములో మొదటి రోజున భీష్ముడు విజృంభించి పాండవుల సైన్యమును ఒకావికలు చేసెను. ఆ రాత్రి ధర్మరాజు తన తమ్ముళ్ళతో కలిసి శ్రీకృష్ణుని శిబిరమునకు వెళ్ళెను. భీష్ముని విజృంభణమును విశదీకరించి యతనిని ఢీకొన భీమార్జునులు చాలరనియు కనుక కాననముల కేగెదనని తెలిపెను. శ్రీకృష్ణుడు ధర్మరాజు దైన్యమును గుర్తించి

ఉ॥ "నెవ్వగ యింత యేల విను నీ కెదు రెవ్వరు నీదుతమ్ములం
దెవ్వరు సూచినన్ జగము లిన్నియు గెల్వ గలారు లావునం
గ్రొవ్విన భీష్ము నోర్చు రణకోవిదుడైన శిఖండి యేను నీ
కొవ్వని వారి నెల్ల గ్రమయుక్తి లయం బొనరింతు
నెమ్మెయిన్" (11)

అని తన సాహాయ్యమును నొక్కి వక్కాణించెను.

3.1.1.4.6.2.4. అగస్త్యమహర్షి సముద్ర పానము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము అరణ్య పర్వము తృతీయాశ్వాసము (18-19) (33-42) లో కలదు. వరమును కోరినవారు దేవతలు కాగా ఉపాయమును సూచించిన వాడు విష్ణువు వర ప్రదాత అగస్త్యుడు.

కాలకేయులు రాక్షసులు. వారు దేవతలను బాధించుచుండిరి. దేవతలు నిస్సహాయులై విష్ణు సహాయమును కోరిరి. అగస్త్య మహర్షి కడకు వెళ్ళుడని విష్ణువు తెలిపెను. దేవతలు అగస్త్యమహర్షి కడకు వెళ్ళి

కం॥ "అమర హితంబుగ జగదహి
తము దలుగుము పేర్మితో బుధస్తుత గుణ" (19)

అని ప్రార్థించిరి. వారి ప్రార్థనను అగస్త్యుడు మన్నించెను.

3.1.1.4.6.3. సారథ్య సహాయ వరములు

ఆంధ్ర మహాభారతములో సారథ్య సహాయ వరములు రెండు
1) శ్రీకృష్ణుని వరము 2) శల్యుని వరము

3.1.1.4.6.3.1. విజయునకు శ్రీకృష్ణ సారథ్యము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ఉద్యోగ పర్వము ప్రథమాశ్వాసము (84-90) లో కలదు. కృష్ణ సారథ్యమును కోరిన వాడు అర్జునుడు కాగా వరప్రదాత శ్రీకృష్ణుడు.

దుర్యోధనార్జునులు సమర సహాయార్థమై కృష్ణుని కోరిరి. అర్జునుడు నిరాయుధుడైన కృష్ణుని కోరుకొనెను. ఆయుధధారులైన పది వేల మందిని దుర్యోధనుడు కోరుకొనెను. దుర్యోధనుడు హస్తినకు మరలగనే శ్రీకృష్ణుడు తన్నెందుకు కోరు కొంటివని "అర్జునుని" ప్రశ్నించెను. అంత అర్జునుడు విజయమునకు కృష్ణుడు మూలమనియు ఎదుటి పక్షముననున్నచో వారికే విజయము దక్కుననియు స్వపక్షమున నున్న యెడల కీర్తి ప్రతిష్టలు తమకే దక్కుననియు స్పష్టము చేసెను. పైగా

కం॥ "సారథ్యం బొనరింప మ
పార కృపాలీల నెల్ల భంగుల నా కీ
గౌరవమును జిరకాలము
గోరిన యది నిమ్ము గుణరత్న నిధీ" (88)

అని ప్రార్థించెను. తాను సారథియై యసమాన సమర విన్యాసము లకు దోహదము చేసెదనని కృష్ణుడు "అర్జునున"కు విశ్వాసమును కలిగించెను.

3.1.1.4.6.3.2. కర్ణునకు శల్య సారథ్యము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము కర్ణ పర్వము ప్రథమాశ్వాసము (229_256, 308_314)లో కలదు. వరమును కోరిన వాడు దుర్యోధనుడు కాగా కర్ణునికి సారథిగా నుండుటకు సమ్మతించిన వాడు శల్యుడు.

కౌరవ పాండవ సమరము భయంకరముగ సాగెను. కౌరవ పక్షమున భీష్మ ద్రోణాదులు పోరాడిరి. అపై కర్ణుడు సైన్యాధిపతి యయ్యెను. మొదటి రోజు యుద్ధము గడచినది. రెండవ నాటి యుద్ధము మొదలైనది. ఆ నాడు కర్ణుడు దుర్యోధనుని దగ్గరకు వెళ్ళి తనకు శల్యుడు సారథి యగుట తగునని పలికెను. దుర్యోధనుడును సమ్మతించెను. వారిరువురు శల్యుని కడ కేగిరి. దుర్యోధనుడు

సీ॥ వినతుండనై వేడికొనియెద రాజుల
నడుమ నీ దగు సౌమనస్య మెఱిగ

యర్జును ననిదెగటార్పగ వలయుట
యూహించి సంభృతోత్సాహ లీల

ఆ.వె.॥ "గావు మితవి ననుచు గర్ణుని జూపి యీ
తని రథంబు గడపు మనఘ" (245)

కం॥ "ఇమ్మివ్వరమ్ము సార
థ్యమ్మితనికి జేయు" (247) మని శల్యుని ప్రార్థించెను. కాని కర్ణుని కులమును తడవి శల్యుడు నిరాకరించెను. సారథ్యమున కృష్ణుని కంటె గొప్ప వాడవని శల్యుని దుర్యోధనుడు పొగెడెను. తన పరిస్థితిని వివరించి బ్రతిమాలెను. అంత నతడు సారథ్య సమయమున కర్ణునితో విచ్చల విడిగ మాటలాడినను కర్ణుడు తప్పు పట్టకూడదనియు నట్లైన సారథ్యమును చేసెదననియు ప్రతిన పలికెను. కర్ణుడందుల కంగీక రించగా శల్యుడు కర్ణునికి సారథి యయ్యెను.

3.1.1.4.6.4. ఇతర సహాయ వరములు

ఇవి రెండు 1. శ్వేతకికి ఇందుశేఖరుని సహాయము
2. ఇంద్రునకు శ్రీకృష్ణుని సహాయము

3.1.1.4.6.4.1. శ్వేతకికి ఇందుశేఖర వరము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వమష్టమాశ్వాసము (243-247)లో కలదు. వరప్రదాత ఇందుశేఖరుడు కాగా వరానుగ్రహమును పొందినవాడు శ్వేతకి.

శ్వేతకి రాజర్షి. అతడనేక యాగములను చేసినవాడు. ఒకసారి శతవార్షిక సత్రయాగమును చేయుటకు సమకట్టెను. కనుక ఋత్విక్కు

లను ప్రార్థించెను. కాని వారు నిరంతర క్లేశమునకు సమ్మతించలేదు. ఈశ్వరుడు యాజకత్వమును చేయగలడని సూచించిరి. శ్వేతకి కైలాసమునకు వెళ్ళి యుగ్రతపమును చేసెను. పరమేశ్వరుడు ప్రత్యక్షమయ్యెను. శ్వేతకి తనకు ఋత్విక్కుడవు కమ్మని శివుని ప్రార్థించెను. అంత శివుడు యాజకత్వంబు బ్రాహ్మణులకు తగును గాని యితరులకు కాదని "అగ్ని"దేవుని తృప్తుని చేయుమని యానతిచ్చెను. శ్వేతకి "అగ్ని"దేవుని పూజించెను. అతని నిష్ఠకు యాగ నిర్వహణ కాంక్షకు సంతృప్తుడై "ఈశ్వరుడు" దుర్వాసుని పిలిచి

కం॥ "ఈత డన వరత యజన
ప్రీతుం డీతనికి దురిత భీతునకు మనః
ప్రీతిగ నార్త్విజ్యమ్ము మ
హాతేజోధికుఁడ చేయు మని దయ బంచెన్" (246)

శ్వేతకి యాగమునకు తాను సహాయ పడకున్నను నితరులను నియమించుట విశేషము.

3.1.1.4.6.4.2. ఇంద్రునకు శ్రీకృష్ణుని సాహాయ్యము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది"పర్వమష్టమాశ్వాసము (319-321)లో కలదు. వరమును కోరినవాడు ఇంద్రుడు కాగా వర ప్రదాత శ్రీకృష్ణుడు.

అగ్ని ఖాండవవనమును కాల్చువేళ శ్రీకృష్ణార్జునులు సహాయ పడిరి. ఇంద్రుడు శ్రీకృష్ణార్జునులను సామాన్యులుగా తలంచి పోరాడి యోడి పోయెను. అపుడు శ్రీకృష్ణార్జునులు నర నారాయణులని దివ్య వాణి పలికినది. అంత "ఇంద్రుడు" కృష్ణార్జునుల కడకు వెళ్ళెను. అర్జునునకు ననేకాస్త్రములను నిచ్చి శ్రీకృష్ణునితో

వ॥ "అర్జునున కెప్పుడు నిష్ట సఖుండవై యుండుమని" (321)
ప్రార్థించెను. కృష్ణుడందులకు సమ్మతించెను.

3.1.1.4.7. ఉపాయ వరములు

ఆంధ్ర మహాభారతములో "ఉపాయ" వరములు పదమూడు గలవు. వీటిని దైవ, ఋషి, మహావీర ప్రోక్తములని వర్గీకరించ వచ్చును.

3.1.1.4.7.1. దైవ ప్రోక్తములు

దేవతలె యుపాయమును సూచించినవి దైవప్రోక్తములు. బ్రహ్మ, విష్ణు, సూర్యు లట్టివారు.

3.1.1.4.7.1.1. బ్రహ్మ వరములు

బ్రహ్మ, దేవతలకు, గరుత్మంతునికి సూచించిన యుపాయము లీ వర్గమున చేరును.

3.1.1.4.7.1.1.1. దధీచి సంప్రార్థనోపాయము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య" పర్వము తృతీయాశ్వాసములోను (3-81) తిక్కన భారతభాగము శల్యపర్వము ద్వితీయాశ్వాసములోను (204-207) గలదు. కథ యించుమించు సమానము. వరప్రదాత బ్రహ్మ కాగా వరానుగ్రహమును పొందిన వారు దేవతలు.

కృత యుగములో దేవదానవులకు భీకర సమరము జరిగెను. దానవులకు విజయమును దేవతలకు పరాజయమును కలుగుచుండెను. వృత్రాసురుని విజృంభణమునకు "ఇంద్రుడు" తట్టుకొనలేక పోయెను.

దేవతలు బ్రహ్మదేవుని శరణుజొచ్చిరి. బ్రహ్మ దధీచిని వేడుడనియు, నతని "అస్థుల" నాయుధములుగా చేసుకొనుడనియు తెలిపెను.

బ్రహ్మ యాదేశము మేరకు దేవతలు దధీచిని కోరిరి. అతడు సంతసించి, కృతార్థుడనైతినని పలికి

**వ॥** "దేవ హితార్థముగా నిజ ప్రాణంబులు విడిచెను."

(అరణ్య 1.6)

అతని "అస్థుల"తో వజ్రాయుధము "ఇంద్రుని"కిని. నితర దేవతలకు నితర యాయుధములుగా సిద్ధమయ్యెను.

3.1.1.4.7.1.1.2. అగ్ని సంప్రార్థనోపాయము

ఈ వృత్తాంతము తిక్కన భారత భాగము "అనుశాసనిక" పర్వము తృతీయాశ్వాసములో (141-151) గలదు. ఉపాయమును సూచించినవాడు బ్రహ్మ కాగా వరానుగ్రహమును పొందిన వారు దేవతలు.

తారకుడు రాక్షసుడు. అతడు దుర్జయుడుగా నుండగా దేవతలు బాధలకు గుఱియైరి. తారకాసుర సంహారము త్వరితగతిన సాగవల యునని దేవతల యాశయము. కనుక వారు బ్రహ్మను కోరిరి. అగ్ని దేవుని నాశ్రయించి ప్రార్థనము చేయవలసినదిగా వారిని బ్రహ్మ యాదేశించెను. దేవతలు అగ్ని కడకు వెళ్ళి,

**వ॥** "తారక దైత్యు చేయు బాధ లెఱింగించి వాడేమి యుపాయం బునం దెగటాఱు నట్టులం గాపాదింపుమని నిన్ను బ్రార్థింప వచ్చితిమని పలికిరి" (148)

అప్పుడు అగ్ని తనలో ప్రకాశించు శంభుని వీర్యమును గంగలో విడిచెను. ఆ వీర్యభారమును గంగయు భరించలేక పోయినది. తన భారమును పర్వత తటమున శరవణస్థము గావించినది. అక్కడ కుమారస్వామి జన్మించెను. అప్పుడే యారుగురు కృత్తికలు "నా కొడుకు, నా కొడుకు" అని లాలించిరి. బ్రహ్మ బాలుని పూజించి దేవ సేనానిగా జేసెను.

తారకాసుర సంహారమును త్వరిత గతిన సాగుట యాశయము. కనుక దేవతలు బ్రహ్మను కోరుట తప్పుగాదు. దీని వలన "అగ్ని" వీర్య తేజమును వదలుట, గంగ భరించకుండుట. తేజమును రెల్లు గడ్డిలో దాచుట మొదలగు కార్యములకు నవకాశ మొసంగెను. అగ్ని దేవుని వేడుమని యుపాయమును చెప్పిన వాడు బ్రహ్మ.

**3.1.1.4.7.1.1.3.** అగ్ని జ్వాలోప శాంతికి నుపాయము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వము ప్రథమాశ్వాసము (241-254) లో గలదు. వరప్రదాత బ్రహ్మ కాగా వరానుగ్రహమును పొందిన వాడు గరుత్మంతుడు.

గరుత్మంతుడు ఖగరాజు. అతడు తల్లి దాస్యమును తీర్చుటకై "అమృతార్థము" దేవలోకమునకు వెళ్ళెను. అమృతము చుట్టును అగ్ని వెలుగుచుండెను. తన యీకలు కాలి పోవునని గరుత్మంతుడు భయపడెను. కనుక బ్రహ్మదేవుని కడ కేగెను. అగ్ని భయమును బాపుకొనుటకు నుపాయమును వేడెను. అంత నతడు

చం॥ "— — — — — — — — — —" వెన్న పై పయిన్
వితతము గాగ జిహ్వలకు ప్రేగగు నట్లుగ జాల పైచినం
బతగవరేణ్య మక్క బడు బావకు డయ్యెడ జొచ్చి నీదు వాం

భితము ఫలింప సత్వరత జేకొను మయ్యమృతంబు" (253)

అని యుపాయము ననుగ్రహించెను. గరుత్మంతుడు గోవుల మంద కడకు వెళ్ళి, కొండంత వెన్నను సేకరించుకొని అగ్ని మీద వేసెను. అగ్ని జ్వాలలు తగ్గగా "అమృతము"ను తీసికొని పోయెను.

3.1.1.4.7.1.2. విష్ణుమూర్తి వరములు

ఇంద్రాది దేవతల కిచ్చిన వరము లీ వర్గమున చేరును.

3.1.1.4.7.1.2.1. వృత్ర సంహారోపాయము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగ" పర్వము ప్రథమాశ్వాసములో (127-132) గలదు. ఉపాయమును సూచించిన వాడు శ్రీహరి. ప్రయోజనమును పొందిన వాడు దేవేంద్రుడు.

వృత్రాసురుని ధాటికి తట్టుకొనలేక "ఇంద్రుడు" మందర గిరి శిఖరమున దాగెను. దేవతలు ఇంద్రుని నన్వేషింప సాగిరి. చివరకు శ్రీహరి కడకు వెళ్ళుదమని నిర్ణయించిరి. అట్లు వారు శ్రీహరి దగ్గరకు వెళ్ళి వృత్రాసురుని చేతలను విన్నవించిరి. ఆ మాటలను వినిన విష్ణుమూర్తి

కం॥ ——————"ఒకటి సెప్పెద

విను డాతని తోడ నమర విభునకు దగ బొం

దొన రింపు డొక్క సమయం

బున నడకువ గులిశధార బొందెద నేనున్" (131)

అని స్పష్టము చేసెను. అట్లే విష్ణుమూర్తి కులిశమున ప్రవేశించి వృత్రాసురుని సంహారమునకు సహాయపడెను.

3.1.1.4.7.1.2.2. కాలకేయ సంహారోపాయము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్యపర్వము తృతీయాశ్వాసములో (9-17) గలదు. వరప్రదాత విష్ణువు. వరానుగ్రహమును పొందిన వారు దేవతలు. కాలకేయులను చంపుటకు విష్ణుమూర్తి యిచ్చిన యుపాయమే వర ఫలితము.

వృతు డొక రాక్షసుడు. అతనిని "ఇంద్రుడు" సంహరించెను. కాని వృత్రుని యనుచరులైన కాలకేయులు పలాయనులైరి. వారు సముద్రమున దాగిరి. పగటివేళ దాగి రాత్రివేళ నొడ్డున చేరి చ్యవనాది ఋషులను బాధింప సాగిరి. అందువలన వారు యాగములను మానివేసిరి. అపుడు "ఇంద్రా"దులు విష్ణువుని శరణు జొచ్చిరి. అంత నతడు

కం॥ "వరుణ జలంబుల మిత్రా
వరుణ తనూజుండు వీర్య వంతుండై చె
చ్చెర ద్రావ నోపు నిందఱు
నరుగుడు ప్రార్థింపు డమ్మహాత్ము నగస్త్యున్" (17)

విష్ణువు యొక్క యాదేశముతో దేవతలు "అగస్త్యు"ని కడకేగి ప్రార్థించి కార్యమును నిర్వర్తించుకొనిరి.

3.1.1.4.7.1.2.3. అశ్వమేధయాగ సన్నాహోపాయము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగ" పర్వము ప్రథమాశ్వాసములో (148-168) గలదు. వరప్రదాత విష్ణుమూర్తి కాగ వరానుగ్రహమును పొందిన వారు దేవతలు.

పూర్వము నహుషుడు నూరు యాగములను చేసి, "ఇంద్ర" పదవిని చేపట్టెను. "ఇంద్రుడు" స్వర్గమును వదలి పలాయను

డయ్యెను. నహుషుడు శచీదేవిని కామించెను. దేవతలు దిగులు చెందిరి. శచీదేవి బృహస్పతిని శరణు జొచ్చినది. ఈ వార్త విని నహుషుడు దేవతలను మందలించెను. వారు బృహస్పతి దగ్గరకు వెళ్ళి శచీదేవిని పంపుడని కోరిరి. కాని చివరకు శచీదేవియే కాల వ్యవధిని కోరుట తగునని సూచించిరి. బృహస్పతియు సమ్మతించెను. శచీదేవియు కాలవ్యవధి నడిగినది. నహుషుడు సమ్మతించెను. ఇంతలో దేవతలు విష్ణుమూర్తి కడకు వెళ్ళి "ఉపాయము" నభ్యర్థించిరి. అంత విషువు

కం॥ "హయ మేథంబున నాకుం
ప్రియ మొనరింపగ వృత్ర భేదికి బుణ్యో
దయ మగు" (167) నని తెలిపెను.

దేవతలు "ఇంద్రుని" కడకేగి యతని చేత "అశ్వమేధ" యాగమును చేయించి కల్మష రహితుని జేసిరి. ఇంతలో "అగస్త్య" మహర్షి శాప ముతో నహుషుడు భూలోక పతితు డయ్యెను.

**3.1.1.4.7.1.3.** శక్తి గ్రహణమునకై సూర్యోపాయము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య" పర్వము సప్తమాశ్వాసములో (283-308) గలదు. ఉపాయమును సూచించిన వాడు సూర్యభగవానుడు కాగా సమ్మతించిన వాడు కర్ణుడు.

కర్ణుడు కుంతి పుత్రుడు. సూర్య తనయుడు. కనుక సూర్యుడు తన కుమారుని క్షేమమును కోరి బ్రాహ్మణ వేషములో కర్ణుని దగ్గరకు వచ్చెను. ఇంద్రుడు బ్రాహ్మణ వేషధారియై కవచ కుండలముల నడుగుననియు వాని నీయ వలదనియు హెచ్చరించెను. నీ వెవరి వని

యడుగగా తాను సూర్యుడనని పరిచయము చేసికొనెను. అంత కర్ణుడు కవచ కుండలములను దానము చేయుకున్నచో తన కప కీర్తియని విశదము చేసెను. తన్నుమాలిన ధర్మము మొదలు చెడ్డ బేరము కదా యని సూర్యుడు చెప్పినను కర్ణుడు సమ్మతించ లేదు. మరియు ప్రతి కూల దుర్లలిత వాక్యములను సహింపుమని ప్రార్థించెను. కర్ణుని పట్టు దల నర్థము చేసికొని

తే. గీ॥ "వత్స వినుమింక నొకటి వాసవునకు
గలదు దారుణంబును నమోఘంబునైన
శక్తి యది నీకు నడుగుము సవినయముగ" (305)

కం॥ "లొలితొలి బలసూదనుచే
చెలువుగ నా దివ్యశక్తి సేకుఱ గొని కుం
డలములు గవచంబును మఱి
యలఘుమతీ యిమ్ము భద్ర మగు నట్లయినన్" (306)

అని యుపాయమును సూచించెను.

3.1 1.4.7.2. ఋషి ప్రోక్తములు

నారద, వేదవ్యాస ఋషుల వరము లీ వర్గమున చేరును.

3.1.1.4.7.2.1. మరుత్తుని యాగ విధికై నారదోపాయము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అశ్వమేధ" పర్వము ప్రథమాశ్వాసములో (40-46) గలదు. పరప్రదాత నారద మహర్షి. వరానుగ్రహమును పొందిన వాడు మరుత్తుడు.

మరుత్తుడొకరాజు. అతడు కృతయుగము కాలము నాటి వాడు.

అతడు యాగమును చేయకోరి బృహస్పతి నర్థించెను. దేవ గురువు నిరాకరించెను. మరుత్తుడు విషాదముతో వెనుదిరిగి వచ్చుచుండెను. దారిలో నతనికి నారద మహర్షి యెదురయ్యెను. మరుత్తుని దీన వదనమును గాంచి నారదుడు కారణము నడిగెను. మరుత్తుడు తన దైన్యమును ప్రకటించుకొనెను. అప్పుడు నారద మహర్షి బృహస్పతి తమ్ముని పరిస్థితిని తెలిపి

వ॥ "అతని పాలికి నరుగు మమ్మహాత్ముండు
భవన్మఖంబునకు నుపదర్శనం బాచరించు" (42)

నని యుపాయమును తెలిపెను. సవర్తు డెచ్చట నున్నాడో యతని యునికిని తెలియజేయుమని కోరెను. కాశీపుర ద్వారమున శవమును ముందిడుకొని యున్నచో నెవడచ్చటికి వచ్చి వెను దిరిగి పోవునో యతనిని సంవర్తునిగా నెఱుగు మనియు, సంవర్తు డున్మత్తునిగా ప్రవర్తించుననియు నాతూకి తెలిపెను. అట్లే మరుత్తుడు సంవర్తుని గుర్తు పట్ట గలిగెను. అతని సాహాయ్యముతో "ఇంద్రా"దులను కూడ హవ్య భాగ స్వీకారమునకు నాహ్వానించెను.

కింకర్తవ్యతా మూఢుడై విషాద వదనుడైన మరుత్తునికి సంవర్తుని నియోగించుట "ఉపాయ వరము" కాగలదు.

3.1.1.4.7.2.2. వేదవ్యాస మహర్షి వరములు

3.1.1.4 7.2.2.1. ధృతరాష్ట్రునికి వాసుదేవాశ్రయోపాయము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగ" పర్వము ద్వితీయాశ్వాసములో (116_331) గలదు. వరమును కోరినవాడు ధృతరాష్ట్రుడు. వర ప్రదాత వేదవ్యాసుడు.

దుర్యోధనాదులకు పాండవులకు యుద్ధము జరిగినచో నే పక్షము వైపున నుపాయ పౌరుషములను గల వారున్నారని ధృతరాష్ట్రుడు సంజయుని నడిగెను. అంత సంజయుడు వేదవ్యాసుని స్మరింపుమనెను. ధృతరాష్ట్రుడు భక్తిభావముతో వేద వ్యాసుని తలంచెను. అతడు ప్రత్యక్ష మయ్యెను. వ్యాసుడు ధృతరాష్ట్ర సంజయుల చిత్తవృత్తులను దివ్యదృష్టితో నెఱిగెను. కావున సంజయునిని ప్రసన్న దృష్టితో చూచెను. అతని సమక్షములో సంజయుడు ధృతరాష్ట్రునికి నిరుపక్షముల తారతమ్యములను గురించి, వాసుదేవుని గురించి తెలిపెను. సంజయుడు చెప్పినట్లు విని, యుద్ధమును మానుమని దుర్యోధనునికి గాంధారీ ధృతరాష్ట్రులు చెప్పిరి. కాని దుర్యోధనుడు వినలేదు. ఆ సమయమున వేదవ్యాసుడు తానే పూనుకొని ధృతరాష్ట్రునితో

వ॥ కృష్ణుడు నీకుం గూర్చి నీవుం బరమాప్తుడైన సంజయు
నతని పాలికిం బుచ్చి తది లెస్స కార్యంబయ్యె వీడును
నమ్మహానుభావు మహనీయ ప్రభావం బున్నరూపెఱుంగు
వీని బుద్ధి విని యద్దేవు నాశ్రయింపు మతం డేకాగ్ర
చిత్తులై యారాధించిన వారికి జేరువయగు గామ క్రోధోప
హతులై తమ తమ ధనంబులం దృప్తులు గాక యన్యాంబున
వర్తించు వారలకు దూరంబై యుండు నెల్ల భగుంల నాతనిం
జొచ్చి బ్రదుకు మని" (325) చెప్పెను.

ధృతరాష్ట్రు డా మాటలను విని "ప్రసాదం బట్లు చేయుదునని (325) తెలిపెను. మరల ధృతరాష్ట్రుడు వాసుదేవ నామ నిర్వచనమును తేట పరచి యతనిని పొందు నుపాయము నుపదేశింపుమని సంజయు నడిగెను. సంజయుడు వాసుదేవ నామమును నిర్వచించి యతని నాశ్రయింపుమని సలహా నిచ్చెను. ఆ సలహాను ధృతరాష్ట్రుడు విని

శరణాగతుడైన గోవిందు నాశ్రయించెదనని పలికెను. మరియు పారాశర్యునితో

వ॥ దేవా యేను వాసుదేవుని శరణు సొచ్చి బ్రదుకు వాడ
నను చు గృతాంజలి యయ్యెను" (331)

వ్యాస మహాముని యాశీర్వదించి మాయమయ్యెను.

3.1.1.4.7.2.2.2. అశ్వమేధమునకై ధనార్జనోపాయము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అశ్వమేధ" పర్వము ప్రథమాశ్వాసములో (2-15) గలదు. ఉపాయమును సూచించినవాడు వేదవ్యాసుడు కాగా పాటించిన వాడు ధర్మరాజు.

కురుక్షేత్ర యుద్ధానంతము భీష్ముడు "ఇచ్ఛామరణము"ను పొందెను. ధర్మరాజు దహనాది క్రియలను నిర్వర్తించెను. ఉదక తర్పణానంతరము ధర్మరాజు సొమ్ముసిల్లెను. శ్రీకృష్ణ, ధృతరాష్ట్ర, వేదవ్యాసాదులు ధర్మరాజు నోదార్చిరి. అంత వేదవ్యాసుడు "అశ్వమేధ"మును చేయుట తగునని ధర్మరాజు నాదేశించెను. అందులకు ధర్మరాజు యాగమునకు ధనము కావలయుననియు, పైగా దుర్యోధనుని కోశాగారమున ధనము లేదనియు, యుద్ధానంతరము ప్రజలు శోక సంతప్తులై యున్నారనియు పలికెను. ఏదేని యుపాయమును సూచించుడని ధర్మరాజు చేతులు జోడించెను. అంత నాతడు

సీ॥ "అనఘ మరుత్తుండు యజ్ఞంబు సేసి మ
హా ధనరాసుల నవని సురల
కిచ్చె వా రవి గడు నెక్కుడై యుండుట
ద్రవ్వి తండంబులు దమ గృహముల

నిడు కొని పెఱ ధన మెల్లను నిధియు గా
నిమ్మైన నెలవున నిడుచు నుండి
యందఱు నేక వాక్యత దీని నెవ్వరు
గగినను నిది వారి ధనము యనిరి

ఆ.వె॥ మానవేంద్ర యమ్మహా నిధానము దెచ్చి
వలసి నట్లు నీవు వ్యయము సేయు
మనెను." (15)

3.1 1.4.7.3. వీర ప్రోక్తములు

భీష్మ, ద్రోణ, ప్రహ్లాదుల వరము లీ వర్గమున చేరును.

3.1.1.4.7.3.1. భీష్మ వధోపాయము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము భీష్మ పర్వము తృతీయాశ్వాసములో (275-415) గలదు. వరమును కోరిన వాడు ధర్మరాజు. వర ప్రదాత భీష్ముడు.

భారత యుద్ధములో భీష్ముడు తొమ్మిదవ నాడు భీషణముగా విజృంభించెను. ఆ నాటి రాత్రి ధర్మరాజు తన సోదర శ్రీకృష్ణులతో కలిసి భీష్ముని శిబిరమునకు వెళ్ళి నమస్కరించెను. వచ్చిన పని గురించి భీష్ముడడిగెను. భీష్ముని గెలుచు విధమును ధర్మరాజు వేడెను. భీష్ముడు తానెటువంటి వారితో యుద్ధమును చేయడో తెలిపెను. పిమ్మట వ॥ "మీకు నుపాయంబు సెప్పెద" (303)నని పలికి శిఖండి జన్మను గురించి వివరించి. యా శిఖండిని ముందిడుకొని యుద్ధము చేసినచో తనను గెలువ వచ్చునని తెలిపెను.

### 3.1.1.4.7.3.2. ద్రోణ వధోపాయము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము భీష్మ పర్వము ప్రథమాశ్వాసములోను (161) ద్రోణ పర్వము పంచమాశ్వాసములోను గలదు. వరమును కోరిన వాడు ధర్మరాజు. వరప్రదాత ద్రోణాచార్యుడు.

భారత యుద్ధభూమిలో రెండు పక్షములును నెదురెదుగా మోహరించెను. ప్రారంభ మగుటకు ముందు ధర్మరాజు యుద్ధానుమతిని భీష్ముని నుండి పొందెను. పిమ్మట ద్రోణాచార్యుని దగ్గరకు వెళ్ళి పాదములకు నమస్కరించెను. యుద్ధానుమతిని పొందెను. తనకు జయము కలుగున ట్లాశీర్వదింపుడని యభ్యర్థించెను. తరువాత ద్రోణుని

వ॥ "వధోపాయంబు వేడెను"(161) అప్పుడు ద్రోణుడు ధర్మరాజునకు

వ॥ "ఏను ప్రాయోపవేశంబున సన్న్యస్త్ర శస్త్రుండ నైనం జంపుటకు నోపు నట్టి వారికి నది దొరకొను బెద్దయు నమ్మ గలవాడు సెప్ప నత్యంత దుస్సహంబైన కీడు మాట వింటినేని నట్టి వాడ నగుదు నప్పు డట్టి పగఱకు నప్పని దీర్ప ననుపై యుండు నని చెప్పెను." (161)

### 3.1.1.4.7.3.3. ప్రహ్లాదుని ఐశ్వర్య సిద్ధికై హేతువు

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము తృతీయాశ్వాసములో (132-146) గలదు. వరమును కోరిన వాడు ఇంద్రుడు. వరప్రదాత ప్రహ్లాదుడు.

ప్రహ్లాదుడు రాక్షసరాజు. అతడు సత్కులీనుడు. ఆ కారణమున నతడిం ద్రైశ్వర్యముతో రాణించెను. ఇంద్రుడందుకు బాధ పడెను.

అతడు బృహస్పతిని సంప్రదించెను. చివరకు బృహస్పతి శుక్రుని దగ్గరకు వెళ్ళుమనెను. శుక్రుడును ప్రహ్లాదుని నాశ్రయింపుమనెను. ఇంద్రుడు బ్రాహ్మణ వేషములో ప్రహ్లాదుని దర్శించెను. త్రైలోక్య రాజ్యంబు సంప్రాప్తంబైన కారణంబును ప్రశ్నించెను. దానికి సమాధానముగా బ్రాహ్మణుల మనస్సునకు కష్టమును కలిగించననియు నెవ్వుడును వారిపై నసూయ పడననియు, నిష్టముతో వారికి ధనము నిత్తుననియు, వారు మెచ్చునట్లు మంచిగ ప్రవర్తించుదు ననియు, దాని వలన నేను మహోన్నతుడనైతినని ప్రహ్లాదుడు తెలిపెను. బ్రాహ్మణ వేషములో నున్న ఇంద్రుడు మరల

కం॥ ——————"నీ శీలము నా
కనఘా దయ నొసగవే మహాత్ముల దగ జెం
దిన వారు బ్రతుక వలదే
యని దీనత దోప" నడిగెను" (139)

అప్పుడు ప్రహ్లాదునిలో ఇంద్రునిపై దయ గలిగెను. అతడు బ్రాహ్మణుడు కాడని ప్రహ్లాదు డను కొనెను. అప్పుడే ఇంద్రుడు

తే.గీ॥ "———— ——— శీల సంపన్ను డగుచు
జనియెన్" (141)

తరువాత ప్రహ్లాదుని శరీరము నుండి యతనికి తెలిపి వరుసగా శీలమును, ధర్మమును, సత్యమును, బలమును, లక్ష్మిదేవియును వెడలి "ఇంద్రు"ని చేరిరి.

3.1.1.4.8. సందేహ నివృత్తి వరము

ఒక వ్యక్తికి నెదుటి వ్యక్తి స్వరూపము పట్లనో లేదా నడవడిక పట్లనో సందేహము కలుగగా "అడుగుట ఛట్టించుట" సందేహ నివృత్తి

యగును. ఇట్టివి "ఆంధ్ర మహాభారతములో "ఏడు" గలవు. ఇవి నారాయణమూర్తి పట్ల గరుత్మంతుని, భీష్ముని విజయము పట్ల ధర్మరాజు, కురుక్షేత్రమున పార్థ సారథి, అశరీర వాణి పట్ల ధర్మరాజు, యక్షాకారము పట్ల ధర్మరాజు, బ్రాహ్మణోపదేశము పట్ల కర్ణ, వ్యాస జన్మ పట్ల సుమంతాదుల సందేహములను తొలగించుట.

3.1.1.4 8.1. శ్రీమన్నారాయణమూర్తి రహస్యము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసని"కపర్వము ప్రథమాశ్వాసములో (353.379) గలదు. వరమును కోరిన వాడు గరుత్మంతుడు. వర ప్రదాత నారాయణమూర్తి.

గరుత్మంతుడు దేవలోకము నుండి "అమృతమును" తీసికొని వెళ్ళుచుండెను. అప్పుడు కోరకనే నారాయణమూర్తి ప్రత్యక్ష మయ్యెను. ఆ విషయమును గరుత్మంతుడు తన తండ్రియగు కశ్యప ప్రజాపతికి తెలిపెను. అతడు సంతసించెను. నిస్సంగుడవై నిష్టతో బదరికాశ్రమమునకు వెళ్ళి నారాయణమూర్తిని సేవించుమని కశ్యప మహర్షి సలహా నిచ్చెను. గరుత్మంతుడు బదరికాశ్రమమునకు వెళ్ళెను. నారాయణమూర్తికి భక్తితో నమస్కరించి స్తుతించెను. నారాయణమూర్తి పీతాంబర ధారియై శంఖ, చక్ర, గద, కత్తి, శార్ఙ్గయుత అష్ట భుజధారియై మందహాస వదనముతో ప్రత్యక్ష మయ్యెను. అప్పుడు గరుత్మంతుడద్భుత, కౌతుక, మోద భావములను పొందెను. ఆ స్వామికి నమస్కరించి

వ॥ దేవా యేను భగవత్పాద భక్తుండ నేని నీ దయకు
భాజనంబ నేని నాకు వినం దగు నేని సురధిగమ
సారంబైన భవదీయ ప్రకారం బిట్టి దని యెఱుంగు
నట్లుగా జెప్పవే యని" (377) ప్రార్థించెను.

నారాయణుడు.

వ॥ "కశ్యప నందనా నీవు మన్మనస్కుండవు మద్భక్తుండవు
మత్పరాయణుండవునై మత్స్వరూపవేదివగు మనియె"
(379)

3.1.1.4.8.2. భీష్మ విజయ సందేహము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము భీష్మపర్వము తృతీయాశ్వాసములో (276-286) గలదు. వరమును కోరిన వాడు ధర్మరాజు. వర ప్రదాత శ్రీకృష్ణుడు.

కురుక్షేత్ర సంగ్రామము మొదలయినది. తరువాత భీష్ముడు తొమ్మిదవ నాటి యుద్ధములో గొప్పగ విజృంభించెను. పాండవులు భీష్ముని ధాటికి నిలువలేక పోయిరి. ఆ నాటి రాత్రి ధర్మరాజు తన తమ్ముళ్ళతో కలిసి శ్రీకృష్ణుని శిబిరమునకు వెళ్ళెను. భీష్ముని పరాక్రమమును తెలిపి శ్రీకృష్ణుని

వ॥ "నీకు మాదెస ననుగ్రహంబు గలదేని కయ్యంబు దక్కి ధర్మ విరోధంబు గాకుండు నట్టి యొక్క తెరువు సెప్పు మని సకరుణంబుగా" (281) ప్రార్థించెను.

అప్పుడు శ్రీకృష్ణుడు.

కం॥ "వగవగ నేటికి బార్థుడు
దెగువకు జొరకున్న భీష్ము దెగ జూచి వెసం
బగ యడగించెద నన్నున్
మిగిడింపక చూచుచుండు మనుజాధీశ" (283)

అని పలికెను. ఆ మాటలకు ధర్మరాజు ధైర్యమును పొందెను.

3.1.1.4.8.3. కురుక్షేత్రమున పార్థసారథి సందేహము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము భీష్మ పర్వము ప్రథమాశ్వాసములో (178 205) గలదు. వరమును కోరిన వాడు అర్జునుడు. వర ప్రదాత శ్రీకృష్ణుడు.

భారత యుద్ధమునకు రెండు పక్షములును సిద్ధ మయ్యెను. అప్పుడెదుటి పక్షములోని తన బంధు, మిత్రుల నందరిని చూసి అర్జునునికి ధైర్యము సడలెను. కారుణ్యము హెచ్చినది. అతనిలో పాప భీతి చోటుచేసి కొనినది. అతడు విషాదభరితు డయ్యెను. శ్రీకృష్ణుడు ధైర్యమును చెప్పెను. కాని వినలేదు. ఎదుటి పక్షములోని బంధువులను చంపిన బాధ యెక్కువగునని శ్రీకృష్ణునికి చెప్పి

వ॥ "వారిని గెలిపించుటయును మనము వారల గెలిచి వారల
మగుటయు నను నీ రెంటి యందును బెద్ద మేలెయ్యది
యేను గార్పణ్య దోషో పహత స్వభావుడను ధర్మ సమ్మూఢ
చేతస్కుండను నై నిన్ను శరణు వొచ్చి యడిగెద నీ
శిష్యుండ నగు నన్ను శాసింపు మని" (194) ప్రార్థించెను.

శ్రీకృష్ణుడు అర్జునుని మాటలకు కలకల నవ్వి తగని వారిని గురించి బాధ పడగూడ దనియు, పండితులు బాధ పడరనియు పలికి పరమ జ్ఞానమునకు కారణమ్మైన యీా వాక్యములను వినుమని పలికెను.

చినిగిన వస్త్రము లను తీసివేసి నూతన వస్త్రములను ధరించు నట్లుగ శరీరమునకు బాల్య యౌవన వార్ధక్యావస్థ లుండు ననియు, మరణించిన తరువాత "ఆత్మ" కు నే హానియు లేదనియు, జనన

మరణములు లేక పోవుటచే శరీరము వలె శస్త్రచ్ఛేదనము మొదలైన వికృతి కారణములకు "ఆత్మ" లోను కాదనియు, పురుషుడు నొప్పించు వాడును నొప్పింప బడు వాడును కాడనియు, "ఆత్మ"కు నభావమును శరీరమునకు భావమును గలుగ వనియు, నాత్మతత్త్వము శాశ్వత మగు ననియు "అర్జును"నికి తెలిపెను.

వ॥ "మఱియు నీ దృశంబు (తత్త్వజ్ఞానోపదేశము) లగు
వాక్యంబు లనేకంబు లను గ్రహించుచు వివిధ ప్రకారంబుల
వికల్పించి విజయుం డడిగిన వాని కెల్ల సదుత్తరంబు లిచ్చి
సందేహంబు వాపెను" (203).

3.1.1.4.8.4. అశరీరవాణి పట్ల ధర్మరాజు సందేహము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య పర్వము" సప్తమాశ్వాసములో (405-419) గలదు. వరమును కోరిన వాడు ధర్మ రాజు. వర ప్రదాత యక్షుడు.

యక్ష ప్రశ్నల ఘట్టమునకు ముందు ధర్మరాజు తన నలుగురు సోదరులు రాలేదని వెదకుచు నీటి కొలను దగ్గరకు వెళ్ళెను. కొలని యొడ్డున నిశ్చేతనులై పడి యుండిన తన నల్గురి తమ్ముళ్ళను చూచెను. చాల దుఃఖించెను. దప్పికకు తట్టుకొనలేక నీటిని త్రాగుటకు కొలను లోనికి దిగెను. అప్పుడు "అశరీర భూతము" "ఓ రాజా! వినుము. నే నొక కొంగను. ఈ కొలను నా సొమ్ము. నీ తమ్ముళ్ళు నా మాటలను వినకుండ యీ నీటిని త్రాగి ప్రాణమును పోగొట్టు కొనిరి. నీవు నట్లేయగుదువు. కావున నే నడిగిన ప్రశ్నలకు నీవు తగిన సమాధానములను చెప్పి తరువాత నీటిని త్రాగుమని చెప్పెను. ఆ మాటలను వినిన ధర్మరాజు ప్రధాన ప్రముఖ దేవతల పేర్లను తెలిపి వారిలో

వ॥ "నీ వెవ్వండవు? నీ తలంపెయ్యది? చెప్పి నా హృదయ
వేదన నపన యింపవే" యని (417) వేడెను.

అప్పుడు "అశరీర భూతము"

ఆ.వె॥ "కౌరవేంద్ర బకము గాను నే విను మొక్క
యక్ష వరుడ నిచట నస్మదీయ
నికృతి జేసి పడిరి నీతమ్ము లందఱు
ననుచు నాక్షణంబు యతని యెదర" (413)

భయంకర ఘోరాకృతితో యక్షుని యాకారముతో నిలిచెను.

3.1.1.4.8.5. యక్షాకారము పట్ల ధర్మరాజు సందేహము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య" పర్వము సప్తమాశ్వాసములో (459-462) గలదు. వరమును కోరిన వాడు ధర్మరాజు. వర ప్రదాత యక్షుడు.

యక్షుడు ధర్మరాజు ధర్మపరాయణతను పరీక్షించి మెచ్చి సంతోషించెను. ధర్మరాజు కోరిక ప్రకారము నకులుని బ్రతికించెను. మరియు మిగిలిన ముగ్గురిని బ్రతికించెను. అప్పుడు ధర్మరాజు విస్మయమును చెంది "నీ వొక యక్షుడవని నేను నమ్మను. నీవు నిజముగ ఇంద్రుడవో, కుబేరుడవో, అగ్ని దేవుడవో, వాయు దేవుడవో లేక నా తండ్రివైన ధర్మ దేవతవో సత్కృప జెప్పుము నాకు నేర్పడన్" (406) అని వేడెను. ఆ మాటలకు యక్షుడు నవ్వుచు

మ.కో.॥ "ఏను ధర్ముడ జువ్వె రాజ కులేంద్ర సత్యము శౌచమున్
దానముం దపమున్ శమంబును దాంతియున్ యశముం బరి
జ్ఞాన యుక్తియు నాదుమూర్తులు సమ్మదంబున నిష్ఠ మ

తూనను నుత్తమ ధార్మికున్ నిను జూచు వేడుక వచ్చితిన్"
(462)

అని పలికెను.

3.1.1.4.8.6. బ్రాహ్మణోపదేశము పట్ల కర్ణ సందేహము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య పర్వము సప్తమాశ్వాసములో (283-288) గలదు. వరమును కోరిన వాడు కర్ణుడు. వర ప్రదాత సూర్య భగవానుడు.

పాండవుల యరణ్య వాస కాలము ముగియ వచ్చినది. అపుడు "ఇంద్రుడు" బ్రాహ్మణ వేషములో కర్ణుని దగ్గరకు వెళ్ళి యాతని కవచకుండలముల నడుగవలెనని తలంచెను. ఆ విషయమును సూర్య భగవానుడు పసి గట్టెను. తాను కూడ బ్రాహ్మణ వేషములో తన కొడుకైన కర్ణుని దగ్గరకు వెళ్ళెను. "ఇంద్రు" ని దురాలోచనను తెలిపి కవచకుండలములను "ఇంద్రు"నికి నీయుపలదని చెప్పెను అట్లిచ్చినచో నవజయము తప్పదని తెలిపెను. అపుడు కర్ణుడు

కం॥ ———————"విప్రాకారం
బున వచ్చిన వేల్పవు నీ
వనఘా యెవ్వడవు నాకు నానతి యీవే" (287)

అని యడిగెను.

ఆ మాటలను వినిన బ్రాహ్మణవేషములో నుండిన సూర్య భగవానుడు.

కం॥"————————ఏను సూర్యుడ
మునమున నీయందు గలుగు మక్కువ గర్ణం

బొనరగ నుపదేశింపం
జనుదెంచిరితి" (288) నని తెలిపెను.

3.1.1.4.8.7. వ్యాస జన్మపట్ల సుమంతాదుల సందేహము

ఈ వృత్తాంతము భారతభాగము శాంతి పర్వము షష్ఠాశ్వాసములో (518. 530)గలదు. వరమును కోరినవారు వేదవ్యాసుని శిష్యులు, వర ప్రదాత వేదవ్యాస మహర్షి.

సుమంత, వైశంపాయన, జైమిని, పైలులు వేదవ్యాస మహర్షి శిష్యులు. హిమాలయ పర్వత పాదమున వేదవ్యాసుడు మహా భారత రచన సాగించు చుండెను. ఆ సమయమున శిష్యులు పరిచర్య చేయు చుండిరి. వారికి గురువు వేదార్థ భారతార్థములను తెలియ జేయు చుండెను. ఒక దినమున నా శిష్యులు గురువుగారి పాదములకు నమస్కరించి.

తే.గీ॥ "————నారాయణ ప్రభువు డంద్రడు
నిన్ను గృప జెప్పవే మాకు నిర్మలాత్మ
యత్తెఱం గని" (518) కోరిరి.

అంత వ్యాసుడు తన జన్మ రహస్యమును తెలిపెను.

మొదట వ్యాసుడు "అపాంతరతము" డను నామధేయుడు. విష్ణు చిత్తోద్భవుడు. వేదములను విభజించుట నాటి కర్తవ్యము. కనుక వేదవ్యాసుడయ్యెను. (522)

రెండవ జన్మమున పరాశరుని పుత్రుడు. ఈ జన్మములో శృంగార భావ మెక్కువ. అతడే ధార్తరాష్ట్ర పాండవుల వృద్ధికి కారకుడు.

మరు జన్మములో "లోకహితవాణి." ఈ జన్మమున "అగమ వైష్ఠి కత" ప్రధానము.

తరువాత జన్మములో వేదవ్యాసునికి స్వైచ్ఛిక ప్రవృత్తి యుం డును.

3.1.1.4.9. సమయ వరములు

సమయ మనగా "బాస, శపథము, ఆచారము, సంకేతము, ఒప్పుకోలు, నియమము" అని యర్థములు. ఆంధ్ర మహాభారతములో ని పద ప్రయోగములతో కూడిన వరములు నాలుగు. 1. నారదుని సమయోపదేశము, 2. గోగణము పట్ల రంతిదేవుని సమయము, 3. బకాసురుని సమయము, 4. బకాసురుని పట్ల భీముని సమయము.

3.1 1.4.9.1. నారద మహర్షి సమయోపదేశము

ఈ వృత్తాంతము నన్నయ భారత భాగము "ఆది"పర్వ మష్ట మాశ్వాసములో (89-115) గలదు. వరమును కోరినవారు పాండవులు వరప్రదాత నారదుడు.

పాండవులయిదుగిరికి "ద్రౌపది యొకతె మాత్రమే యిల్లాలు" వారు "ఇంద్రప్రస్థము"న నుండగా నారదుడు విచ్చేసెను. పాండవు లతనిని గౌరవించిరి. ద్రౌపదిని, పాండవులను ప్రత్యేకముగా సమీ క్షించి, యిది లోకాచార విరుద్ధమని స్త్రీ కారణముగా విభేదములు తప్పవని తెలిపెను. అందులకు దృష్టాంతముగా

కం॥ ఇంతుల నిమిత్తమున ధృతి
మంతులు బొందుదురు భేద మది గావున మీ
రింతయు నెఱిఁగి యొండు
చింతింపక సమయ మిందు సేయుఁడు బుద్ధిన్" (114)

ఒక్కొక్క సంవత్సర మొక్కొక్కరి యింట ద్రౌపది నుండు నట్లును, నట్లుండు కాలమున నితరులెవ్వరు వారి యింటకు వెళ్ళకుండు నట్లును నట్లువెళ్ళిరేని 12 నెలలు తీర్థయాత్ర చేయదగు ననియు సూచించెను.

3.1.1.4.9.2. గోగణము పట్ల రంతిదేవుని సహాయము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వము తృతీయాశ్వాసములో (82-86) గలదు. వరమును కోరినవి గోవులు. వరప్రదాత రంతి దేవుడు.

గ్రామ, పురము లందలి గోవులు తమను పోషించు బ్రాహ్మణులు చేయు హవ్య కవ్యములకు, నతిథి పూజలకు, వారి యాహారములకు, బ్రాహ్మణులకు పాల నిచ్చెను. వారి పనులను చేయుటకు వాటి పుత్రులను పంపెను. ఆ విధముగ నవి సుకృతములను చేయుటచే వాటికి గొప్పదనము లభించెను. ఆ గొప్పదనముచే నవి యొకమారు స్త్రీల రూపములను ధరించి యడవిలో నొక కొలనులో జలక్రీడ లాడు చుండెను. ఆ సమీపమున సుమిత్రుడను బ్రాహ్మణుని గోవులు మేయు చుండెను. అవి మనుష్య మాటలలో "మీరెవ్వ" రని యా స్త్రీల నడిగెను. వారు గోవులమని చెప్పిరి. అంతటి యద్భుతానుభవమెట్లు కలిగెనని మరల సుమిత్రుని గోవులు ప్రశ్నించెను. పైన తెలిపిన సుకృత కార్యములను చేయుటచే నంతటి గొప్పదనము కలిగెననియు గోలోకము గూడ లభించునని స్త్రీలు చెప్పిర. అప్పుడు సుమిత్రుని గోవులు "గోవులకు గోవులే గతి. కావున మాకును సుగతి కలుగు దారిని చెప్పు" మని యడిగెను. రంతిదేవుడను రాజు చేయు వేయి సంవత్సరముల యజ్ఞమునకు వెళ్ళుము. అతడు మిమ్ములను వధించును. అద్దాన మీకు గోలోకము లభించునని స్త్రీలు చెప్పిరి. పిమ్మట నవి వాటి పోషకుడైన సుమిత్రునికి గోలోకము లభించు

నట్లు వరమునిచ్చి యతనిని చంపెను. తరువాత రంతిదేవుని యజ్ఞ మునకు వెళ్ళి, యతనిని

వ॥ "సుగతి వేడి తమ్ముం బశువులుగా విశసింపు మని మానుష భాషణంబులం బ్రార్థించెను." (80)

అప్పుడు రాజు వాటిని చంపినచో తన కే విధముగ సద్గతి కలుగునని ప్రశ్నించెను. "జ్ఞానులు చేయు నీ పనికై నిన్ను చూడు మని మమ్ములను పంపిరి. కావున నీకు స్వర్లోకము కలుగును. నీ కీర్తి జగము లన్నింట వ్యాపించు"నని గోవులు చెప్పెను. అప్పుడు రాజు వాటితో

కం॥ "————మీ లోపల నొక
గోవైనను మోహవశత గూరుటయు మఖం
బా వేళ బరి సమాప్తము గావలయును వినుడు సమయ

కల్పన దెలియన్" (83) అని పలికెను.

ఆ రాజు మాటలను

కం॥ "విని గోవులు సమ్మతించెను" (84)

3.1.1.4.9.3. బకాసురుని సమయము

ఈ వృత్తాంతము నన్నయ భారత భాగము "ఆది" పర్వము షష్ఠాశ్వాసములో (267-269) గలదు. వరమును కోరినవారు ఏకచక్ర పుర బ్రాహ్మణులు. సమయమునకు నొడంబడినవాడు బకుడను రాక్షసుడు.

ఏక చక్ర పురమునకు నామడ దూరములో యమునా న
సమీపారణ్యములో బకుడను రాక్షసుడు నివసించు చుండెను. అత డొక
గొన్ని వేళ పురములోనికి ప్రవేశించి వరుస ప్రకారము కాపుల బ్రాహ
ణుల నందరిని తిను చుండెను. అప్పు డా పురములోని బ్రాహ్మ
లందరు జప, హోమ, దానములను చేసి యాపై బకాసురుని కడ
వెళ్ళిరి. ఒక్కమ్మడి పురముపై పడుట కంటె తామే యాహారము
సమకూర్తుమని సమయమును తెలిపిరి.

వ॥ "నిత్యంబు నిలు వరుస నొక్క మానిసి రెం డెనుపోతులం
బూన్చిన శకటంబున నపరిమిత భక్ష్యపిశిత మిశ్రాన్నంబు
నించి కొని పోయిన దానిని వానిని నయ్యెను పోతులను
భక్షించుచు" (268) నుండు మని కోరిరి.

బకు డా సమయమునకు సమ్మతించెను. ఆ పురమునకు నొరు
వలన బాధ కలుగకుండ చూచు చుండెను. ఆ పుర రాజు బకుని గెల
లేక యూర కుండెను.

3.1.1.4 9.4. బకానుచరుల పట్ల భీముని సమయము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వవ
షష్ఠాశ్వాసములో (292-308) గలదు. వరమును కోరినవారు ఏకచ
పుర ప్రజలు. వరప్రదాతలు భీముడు (లేక) బకాసురుని బంధువుల

ఏకచక్ర పురవాసులకు "బకుడు" పోరాని బంధువు. అతని య
హారార్థము వెళ్ళెడి వంతు భీముని పాలబడినది. భీముడు కడుపా
నారగించి వేళదాటి కాననమునకు కదలెను. ఆలస్యమునకు "చి
బుర్రు" లాడు బకుని పిలిచి, పెట్టకుండ తానేతిను చుండెను. చివర

వారిద్దరి మధ్య గ్రుద్దులాటలు, చెట్లు విసిరివేయుట, ముష్టి యుద్ధములు సాగెను. భీము డొడుపు పట్టి బకుని చంపెను. నవరంధ్రముల నుండి రక్తము స్రవింప బకుడు మరణించెను. అప్పుడు భీముడు, బకుని తమ్ముళ్ళను, బంధువులను

తే.గీ॥ "ఇంక నెన్నండు రక్కసు లిద్దురాత్మ
నట్లు మనుజుల దినకుండు డడరి మనుజ
భక్షణము సేసితిరి యేని బకుని యట్లు
చత్తురని" (307) బెదరించెను.

భీముని మాటలను వినిన యారాక్షసులు

వ॥ "భీతులై భీము చేసిన సమయంబున కొడంబడి నాటంగోలె నేక చక్ర నివాసులకు నుపద్రవంబు జేయ నోడిరి" (308)

3.1.1.4.10. సంహార వరములు

సంహార పదమునకు ననేకార్థము లున్నను, ఆంధ్ర మహాభారతము" లో నాశనము, ముగింపు" అను నర్థములు వచ్చు యుదాహరణములు మాత్రమే యున్నవని చెప్ప వచ్చును.

ఆంధ్ర మహాభారతములోని సంహార వరములను రెండు వర్గములుగా విభజింప వచ్చును.

1. రాక్షస సంహారములు, 2. మహీపతుల సంహారములు,

3.1.1.4.10.1. రాక్షస సంహారములు

వీటిని మరల మూడు భాగములుగా విభజింప వచ్చును.

1. విష్ణుమూర్తి రాక్షస సంహారములు 2. రుద్రుడు రాక్షస సంహారము 3. రుద్ర విష్ణుమూర్తుల రాక్షస సంహారము

3.1.1.4.10.1.1. విష్ణుమూర్తి రాక్షస సంహారములు

3.1.1.4.10.1.1.1. భూతలాసుర సంహారము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వము ప్రథమాశ్వాసము (308 315) లో గలదు. వర ప్రదాత విష్ణువు. వర స్వీకర్త బ్రహ్మ.

పూర్వము "అమృతము" కొరకు మందర పర్వత మథనము జరిగినది. కారణ వశమున దేవదానవుల సమరము సాగినది. దేవతలు డస్సి పోయిరి. వారు బ్రహ్మ నాశ్రయించిరి. బ్రహ్మ నారాయణుని ప్రార్థించెను. అంత నారాయణుడు.

కం॥ ————"నే నిదె మిమ్మున్
గెలిపింపగ వచ్చితి" (342) నని

నమ్మకమును కుదిర్చెను. పంచాయుధ ధారియై గరుడారూఢుడై విష్ణువు రాక్షసులను సంహరించెను.

3.1.1.4.10.1.1.2. రసాతలాసుర సంహారము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము: షష్ఠాశ్వాసము (479-488) లో కలదు. వర ప్రదాత విష్ణుమూర్తి. వరానుగ్రహమును పొందిన వాడు బ్రహ్మ.

ప్రళయ కాలమున విష్ణువు యోగ నిద్రలో నుండెను. ఆపై మేల్కొని లోక రక్షణకు పూనుకొనెను. అతని నాభి నుండి బ్రహ్మ జన్మించెను. అతడు నాల్గు వేదములను సృజించెను. ఇంతలో కైటభుడను రాక్షసుడు వేదములను దొంగిలించి రసాతలమున కేగెను. బ్రహ్మ దిగులు చెందెను.

ఆ.వె॥ "విష్ణు బహు విధముల వినుతించెను" (484)

విష్ణువు హయగ్రీవుడై రసాతలమున కేగి ప్రణవ నాదమును చేసెను. ఆ రాక్షసులకు నా నాదముతో కోపము హెచ్చైనది. నాదము వైపు కదలిచనిరి, వారొక దిక్కు వెళ్ళగా విష్ణువు మరొక దిక్కునకు కదలి శ్రుతులను విడిపించుకొని వచ్చి "అజున" కిచ్చెను. రాక్షసులు తాము మోసపోవుటను గుర్తించిరి. చివరకు విష్ణువుతో కయ్యమునకు దిగిరి. హయగ్రీవుడు వారిని సంహరించెను.

3.1.1.4.10.1.2. రుద్రుడు త్రిపురాసుర సంహారము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము కర్ణ పర్వము ప్రథమాశ్వాసములో (265-294) గలదు. వరమును కోరినవారు బ్రహ్మాదులు. వర ప్రదాత రుద్రుడు.

త్రిపురాసురులు బలవంతులు. వారిని సామాన్యులు చంపలేరు. రుద్రుడొకడే రాక్షసులను చంపగలడని బ్రహ్మ దేవర్షి గణమునకు సూచించెను. వారందరు రుద్రుని కడ కేగిరి. బ్రహ్మ త్రిపురాసురుల యకృత్యమును వివరించెను. శివుడు - త్రిపురాసురులు బలవంతులనియు తానొక్కడే చంపలేననియు, తన తేజస్సులో సగ భాగమును గ్రహించి చంపుడని తెలియ జేసెను. కాని యా తేజమును తాము భరింప లేమని దేవతలు చెప్పిరి. చివరకు తమ తేజములను కూడా గ్రహించి త్రిపురాసురులను చంపుడని తెలిపి దేవతలు

వ॥ "ఎల్ల భంగిని నీకు రక్షణీయుల మగు మమ్ము రక్షింపు" మని (274) శివుని కోరిరి. అందుకు శివుడు సమ్మతించెను. దేవతలు తమ తేజస్సులో సగ భాగముల నిచ్చిరి. శివుడు మరింత తేజోవంతుడయ్యెను. మహా దేవునకు త్వష్ట విశిష్ట రథమును నిర్మించెను. విష్ణువు

బాణము గా ప్రణవము కోల యయ్యెను. రుద్రుడు పాశు పతాకా స్త్రమును సంధించి త్రిపురములను స్మరించెను. అవి మూడును నేకత్రము కాగా రుద్రుడు బాణమును వదలి కాల్చి వేసెను.

3.1.1.4.10.2. మహీ పతుల సంహారములు

3.1.1.4.10.2 1. భీష్మ వినాశము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగ" పర్వము చతుర్థాశ్వాసము (360-368) లో కలదు. వరమడిగినది అంబ కాగా వర ప్రదాత శివుడు.

తన బ్రతుకు బుగ్గిపాలైనందుకు భీష్మునిపై "అంబ" కు నంతు పట్టని కోపము వచ్చినది. కనుక పరశురాముని సహాయమును కోరి నది. భీష్మ పరశురాములకు సమరము సాగినది. కాని "అంబ" కు ఫలితము దక్కలేదు. చివరకు కౌశికుని యాశ్రమమున నిష్ఠుర వ్రత మును మొదలు పెట్టినది. అపుడు గంగాదేవి "అంబ" దగ్గరకు వెళ్ళి కారణము నడిగినది. అంబ తన కోరికను విన్నవించగా గంగ కోపించి "నది"వి కమ్మని శపించినది. అంబ వ్రతములో సగము నదీ రూప మయ్యెను. మరొక సగము తపమునకు సిద్ధమైనది. ఆమె తపమునకు రుద్రుడు ప్రత్యక్షమై వరమును కోరుకో మనెను. అపుడు అంబ

కం॥ "———————————భీ
ష్మని నాడు జంపగా దొర
కొను నట్లుగ నొసగు మనియె" (366)

అందుకు శివుడు వ॥ "అట్లకాక యని యనుగ్రహించెను" (367)

ఈ నిధనము మరుసటి జన్మమున (శిఖండి) నెరవేరునని రుద్రుడు స్పష్టము చేసెను.

3.1.1.4.10.2.2. శల్య సంహారము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శల్య పర్వము ప్రథమాశ్వాసములో (261-285) గలదు. వరమును కోరినవాడు ధర్మరాజు. వర ప్రదాతలు శ్రీ కృష్ణ, శివులు.

భారత యుద్ధములో దుర్యోధనుని పక్షమునకు శల్యుడు నాయకత్వమును వహించెను. అప్పుడు ధర్మరాజు శల్యునితో యుద్ధమును చేయుచు రెండు పర్యాయములు శల్యుని విరథునిగా చేసి, మూర్ఛిల్ల చేసెను. మూడవ పర్యాయము శల్యునిచే విరథుడయ్యెను. అప్పుడు ధర్మరాజు తన మనస్సులో శల్యుని గెలువుమని శ్రీకృష్ణుడు తనను నియోగించిన విషయమును స్మరించెను. దైవ ఘటన వలన తన మాట లసత్యమగు నేమో యని శంకించెను. శ్రీకృష్ణుని నియోగ మమోఘము కావలయునని శ్రీకృష్ణుని మనస్సులో ప్రార్థించెను. మరియు అర్జునుని ముందు భాగమున నుండి శత్రువులను నాశనము చేయు త్రిశూలిని జయము కొఱకు భక్తితో మనస్సులో ప్రార్థించెను. ఉన్నతమైన బాణములను శల్యునిపై వేసెను. కాని యవి శల్యుని బాధ పెట్టలేదు. అర్జునుడు తప్ప భీమసేనాది ప్రముఖులు ధర్మరాజును రక్షించు చుండినను శల్యుని బాణములు ధర్మరాజు మీదికి వచ్చు చుండెను. అప్పుడు ధర్మరాజు శక్తి యాయుధమును ప్రయోగించ దలచి హృషీకేశు నుద్దేశించి

ఉ॥ "————— - ——జయం బొడ గూర్చుము దేవ సంశ్రితాం
హోదశనంబు నీకు వ్రత ముల్లము నావయి నిల్పు మి
త్త్రజిన్" (275)

వ॥ "అని హృదయంబున బ్రార్థించెను." (276)

పూర్వము తన యచ్చపు భక్తికి మెచ్చి ప్రియముతో ఫాలలోచను డిచ్చిన శక్తి యాయుధమును ధర్మరాజు చేతి యందు ధరించి శల్యునిపై వేసెను. అది శల్యుని రొమ్మున దూటి వీపు నుండి వెలుపలికి వచ్చి క్రింద బడెను. వెంటనే శల్యుడు బోర్లపడెను. ప్రాణమును వదలెను.

### 3.1.1.4.11. ప్రత్యుపకృతి వరములు

తమకు మేలుచేయు వారిని గుర్తించుట, వారి పట్ల కృతజ్ఞతను కలిగి యుండుట వీలైనచో వారికి ప్రత్యామ్నాయముగా ప్రతికృతిని చేయుట ప్రత్యుపకారములు. ఇట్టివి భారతములో రెండు గలవు.
1. భూదేవి 2. ఆశ్రిత శుక ప్రతికృతులు.

### 3.1.1.4.11.1. భూదేవి ప్రతికృతి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము ద్వితీయాశ్వాసములో (86-96) కలదు. వర ప్రదాత కశ్యప మహర్షి కాగా వరానుగ్రహమును పొందినది భూదేవి.

పరశురాముడు క్షత్రియుల మీది కోపముతో 21 మార్లు దండెత్తి వారి పీచమణచెను. తర్వాత "అశ్వమేథ" యాగమును చేసి కశ్యప మహర్షికి తాను సంపాదించిన భూమిని దానముగా నిచ్చెను. కశ్యపుడా భూమిని భూసురుల కిచ్చి తపోవనమునకు వెళ్ళెను. కొంత కాలమునకు వైశ్య శూద్రులు విప్రధనము నపహరించిరి. అంత బ్రాహ్మణులును యాగాదులను వదలి వేసిరి. దుష్ప్రవర్తనకు లోనైరి. అరాజకము ప్రబలెను. పాపబాహుళ్యముచే భూమి క్రుంగి పోదొడగెను.

కశ్యపుడు తన యూరువుల నూతగా పెట్టి భూమినెత్తెను. అప్పటినుండి భూమికి "ఉర్వి" అని పేరు వచ్చెను. అంత భూదేవి కశ్యపుని శరణు వేడినది. పరశురామ దండనమున తప్పించుకొనిన వారికి రాజ్య మిమ్చుట తగునని

వ॥ "వారలు సమ్యక్పరిపాలనచున నన్నరయువారు గా
నను గ్రహించిన నచలితనై యుండెదను" (92)

కం॥ "వారల పెద్దలు నాకై
పోర బరశురాము చేత బొలిసిరి నాకున్
వారి నధిపతుల జేయుట
గోరందగు గాన యిట్లు గోరితి ననఘా! (93)

అని ప్రార్థించెను. కశ్యపు డట్లే వారికి భూమిని పంచి యిచ్చెను.

3.1.1.4.11.2. ఆశ్రిత శుక ప్రతిక్రియ

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఆనుశాసనిక" పర్వము ప్రథమాశ్వాసములో (150-158) గలదు. వరమును కోరినది యొక చిలుక. వర ప్రదాత ఇంద్రుడు.

కాశీశ్వరు దేశమున నొక లుబ్ధకుడు వేటకు పోయి విష దగ్ధ శరమును నొక మృగముపై వేసెను. కాని యా మృగము బాణమును తప్పించుకొనెను. ఆ బాణమొక చెట్టుకు తగిలెను. క్రమ క్రమముగా నా చెట్టు యొక్క పూవులును, కాయలును, ఆకులును, కొమ్మలును నెండి పోయెను. ఆ చెట్టు మీద చాల పక్షులుండెను. చెట్టెండి పోవుటతో నొక చిలుక తప్ప మిగిలిన పక్షులన్నియును చెట్టును వదలి వెళ్ళి పోయెను. ఆ చిలుక మాత్ర మెండకు, గాలికి, వానకు భయ పడక దీన భక్తి

భావములతో చెట్టును వదల కుండెను. ఆ చిలుక యుదాత్త ప్రవర్త నకు "ఇంద్రుడు" మనస్సులో మెచ్చుకొనెను. ఆ చిలుక దగ్గరకు వెళ్ళి యా చెట్టును వదలక పోవుటకు కారణము నడిగెను. ఆ చిలుక ఇంద్రుని గుర్తించెను. ఎల్లప్పుడును నాశ్రయ మిచ్చిన యా చెట్టును వదలుట కృతఘ్నత కదా! యని సమాధానము నిచ్చెను. ఆ చిలుక పురాకృత పుణ్య విశేషముచే తనను తెలిసికొనెనని "ఇంద్రుడు" గ్రహించెను. శుకమునకు మేలును చేయవలెనని తలచెను. వరమును కోరుకొనుమని దాని నడిగెను.

అప్పు డా శుకము

కం॥ "—— — ——మహీజం
బు నకుం బేరెలమి వేడెను" (157)

ఇంద్రుడు శుకము కోరికను మన్నించెను.

### 3.1.1.5. విశ్వాసాను బంధి వరములు

పుణ్య పాపములు, పునర్జన్మలు, పరలోక వాసము, శాస్త్ర దీక్ష మొదలైనవి విశ్వాసమునకు సంబంధించిన యంశములు. ఈ విశ్వాసముల నాధారముగా వ్యక్తులు కోరు కోరికలు విశ్వాసాను బంధి వరములు. ఇట్టివి మూడు వర్గములు 1. లోకాంతరవాస సందర్శన కాంక్ష 2. పుణ్యలోక ప్రాప్తి 3, విశ్వరూప సందర్శన కాంక్ష.

### 3.1.1.5.1. లోకాంతరవాస సందర్శన కాంక్ష

లోకము లనేకములు. అతల, వితల, అధో, భువర్, ఊర్ధ్వ లోకాదులు. ఇవిగాక పితృ, గోలోకాదులను పురాణములలో

ప్రస్తావించిరి. నరకలోకములోని మానవులను చూడవలయునని కోరుట యిందలి విశేషము.

3.1.1.5.1.1. ధర్మరాజు సోదర సందర్శనాభిలాష

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము మహా ప్రస్థాన పర్వములోను (67-76), స్వర్గారోహణ పర్వములోను (2-64) కలదు. వరమును కోరినవాడు ధర్మరాజు. వర ప్రదాత ఇంద్రుడు.

మహా ప్రస్థానమున ధర్మరాజొక్కడే స్థిరుడై నిలిచెను. చివరకు ఇంద్రుని దివ్య విమానమున కూర్చొనెను. అప్పుడు నారద మహర్షి సశరీరముతో ధర్మరాజొకడు మాత్రమే స్వర లోకమునకు కదలుచున్నాడని చెప్పెను. ఆ మాటలను ధర్మరాజు వినెను. తన్ననుసరించి మరణించిన తన తమ్ములను చూచినపుడే తనకు సుఖమని తెలిపి.

వ॥ "వారలను మదీయ పక్ష ప్రాప్తులయిన భూపతులను జూచు
వేడ్క యెల్ల లోకంబుల మీదను గలుగు వేడుక కంటెను
మిగిలి యున్నయది ( మహాప్రస్థాన పర్వము - 71 )

అని తెలిపెను. కాని స్వర్గలోకమునకు వచ్చునపు డిహ సంబంధమును వదలుట తగునని "ఇంద్రుడు" చెప్పెను. పాండవులను, మునులను, సిద్ధులను శుభ దృష్టితో చూడు మనియు, నతని గొప్పదనముచే దేవతాత్మకుల బుద్ధిని తెలిసికొను మనియు నతనివలె నతని సహోదరులున్నత స్థానమున కనర్హులనియు ధర్మరాజుకు చెప్పెను. కాని ధర్మరాజు మరణించిన సోదరులను తప్పక చూడ వలెనని పట్టు పట్టెను. అప్పటికి విమానము స్వర్గమునకు చేరెను. అప్పుడు "ఇంద్రుడు" ధర్మరాజు కోరికను తీర్చ దలచెను. ఒక దేవదూతను రప్పించి యతనితో

సీ॥ "————————ధర్మనందను నకు
దమవారి జూడ జిత్తమున గోర్కి
దనికిన యది నీ వితని నట గొనిపోయి
యఖిల బంధుల జూపు" (స్వర్గా-3) మనెను.

ఇంద్ర, యమ ధర్మరాజుల మాయచే కల్పింపబడి నరకయాతనల ననుభవించు చుండిన కర్ణ, భీమార్జున, నకుల సహదేవ, ద్రౌపది, ధృష్టద్యుమ్న, ఉప పాండవులు మొదలగు వారున్న నరకలోకమును ధర్మరాజుకు నా దేవదూత చూపెను. వారిని చూచిన ధర్మరాజు చాల దుఃఖించెను. తన వారితో తాను నరకవాసమును చేసెదనని పట్టు పట్టెను. ఆ విషయమును దేవదూత ఇంద్రునికి తెలిపెను. ఇంద్రుడును, సకల దేవత, దేవర్షులును ధర్మరాజునకు నచ్చ చెప్పిరి. ధర్మ రాజు వారి మాటలను విని యాకాశగంగలో స్నానమాడి భూలోక సంబంధమైన దేహమును వదలి దివ్య దేహుడయ్యెను. పిమ్మట నర నారాయణులను, దేవత్వము నొందిన యితర సోదరులను, ద్రౌపదిని, తన బంధువుల నందరిని స్వర్గలోకములో చూచెను.

### 3.1.1.5.1.2. ధృతరాష్ట్రునికి సుత బాంధవ సందర్శనా కాంక్ష

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఆశ్రమవాస" పర్వము ద్వితీయాశ్వాసములో (70-127) గలదు. వరమును తొలుత కోరినవాడు ధృతరాష్ట్రుడు. ఆ కోరికను పునరావృత్తము చేసినవాడు కుంతీ గాంధారీ జనము. వర ప్రదాత వేదవ్యాసుడు.

కురుక్షేత్ర సమరానంతరము పాండవులు హస్తినలో రాజ్యమును చేపట్టిరి. పిదప ధృతరాష్ట్రాదులు భాగీరథీతీరమున నాశ్రమవాసమును

గడుపు చుండిరి. అపుడొకసారి వేదవ్యాసుడు వచ్చి వరమును కోరు కొనుడని యడిగెను. దుష్టుడైన దుర్యోధనుని రాజ్యకాంక్షచే కల్లకపటము తెలియని వారును, పాప రహితులునైన సమస్త రాజులు యుద్ధమున చనిపోయిరని పలికి

తే.గీ॥ "——————అవ్విభుల కేది
గతియొ" (88) అని ప్రశ్నించెను.

అప్పుడు కుంతి కర్ణుని గురించి మనస్సులో తలంచెను. ఆ విషయమును వేదవ్యాసుడు గ్రహించెను. గాంధారితో

ఆ.వె॥ "నీవు సుతుల దోడ బుట్టు
వులను గాంతు నీదు చెలియు గొంతియు
గర్ణు గూడ గాంచు గణ్య చరిత" (2-107).

ఉ॥ "ద్రౌపదియున్ సుభద్రయును దక్కటి కాంతలు భ్రాతృ
పుత్ర పౌ
త్రోప విలోక నోత్సవము నొందుదు రిచ్చట కిష్ట వచ్చు టే
నీ పని యాచరించుటకు నిమ్మను జేంద్రుడు నీవు గొంతి చిరు
తా పరితాపనోదన విధంబుగ గోరితి రట్లు చేసెదన్" (103)

అని తెలిపెను. కొడుకులను, మనుమలను, గురించి బాధ పడవలదని చెప్పి వారిని గంగానది యొద్దునకు పిలిచికొని వెళ్ళెను. మరునటి సూర్యోదయమైన పిమ్మట వేదవ్యాసుడు నదిలోనికి దిగెను. ఒడ్డున స్త్రీ పురుషులు నిలబడి చూచుచుండిరి. అతడు నీటిలోనికి మునిగి "ఇటు రండు" అనెను. వెంటనే నీటి యందెక్కువ శబ్దము కలిగెను. భీష్మ ద్రోణులను ముందిడు కొని కౌరవ ముఖ్యులును, నితర కౌరవులందరును, కర్ణ, ద్రుపద, విరాట, శకుని, యతని తనూజులు, దివ్యా

లంకారాంబరములను ధరించిన దివ్య శరీరములతో నొడ్డునకు వచ్చిరి. ఈ వైభవమును చూడ ధృతరాష్ట్రునికి దివ్య దృష్టి నిచ్చెను. వెంటనే గాంధారి తన కంటికి కట్టిన గుడ్డను విప్పివేసి చూచుచుండెను. వారం దరు దివారాత్రములు కలిసి మెలిసి యుండిరి. మరుసటి దినము పారాశర్యుని యాజ్ఞ మేరకు వారు భౌతిక ప్రపంచమును వీడిరి.

3.1.1.5.2. పుణ్యలోక ప్రాప్తి వరములు

పాపికి నరకము, పుణ్యాత్మునకు స్వర్గము దక్కునని నమ్మకము. పాపులైన వారు కూడా పుణ్య కార్యములచే స్వర్గమునకు చేరుకొందురు. కొన్ని వేళల మహాత్ముల వరానుగ్రహములు కూడ పుణ్య లోక ప్రాప్తికి దారి తీయును. ఇట్లు పుణ్యలోక ప్రాప్తిని కలిగించిన వరములు "ఎనిమిది" గలవు. 1. కృత్తికల, 2. కురుక్షేత్ర మృతుల, 3. బ్రహ్మరాక్షసుల, 4. పరశురాముని, 5. సోమకరాజర్షి ఋత్విజుని, 6. మాంధాతృ, 7. వివిధ దానాదుల వలన, 8. సుమిత్ర గోవులకు పుణ్యలోక ప్రాప్తి వరములు

3.1.1.5.2.1. కృత్తికలకు పుణ్యలోక ప్రాప్తి

ఈ వత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య పర్వము" పంచమాశ్వాసములో (237-245) గలదు. వరమును కోరినవారు కృత్తికలు. వర ప్రదాత కుమారస్వామి.

ఇంద్రుడు దేవసేనా కుమారస్వాములకు వివాహమును చేసెను. ఆ సమయమున కృత్తికలు కుమారస్వామి దగ్గరకు వెళ్ళి "ఒక పర్యాయమెవ్వరును చూడని సమయమున మేము సంభ్రమముతో అగ్ని దేవునితో కలిసి నిన్ను కంటిమని దుర్జనులు పలికినందుకు మా భర్తలు

మమ్ములను విడిచి పెట్టిరి. నీవు మాకు ప్రియమైన కుమారుడవు" మాకు పుణ్యలోకమును ప్రసాదింపుమని కోరిరి. కుమారస్వామి వినయముతో

కం॥ ——"నేను మీకు బుత్రుడ మీరల్
నన్ను గన్న తల్లులరు విను
డనుమానం బేల మీ ప్రియం బొనరింతున్" (243)

అని పలికి తన సమీపమున నున్న ఇంద్రుని చూచి వీరికి తగు పదమును సూచింపుమని కోరెను.

అంత ఇంద్రుడు రోహిణి ప్రక్కన గల "అభిజిత్" నక్షత్ర స్థానము ఖాళిగా కలదని తెలిపెను. కుమారస్వామి వారికి నాస్థాన మొసగెను.

ఆ.వె॥ "వారు సనిరి గగనమునకు" (244)

3.1.1.5.2.2. కురుక్షేత్ర మృతులకు పుణ్యలోక ప్రాప్తి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శల్య పర్వము ద్వితీయాశ్వాసములో (214–218) గలదు. వరమును కోరిన వాడు "కురు" అను రాజు. వర ప్రదాత ఇంద్రుడు.

చంద్రవంశపు రాజైన "కురు" అను పేరు గల రాజు శమంత పంచక ప్రాంతమును దున్నెను. ఇట పుట్టిన జనులందరును చని పోయిన తరువాత త్రిదివమునకు వెళ్ళవలయునని యాతని కోరిక. అప్పుడు ఇంద్రుడు వెళ్ళి దున్నుటకు కారణము నడిగెను. దానికి సమాధానముగ నా రాజు తన కోరికను తెలిపెను. ఇంద్రు డా మాట లను విని గేలి చేసి వెళ్ళెను. అట్లు పలుమార్లు గేలి చేయుచుండెను. కాని కురురాజు పట్టు వదలక బాధపడకుండ దున్నుచుండెను. అప్పుడు

ఇంద్రుడతనికి వరము నీయ దలచి దేవతలకు తెలిపి నిశ్చయించుకొని రాజు దగ్గరకు వెళ్ళి

వ॥ "ఈ పుణ్యక్షేత్రంబున నిరాహారులై దేహంబు విడిచిన
వారలకును, నిందు సమరంబు సేసి సమ్యక్ప్రకారంబున
మృతి బొందిన సమస్త జంతువులకును సురలోక ప్రాప్తి
గలిగెడు మని పల్కి——— సంభావ నాతిశయంబున (216)

కం॥ "గాలి గురుక్షేత్రంబున
ధూలి తనువు జెంది నరుని దుష్కర్మములం
దోలి యతనికి ధరిత్రిం
దూలి మధుర లీనమై నతుల గతి యొసగున్ (217)

అని తెలిపెను.

ఆ వరమును విని రాజు చాలా సంతోషించితినని ఇంద్రునికి తెలిపెను. ఇంద్రుడు వెళ్ళెను.

3.1.1.5.2.3. బ్రహ్మరాక్షసులకు సుగతి ప్రాప్తి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శల్య పర్వము ద్వితీయాశ్వాసములో (170-173) గలదు. వరమును కోరి పొందిన వారు మునులు, బ్రహ్మరాక్షసులు. వర ప్రదాత్రి సరస్వతీమ తల్లి.

మాత్సర్యముతో వసిష్ఠమహర్షిని వధించుటకు విశ్వామిత్రుడు సరస్వతీనది నాజ్ఞాపించెను. ఆమె వసిష్ఠుని తన ప్రవాహముచే తీసికొని వచ్చెను. అతనిని వధించుటకు సాధనమును వెదకుచుండగ నామె వసిష్ఠుని తన ప్రవాహముచే తొలగించెను. అద్దాన విశ్వామిత్రుని శాపముచే సరస్వతీనది రక్తవాహిని యయ్యెను. తరువాత మునులు తప

శ్శక్తితో నా యరుణిమను తొలగించిరి. అప్పుడు కొందరు బ్రహ్మరాక్ష సులు వెళ్ళి యా మునులకు ప్రణమిల్లిరి. తాము చేసిన విప్రద్వేష గురు జన యవమాన దుష్టాన్న భక్షణములగు పాతకములను గురించి తెలిపి

వ॥ "మే మిర్యోడ పసియించి యున్న వారము మాకు నిష్కృతి యనుగ్రహింప వలయు నని ప్రార్థించిరి." (172)

వారి ప్రార్థనను వినిన మునులు వ॥ "సరస్వతిం బ్రార్థించిరి."(172) మునుల ప్రార్థనను వినిన యా మహానది "అరుణా"నదిని "అంతర్వాహిని"గా నుండ కదలి వచ్చినది. అందు మజ్జనము సేయుడని యానతిచ్చినది. బ్రహ్మరాక్షసులట్లు చేసి రాక్షస దేహమును వదలి ధర్మగతికి చనిరి.

3.1.1.5.2.4. పరశురాముని సద్గతి కాంక్ష

ఈ వత్తాంతము నన్నయ భారతభాగము "ఆరణ్య" పర్వము ద్వితీయాశ్వాసములో క్లుప్తముగా (261-264), తృతీయాశ్వాసములో వివరముగా (145-156) గలదు. వరమును కోరినవాడు పరశురాముడు. వరప్రదాతలు పితృదేవతలు.

కార్తవీర్యార్జునుడు క్షత్రియుడు. రాజు. సహస్రబాహుడు. అతడు బహు సైన్యముతో కలిసి యొకనాడు వేటకు నరణ్యమునకు వెళ్ళెను సైన్య సమేతుడై జమదగ్ని ముని యాశ్రమమునకు వెళ్ళెను. ఆ ముని గౌరవించెను. కాని యా రాజు రాజ్య మదముతో మెచ్చక యాశ్రమవాసుల నవమానించెను. అచ్చట గల వృక్షముల నన్నింటిని విరిచెను. జమదగ్ని హోమధేనువును, దాని దూడను తోలికొని

వెళ్ళెను. జమదగ్ని నిస్సహాయుడై నిలిచెను. అంత దర్భఫలము లకు వెళ్ళిన పరశురాముడు వచ్చెను. జమదగ్ని విషయమంతటిని చెప్పెను. వెంటనే పరశురాముడు బయలుదేరి దారిలోనే యా రాజు సైన్యమును బాణములతో చీకాకు పరచెను. రాజును చంపెను. రాజు కొడుకులు పరశురామునికి శత్రువులైరి. వారొక నాడు పరశురాముడు లేని సమయమున జమదగ్ని యాశ్రమమునకు వెళ్ళి జమదగ్నిని చంపిరి. ఆ విషయమును పరశురాముడు తెలిసికొనెను. పరశురాముడు క్షత్రియులపై పగ బూనెను. తన దారుణ పరశువుచే క్షత్రియుల నందరిని వధించెను. వారి రక్తము నంతటిని నైదు మడుగులుగా చేసెను. ఆ రక్తముతో నచటనే పితృ తర్పణమును చేసెను. అప్పుడతని పితృ దేవతలు ప్రత్యక్షమై "నీ కిష్టం బైన వరంబు వేడు మనిరి" (262) అప్పుడు పరశురాముడు

తే.గీ॥ "క్షత్ర వధ నైన పాపంబు గ్రాగ వలయు
గడగి నాకును సద్గతి గలుగ వలయు
నివియు బుణ్య తీర్థంబులై యుద్ధరిత్రి
బరగు చుండగ వలయు మీ కరుణ జేసి" (263) అని వేడెను.

అతడు కోరినట్లు పితృదేవత లా మూడు వరముల నిచ్చిరి.

**3.1.1.5.2.5. సోమకుడను రాజర్షి ఋత్విజునకు స్వర్లోక ప్రాప్తి**

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆరణ్య" పర్వము తృతీయాశ్వాసములో (208 221) గలదు. వరమును కోరినవాడు సోమకుడను రాజర్షి ఋత్విజుడు. వరప్రదాత యా సోమకుడు.

సోమకుడు ప్రసిద్ధుడగు రాజు. అతనికి నూఱు మంది భార్యలు. వారికి సంతానము లేదు. కావున నతడు యజ్ఞమును చేసెను. అతని

కొక పుత్రుడు కలిగెను. కొంత కాలము తరువాత తన నూఱు మంది భార్యలకు సంతానము కలుగవలెనని మంత్రులను, ఋత్విజుని సలహా నడిగెను. ఉన్న కొడుకును చంపి వాని వప (క్రొవ్వు లేక మెదడు) ను యజ్ఞములో వేల్చి "అగ్ని దేవు"ని కొలిచినచో నూఱుగురుకు నూఱు మంది పుత్రులు పుట్టుదురని ఋత్వికుడు సలహా నిచ్చెను. రాజం దుకు సమ్మతించెను. ఆ విధముగ యజ్ఞము జరిగెను. నూఱు మంది గర్భములను ధరించిరి. నూఱుగురు పుత్రులు పుట్టిరి. తరువాత కొంత కాలమునకు ఋత్విజుడు మరణించెను. యమధర్మరాజు ఋత్విజునికి నరకలోకములో ఘోరమైన యగ్ని యందు క్రాగునట్లు శిక్షను విధించెను. అత డా శిక్ష ననుభవించు చుండెను. మరి కొంత కాలమునకు రాజు మరణించెను. నరకలోకము మీదుగా "అమర" లోకమునకు వెళ్ళుచు నగ్ని యందున్న తన ఋత్విజుని చూచెను. "ఇట్లేల తీవ్ర దుఃఖోప హతుడవైతి" వని యడిగెను. అప్పుడు ఋత్విజుడు రాజునకు పూర్వము చేసిన సహాయము వలననే తనికిప్పుడు నరక బాధ కలిగినదని తెలిపి తన్ను కాపాడుమని ప్రార్థించెను. రాజు కా ఋత్విజునిపై కనికరము కలిగినది. యమధర్మరాజు దగ్గరకు వెళ్ళి

కం॥ "నా కారణమున ఋత్విజు

డే కాంతము నరక గతికి నేగెను" (220) అని పలికి తన తపో యజ్ఞ ఫలములను ఋత్విజునకు ధారవోసె యతనికి నరక విముక్తిని కలిగించెను.

### 3.1.1.5.2.6. మాంధాతృకు పుణ్యలోక ప్రాప్తి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక"పర్వము తృతీయాశ్వాసములో (5-17) గలదు. వరమును కోరినవాడు మాంధాతృడను రాజు. వర ప్రదాత బృహస్పతి.

ధర్మరాజు గోప్రదాన విధిని గురించి యంపశయ్యపై నున్న భీష్ముని నడిగెను. దానికి సమాధానముగా మాంధాతృ గోదానమును గురించి బృహస్పతి నడిగి తెలిసి కొనిన యీ క్రింద తెలిపిన విషయమును భీష్ముడు ధర్మరాజుకు తెలిపెను. గోవులు తనివితీరా మేసి నీటిని త్రాగి మందకు వచ్చెను. సౌఖ్య మెసగ పరుండి యుండెను. మాంధాతృరాజు నియతిగ నచట నిలిచి పరమ భక్తితో బృహస్పతిని తలచి . . . .

వ॥ "కరములు మొగిచి బహు విధముల బ్రస్తుతించెను" (6) వెంటనే, వ॥ "ఆ పురుహూత పురోహితుండు ప్రత్యక్షంబయ్యెను" (6) అప్పుడు రాజు బృహస్పతి పాదములకు మ్రొక్కి గోప్రదాన విధిని గురించి తెలుపుమని యడిగెను. బృహస్పతి యప్పుడే మాంధాతృ రాజుకు గోప్రదానమును (గోదానమును) గురించి యీ క్రింద తెలిపిన విధముగ వివరించెను. పుణ్య దినమున బ్రాహ్మణుని యను మతితో నుపవసించి గోవుల మందకు వెళ్ళ వలెను. అచట పరమ నియతితో నా దివారాత్రము లుండ వలెను. సంగవాభిదాన సత్కాలమున దానముగ తానిచ్చు గోవును పేరు పెట్టి సంతోషముతో పిలువ వలెను. "తల్లి గోవు, వృషభము తండ్రి. గర్భ ప్రదేశము దివము, ధరణి సంప్రతిష్ఠ" అని బ్రహ్మ చెప్పిన వాక్యమును తరువాత పఠించ వలెను. పిమ్మట యోగ్యుడగు విప్రుని నర్చించి గోవును దానముగా నతనికి నిచ్చు చున్నట్లు పలుక వలెను. తరువాత

కం॥ "సారము లగు గోవులు మ
ద్ఘోర సకల కల్మషముల ద్రుంచును సౌమ్య
త్వారూఢంబులు శాశ్వత
సారోదార పద మిచ్చు సౌఖ్యమున జేర్చున్" (12)

అని పలుక వలెను. "గోవునిచ్చితి" నని పలుకుచు నీటిని నా విప్రుని చేతి యందు పోయవలెను. గోదానమును గ్రహించుటకు "శిష్యుడు, వ్రతశీలుడు, అనఘుడు, శాంతుడు, దాంతుడు, అక్రోధనుడు"-తగిన వారు. గోదాత మానవు డోపికతో "ఆశ్వీయుజ" మాసములో వచ్చు రెండవ యష్టమి నుండి వ్రతమును పూని మూడు రోజుల పాటు పరి పూజిత గోవుల మందలో నుండి నిష్ఠతో గోవుల పేడ నన్నముగా తినుచు గోవుల మూత్రమును, పాలను త్రాగినచో బహు కామ్య ఫలములను పొందును.

బృహస్పతి చెప్పినట్లు మాంధాతృరాజు గోదానమును చేసి యుభయ లోకములలో వినుత డయ్యెను. అతని చరిత్రను తెలిసి కొని భరత, దిలీప, భగీరథ, దాశరధి మొదలగు రాజులు కూడ నా విధముగ ప్రవర్తించి పుణ్య లోకములను పొందిరి.

3.1.1.5.2.7. వివిధ దానాదుల వలన పుణ్యలోక ప్రాప్తి

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య" పర్వము చతుర్థాశ్వాసములో (208-217) గలదు. వరమును కోరినవాడు తార్క్ష్యు డను ముని. వరప్రదాత్రి భారతీదేవి.

పూర్వము తార్క్ష్యుడను ముని భారతీ దేవత నారాధించెను. ఆమె ప్రత్యక్ష మయ్యెను. అప్పుడతడు

కం॥ "పురుషున కెయ్యది ధర్మువు
పురుషుం డెద్దాన బరమ పుణ్యాత్మకుడై
చిరపుణ్య గతులు వడయును
దిరముగ నివి యానతిమ్ము దేవీ నాకున్" (209) అని కోరెను.

భారతీదేవి యతని కోరికను మన్నించి పుణ్యలోక గతులను వివరిం చెను.

నాలుగు వేదములను చదివి నానాధ్వర వ్రతుడై యుండు నట్టి పుణ్యవంతుడైన బ్రాహ్మణుడు "అమరావాసము" ను చేరును. అచట "అప్సరస" నృత్యమును చూచును. పెక్కేండ్లుండును. తొలి పర్యాయము మంచి దూడ నీనిన యావును దూడతో సహ శ్రోత్రియునికి దానము నిచ్చినచో నా యావు శరీరముపై నెన్ని రోమము లుండునో యన్ని వేల యేండ్లు నరునికి సురలోక సౌఖ్యము లభించును. బరువును మోయదగిన మంచి యెద్దును బ్రాహ్మణుని కిచ్చిన నరుడు "దశకిమిరవొంద" (3100) దేనువుల నిచ్చిన ఫలమును పొందును. మంచి వస్త్రము నిచ్చి చంద్రలోకమునకు వెళ్ళును. బంగారు నిచ్చినచో స్వరలోకమునకు వెళ్ళును. ప్రయత్న పూర్వకముగ నేడు సంవత్సరములు నేతితో యజ్ఞమును చేసి "అగ్ని దేవు" ని సేవించిన యతడు పదునాలుగు తరముల పితరులను తీసికొని దివికి వెళ్ళును. ఎల్లప్పుడును శుచియై దేవతలను ప్రదీప్తాగ్నియందు వదలక తృప్తి పరచిన యతడు గౌరవముతో గోలోకవాస చిర సౌఖ్యములను పొందునని తెలిపెను. అగ్నిహోత్రము భారతీదేవత యాత్ర సకల యజ్ఞముల యందును కల్గింపబడు విశిష్ట ద్రవ్యము లన్నియు నామెవే. ఆమె మహనీయంబైన "అగ్నిహోత్ర" ముఖము ద్వార ననుభవించును. ఆత్మజ్ఞులైన మహాత్ములకు నఖిల సంశయచ్ఛేదమును చేయును. అనవరత తపస్స్వాధ్యాయ దానవ్రత పరాయణులై యుందురో యది యామెకు సంబంధించిన పరమపదము. శ్రేష్ఠమైన తేనె, పాలు, నీరు, శర్కరా, సైకతములును, మాంసాపూప సమూహములును పాయస కర్దమములును నైన యేఱు లనేకములను పుట్టించి ఇంద్రాగ్ని మొదలగు దేవతలను తృప్తి చేసిన యజన శీలురు. పెకేండ్లు భారతీ దేవత లోకమును పొందుదురని తెలిపెను.

3.1.1.5.2.8. సుమిత్ర గోవులకు పుణ్యలోక ప్రాప్తి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వము తృతీయాశ్వాసములో (62-36) గలదు. వరమును కోరినవి సుమిత్రుని గోవులు. వరమును గ్రహించిన వారు కామరూపిణులగు గోవులు.

భృగు వంశ సంభవుడైన సుమిత్రుడను పేరు గల ముని కడ నొక గోవుండెను. దాని సంతతి క్రమముగా వృద్ధి నొందెను. వాటిలో రంగు రంగుల యాపు లుండెను. ఒకనా డా గోసంతతి సమీపమున నొక సరస్సులో స్త్రీల రూపములను ధరించి జలక్రీడ లాడు స్త్రీలను దర్శించెను. వారిని చూచిన సుమిత్రుని గోవులు "మీరెవ్వ"రని మనుష్యవాక్కుల నడిగెను. వారు గోవులమని సమాధానమును చెప్పిరి. మరల సుమిత్రుని గోవులు "ఇటువంటి యద్భుతానుభవము మీ కెట్లు కలిగెనని యడిగెను. హవ్య కవ్యములకు, నతిథి పూజలకు, వారి యాహారములకు, బ్రాహ్మణులకు తాము పాల నిత్తుమనియు, వారి పనులను చేయుటకు తమ పుత్రులను పంపుదు మనియు, కావున తమ సుకృతములచే తమ కీ గొప్పదనము కలిగెననియు, తమకు గోలోకము లభించుననియు చెప్పిరి. సుమిత్రుని గోవులు దీన వదనలై యా స్త్రీలను

కం॥ "గోవులకును గోవులు గతి
గావున మీ రరసి సుగతి గలుగు తెరువు మా
కేవిధి నైనను జెప్పం
గా వలదే యని" (72) నేడిరి.

వారు "అట్లుకాకని" (72) చెప్పి

తే.గీ॥ "రంతిదేవుండు వేవత్సరములు సేయు
నధ్వరమునకు బశువులై యరుగు డతడు

విశసనము సేయ గోలోక విభవమొంద
గాంతు రని నెమ్మి బల్కిరి" (73)

వెంటనే సుమిత్రుని గోవులు రంతిదేవుని యజ్ఞమునకు వెళ్ళుటకు ప్రయత్నించెను. అప్పుడు పోషకుడైన సుమిత్రుని యనుమతి లేనిదే యెట్లు వెళ్ళగలమని యొక గోవు పలికెను. అతనిని చంపినచో నతడు గూడ గోలోకమునకు వచ్చును గదా యని గోవులన్నియును పలికెను. గోవులన్నియు కలిసి సుమిత్రుని చంపుటకు వెళ్ళెను. భయపడి యతనిని తేటి చూడలేక వెను దిరిగెను. అప్పుడు వాటిలోని కొన్ని కపిల వర్ణ ధేనువులు "మేమతి క్రూర చిత్తులము. అతనిని వధించెదము. మీరు మాకేమి మేలును చేయుదు" రని యితర గోవులను ప్రశ్నించెను. సమాధానముగ నితర వర్ణ గోవులు

ఆ.వె॥ "సకల వర్ణ ధేను సమితికి నెల్లను
గపిల గోవు శ్రేష్ఠ గాగ గపిల
నీగి గోశతంబు నిచ్చిన యట్లుగా
వరము మీకు నిచ్చు వార మనిరె" (75)

ఆ మాటలను విని కపిల వర్ణ గోవులు చాల సంతోషించెను. తాము రూపి ణులగుటచే రూపాంతరములను పొంది సుమిత్రుని దగ్గరకు వెళ్ళి "మేము గోమాతలము నీ గోసమారాధనమునకు మెచ్చి వరమునిచ్చు వారమై వచ్చితి మిష్టం బెయ్యది యడుగు" మని యతనితో పలికెను. సుమిత్రుడప్పుడు ఇప్పటి యట్ల యెల్లప్పుడును గోవుల వలన భక్తి స్నేహములు గలుగు నిండని" (76) కోరెను.
అవి "అట్ల యయ్యెడు గాక" (76) అని పలికెను. మరియు నతనిని

కం॥ "ఈ లోకం బేటికి మన
గోలోకంబునకు రమ్మి కులవర" (77) అని యడిగెను.

అప్పుడు సుమిత్రుడు

కం॥ చాలుదునే మద్గోర
త్నాలి విడిచి యందు రాక కని ముని పల్కెను. (77)

అవి యతని మాటల నంగీకారముగా భావించెను. వెంటనే యతనిని కొమ్ములతో పైకెత్తి యోగబలముచే నతని ప్రాణమును పోగొట్టి క్రింద బడవైచెను. కొమ్ములతో కాళ్ళతో పిండి యగునట్లు చేసెను. అతనికి గోలోకము సిద్ధించెను. అతనిని చంపిన విధమును పిమ్మట నితర వర్ణ గోవులకు చెప్పెను. ఇతర వర్ణ గోవు లా కపిల వర్ణ గోవులకు ముదు చెప్పి నట్లు వరము నిచ్చెను.

తరువాత రంతి దేవుని యజ్ఞమునకు వెళ్ళి యతనిని

వ॥ "సుగతి వేడి మమ్ముం బశువులుగా విశసింపు మని మానుష
భాషణంబులం బ్రార్థించెను." (80) అప్పుడు రాజు వాటిని

చంపినచో తన కే విధముగ సద్గతి కలుగునని ప్రశ్నించెను. "జ్ఞానులు చేయు నీ పనికై నిన్ను చూడుమని మమ్ములను పంపిరి. కావున నీకు స్వర్లోకము కలుగును. నీ కీర్తి జగము లన్నింట వ్యాపించు" నని గోవులు చెప్పెను. అప్పుడు రాజు వాటితో

కం॥ "————————మీ లోపల నొక
గోపైనను మోహవశత గూరుటయు మఖం
బావేళ బరి సమాప్తము
గా వలయును వినుడు సమయ కల్పన దెలియున్ (83)

అని పలికెను. ఆ రాజు మాటలను

కం॥ "విని గోవులు సమ్మతించెను" (84)

అప్పటి నుండి రాజా గోవులను వధించి, యజ్ఞములో ప్రేల్చుచుం డెను. ఒకనాడొక గోవు తన దూడకు పాలనిచ్చుచు దాని మీద జాలి బుద్ధితో "నీ వింక యెక్కడ చేసెదవు. అకృపులు నన్ను చంపుటకు వచ్చుదురు" రని పల్కెను. మహానుభావుడైన రంతిదేవు డా గోవు మాటలను విని యా యాగమును సుప్రయోగముగా సమాప్తము చేసెను. కొన్ని గోవులు వధింప బడక మిగిలెను. వాటి సంతతియె నేటి గో సంతానము. ఆ యజ్ఞములో వధింపబడి ప్రేల్చబడిన గోవులు గోలోకమునకు ప్రమోదముతో వెళ్ళెను. మరణానంతరము

వ॥ "ఆ రంతిదేవ భూపతియును యజ్ఞ సమృద్ధుండై వృద్ధశ్రవునితోడి సఖ్యంబునం బొలిచి యక్షయ నాకంబున సుశ్లోకుండై యుండె పేన పాఖ్యుండును గోలోకంబున శాశ్వతుండై వసించెను" (86)

ఈ యితిహాసములో నాలుగంశము లున్నవి. మొదటిది మానవుల కవసరమైన మేలును చేసిన గోవులకు, రెండవది గోవులను పోషించిన సుమిత్రునకు, మూడవది దేవతల ప్రీత్యర్థము మానవుల క్షేమార్థము యజ్ఞ బలి పశువులైన గోవులకు, బ్రహ్మలోకము కంటె సూర్ధ్వమున నున్న గోలోక ప్రాప్తి, నాల్గవది యజ్ఞఫల సమృద్ధుడైన రంతిదేవునకు స్వర్గలోక ప్రాప్తి.

3.1.1.5.3. విశ్వరూప సందర్శన వరములు

ధర్మమునకు హాని కలుగు వేళ, నధర్మము పెచ్చు పెరుగు వేళ భగవంతుడు భూలోకమున నవతరించునని "ఐతిహ్యము". ఈ యవతరణమునకే "అవతారము" లని పేరు. అవతారములు విష్ణుమూర్తికి గాని శివునకు లేవు. మత్స్య, కూర్మాదు లవతారములే.

శ్రీకృష్ణుడు పూర్ణావతారుడు. అయినను శ్రీకృష్ణుని మానవమాత్రు నిగా తలచి పరిహసించిన వారును లేకపోలేదు. అట్టి వేళ పూర్ణావతారమున స్వామి తన విశ్వరూపమును ప్రదర్శించి బయ పెట్టును. ఇట్టి విశ్వరూప ప్రదర్శనములు "ఐదు" చోట్ల కనిపించును. వానిని రెండు రకములుగా వర్గీకరించ వచ్చును. 1) ఋషి, 2) మర్త్యదర్శితములు.

3.1.1.5 3.1. ఋషి దర్శిత విశ్వరూపము

స్వామి విరాట్స్వరూపమును దర్శించిన ఋషులలో కశ్యప, నారద, ఉదంకులు ముఖ్యులు.

3 1.1.5.3.1 1. కశ్యప విశ్వరూపము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వము ప్రథమాశ్వాసములో (354) గలదు. వరమును కోరిన వాడు కశ్యప ప్రజాపతి. వరప్రదాత నారాయణమూర్తి.

కశ్యప ప్రజాపతి నారాయణమూర్తిని చూడవలెనని తలంచెను. ఏకయోగ సమాధి నవలంభించి యారాధించెను. అప్పుడు నారాయణ మూర్తి.

వ॥ "నీలశ్వేత పీతారుణపింగళంబును బహూదర పాదపాణి
శిరోనేత్రంబును నైన దివ్య గాత్రంబు చూపి సంగంబు గల
నంతరంగంబున నన్నెఱుంగ వచ్చునే నిస్సంగుండవై
యెఱింగెదవు గాక యనియె" (354)

3.1.1.5.3.1.2. నారద మహర్షి దర్శిత విశ్వరూపము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము షష్ఠాశ్వాసములో (349-353, 377-390) గలదు. వరమును కోరిన వాడు నారద మహర్షి. వరప్రదాత నారాయణమూర్తి.

బదరికాశ్రమమున నారాయణమూర్తిని నారద మహర్షి భక్తితో కొలచి

సీ॥ "— — — — — — — ధ్రువం బచ
లం బింద్రియా గోచరంబు సూక్ష్మ
మనుపమ మన సర్వమున కంత రాత్మయై
వెలుగు తత్వము దక్క వేఱ కలదె.

తే.గీ॥ "యరయ నారాధ్యమై యజుడాది గాగ
సకల భూతలంబులకును బూజ్యంబు దాన యనియె" (349)

నారదముని సంప్రీతు డయ్యెను. వినయముతో మరల

కం॥ "లోకేశ నీవు ధర్మ
శ్రీకావలి గాగ నవతరించుట విద్వ
ల్లోకము సెప్ప నమ్మూ
లాకృతి యెట్లుండునో దయాత్మక మూర్తీ" (351)

కం॥ "శ్రుతి పరతయు గురుభక్తియు
మతి గల వొక కొంత మన్నింపగ బా
త్రత గలిగె నేని నాకొస
గు తదీయాలోకనం బగు తెఱంగు కృపన్" (352)

వ॥ "అని వేడెను" (353).

నారాయణమూర్తి భక్తి పరాధీనతతో నారద మునిని

వ॥ "పరమై కాంతి వగుము నీ కట్టి పెంపు సంపాదించెదం
బొమ్మని యత్యాదరంబున వీడు కొలిపెను" (353).

నారదముని ప్రీతుడయ్యెను. విద్యుద్వీథిలో వెళ్ళి మేరు పర్వతము మీద నియతాత్ముడై యుండెను. పాల సముద్రమున కుత్తరమున సమీపమున నున్న శ్వేతద్వీపము నందనాహారులును, నిద్రియ వృత్తి రహితులును, నస్వేదులును, సుగంధి శ్వేతాంగులును గల పురుషులతని యంతరంగమున కనబడిరి. నారదముని వెంటనే యచటికి వెళ్ళెను. వారతని నాదరించలేదు. అప్పుడతడత్యంత భక్తితో ప్రణతుడై వారికి సమీపమున నిలిచి కఠినమైన తపో నిష్ఠను పూని యూర్ధ్వబాహుడై కదలక యుండి యచట వారందరు నాశ్చర్యపడునట్లు విష్ణు స్తవమును చేసెను. అప్పుడు నారాయణమూర్తి తన దివ్య (విశ్వ) రూపముతో ప్రత్యక్షమయ్యెను. నారదముని వినయ, సంభ్రమ, భక్తి భావయుతుడై నమస్కరించెను.

### 3.1.1.5.3.1.3. ఉదంకముని దర్శిత విశ్వరూపము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అశ్వమేధ" పర్వము తృతీయాశ్వాసములో (21-70) గలదు. వరమును కోరిన వాడు ఉదంకముని. వరప్రదాత శ్రీకృష్ణుడు.

భీష్ముని అపర క్రియలకు వచ్చిన శ్రీకృష్ణుడు ధర్మరాజాదుల కడ సెలవు గైకొని ద్వారకకు బయలు దేరెను. దారిలో ఉదంక మున్యాశ్రమమున నిలిచి మునిని దర్శించెను. అతనిని ముని గౌరవించెను. మునికి కృష్ణు డెవరో తెలియదు. ధార్తరాష్ట్ర, పాండవ శ్రీకృష్ణాదుల గురించి అడిగెను. కురుక్షేత్ర సంగ్రామమున గాని మారణ

హోమమున గాని తనపాత్ర యేదియు లేదని శ్రీకృష్ణుడు విషయము సంతటిని చెప్పెను. అంత ముని

ఆ.వె॥ "అతుల మైన నీదయా మహిమకు నేను
పాత్ర మగుదు నేని పద్మనాభ
యనుపమాన దివ్యరూపము జూపవే
నాకు జూడ్కి యును మనంబు నలర" (47) అని ప్రార్థించెను.

శ్రీకృష్ణుడు దయాళుడై భారతయుద్ధములో అర్జునునికి చూపినట్లు తన విశ్వరూపమును చూపెను. ఆ రూపమును చూచి మునికి భయము, విస్మయములు కలిగెను. చేతులెత్తి నమస్కరించి స్తుతించెను. విశ్వరూపము నుపసంహరించుమని ప్రార్థించెను. శ్రీకృష్ణుడట్లు చేసెను.

3.1.1.5.3.2. మర్త్య దర్శిత విశ్వరూపము

మర్త్యు లనగా మరణము నొందు భూలోకవాసులు. అట్టి వారికి భగవద్దర్శన మపూర్వము. అనూహ్యము. మర్త్యులు దర్శించిన యట్టివి రెండు కలవు. 1) భీష్మాదులు, 2) పార్థుడు ధర్శించిన విశ్వ రూపములు.

3.1.1.5.3.2.1. కౌరవ సభాదులు దర్శించిన విశ్వరూపము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగ" పర్వము తృతీయాశ్వాసములో (405-411) గలదు. వరమును కోరకనే కోరిన వారు భీష్మాదులు. వరప్రదాత శ్రీకృష్ణుడు.

శ్రీకృష్ణ రాయబార ఘట్టములో దుర్యోధనుని దుష్టచేష్టకు శ్రీకృష్ణుడు కోపించెను. అద్భుత భయానక దుర్నిరీక్ష్యమగు తన నిజ రూపమును చూపెను. సభలోనిని నారద, జమదగ్ని, కణ్వ మహా మునులపైనను, భీష్మ, విదుర, ద్రోణ సంజయులపైనను దయతలచి

వారు కోరకనే వారికి మాత్రమే దివ్యదృష్టి నిచ్చెను. అప్పుడు సభలో జయజయ శబ్దములు పుట్టెను. ఆ శబ్దము విష్ణుమూర్తి దివ్య విజృంభణము వలన కలిగినదని ధృతరాష్ట్రుడూహించి

కం॥ "కరుణింపుము సంశ్రిత భయ
హరణ ధురీణా సహింపు మజ్ఞానంబున్
శరణంబు వేడెద భవ
చ్చరణంబులు గను గొనం బ్రసాదింపగదే" (408)

అని వేడెను. అతని వేడికోలుకు

చం॥ "——దయార్ద్ర చిత్తు డగు నప్పరమేశ్వరు డిచ్చె దృష్టి యు
జ్జన పతి కద్భుతం బడర సమ్మద పూరము గ్రమ్మఁగన్" (409)

వెంటనే ధృతరాష్ట్రుడు విష్ణుమూర్తి సహజ రూపమును చూచి భక్తి భావముతో మ్రొక్కి

చం॥"————నిను గంటి గృతార్థుడ నైతి నిఁక నొ
ల్ల నొరుల జూడ లోచనములం బురుషోత్తమ సంహరింపవే"
(409)

అని వేడెను. అప్పుడట నుండిన జనులందరును ధృతరాష్ట్రుని తెల్లనైన కన్నుల నాశ్చర్యముతో చూచుచుండిరి తరువాత.

వ॥ "దామోదరుడు ధృతరాష్ట్రు నభిమతం బొడ గూడ నతని కన్ను లెప్పటి యట్లు గావించి నిజ విశ్వరూప ప్రపంచంబు నుపసంహరించెను." (411)

3.1.1.5.3.2.2. పార్థ సందర్శిత విశ్వరూపము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము భీష్మ పర్వము ప్రథమాశ్వాసములో (210-229) గలదు. వరమును కోరిన వాడు అర్జునుడు. వరప్రదాత శ్రీకృష్ణుడు.

అర్జునుడు తన బంధువులను మిత్రులను చంపుటకు నిష్టపడక యుద్ధమును మాని విషాదముతో కూర్చొనెను. అతని విషాదమును గీతోపదేశముతో శ్రీకృష్ణుడు పోగొట్టెను. సర్వము తానేయని పలికి చివరగ తన విశ్వరూపమును శ్రీకృష్ణుడు చూపెను. అర్జును డా రూపమును చూచి భయ పడెను. శ్రీకృష్ణుని ననేక విధములుగా పొగడి

వ॥ "ఇట్లు దీప్తోగ్రంబగు విభ్రాంతి వొడమి ధృతి దూలి సుఖంబు వడయ నేరక చిక్కువడి యున్నవాడ బ్రసన్నుండ వగుము రక్షింపుము" (213) "అని సంప్రార్థనంబు సేసెను" మరియు

అర్జునుడు శ్రీకృష్ణుని

వ॥ "అదృష్ట పూర్వం బైన భవదీయ రూపంబు గనుం గొనం బడయుటం బ్రమోదంబును బిట్టు చూచిన వెక్కసంబును హృదయ వ్యథయుం బుట్టి యున్న యది నీవొంటి సౌమ్యాకారంబు గైకొని నిలచి నాకు నాహ్లాదంబు సేయుము" (219) అని ప్రార్థించెను. శ్రీకృష్ణుడు పూర్వపు రూపమును ధరించెను. అప్పుడు అర్జునుడు.

వ॥ "సచేతనత్వంబు నొందితి బ్రకృతిస్థితుండ నైతి నని" (221) పలికెను. శ్రీకృష్ణుడు విశ్వరూపము నుపసంహరించుకొనెను.

3.1.1.6. పరిశిష్టము

ఖచ్చితముగా నే విభాగము నందును చేర్చుటకు వీలుకాని

వరము లీ విభాగము నందు చేరును. వీనిలో ప్రధానముగా అనేకానేక వరములు, సవరించి యిచ్చిన వరములు, ప్రకీర్ణకములు చేరదగినవి.

3.1.1.6.1. అనేకానేక వరములు

ఒకే పర్యాయ మొకటి కంటె నెక్కువ వరములను కోరుట యని యర్థము. ఇవి కోరిన వారి తపస్సునకు, సాహసమునకు, నుచిత మైన పనికి, సేవకు మెచ్చి యిచ్చిన వరములు. వీనిని ప్రధానముగా "ఐదు" విధములుగా విభజింప వచ్చును. 1) బ్రహ్మ, 2) గరుత్మంతుని పట్ల నారాయణమూర్తి, 3) గయుని పట్ల అగ్నిదేవుని, 4) శకుంతల పట్ల కణ్వ మహాముని, 5) కుశికుని పట్ల చ్యవన ముని వరములు.

3.1.1.6.1 1. బ్రహ్మ వరములు

3.1.1.6.1.1.1. వైశ్రవణుని భాగ్యము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య" పర్వము షష్ఠాశ్వాసములో (270-271) గలదు. వరములను కోరి పొందిన వాడు వైశ్రవణుడు. వరప్రదాత బ్రహ్మ.

బ్రహ్మ మానస పుత్రుడు పులస్త్యుడు. అతని కొడుకు విశ్రవసుడు. అతని పుత్రుడు వైశ్రవణుడు.

వ॥ "ఆ వైశ్రవణుడు దన తండ్రి యగు పులస్త్యుని విడిచి తాత యగు చతుర్ముఖునకుం దపంబు సేసి నలకూబరుం దను కొడుకును లోకపాలకత్వంబును ధనేశ్వరత్వంబును లంక యను పురంబును శంకరు తోడి సఖ్యంబును వరంబులుగా బడసి మహా విభూతితో వర్తిల్లు చుండెను" (271)

3.1.1.6.1.1.2. సుందోపసుందుల భాగ్యము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వ మష్ట మాశ్వాసములో (95-98) గలదు. అనేక వరములను కోరి పొందినవారు "సుందుడు, ఉపసుందుడు" అను పేర్లు గల రాక్షస సోదరులు. వర ప్రదాత బ్రహ్మ.

తొల్లి దితి పుత్రుడైన హిరణ్యకశిపుని వంశమున "ఇసుంభుడు" పుట్టెను. అతనికి "సుందుడు, ఉపసుందుడు" అను నిద్దరు కొడుకులు పుట్టిరి. వారు నియతాత్ములై తపముచే సర్వమును పొంద వచ్చునని నిశ్చయించిరి. వింధ్యాచలమున హఠయోగము నవలంభించి తప మును చేసిరి. వారి తపోగ్ని ధూపమునకు దేవతలు భయపడిరి. బ్రహ్మ దగ్గరకు వెళ్ళి విన్నవించిరి. బ్రహ్మ సుందోప సుందుల తపస్సునకు మెచ్చి సన్నిహితుడై వారి కిష్టమైన వరము నిచ్చెద వేడుమనెను. వారు నమస్కరించి

వ॥ "దేవా మాయిష్టంబు దయసేయ మీ కిష్టం బేని మాకు
కామ రూపత్వమును కామ గమనత్వమును సకల
మాయాన్వితంబును నన్యులచేత నవధ్యత్వంబును
నమరత్వంబునుం బ్రసాదింపు డని" (97) కోరిరి.

అప్పుడు బ్రహ్మ

ఆ వె॥ "———వారి కమరత్వ మొక్కటి
దక్క గోర్కు లెల్ల నక్కజముగ
గరుణ నిచ్చెన్" (98)

3.1.1.6.1.2. గరుత్మంతుని పట్ల శ్రీమన్నారాయణమూర్తి వరము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వము

ద్వితీయాశ్వాసములోను (103-106) తిక్కన భారతభాగము "అనుశాస నిక" పర్వము ప్రథమాశ్వాసములోను (351-354) నించు మించు సమానముగా గలదు. వరములను కోరి పొందిన వాడు గరుత్మం తుడు. వరప్రదాత శ్రీమన్నారాయణమూర్తి.

గరుత్మంతు డమృత భాండమును తీసికొని తా నేమాత్రము త్రాగకుండ వచ్చుచుండెను. అప్పుడు శ్రీమన్నారాయణమూర్తి యెదు రుగా వచ్చి ప్రసన్నుడై

కం॥ "నీ విజయోత్సాహమునకు
లావునకు జవంబునకు నలౌల్యమునకు స
ద్భావమునకు మెచ్చి వరం
బీ వచ్చితి వేడు మెద్ది యిష్టము నీకున్" (104) అని పలికెను.

గరుత్మంతు డా మాటలను విని యాది దేవుడగు శ్రీమన్నారాయణు నకు నమస్కరించి

సీ॥ "అమృతాశనంబు చేయకయును దేవ నా
కజరామరత్వంబు నందుటయును
నఖిల లోకంబుల కగ్రణి యైన నీ
యగ్రంబు నందు నే న్నధిక భక్తి
గొలుచుచు నునికియు గోరెద గరుణతో
దయ చేయు ముద్ధత దైత్యభేది" (106) అని కోరెను

ఆ కోరికను వినిన శ్రీహరి గరుత్మంతుని యభిమతమును తీర్చెను.

3.1.1.6.1.3. గయుని పట్ల అగ్ని దేవుని వరములు

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ద్రోణపర్వము ద్వితీ యాశ్వాసములో (208) గలదు. వరములను కోరి పొందిన వాడు "గయుడు". వరప్రదాత అగ్ని దేవుడు.

శత్రు పక్షము పన్నిన పద్మవ్యూహములో "అభిమన్యుడు" మరణించెను. ఆ విషయమును తెలిసి కొనిన ధర్మరాజు శిబిరములో చాల దుఃఖించు చుండెను. అప్పుడతని నోదార్చుటకు వెళ్ళిన వేదవ్యాస మహాముని షోడశ రాజుల చరిత్రలను తెలిపెను.

గయుడు షోడశ చక్రవర్తులలో నొకడు. అతడు "అగ్ని దేవుని" నారాధించెను. అగ్నిదేవుడు ప్రత్యక్షమై యేమి కావలయునో కోరు కొను మనెను. అప్పుడు గయుడు.

సీ॥ "— —————బ్రహ్మచర్య
వృత్తంబు దమమును వేద విత్త్వము నహిం
సయు బాత్ర దానంబు శమము వరము
గా గోరి కొనెను" (208)

3.1.1.6.1.4. శకుంతల పట్ల కణ్వ మహాముని వరములు

ఈ వత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వము చతుర్థాశ్వాసములో (61-63) గలదు. వరములను కోరి పొందినది శకుంతల. వరప్రదాత కణ్వమహాముని.

దుష్యంతుడు గాంధర్వ వివాహమున శకుంతలను వివాహమాడి యభిమత సుఖంబుల ననుభవించెను. తరువాత పిలిపించు కొందునని ధైర్యమును చెప్పి వెళ్ళెను. శకుంతల తాను చేసిన దోషమునకు కణ్వమహాముని కోపగించునేమో యని భయపడు చుండెను. కణ్వ మహాముని కంద మూల ఫలములను సేకరించుకొని వచ్చెను. లలిత శృంగార భావముచే లజ్జా వనత వదనయు నతిభీత చిత్తయునై యుండిన కూతురగు శకుంతలను చూచెను. తన దివ్యజ్ఞానము వలన విషయ మంతటిని తెలిసి కొనెను. క్షత్రియులకు గాంధర్వ వివాహము

విధిచోదితమని సంతసించెను. శకుంతలతో "నీవు తగిన" పతి నెన్ను కొంటివి. దానికి తగి నట్లుగ నీ గర్భమున నున్న వా డఖిల భువన చక్రవర్తి యగునని చెప్పి

వ॥ "నీ ధర్మ చరితంబునకు మెచ్చితి నీ కోరిన వరం బిచ్చెద వేడు మని" (63) పలికెను.

అప్పుడు శకుంతల

వ॥ "నా చిత్తం బెప్పుడు ధర్మము నందు తగిలి యుండను నా కుదయించెడు పుత్రుండు దీర్ఘాయురారోగ్యైశ్వర్య బల సమన్వితుండును వంశకర్తయు గా వలయు నని" (63)

వరమును కోరెను. అందుకు కణ్వుడు సమ్మతించెను.

3.1.1.6.1.5. కుశికునకు చ్యవనముని వరములు

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వము ద్వితీయాశ్వాసములో (291-331) గలదు. వరమును కోరి పొందిన వాడు కుశికుడను రాజు. వరప్రదాత చ్యవను డను ముని.

బ్రహ్మ మునుల, సురలతో కొలువు తీరి యుండెను. ప్రసంగ వశమున వారితో బ్రహ్మ భృగు, కుశిక వంశములకు సంకరము వాటిల్లునని చెప్పెను. అచటనే యుండిన భృగు మహర్షి కుమారు డగు చ్యవనముని యా మాటలను వినెను. అట్లు జరుగుటకు నిష్ట పడక కుశికుని వంశమును నాశనము చేయుటకు పూను కొనెను. కన్యాకుబ్జ దేశపు రాజగు కుశికుని యింటికి వెళ్ళెను. కుశికుడును నతని భార్యయును నతిథి మర్యాదలను చేసిరి. తనకు పరిచర్యలను చేయుడని యాదేశించెను. వారట్లు చేసిరి. అతడు వారి ననేక విధము

లుగ పరీక్షించి మెచ్చుకొనెను. గంగాతీరమున జపమును చేసికొను తన దగ్గరకు మరునాడు రమ్మని వారికి చెప్పెను. వారట్లు వెళ్ళిరి. వారికి తన యోగ బలముచే స్వర్గ లోకమును చూపించి క్షణములో మాయము చేసెను. వారు బ్రాహ్మణత్వమును కోని యాడిరి. అతడు వారిని దగ్గరకు పిలిచి మెచ్చుకొని వరమును వేడుమనెను. వారిని పరీక్షించిన కారణమును తెలుపు మనిరి. అతడు వారి కా విషయమును వివరించెను. మరియు వారు కోరకనే

వ॥ "నీకు మూడవ వాడు బ్రహ్మ తేజోదీప్తు డయి జనియించు" (331) నని పలికి "వరంబు వేడు" (331) మని పలికెను.

అప్పుడు కుశికుడు

వ॥ "మదీయ సంతానంబు బ్రహ్మత్వ ప్రాప్త మహత్వనిరూఢం బును గాఢ ధర్మతత్పరంబును గా ననుగ్రహింపు మని" (331) కోరెను. చ్యవను డతని కోరికను విని

వ॥ "నీదు మనమండు త్రిలోకపూజనీయుం డని పల్కెను" (331)

3.1.1.6.2. సవరించి యిచ్చిన వరములు

కోరిన వరముల నిచ్చినచో నితరులకు బాధ కలుగుట గాని, యితరుల వలన వరప్రదాతకు బాధ కలుగుట గాని, వరములకు తగిన యర్హతలు లేకుండుట గాని గమనించియే వర ప్రదాతలు సవరించి వరముల నిచ్చిరి. ఇట్టివి "ఆంధ్ర మహాభారతము" లో నైదు గలవు. ఇవి 1) బ్రహ్మ, 2) మహేశ్వర, 3) సముద్ర, 4) కుమారస్వామి, 5) ఇంద్రుని వరములు

### 3.1.1.6.2.1. త్రిపుర వినాశము పట్ల బ్రహ్మ వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము కర్ణపర్వము ప్రథమాశ్వాసములో (257-261) కలదు. వరప్రదాత బ్రహ్మ. వరమును కోరిన వారు విదున్మాలి, తారకాక్ష, కమలాక్షు లను అన్నదమ్ములైన రాక్షసులు.

తారకాసురుని కుమారులు విద్యున్మాలి, తారకాక్ష, కమలాక్షులను రాక్షసులు. తారకాసురుడు కుమారస్వామితో చేసిన యుద్ధములో మరణించెను. తండ్రి మరణింపగా కుమారులు బ్రహ్మ నుద్దేశించి తపమును చేసిరి. బ్రహ్మ ప్రత్యక్షమయ్యెను. అంత వారు సకల భూతలంబుల సర్వకాలంబుల "అనవధ్యత్వంబు"ను కోరిరి. అంత బ్రహ్మ యిట్టి వరమెచ్చటనుకానరాదనియు, నిచ్చుటకు పుచ్చుకొనుటకు తగిన రీతిలో వరమును కోరుకొనుడని యాదేశించెను. అంత వారును

వ॥ "మాకు మువ్వురకు మూడు పురంబు లెల్ల సుఖంబులుం గలిగి
కామ గమనంబులై దేవ దానవ యక్షోరగాది జాతులకుం
జెఱుప రాక విలసిల్లు నట్లుగా నొసంగు మేము భవత్ప్రసా
దము సొంపున నిర్భయులమై పెం పొంది సంచరించెదము."
(261) అని వరమును కోరెరి.

బ్రహ్మ యా వరము ననుగ్రహించి సమాప్తి దశను కూడా సూచింపుడని వారినే యడిగెను. త్రిపురము లెపుడు దగ్గరికి రాగలవో యప్పుడే వర సమాప్తి యని తెలియ జేసిరి. బ్రహ్మ యట్లే యనుగ్రహించెను.

### 3.1.1.6.2.2. సైంధవ విజయము పట్ల మహేశ్వర వరము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్యపర్వము"

షష్ఠాశ్వాసము (253-260) లో కలదు. వర ప్రదాత మహేశ్వరుడు. వరానుగ్రహమును పొందినవాడు సైంధవుడు.

పాండవులు జూదములో నోడిపోయి యరణ్యవాసమును చేయుచుండిరి. అంత నొకనాడు సైంధవుడు ద్రౌపది నపహరింప కమకట్టెను. అపుడు పాండవులు సైంధవుని నవమానించిరి. సైంధవు డా యవమానమును భరించ లేక పోయెను. తాను పురమునకు వెళ్ళక గంగాతీరమునకు కదలి చనెను. శివు నుద్దేశించి పాదాంగుష్ఠ తపమును చేసెను. శివుడు ప్రత్యక్షమయ్యెను. పాండవులను జయించు వరము ననుగ్రహింపుమని కోరెను. శివుడతని కోరికనువిని "ఇంద్రా"ది దేవతలకైనను పాండవులను జయించుట కష్టమని పలికి

చం॥ "విజయు డొకండు దక్క నతి వీరుల బార్థుల నున్న నల్వురన్
నిజ మొకనాటి కయ్యమున నీవు జయింపుము: ఫల్గునుండు స
ర్వ జగదజయ్యవిక్రముడు వాని నెదుర్కొని నాకు నైన బో
ర జితుని జేయు టెంతయు భరం బగు నిక్కము వల్కితిం
జుమీ (257)

అని వరమును నవరించి శివు డనుగ్రహించెను.

3.1.1.6.2.3. సేతు నిర్మాణము పట్ల సముద్రుని యంగీకారము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము ఆరణ్యపర్వము సప్తమాశ్వాసము (43-50) లో కలదు. వర ప్రదాత సముద్రుడు. వరానుగ్రహమును పొందినవాడు శ్రీ రామచంద్రుడు.

శ్రీరామ లక్ష్మణులు, వానర సైన్యముతో దక్షిణము వైపు కదలిరి. సైన్యము దక్షిణ సముద్రతీరమును చేరినది. సముద్రము

నెట్లు దాట వలయునో రామునకు తెలియలేదు. లక్ష్మణ ద్వితీయుడై దర్భశయనుడై యుపవాస దీక్షతో సముద్రుని నారాధించెను. సముద్రుడు ప్రత్యక్షమై ప్రియంబు చేతునని పలికెను. లంక కరుగ మార్గము చూపక పోయినచో దివ్యాస్త్రంబుల శోషింప జేయుదునని రాముడు పలికెను. సముద్రుడా మాటను విని రాము డంతటి వాడె యట్లు చేసినచో తాను చులకన యగుదుననియు, మానవులు కూడా యిట్టి ప్రయత్నము చేయగలరనియు తన దైన్యమును వ్యక్తము చేసెను. మరియు రామునితో

సీ॥ "మీయందు గపివీరు డాయత మతి విశ్వ
కర్మ సూనుడు శిల్పి కర్మ విదుడు

అ.వె॥ "నలుడు నాగ నొకడు గలడు వా డొలసి నా
యందు దరులు గిరులు నొందఁ బైవ
నవి ధరింతు నేను దివిరి నీ కది సేతు
వుగ గడంక నరిగి పగఱ గెలుము" (49)

అని యుపాయమును తెలిపెను.

3.1.1.6.2.4. కుమార సప్తమాతృకల పట్ల కుమారస్వామి వరము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము" "అరణ్య"పర్వము పంచమాశ్వాసములో (245-252) గలదు. వరమును కోరి పొందిన వారు కుమార సప్తమాతృకలు. వర ప్రదాత కుమారస్వామి.

కుమారస్వామి స్వాహాదేవి కోరికను తీర్చిన వేళ కుమార సప్త మాతృక లతని దగ్గరకు వెళ్ళిరి. వారు ముందున్న మాతృకల కంటె నెక్కువగా జగత్త్రయములకు తమ నిప్పుడే మాతలగా నుంచుడనియు, ముందున్న మాతృకల గౌరవము కంటె నెల్లప్పుడును తమనే సర్వ

లోకములు నిష్టముతో కొలుచు నట్లుగ వరము నిమ్మనియు కోరిరి. ఆ మాటలను వినిన కుమారస్వామి నవ్వుచు పూర్వపు సప్త మాతృకల గౌరవమును తగ్గించ వలదనియు, మఱియొక వరమును కోరుమని వారికి తెలిపెను. అందుకు కుమార సప్త మాతృకలు గౌరవముతో సమ్మతించి

కం॥ "———— ——ఏ మీ
జగముల గల శిశువులకు నజస్రము బీడల్
దగ నొనరించుచు నీకృప
నెగడెద మివ్వరము మాకు నీ వొసగ దగున్" (249)

అని కోరిరి.

వారి కోరికను వినిన కుమారస్వామి

కం॥ "అక్కట కీడు దలంచితి
రికార్యము దగవె? యైన నిచ్చితి; మీకున్
మ్రొక్కిన గొల్చిన వేడిన
నక్కటికము తోడ గావు డమ్మ శిశువులన్" (250)

కం॥ "పాయక పదియాఱేడుల
ప్రాయము నందాక నరుల బాధింపుడు మీ
రని" (251) పలికెను.

వారు కోరకనే వారికి రక్షకునిగా తన దేహము నుండి కాంచన వర్ణుడైన పురుషుని పుట్టించెను. వారికి స్కందాపస్మారమను పేరిడెను.

3.1.1.6.2.5. మతంగుని పట్ల ఇంద్రుని వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక"పర్వము

ప్రథమాశ్వాసములో (88-102) గలదు. అడిగిన వరమును పొంద లేక విధిలేక కోరకనే యిచ్చిన మరియొక వరమును పొందినవాడు మతంగుడను పేరు గల బ్రాహ్మణుడు. వరప్రదాత ఇంద్రుడు.

మతంగుడు బ్రాహ్మణ బాలుడు. తండ్రి యాజ్ఞ ప్రకారము వెళ్ళు చుండెను. దారిలో గర్వ బుద్ధితో నొక గాడిద పిల్లను కట్టెతో కొట్టెను. అది యా విషయమును బాధతో తన తల్లికి చెప్పెను. ఆ తల్లి గాడిద తన బిడ్డకు "వీడు చండాలుడు కావున ప్రచండ స్వభావు డయ్యెను గదా!" అని చెప్పెను. మతంగుడు పూర్వజన్మ విశేషమున తిర్యగ్జాతి భాషావిదుడు, కావున నా గాడిద మాట లర్థమయ్యెను. అవి నిందా మటలు కావనియు నిజమైన మాటలనియు నమ్మెను. తాను పూర్వ జన్మమున మాల తనమున పుట్టి యుండుదునని భావించెను. ఆ గాడిద దగ్గరకు వెళ్ళి తనకు చండాలత వచ్చిన కారణము నడిగెను. పూర్వ జన్మమున నొక మంగలి వాడొక బ్రాహ్మణ స్త్రీతో రమించుటచే పుట్టితివని గాడిద చెప్పెను. అప్పుడు మతంగుడు తాను వెళ్ళుచుండిన పనికి వెళ్ళకుండ యింటికి వెళ్ళెను. తండ్రికి తన పూర్వజన్మ పుట్టు కను గురించి చెప్పి తపస్సునకు వెళ్ళెను. గొప్పగా తపస్సును చేసెను. ఇంద్రుడు ప్రత్యక్షమై వరము నగుడు మనెను అపుడు మతంగుడు

కం॥ "ధరా

మరత్వ మిమ్మనియె" (93)

ఇంద్రుడతని కోరికను విని బ్రాహ్మణత్వ మహత్వము నన్యజాతివారు తెలిసికొన లేరు. కావున మరియొక వరమును కోరు మనెను. కాని యతడు వినకుండ యేక పాదమున నూఱు సంవత్సరముల కాలము తపస్సును చేసెను. ఇంద్రుడు మరల వచ్చి తపస్సును మాను మనియు లేనిచో మతంగునికే వినాశము కలుగునని చెప్పెను. కాని

మతంగుడు వినక యూరకుండెను. ఇంద్రుడు వెళ్ళెను. మతంగుడొక కాలి బొటన వ్రేలిపై నిలిచి నూఱు సంవత్సరముల కాలము తపస్సును చేసి కృశించెను. తాళలేక క్రింద పడెను. అప్పుడు ఇంద్రుడు వచ్చి పట్టుకొని

కం॥ "క్షత్రియాదుల చేతనుం బట్టు వడని బ్రాహ్మణ శార్దూలంబు
తోడి మేలంబు దక్కుము నీకు నొక్క వరం బిచ్చెద గైకొను
మని (100) పలికెను.

అందుకు మతంగుడు సమ్మతించెను.

ఆ.వె॥ "చండదేవుడన బ్రశస్తి వహించి సు
స్త్రీలు పూజనంబు సేయ గామ
రూప ధారివై నిరూపింప విహగ భా
వంబు గల్గి ప్రమదవర్తి వగుము" (101)

కం॥ "అని వరం బిచ్చి మహేంద్రుడు
సనియెను" (102)

3.1.1.6.3. ప్రకీర్ణక వరములు

చెల్లాచెదరయినవి ప్రకీర్ణకములు. ప్రధాన దేవతలు "ముఖ్య దేవతా గణము", ఋషి పుంగవులు, రాజులు, రాక్షసులు, తిర్యక్కులు వివిధ ప్రయోజనములకై వరముల నిచ్చుట యిందు చేరును.

3.1.1.6.3.1. బ్రహ్మ వరములు

ఈ వర్గములో బ్రహ్మ యిచ్చిన వరములు ఐదు: ఇవి
1. అగ్న్యాదులకు నిష్కృతి ప్రాప్తి 2. మృత్యు దేవతా శ్రీవుల పరిణామము 3. వృత్రాసురుని బలాధిక్యము 4. కుంభకర్ణుని నిద్రా వరము 5. ఉష్ట్రాంగ వికృతి.

3.1.1.6.3.1.1. అగ్న్యాదుల నిష్కృతి ప్రాప్తి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము పంచమాశ్వాసము (430-432) లో కలదు. వరప్రదాత బ్రహ్మ కాగా నిష్కృతి వరమును పొందిన వారు అగ్ని ఓషధి తృణాదులు.

ఇంద్రుడు వృత్రాసురుని చంపెను. అందువలన నతనిని బ్రహ్మహత్యాదోషము పట్టుకొనినది. ఇంద్రుడీ దోషము తొలగుటకు బ్రహ్మకడకేగెను. బ్రహ్మ "అగ్ని" దేవుని, ఓషధి, వృక్ష తృణములను స్త్రీలను, జలమును తలంచెను. అవన్నియు ప్రత్యక్షము. కాగా ఇంద్రుని బ్రహ్మ హత్యాదోషమును పంచుకొనుడని బ్రహ్మ యాజ్ఞాపించెను. అపుడు నిష్కృతిని నెరిగింపుడని కోరిరి.

వ॥ "అగ్నికిని నోషధి వృక్ష తృణంబులకును, వనితా జనంబులకును జలములకును వరంబులుగా గ్రమంబున నీవు ప్రజ్వలింపక హవిః ప్రదానంబు సేయు వాని యందును మీకు బర్వకాలంబుల భేదన చ్ఛేదనంబు లాచరించు వాని యందును మీరు రజస్వలలై యుండ మీతో సుతరంబు సలుపు వాని యందును మీలో మలమూత్ర శ్లేష్మంబులు విడుచు వాని యందును మీ మీ కడ నున్న బ్రహ్మహత్య ప్రవేశింప గలయది యని నిర్దేశించెను" (432).

3.1.1.6.3.1.2. మృత్యు దేవతాప్రవుల పరిణామము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ద్రోణపర్వము ద్వితీయాశ్వాసము (2-165-175) లో కలదు. వరప్రదాత బ్రహ్మ. వరానుగ్రహమును పొందిన దేవత మృత్యువు.

పూర్వము మరణ మనునది లేకుండ లోకములు నిండి పోయెను. భూదేవి యా భారమును మోయలేక బ్రహ్మను ప్రార్థించినది. అప్పుడు బ్రహ్మ యింద్రియముల నుండి మృత్యువు పుట్టినది. సకల ప్రాణి సంహారమును చేయుమని బ్రహ్మ యా దేవత నాదేశించెను. మృత్యువు మారుపలుకక యొకచో తపమును చేసినది. అందరిని కారణము లేకుండ చంపలేనని మృత్యువు పలికినది. కాని బ్రహ్మ సమ్మతించ లేదు. చివరకు

వ॥ "దేవా దేవరయాజ్ఞ దలమోచి చేయు దానం గాక యొక్క విన్నపం బవధరింపుము లోభంబును గ్రోధంబును నీర్ష్యయు నసూయయు జంతువుల శరీరంబుల వికృతిం బొందింప వలయును" (175) అని కోరెను.

బ్రహ్మ "అట్ల యయ్యెడు" మని పలికెను. మరియు మృత్యువు యొక్క యశ్రుబిందువు లన్నియు రోగములై జనులను చావం జేయ గలవనియు, స్వకృత్యముల వలన మానవు లధర్మ వర్తనులగుదు రనియు, దాని వలన పాప పుణ్య భయము లేదనియు నామె నాశ్వా సించెను.

3.1.1.6.3.1.3. వృత్రాసురుని బలాధిక్యము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము పంచ మాశ్వాసములో (425) గలదు. వరమును కోరి పొందిన వాడు వృత్రా సురుడు. వరప్రదాత బ్రహ్మ.

వృత్రాసురుడు బ్రహ్మ నుద్దేశించి యిరువది వేల దివ్యాబ్దము లు తపస్సును చేసెను. కావున నతనికి

తే.గీ॥ "ఒసగె బద్మజు డధిక మహోగ్ర బలము (425).
ఆ వరబలము కారణముగా నింద్రాదులు కూడ నతనిని నోడించ లేక పోయిరి.

3.1.1.6.3.1.4. కుంభకర్ణుని నిద్రావరము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య" పర్వము షష్ఠాశ్వాసములో (276_281) గలదు. వరమును కోరి పొందిన వాడు కుంభకర్ణుడు. వరప్రదాత బ్రహ్మ.

వైశ్రవణుడు తపముతో బ్రహ్మను మెప్పించి వైభవము నందెనని రావణ, కుంభకర్ణ, విభీషణులు తెలిసికొని, యసూయ జెందిరి. వారు ముగ్గురు నొకే పర్యాయ మొకే చోట చాల నిష్ఠతో నొకే విధముగా తపస్సును చేయ సాగిరి. వారట్లు పదివేల సంవత్సరముల కాలము పాటు తపస్సును చేసిరి. వారికి బ్రహ్మ ప్రత్యక్షమై "వరము నడుగు" డని పలికెను. అప్పుడు కుంభకర్ణుడు

వ॥ "దైవోపహతుండై తనకు నాత్యంతికంబైన నిద్ర
నడిగెను" (281).

అతని కోరికను వినిన బ్రహ్మ "అట్లయగు" (281) నని పలికెను.

3.1.1.6.3.1.5. ఉష్ట్రాంగ వికృతి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము తృతీయాశ్వాసములో (83_85) గలదు. వరమును కోరి పొందినది యొక "ఒంటె". వర ప్రదాత బ్రహ్మ.

పూర్వమొక ఒంటె బ్రహ్మ నుద్దేశించి తపస్సును చేసెను. అం

దుకు బ్రహ్మ సంతసించి ప్రత్యక్షమై "అర్థించి నదియేమి" అని యడి గెను. అప్పు డా లొట్టియు

సీ॥ "ఒప్ప నామెడ శతయోజన ప్ర
మాణం బగుట కోర్కి వాణీశ" (83) అని యర్థించెను.
బ్రహ్మ దాని కోరికను మన్నించెను.

తరువాత నా యుష్ట్రము వరగర్వముతో మిడిసి పడు చుండెను. ఒక నాడ రణ్యములో తన పొడవైన మెడను చాచి మేయు చుండగా నకాల వర్షము పడినది. అప్పు డా యొంటె తన పొడవైన మెడను దగ్గరలో నుండిన యొక గుహ వైపు చాచి యిష్ట ప్రకారము నిదురించు చుండెను. ఆ గుహలోని జంబూక ద్వయము మెడను చూచి కొఱికి నెత్తురును త్రాగుచు కండలను తిను చుండెను. అప్పుడొంటె కొద్దిగా పొర్లెను. కాని యప్పటికే దాని మెడ నరములు తెగిపోగా ప్రాణమును వదలెను.

3.1.1.6.3.2. విష్ణు వరములు

ఈ వర్గములో విష్ణుమూర్తి యిచ్చిన వరములు నాలుగు. ఇవి 1. దేవతల వివిధ కార్య విముక్తి 2. సప్తర్షుల ధర్మశాస్త్ర కరణ ప్రవృత్తి 3. హవిర్భాగ గ్రహణము 4. కపిధ్వజాదుల యంతర్థానము.

3.1.1.6.3.2.1. దేవతల వివిధ కార్య విముక్తి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము షష్ఠాశ్వాసములో (403-413) గలదు. వరమును కోరి పొందిన వారు బ్రహ్మాది దేవతలు. వరప్రదాత విష్ణుమూర్తి.

కృతయుగ ప్రారంభమున "ఆదిత్య, మరుత్, వసు రుద్రాది

దేవతలును, మునులును, బ్రహ్మ దగ్గరకు వెళ్ళి కర్తవ్యము నాదేశింపు డని కోరిరి. పురుషోత్తము శరణు పొత్తము రండని బ్రహ్మ పలికెను. అతడును వారును పాల సముద్ర తీరమునకు వెళ్ళి బహు సహస్ర దివ్య సంవత్సరముల కాలము ఘోర తపస్సును చేయుచుండిరి. వారికి గంభీరమైన మధురమైన వాణి

వ॥ "వేద విహితం బగు నొక్క యాగంబు సేయుం డందు
భాగంబు నాకుం గల్పింప వలయు నని" (408) పలికెను.

వారు సంతసించిరి, బ్రహ్మ చెప్పి నటుల దేవతలు వైష్ణవ యాగ మును చేసిరి. అందు విష్ణువునకు భాగమును కల్పించిరి. అప్పుడు విష్ణువునకు వారిపై దయ గలిగెను, గగనము నుండి యదృశ్యుడై వారితో

కం॥ "నా పంపునను బ్రవర్తి
వ్యాపక లైయెనట్టి సత్క్రియం జేసితి రి
ట్లీ పుణ్యంబు నకును ఫల
రూపం బగు దాని నే నిరూపింతు దగన్" (409).

అని పలికి, ఈ క్రింద తెలిపిన విధముగ నిరూపించెను.

మరీచి, అంగిరసుడు, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు-అను వారు బ్రహ్మ మానస పుత్రులు. వారును బ్రహ్మ వంటి వారు. వారు వేదాచార్యులు. యజ్ఞ కార్యధుర్యులు. వారు విధించిన సర్వ యజ్ఞములను మానవులు గౌరవముతో చేయుదురు. ఆ యజ్ఞములలో దేవతలకు భాగము లుండును. ఆ భాగములచే దేవ తలు సంవృద్ధి యగుదురు. సనక, సనందన, సనాతన, కంపిల సనత్కుమారులు బ్రహ్మ మనస్సు నుండి పుట్టుదురు. వారు సహజ

విజ్ఞానులు. సాంఖ్యయోగములకు ప్రవర్తకులు. వారి వలన మోక్ష ధర్మములు బాగుగా తెలియును. దేవతలకు తల్లి, తండ్రి, గురువు బ్రహ్మయే. విష్ణుమూర్తి యాజ్ఞ వలన బ్రహ్మ సర్వము చేయు చుండును. విష్ణుమూర్తి ఫాల భాగము నుండి రుద్రుడు పుట్టును. అతడు సర్వలోకారాధనీయుడు. సకల వరప్రదుడు. దేవతలును, వేదాంత కర్మములును, బ్రహ్మ మరీచ్యాది ప్రజాపతులు చెప్పినట్లు ప్రవర్తిల్లును. అది కృతయుగమను పేరుతో నుత్తమకాలము. దాని యందు పశువులు చంపబడవు. అనుమానము వలదు—అని నిర్దేశించెను.

పై మాటలను విని, మునులు, సురలును విష్ణుమూర్తిని పొగడిరి. నమస్కరించి వారి వారి స్థలములకు వారు వెళ్ళి పోయిరి. బ్రహ్మ యొకడె యుండెను. అప్పుడు విష్ణుమూర్తి హయగ్రీవరూపుడై, దండ కమండల హస్తుడై సాంగవేద ముఖర ముఖుడై బ్రహ్మ యెదుట ప్రత్యక్ష మయ్యెను. బ్రహ్మను కౌగలించుకొని

వ॥ "నీవు సర్వంబునకును విధాతవు గురుండవు ప్రభువవు నయి
నడపుము నీయందు సర్వ భారంబునుం బెట్టి సుఖినై
యుండెద నడపుట నీ కెప్పుడేని గడిందియై తోచి నప్పు
డేను దోచి సమస్తంబును సునీతంబు సేయ గల వాడ
ననియెను" (413).

తరువాత విష్ణుమూర్తి మాయమయ్యెను.

### 3.1.1.6.3.2.2. సప్తర్షుల ధర్మశాస్త్ర కరణ ప్రవృత్తి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము షష్ఠా శ్వాసములో (359–361) గలదు. వరమును కోరి పొందిన వారు సప్తర్షు

లును, చిత్ర శిఖండులును, స్వాయంభువు, మనువును. వర ప్రదాత విష్ణువు.

కల్పాది యందు సప్తర్షులైన మరీచి, అత్రి, అంగిరసుడు, పులహుడు, పులస్త్యుడు, క్రతువు, వసిష్ఠుడును చిత్రశిఖండి నామధేయులును, స్వాయంభు వను పేరు గల మనువును ననేక సంవత్సరములు విష్ణువు నుద్దేశించి తపస్సును చేసిరి. వారికి విష్ణు వదృశ్య రూపమున నెదుట నిల్చి వారితో

వ॥ "మీరు ధర్మశాస్త్ర కరణ ప్రవణులరై నన్నాశ్రయించితిరి
భారతి మీయందు నిలువ నియోగించితి మీచేతం బ్రణీతంబై
సకల జగంబులకు హితంబును మర్యాదా ప్రవర్తకంబును నై
శాస్త్రంబు వెలుంగు, నంగిరసు వలన బృహస్పతి యను నొక్క
మహామతి జన్మించు వాని యందా సందర్భంబు ప్రతిష్ఠించు
నది యని యానతిచ్చెను" (359) మఱియు

తే.గీ॥ "ఉపరి చర వసు వను నొక్క నృపతి పుట్టు
నాత డర్థిడా శాస్త్రంబు నధిగమించు
నా బృహస్పతి సెప్పంగ నధిగ మించి
తత్సమాచార నాయకత్వంబు వహించు" (360)

వ॥ "అమ్మహితాత్ముండు మద్భక్తుండు మీకు సంభావనీయుం డని
పలికి చనియెను" (361).

3.1.1.6.3.2.3. విష్ణుమూర్తి హవిర్భాగ గ్రహణము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము షష్ఠాశ్వాసములో (361-363) గలదు. వరమును కోరి పొందినవాడు ఉపరి చర వసు వనురాజు. వర ప్రదాత విష్ణుమూర్తి.

ఉపరి చర వసురాజు హయమేధంబును చేయుటకు పూను కొనెను. ఆ యాగమునకు మరీచ్యాదులగు మహానుభావులును ఋత్వి క్కరణమును చేసిరి. బృహస్పతి యుపదర్శనమును నడపెను. ప్రజా పతి యగు బ్రహ్మ మానస పుత్రులగు ఏకతుడు, ద్వితుడు, త్రితుడు నను ముని సత్తములా యజ్ఞమునకు సదస్యులై వచ్చిరి. ఉపరి చర వసు వహింసకుడు. కావున నా యధ్వరణమున పశునిశనము లేకుండ పరమ నిష్ఠతో నారణ్యకోథితమైన వాక్యముల సమూహముతో విష్ణువు నారాధించెను. అప్పుడు వెంటనే

కం॥ "కరుణా విధేయు డగు నా
హరి యతనికి గాన వచ్చు నట్టులు గా జె
చ్చెర వచ్చి హవిర్భాగా
హరణం బొనరించి చనెను" (363).

3.1.1.6.3.2.4. కపిధ్వజాదులు అంతర్ధానము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము విరాట పర్వము పంచ మాశ్వాసములో (224_231) గలదు. వరమును కోరి పొందిన వాడు అర్జునుడు. వర ప్రదాతలు కపిధ్వజాది దివ్యాయుధములు.

ఉత్తర గోగ్రహణములో విజయునికి విజయము లభించెను. తరువాత రథమును పురమునకు తొందరగ పోనిమ్మని "అర్జునుడు" "ఉత్తరు"ని నాదేశించెను. రథము వెంట సైనికులును వెళ్ళు చుండిరి. దారిలో శమీ వృక్షము దగ్గర రథము నాపుమని చెప్పెను. ఆ యాయుధములను పూర్వము వలె శమీ వృక్షముపై నుంచుమని ఉత్తరుని నియోగించెను. పిమ్మట తాను

వ॥ "కపిధ్వజ దేవదత్త కిరీటాది దివ్య పరికరంబుల సవినయంబుగా బ్రార్థించి యంతర్ధానంబు సేయించెను" (231).

3.1.1.6.3.3. మాహేశ్వర వరములు

ఈ వర్గములో మహేశ్వరు డిచ్చిన వరములు మూడు

1. మాహేశ్వరాత్మకమగు జ్వరము 2. విష్ణువు పరమ తేజో విరాజితుడగుటకు హేతువు. 3. మంకణుని తపోవృద్ధి.

3.1.1.6.3.3.1. మహేశ్వరాత్మక మగు జ్వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము పంచమాశ్వాసములో (443) గలదు. వరమును కోరి పొందిన వాడు బ్రహ్మ. వర ప్రదాత శివుడు.

దక్షాధ్వర ధ్వంస సమయమున బ్రహ్మ ప్రార్థన పై శివుడు తన కోపము నుపసంహరించెను. అప్పుడు బ్రహ్మ శివునితో

వ॥ "దేవా నీనుదుటి చెమటం బుట్టిన యప్పురుషుండు జ్వరం బను నామంబునం బ్రశస్తు డయి యెందును జరియించు నీ జ్వరం బేక ముఖత్వంబునం బృథివికి దుర్భరం బగు బహు విధంబుగా సృజియింపవే" (443) అని ప్రార్థించెను. శివుడు బ్రహ్మ కోరికను విని యా జ్వరమును

వ॥ "కరులకు శిరస్తాపనంబును భుజంగంబులకు నిర్మోకంబును గోవులకు ఖురాంతరాబాధనంబును మృగంబులకు నైజస్వరూప దర్శన ప్రత్యవరోధనంబును దురగంబులకు పార్శ్వ శోషణంబును మయూరంబులకు బర్హోచ్ఛేదనంబును గోకిలంబులకు

నేత్రరోగంబును శుకంబులకు హిక్కయు నజంబులకు జిత్త భ్రమణంబును, శార్దూలంబులకు శ్రమంబును మనుష్యులకు జనన మరణాదుల యెడ వేదనా వేశంబునుం గా

విభాగించెను" (443).

జ్వరము మాహేశ్వరమగు తేజము. కావున సర్వ జనులకు నమస్కార్యమును మాననీయముసై యున్నది.

3.1.1.6.3.3.2. విష్ణువు పరమ తేజో విరాజు డగుటకు హేతువు

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ద్రోణపర్వము పంచమాశ్వాసములో (408-415) గలదు. వరమును కోరి పొందిన వాడు విష్ణువు. వర ప్రదాత శివుడు.

ఆది దేవుడైన విష్ణుమూర్తి యఖిల లోకాభిరక్షణార్ధమై పుట్టెను, మైనాక పర్వతము నందు చాల కాలము "అభవుని" గురించి తపస్సు చేసెను. పిమ్మట గాలినే యాహారముగ యూర్ధ్వబాహుడై యతిఘోర నిష్ఠతో తపస్సును చేసెను. అందుకు శివుడు సంతసించి ప్రత్యక్షమయ్యెను. అతనికి విష్ణువు శివాధిక్యము నిరూపించు స్తోత్రములతో సాష్టాంగ నమస్కారమును చేసెను. శివుని చాల గొప్పగా స్తుతించి

వ॥ "దేవా నిన్ను భక్తి భజించు నాకు ననన్య సులభ ప్రభావం బొసంగు మని యభ్యర్థించెను" (415).

అప్పుడు శివుడు దేవ ముఖ్యుండగు విష్ణు దేవుని ప్రసన్న దృష్టితో చూచి

వ॥ "నీవు నసుర గంధర్వ కిన్నర గరుడోరగాది భూతంబుల నవలీల గెలిచి పరము తేజోవిరాజ మానుండవై వర్తింపుము

నీకు నస్త్రంబుల శస్త్రంబుల నగ్ని జలంబుల నశని నార్ద్రం బునను శుష్కంబునను స్థావరంబునను జంగమంబునను జావు నొప్పులు లేకుండం గల యువి దొడరిన నయ్యైన జయింపు మని వరం బిచ్చెను" (415).

3.1.1.6.3.3.3. మంకణుని తపోవృద్ధి

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య" పర్వము ద్వితీయాశ్వాసములోను (285-286), తిక్కన భారతభాగము శల్య పర్వము ద్వితీయాశ్వాసములోను (160-163) ఇంచు మించు సమా నముగా నున్నది. వరమును కోరి పొందిన వాడు మంకణుడను ఋషి. వర ప్రదాత "ఈశ్వరుడు".

మంకణుడను బ్రహ్మర్షి యొక పర్యాయము తన చేయి వ్రయ్యు నట్లు దర్భను లాగెను. అప్పు డతని చేతి నుండి చిక్కగ "శాక రసము" వెలు వడెను. అతడు దానిని చూచి హర్షించి యాడెను. ఆ స్థితిలోనున్న మునిని సురలును, నితర మునులును సహింపక హరుని దగ్గరకు వెళ్ళి "దేవాధి దేవా! ముని వృత్త మే విధంబున నివృతంబగు నట్లుగా చేయు" మని యడిగిరి. హరుడు వెంటనే తపసి రూపమున మంకణుని దగ్గరకు వెళ్ళెను. ఆడుటకు కారణము నడిగెను. సమాధా నముగ మంకణుడు తన కరమున శాకరసము వెలువడుటచే విస్మితు డనై హర్షించి యాడితినని చెప్పెను. అప్పుడు హరుడిది గొప్ప విస్మయము కాదనియు తాను చేయబోవు పనిని చూడుమని పలికెను. తన యంగుష్ఠముతో మఱియొక యంగుళిని తాడనమును చేయగా నందుండి హిమ సన్నిభమైన భస్మము వెలువడెను. దానిని మంక ణుడు చూచి సిగ్గుపడి 'నీవు పరమేశ్వరుడ" వని నమస్కరించి వేద

మంత్రముతో స్తుతించి

వ॥ "దేవా నీ ప్రసాదంబున నాకు దపోవర్ధనంబు గా వలయు నని (266) కోరెను.

అతని కోరికను వినిన "ఈశ్వరుడు" కరుణించి

వ॥ నీకు దపోవర్ధన మగు నేను నీ యాశ్రమంబున నుండుదు ననియె" (266)

3.1.1.6.3.4. పాండవ సైన్యాధ్యక్ష విషయమున శ్రీకృష్ణ నియోగము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగ" పర్వము చతుర్థాశ్వాసములో (94-109) గలదు. వరమును కోరి పొందిన వాడు ధర్మరాజు. వర ప్రదాత శ్రీకృష్ణుడు.

శ్రీకృష్ణుని నిశ్చయము ప్రకారము పాండవులు యుద్ధమునకు సిద్ధ పడిరి. అప్పుడు సేనా నాయకుని నిశ్చయింప వలయునని ధర్మరాజు పలికెను. భీముడు తప్ప మిగిలిన తమ్ముళ్ళు భిన్నాభిప్రాయములను తెలిపిరి. అప్పుడు ధర్మరాజు శ్రీకృష్ణుని చూపి

వ॥ "ఇతండు సకల చరాచర తారతమ్య సంవేది విశేషించి మనకు నితని మాటయు విజయ మూలంబు కావున నిమ్మహాత్ముండు నిరూపించిన వాడు వరూధినీ ముఖ్యుండు" (102) అని ప్రార్థించెను.

దామోదరుడు ధర్మరాజు మాటలను విని

క॥ "————ధృష్టద్యుమ్ను డర్హు డగు నభిషేకం
బొనరింపుము పేరోలగ

మున నక్షోహిణుల కెల్ల ముఖ్యుడు గాగన్"

(103) అని నిరూపించెను.

మరల ధర్మరాజు శ్రీకృష్ణునితో

వ॥ "అక్షోహిణులకుం బ్రత్యేక నాయకులను నీవే నిర్దేశింపు మని"
(106) ప్రార్థించెను.

పాండవుల యేడక్షోహిణులకును శ్రీకృష్ణుడే వరుసగా ద్రుపదుని, విరాటుని, సాత్యకిని, జరాసంధుని కొడుకగు సహదేవుని, చేకితానుని, శిశుపాలుని తనయుడగు దృష్టకేతుని, శిఖండిని, యక్షోహిణీపతులుగా నిర్దేశించెను.

3.1.1.6.3.5. గోవులందు లక్ష్మి నిరంతరావాసము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఆనుశాసనిక" పర్వము తృతీయాశ్వాసములో (114-118) గలదు. వరమును కోరి పొందినది లక్ష్మీదేవి. అనుగ్రహించిన వారు గోవులు.

ఆవులు మేత మేయుచుండగా లక్ష్మి యా గోగణము కడ చేరెను. ఆవు లామె నెవ్వరని యడిగెను. సమాధానముగా నామె తాను శ్రీ ననియు, గోగణమందు వసించుటకు వచ్చితిననియు చెప్పెను. కాని యావులు చంచలయైన యామెకు స్థానమునిచ్చుటకు సమ్మతించ లేదు. ఆ మాటలకు నామె వగచినది. అంత లక్ష్మి

కం॥ "———మీచే నిట్లు పరిభవింపగ బడి యే
జనిన నను నెవ్వరును గై
కొనరు శరణు మగుడు వేడికొనియెద మిమ్మున్" (115)

తే.గీ॥ "మీ సమీపము నందున్న మేలు దాని
నిందు నా కని" (116) అడిగినది.

లక్ష్మీదేవి వేడికోలును గోవులు మన్నించి

కం॥ "మామూత్ర పురీషంబులు

ధామా వేదంబు లెఱుగు పావనములు నీ

వీ మేలి వస్తువుల బ్రియ

ధామమ పై యుండు మింపు దలకొన మాకున్" (117) అని

చెప్పెను. సిరి యా మాటలకు సమ్మతించినది.

3.1.1.6.3.6. సప్తమాతృకల, స్వాహా దేవులపై కుమారస్వామి మాతృభావన

ఈ వృత్తాంతము ఎఱ్ఱన భారతభాగము అరణ్య పర్వము పంచ మాశ్వాసములో (212-245) కలదు. వరప్రదాత కుమారస్వామి. వర మడిగిన వారు విడివిడిగా సప్తమాతృకలు, స్వాహాదేవి.

తారకాసుర సంహారార్థము జనించినవాడు కుమారస్వామి. అతని జన్మావసరమున నుత్పాతములు కలిగెను. అపుడు విశ్వామిత్రు డను ముని కుమారస్వామి కడకేగి ప్రస్తుతించి జాత కర్మాదులను చేసెను. కుమారస్వామి బలవంతుడు కాగలడనియు "ఇంద్ర" పదవిని చేపట్టు ననియు "అమరులు" ఇంద్రునికి నూరిపోసిరి. ఇంద్రుడు సప్తమాతృ కల సాహాయ మర్థించెను. అంత వారు కుమారస్వామి కడ కేగిరి. అతని తేజస్సునకు జడిసిరి. తమ్ము మాతలుగా ననుగ్రహింపుమని శరణు కోరిరి. అతడు

వ॥ "వారి నభినంధించి చేకొనియెను" (214)

కృత్తిక లార్వురికి కుమా

రస్వామి పుణ్యగతి యందు నిల్చిన సమయమున స్వాహాదేవి వచ్చెను. కుమారస్వామితో

వ॥ నీవు మత్పుత్రుండవు నిత్యంబును నీపాల వసియింప వలతు నని" (245) అడిగెను.

అందుకతడు ప్రీతుడై

వ॥ "అట్లకాక నీవు మత్సమీపంబున నుండి' యేనును నీ కోడలుం గొనియాడం బ్రియంబున నుండు మనియెను" (245).

3 1.1.6.3.7. యమధర్మరాజు వరములు

ఈ వర్గములో యమధర్మరాజిచ్చిన వరములు నాలుగు. ఇవి. 1. ధర్మరాజునకు ధర్మైకబుద్ధి 2. సావిత్రి శ్వశురునికి పునఃదృష్టి ప్రాప్తి 3. సావిత్రి శ్వశురునికి పునఃరాజ్య ప్రాప్తి 4. పాండవుల యజ్ఞాతవాస వేష ప్రాప్తి.

3.1.1.6.3.7-1. ధర్మరాజునకు ధర్మైకబుద్ధి

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య" పర్వము సప్తమాశ్వాసములో (462-467) గలదు. వరమును కోరి పొందినవాడు ధర్మరాజు. వరప్రదాత యమధర్మరాజు.

యక్ష ప్రశ్నల ఘట్టములో యమధర్మరాజు, ధర్మరాజు ధర్మజ్ఞతను పరీక్షించెను. మెచ్చుకొనెను. ధర్మరాజు కోరిన బ్రాహ్మణుని "అరణి" నిచ్చెను. మరియు ధర్మరాజు కోరకనే వారికి నజ్ఞాత వాస కాలములో వారి నెవ్వరును గుర్తించ కుండున ట్లయాచిత వరము నిచ్చెను. ఇంకను వలసిన దాని నడుగు మనెను. అప్పుడు ధర్మరాజు

మ కో॥ "— ——నా మది యెల్లనాడును గ్రోధ మో
హాదులం బెడ బాసి ధర్మువు నందు నెక్కొన జేయవే"
(466) అని కోరెను. ఆ కోరికను యమధర్మరాజు విని

వ॥ "అతనికి నవ్వరం బొసంగెను" (467)

3.1.1.6.3.7.2. సావిత్రి శ్వశురునకు పునః దృష్టి ప్రాప్తి

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య" పర్వము సప్తమాశ్వాసములో (219-226) గలదు. వరమును కోరి పొందినది సావిత్రి. వరప్రదాత యమధర్మరాజు.

యమధర్మరాజు సావిత్రి భర్తయగు సత్యవంతుని ప్రాణమును తీసికొని వెళ్ళుచుండెను. అతనిని సావిత్రి యనుసరించినది. అత డామెను చూచి యెందుకు వచ్చుచున్నావనియు నా యడవి చాల దట్టమైన దనియు వెనుదిరిగి వెళ్ళుమనియు చెప్పెను. కాని యామె వెళ్ళ లేదు. భర్త లెచటికి వెళ్ళుదురో యచటికి భార్య లనుగమింతు రని ధర్మ సూక్ష్మమును విశదము చేసెను. పైగా సజ్జన శేఖరుడని పిలువబడిన యమధర్మరాజు సందర్శనము వలన పరమ శుభములను పొందకుండ తాను రిత్త జనము వలె నూఱక మగుడుట న్యాయము కాదని పలికెను. ఆమె ప్రగల్భ మాటల కద్భుత మందిన ధర్ముడు విభుని జీవిత మొక్కటి దక్క తక్కినవి యిత్తునని పలికెను. అప్పు డామె ప్రాంజలియై శ్వశురుడు

చం॥ "లబ్ధ చక్షు డగు నట్టులుగా గరుణింపవే దయన్" (225)
అని కోరెను. ఆమె కోరికను విని యమధర్మరాజు "అట్టుల యయ్యెడు" (226) అని పలికెను.

3.1.1.6.3.7.3. సావిత్రిశ్వశురునకు పునః రాజ్య ప్రాప్తి

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "ఆరణ్య" పర్వము సప్తమాశ్వాసములో (226-234) గలదు. వరమును కోరి పొందినది సావిత్రి. వర ప్రదాత యమధర్మరాజు.

సావిత్రి యమధర్మరాజు నుండి మొదటి వరమును పొందెను. వెను దిరిగి వెళ్ళకుండ నతని వెనుకనే వెళ్ళు చుండెను. ఆర్యులు వాఙ్మనఃక్రియలతో నెవ్వరికిని కష్టమును కలిగించరనియు నెక్కడైనను దీనులను కరుణాబుద్ధితో కాపాడుదురనియు, నీయదలచినచో కోరిన వాటినన్నిటి నిత్తురనియు మంచి మనస్సుతో నాశ్రితులకు సహాయమును చేయుదురనియు, నివన్నియు నార్యుల ధర్మములని తెలిపెను. మరియు యమధర్మరాజు సంతోషపడు నట్లుగా ననేక విధములగా స్తుతించెను. కావున నత డామెతో

వ॥ "సత్యవంతు ప్రాణంబులు దక్కం దక్కిన కోర్కి యెయ్యది యైనం జెప్పుము సఫలంబు సేసెద" (234) నని పలికెను.

వెంటనే సావిత్రి

వ ॥ "దేవా! వైరుల చేత నపహృతం బైన రాజ్యం బెప్పటి యట్ల ద్యుమత్సేనునకు ప్రాప్తించు నట్లుగా ననుగ్రహింపవే యని వేడెను" (234)

ఆమె కోరికను విని యమధర్మరాజు "అట్లయగు" (234) నని పలికెను.

3.1.1.6.3.7.4. పాండవుల అజ్ఞాతవాస వేష ప్రాప్తి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము విరాట పర్వము ప్రథమాశ్వాసములో (180-184) గలదు. వరమును కోరి పొందిన వాడు

ధర్మరాజు. వరప్రదాత యమధర్మరాజు.

పాండవు లరణ్యవాస కాలమును ముగించు కొనిరి. అజ్ఞాత వాసమును గడపుటకు విరాటరాజు పురములో ప్రవేశించుటకు నిశ్చయించిరి. వారి యాయుధములను పురమునకు సమీపమున నున్న శమీ వృక్షము పై పెట్టిరి. ఆ పురములో పరస్పరము పిలిచి కొనుటకు సంకేత నామములను నిర్ణయించు కొనిరి. పిదప ధర్మరాజు తూర్పు వైపునకు తిరిగి నిర్మల చిత్తముతో యమధర్మరాజును తలచికొని

ఆ.వె॥ "తండ్రి నీవు నాకు దయతోడ నిచ్చిన
వరము చిత్తగించి వలయు తెఱగు
సమయ సముచితముగ సమకట్టుమయ్య యీ
రాకుమారుల విధి బోకయుండ" (181)

అని పలికెను. వారు ముందు బ్రాహ్మణుని "అరణి" ని తెచ్చుటకు వెళ్ళిన నాడు సరోవరతీరమున తనకు యమధర్మరాజు చేసిన గౌరవమును నా యమధర్మరాజుకే విన్నవించి, చేతులను జోడించి నుదుట యందుంచి ప్రార్థించు నట్లు తలను వంచికొని యుండెను. వెంటనే యమధర్మరాజు యొక్క యనుగ్రహమున ధర్మరాజుకు ధాతువట, దండ, కమండలములు గల సన్న్యాసి రూప మేర్పడెను. ఇతరులకును వారి కిష్టమైన వేషములకు తగిన యంబరాభరణ మాల్యాద్యుపకరణములు కలిగెను. అందుకు వారందరును సంతసించిరి. వరుస క్రమములో నొకరొకరే విడివిడిగ విరటుని పురమున ప్రవేశించిరి.

3.1.1.6.3.8. దేవతల వరములు

ఈ వర్గములో దేవతల వరములు రెండు 1. త్రితాదులకు సోమపాన ఫలము 2. భీమునికి హనుమద్రూప సందర్శనభాగ్యము

3.1.1.6 3.8.1 త్రితాదులకు సోమపాన ఫలము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శల్య పర్వము ద్వితీయాశ్వాసము (154-156) లో కలదు. వరము నొసగినవారు దేవతలు కాగా సోమపాన ఫలము ననుభవించిన వారు త్రిత, ద్విత, ఏకతాది యన్నదమ్ములు,

"ఏకతుడు, ద్వితుడు, త్రితుడు" వీరు ముప్పురన్నదమ్ములు. వారు బ్రాహ్మణులు. పైగా ఋత్విక్కులు. రాజుల చేత యాగములను చేయించి గోవులను దక్షిణగా పొందుట వారి వృత్తి. ఒకసారి యాగములను చేయించి వారు గోసమూహముతో వచ్చుచుండిరి. దారిలో ఏక ద్వితులు త్రితుని వంచించి గోగ్రహణము చేయవలయునని తలంచిరి. అప్పుడొక తోడేలు కనబడినది. త్రితుడు భయపడి పరుగెత్తుచు ప్రమాద వశమున నొక నూతిలో పడెను. ఇదే సమయమని ఏక ద్వితులు, త్రితుని గోవులను తోలుకొని పోయిరి. బావిలో పడిన త్రితుడు సంకల్ప మాత్రమున సోమ యాగమును చేసెను. దేవతలు హవిర్భాగముల గొనిరి. అప్పుడే యా కూపమున సరస్వతి స్రవించినది. దేవతలు వరము నడుగుమని కోరిరి. అంత నాతడు

తే.గీ॥ "వీను డుపస్పర్శ మిందు జేసిన యతండు
వడయు వాడు మహిత సోమ పాన ఫలము
వరము నా కది యని" (156) కోరెను. దేవతలట్లయనిరి.

3.1.1.6.3.8.2. భీమునకు హనుమద్రూప సందర్శన భాగ్యము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య" పర్వము తృతీయాశ్వాసములో (312-354) గలదు. వరమునుకోరి పొందినవాడు

భీముడు. వరప్రదాత హనుమంతుడు.

భీముడు సౌగంధిక పుష్పములకై వెళ్ళుచు నుత్సాహముతో గంధమాదన పర్వత ప్రాంతమున శంఖధ్వానమును చేసెను. గుహలోని హనుమంతు డా ధ్వనిని వినెను. తన తమ్ముడైన భీముడని గ్రహించి సంతసించెను. అతనిని కొంతసేపు పరీక్షింప దలచి దారి కడ్డముగా పరుండెను. భీముడచటికి వచ్చెను. అతనిని నిద్రలేపుటకు గట్టిగ నరచెను. హనుమంతుడు మేల్కొనెను. దారి కడ్డము తొలగుమనియు, లేనిచో హనుమంతుని వలె దాటి పోదుననియు పలికెను. తాను హనుమంతుడంతటి వాడననియు లేప గలిగినచో తన తోకను లేపి ప్రక్కకు త్రోచి పొమ్మనియు హనుమంతుడు పలికెను. భీముడు ప్రయత్నించెను. కాని కదపలేక పోయెను. అప్పుడు

"నీవెవ్వడవో నాకు తెలుపు" మని దీనముగా నడిగెను. తానే యానాటి హనుమంతుడనని సమాధానమును చెప్పెను. అప్పుడు భీముడు చాల సంతోషించెను. నమస్కరించెను. పూర్వము సముద్రమును దాటి నప్పటి రూపమును చూపుమని భీముడడిగెను. ఆ కాల రూపము నిప్పుడు చూపలేననియు, చరాచర భూతము లన్నియు భిన్న ప్రకారముగ నుండుననియు చెప్పెను. భీముని కోరికపై కృత, త్రేతా, ద్వాపర కలియుగముల ధర్మములను చెప్పి "నీకిష్టా వాప్తి యయ్యెడు మరుగుమని" చెప్పెను. కాని భీముడు మరల

కం॥ "నీనాటి తనువు జూచియు
కాని యవశ్యంబు పోవ" (342) నని పట్టుబట్టెను.

వెంటనే హనుమంతుడతనికి తన పూర్వ రూపమునను చూపెను.

భీముడు హనుమంతుని రూపమును చూచి చాల సంతోషించెను. హనుమంతుడు కూడ నతిప్రీతుడయ్యెను. సౌగంధిక సరోవరమునకు వెళ్ళి యచ్చట బలమును చూపక తగు జాగత్తగ ప్రవర్తించవలె నని భీమునికి సలహా నిచ్చెను. మరియు భీముడు కోరకనే తాను పార్థుని కేతనము మీద నుండి సమరమును వీక్షింతునని పలికెను.

3.1.1.6.3 9. నారద మహర్షి వరము

స భా వి వ ర ణ

ఈ వత్తాంతము నన్నయ భారతభాగము సభా పర్వము ప్రథ మాశ్వాసములో (57-31) గలదు. తన కోరికను ప్రసాదించిన వాడు ధర్మరాజు. కోరినను కాదనక వివరించిన వాడు నారద మహర్షి.

ధర్మరాజు నారద మహర్షికి మయ సభను చూపించి "ఇటువంటి సభను మీరెక్కడైనను చూచితిరా?" అని యడిగెను. దానికి సమా ధానముగా నారద మహర్షి యిటువంటి సభ మానవలోకములో నెచ్చ టను లేదనియు, ఇంద్రి, యమ, వరుణ, కుబేర, బ్రహ్మ, సభ లత్యంత వైభవ సౌందర్యములచే దీనికి సరిగా వనియు తెలిపెను. అప్పుడు ధర్మరాజు నారద మహర్షిని

వ॥ "అవి యెట్టివి వాని వినవలతు నానతిం డని" (61) కుతూహల ముగా నడిగెను.

3.1.1.6.3.10. మహర్షుల, మునుల, బ్రాహ్మణుల వరము

ఈ వర్గములో వీరిచ్చిన వరములు ఐదు. ఇవి.

1. కీటకమునకు బాదరాయణ వరము 2. నాలాయని సంతృప్తికై

మౌద్గల్యుని వరము 3. ఉదంక ముని సౌదాసరాజు రాక్షసభావ నిర్మూలనము 4. పాండవులకు ధౌమ్యుడు పౌరోహిత్యాంగీకారము 5. అజ్ఞాతవాస కాలక్షేమమునకై బ్రాహ్మణుల యాశీర్వచనము

3.1.1.6.3.10.1. కీటకమునకు బాదరాయణుని వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వము చతుర్థాశ్వాసములో (316-343) గలదు. వరమునుకోరి పొందినది యొక కీటకము. వరప్రదాత బాదరాయణుడు.

ఒకప్పుడు బాదరాయణు డెడ్లబండి దారిలో వేగముగా వెళ్ళు నొక కీటకమును చూచెను. బాదరాయణు డా వేగమునకు కారణము నడిగెను. తాను ప్రాణ భీతిచే పరుగిడు చున్నట్లు కీటకము సమాధానమును చెప్పెను. వేద వ్యాసు డా మాటలను విని భయముతో కీటకమై జీవించుట కంటె దుఃఖ శరీరమును వదలు కొనుట మంచిదని తెలిపెను. కాని కీటకములు గూడ తమ కనువయిన రీతిలో సుఖముల ననుభవించు ననియు, భయమునకు కారణము మరణ మనియు కీటకము తెలిపెను. అపుడు బాదరాయణుడు కీటక పూర్వ జన్మ విషయమును వివరించెను.

ఈ కీటకము పూర్వజన్మములో ధనవంతుడైన యొక శూద్ర వర్ణజుడు. ఆచారములను పాటించ కుండ నతి లోభముతో పర ధనార్జనమునకై ప్రయత్నించెను. క్రూరబుద్ధితో దుర్వినయ ప్రవర్తనముతో మెలగు చుండెను. అయినను తల్లి పట్ల తత్పరుడై యుండెను. అంత నొకనా డొక బ్రాహ్మణ మాతృ డతిథిగా నతని యింటికి వెళ్ళి ధనము నప్పుగా నడిగెను. అప్పుడతనిని పూజించెను. అద్దాన నీ కీటకమునకు పూర్వ జన్మ స్మరణము కలిగెను. బాదరాయణుడు

వ॥ "మదీయ తపోవిశేషంబున నీ దయిన కీటకత్వం బపన
యించెద" (328) నని పలికెను.

మరియు

ఆ.వె॥ "నీచ శూద్ర వైశ్య నృప జన్మముల గ్రమ
వృత్తి నొందు మెపుడు జిత్తమునకు
బు ట్టెటుంగు నట్టి పోడమి నొసగితి
ధర్మ పరుడ వగుదు దాన జేసి" (329)

అని పలికి దానిని దయా దృష్టితో చూచెను. అట్లా కీటకము వరుసగా నీచ శూద్ర, వైశ్య, నృప జన్మముల నెత్తి యా యా జన్మములలో మంచి పనులను చేసి, సుఖమును పొంది పుణ్యమును సంపాదించెను. పిమ్మట బ్రాహ్మణ జన్మము నెత్తెను. సద్విజుని కర్మములను పూర్తి చేసి వేదవ్యాసుని దర్శించి దీవనను పొందెను.

3.1.1.6.3.10.2. నాలాయని సంతృప్తికై మౌద్గల్యుని వరము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వము సప్తమాశ్వాసములో (257-259) గలదు. వరమును కోరి పొందినది "మౌద్గల్యుడు" అను మునిభార్య యగు నాళాయని యైన ఇంద్రసేన. వరప్రదాత మౌద్గల్యుడు.

మౌద్గల్యునకు నాలాయనితో వివాహమైన తరువాత నతనికి కుష్ఠ వ్యాధి వచ్చెను. మరియు నత డతి కోపి. అయిన నామె యతనిని పరమ భక్తితో నారాధించుచు నతడు వదలి పెట్టిన భోజనమును తినెడిది. ఒక రోజతని పెను వ్రేలు భోజనములో నూడి పడెను. కాని యామె యసహ్య పడకుండ నా వ్రేలును తీసి పైచి యన్నమును తినెను. అందుకు మౌద్గల్యుడు ప్రసన్నుడై

వ॥ "నీ కెద్ది యిష్టంబు వేడు మిచ్చెద" (259) ననెను.

అప్పుడామె

వ॥ "మునీంద్రా! నాకుం గామోప భోగేచ్ఛ పెద్ద గలదు నీవునుం దపోశ్శక్తి గామ రూపధరుండ వయి యీ బీభత్సం బగు రూపం బుడిగి మనోహరం బయిన రూపంబునం బంచధా విభక్తుం డయి నన్ను రమియించి కామ భోగంబులం దనుపు మని" (259) కోరెను.

ఆ ముని యామె కిష్టమైన విధముగ నైదు దేహములను ధరించెను భూదేవలోకము లందు బ్రహ్మర్షి, దేవర్షి, పూజితులై సూర్య రథము నెక్కి యాకాశ గంగా జలములో నాప్లుత దేహుడై శీతాంశు జల సమూహములో కొంత కాలము వసియించెను. మేరు, కైలాస పర్వతము లందు క్రీడించెను. అనేక స్థానములలో ననేక వేల సంవత్సరము లామె నుపభోగించి తృప్తుడయ్యెను. తరువాత నామెను వదలి ఘోర తపస్సును చేసి బ్రహ్మమయుడై బ్రహ్మలోకమునకు వెళ్ళెను.

3.1.1.6.3.10.3. ఉదంకముని సౌదాసరాజు రాక్షసభావ నిర్మూలనము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అశ్వమేధ" పర్వము తృతీయాశ్వాసములో (99-104) గలదు. వరమును కోరి పొందినవాడు సౌదాసు డను రాజు. వర ప్రదాత ఉదంక ముని.

ఉదంకముని గౌతమ మహర్షి శిష్యుడు. గౌతమ మహర్షి భార్య అహల్య. ఆమె గురు దక్షిణగ సౌదాసరాజు భార్య యగు మదయంతి కుండలముల నడిగెను. వాటిని తీసికొని వచ్చుటకు ఉదంకముని సౌదాసరాజు దగ్గరకు బయలు దేరెను. దారిలో నొక యడవిలోనె

యా రాజు కనబడెను. అప్పటికే రాజు రాక్షస ప్రవృత్తిలో నుం డెను. కావుననే యతడరణ్యములో నుండెను. అతని భార్య యతని ననుసరించెను. రాజు ఉదంకుని చూచి సమయమునకు తన కాహార ముగా వచ్చితివని పలికెను. ఉదంకముని తన గురువు కార్యము ముగిసిన పిదప వచ్చెదనని రాజునకు తెలిపెను. కార్యమేమి యని రాజడిగెను. ఉదంకుడు తా నేగు పని గూర్చి చెప్పెను. ఉదంక సాన్నిహిత్యముచే రాజుకు రాక్షస ప్రవృత్తి క్షీణించినది. నూతన సత్వము కలిగినది. కావుననే ఉదంక మునికి కుండలముల నిచ్చెడి యాలోచన కలిగినది. తన భార్య నడిగి కుండలములను తీసికొను మని రాజు చెప్పెను. ఆమె యున్న చోటును చూపించెను. ఉదంక ముని యామె నుండి కుండలములను గ్రహించి రాజు కడకు వెళ్ళి కుం డలమును గురువు గారి కిచ్చి రాజు కాహారముగా మరల వచ్చెద ననెను. ముని నిజాయితికి రాజు మెచ్చి

ఉ॥ "———————మదార్తి నీతవ
స్పంపద జేసి పావు మని సమ్మతి బల్కెను" (101)

ఉదంకముని రాజు కోరికను విని సంతసించి రాజుతో

ఉ॥ "ఏమిట నైన నొప్పమి నరేంద్ర సుచిత్తుల బొందె నేనియున్
వే మరలున్ భవద్గుణము వీత కళంకుని జేసె నిన్ను సాం
ద్రామల కీర్తి గౌతమ మహాముని చల్లని చిత్తవృత్తి నీ
పై మలగించె గా వలయు బార్థివ సత్తమ పొందు మున్నతిన్"
(102)

అని పలికి "ఉదంకుడు" తన కరములతో నతని నిమిరెను. అప్పుడు రాజుకు దురితము తొలగెను. కృతజ్ఞతా భక్తి, వినయ భావములతో

రాజు ఉదంకమునిని స్తుతించి నమస్కరించెను. ఆమంత్రినము చేసెను. ఉదంకముని సంతోషముతో వెళ్ళెను.

3.1.1.6.3.10.4. ధౌమ్యుని పౌరోహిత్యాంగీకారము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వము సప్తమాశ్వాసములో (157-159) గలదు. వరమును కోరి పొందిన వారు పాండవులు. వర ప్రదాత "ధౌమ్యు" డను బ్రాహ్మణులు.

పాండవులును, కుంతియును ద్రౌపది స్వయంవరమునకు "ఏక చక్ర" పురము నుండి బయలు దేరిరి. దారిలో "అంగారపర్ణుడు" అను గంధర్వుడు మ్యుని పురోహితునిగా నుంచుకొను మని సలహా నిచ్చెను. వారంత భగీరథీ నది కుత్తరమున నున్న "ఉత్కచము" అను పుణ్య తీర్థమునకు వెళ్ళి ధౌమ్యుని గాంచి పురోహితునిగా నుండు మని ప్రార్థించిరి. వారి ప్రార్థనను వినిన ధౌమ్యుడు

వ॥ "వారి నతి ప్రీతిం బూజించి పురోహితత్వంబుం బరి గ్రహిం
చెను" (159)

3.1.1.6.3.10.5. అజ్ఞాతవాస కాల క్షేమమునకై బ్రాహ్మణుల యాశీర్వచనము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము విరాట పర్వము ప్రథమాశ్వాసములో (46-57) గలదు. వరమును కోరి పొందిన వారు పాండవులు. వర ప్రదాతలు పాండవులు.

పాండవు లరణ్యవాస పరిధిని పూర్తి చేసిరి. అజ్ఞాతవాసమునకు సిద్ధమయిరి. అంత్యకాలము వరకు వారి వెంట నరణ్యములలో కొందరు బ్రాహ్మణు లుండిరి. అప్పుడు పాండవులు తమకు దుర్యోధనుడు

చేసిన కుటిల కృత్యములను గురించి మరల తెలిపి, యజ్ఞాతవాస కాలములో తా మెక్కడున్నది దుర్యోధనాదులు తెలిసి కొనినచో తాము మరల నరణ్యాజ్ఞాతవాసములను తప్పక గడుప వలసి వచ్చుననియు వినయ పూర్వకముగా నా బ్రాహ్మణులకు తెలిపి

ఆ.వె॥ "...........మమ్ము నింక నతి రహస్య
వృత్తిమై నిరస్త విఘ్నులరై చరి
యింపు డని యనుగ్రహించ వలయు" (47) నని ప్రార్థించిరి

బ్రాహ్మణులు పాండవుల ప్రార్థనను విని యొక్క మొనిన

వ॥ "మీ తలంపునకు దైవం బను కూలంబు గావుత మని పాండు పుత్రుల దీవించి పునర్దర్శనం బయ్యెడు మనుచు వీడ్కొని నిజ స్థానంబులకుం జనిరి." (57)

3.1.1.6.3.11. రాజుల వరములు

ఈ వర్గములో రాజుల వరములు నాలుగు ఇవి.

1. ఒక రాజు వరము-జన్మ కథన రహస్యము. 2. దుర్యోధనుని ప్రాయోప వేశోప సంహరణము 3. జనమేజయ రాజు సర్పయాగ విరమణ 4. సావిత్రీ సత్యవంతుల పరిణయమునకు ద్యుమత్సేనుని యంగీకారము

3.1.1.6.3.11.1. ఒక రాజు వరము - జన్మ కథన రహస్య కథనము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వము ప్రథమాశ్వాసములో (276-282) గలదు. వరమును కోరి పొందిన వాడొక పురోహితుడు. వర ప్రదాత యతని రాజు.

హిమగిరి మీద బ్రాహ్మణు లనేకులు తపస్సును చేయుచుండిరి. అచ్చటికి నొక శూద్రుడు వెళ్ళెను. మునులకు గురువైన యొక మునీంద్రుని చూచి నమస్కరించి

సీ॥ "........కృప నుపదేశ మొసంగవే తపో
వృత్తికై నా కని వేడెను" (276)

శూద్రున కుపదేశించుట తగదనియు, శుశ్రూషను చేయు మనియు మునీంద్రు డా శూద్రునికి చెప్పెను. శూద్రుడు కొంచెము దూరముగ కుటీరమును నిర్మించుకొనెను. సంతోషముతో, నధిక భక్తితో నతిథి సుర, పితృపూజల కీడు లేకుండ చేయు చుండెను. నయ వినయము లతో ధర్మ నిరూఢమగు పనులను చేయ సాగెను. అందుకు మునీం ద్రుడు సంతసించి, యొకనాడు శూద్రుని చూచుటకు వెళ్ళెను. శూద్రుడు చేయు పనులలో కానివానిని కొన్నిటిని గురించి చెప్పెను. పుణ్య కర్మ గతులను గురించి చేయవలసిన విధానమును దయతో నుపదేశించెను. అతడట్లు చేయుచు కొంత కాలము తరువాత మరణించెను. అతడు మరు జన్మములో నొక రాజ కుమారుడుగ పుట్టెను. ఆ మునీంద్రుడును మర ణించి మరు జన్మలో వేదాద్యనుపమ విద్యలకు నావాసమై యుండు రాజ పురోహితునికి పుత్రునిగా పుట్టెను. తరువాత నా రాజ కుమారుడు రాజయ్యెను. పురోహితుని పుత్రుడును రాజునకు పురోహితుడయ్యెను. ఆ రాజా పురోహితునిని చూచి నపుడు మందహాసము చేసెడివాడు. దానిని గుర్తించిన పురోహితుడు

వ॥ "దేవా నన్నుం గని నవ్వుడు నవ్వుదు నావలన నేమి కీడు
గల దది యెఱింగింపవే యిదియ నాకు వరం బని
వేడెను" (282)

రా జతని వేడుకోలు విని తనకు జాతి స్మరత్వము గలుగుట వలన పూర్వ జన్మ వృత్తాంతము తెలిసెనని పలికెను.

వ॥ "శూద్రి విషయోపదేశంబునం బరమ గతి దప్పి యిప్పాటి
రాజ సేవాత్మకం బైన పౌరోహిత్యంబు నడపుట కై నీకుం
బుట్టి వలసె నేను బుట్టు వెఱింగి పుట్టిన వాడ నగుటం జేసి
యెఱింగి నవ్వుదు నవ్వునకు గతం బింతియ కాని నీ వొండు
కల్మషంబు గలవాడవే మహా ధర్మపరుండవు గురుండ వా
దుష్కర్మంబునకుం బ్రాయశ్చిత్తంబు సేసికొ మ్మని యనేక
గోవులం గనక రాశులను నొసంగెను" (282)

ఆ పైపురోహితుండును జప తపాదులను చేసి మరణించి ముని కుమారుడై
తపోగరిష్టు డయ్యెను.

ఈ వృత్తాంతమున నొక చిత్ర మున్నది. మునీంద్రునకు మరు
సటి జన్మములో పౌహిత్యమే శరణ్యమైనది. కాని శూద్రునకు రాజ్యా
ధికారము హస్తగతమైనది. మునీంద్రుడు బోధనకు మాత్రము సం-
సిద్ధుడు కాగా శూద్రి డాచరణతో గౌరవ్యు డయ్యెను. అత్యంత ఫలి
తము నందగలిగెను.

3.1.1.6.3.11.2. దుర్యోధనుని ప్రాయోపవేశసంహరణము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య" పర్వము
షష్ఠాశ్వాసములో (18-26) గలదు, వరమునుకోరి పొందినవాడు దుశ్శా
సనుడు. వరప్రదాత దుర్యోధనుడు.

ఘోషయాత్రా ఘట్టములో దుర్యోధనునకు పరాభవము జరిగి
నది. అతడు విషాదముతో ప్రాయోపవేశమునకు పూను కొనెను. ఇక
రాజ్యపాలన చేయుమని దుశ్శాసనుని నాజ్ఞాపించెను. అప్పుడు దుశ్శా
సనుడు దుర్యోధనుని పాదముల మీదబడి

వ॥ "దేవా యి ట్లానతీ దగదు నాకుం బ్రిసన్నుండ వగు
మని" (24) ప్రార్థించెను.

మరియు సువిశాల భారతదేశమును తాను పాలించ లేననియు దుర్యో ధనుడే సమర్థుడని సాత్రువులతో నివేదించెను, పిమ్మట కర్ణ, శకునులు కూడ ప్రియోక్తులు పలికిరి. వారి మాటలను వినిన తరువాత దుర్యోధ నుడు ప్రాయోపవేశమును వదలి పెట్టెను.

3.1.1.6.3.11.3. జనమేజయ రాజు సర్పయాగ విరమణ

ఈ వృత్తాంతము "నన్నయ" భారతభాగము ఆది పర్వము ద్వితీయాశ్వాసము (202-230) లో కలదు. ఇష్టమేదో కోరుకొమ్మని చెప్పినవాడు జనమేజయుడు. ప్రార్థించిన వాడు "ఆస్తీకుడు".

జనమేజయ మహారాజు సర్పయాగమును చేయ మొదలిడెను. ఆ యాగ కుండములో పాములు పడిపో సాగినవి. ఈ వినాశనము నకు వాసుకి నొచ్చుకొనెను. దీనిని నిరోధింప "అస్తీకముని" తగిన వాడని భావించెను. కనుక "ఆస్తీకు"ని తల్లితో నీ విషయమును విశ దీకరించెను. ఆ ముని వేదవేత్తలతో కూడి మహారాజు కడకు వెళ్ళెను. స్వస్తి వచనములు పలికెను. సభ్యులను వినుతించెను. అచట నున్న వారందరు ప్రీతులైరి. అంత రాజు

వ॥ "మునీంద్రా నీ కెద్ది యిష్టంబు దానిన యిత్తు" (227) నని
పలికెను.

అతడు సర్పయాగము నాపుమని కోరు కొనెను. సదస్యు లెల్లరు "ఆస్థికు"ని మహిమను చెప్పి యాగోపసంహారణకు వంత పాడిరి. అంత మహారాజు సర్వజనాను మతంబుగా "అస్థిక" ప్రార్థనను మన్నించెను.

### 3.1.1.6.3.11.4. సావిత్రి సత్యవంతుల వివాహమునకు ద్యుమత్సేనుని యంగీకారము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య" పర్వము సప్తమాశ్వాసములో (186-196) గలదు. వరమును కోరి పొందిన వాడు "అశ్వపతి" అను రాజు. వర ప్రదాత ద్యుమత్సేనుడు.

అశ్వపతి మద్రి దేశపు రాజు. అతని కైకైక సంతానము సావిత్రి. ద్యుమత్సేనుడు సాళ్వదేశపు రాజు. అతడంధుడు. కావున రాజ్యమును కోల్పోయి యేకైక పుత్రునితో భార్యతో సహా యడవిలో నుండెను. అతని పుత్రుని పేరే సత్యవంతుడు. నారద మహర్షి సావిత్రిని సత్యవంతున కిచ్చి పెండ్లి చేయుమని "అశ్వపతి"కి సలహా నిచ్చెను. అశ్వపతి తన బంధువుల, మంత్రి, పురోహిత సమూహా ములతోను, వివాహ సంబంధమైన వస్తువులతోను, తన కూతురగు సావిత్రిని పిలిచికొని యడవిలోనున్న ద్యుమత్సేనుని దగ్గరకు వెళ్ళెను. ద్యుమత్సేనుడు గౌరవించెను. కారణమును "అశ్వపతి" నడిగెను. అశ్వ పతి తన కూతురగు సావిత్రి సత్యవంతునికి భార్యగా తగునని సమా ధానమును చెప్పెను. ద్యుమత్సేనుడు తన దైన్య యసహాయ పరిస్థి తులను తెలిపెను. మరియు సుకుమారియైన సావిత్రి కష్టపడ వలసి వచ్చును గదా! యని తెలిపెను. ద్యుమత్సేనుని కుటుంబ పరిస్థితు లన్నియు తెలిసియే తాను వచ్చినట్లును తన కూతురు సావిత్రి ధీరు రాలనియు అశ్వపతి చెప్పి

కం॥ "నీతోడ వియ్య మందం
జేతోగతి నాస జేసి చెచ్చెర నిట్లే
నేతెంచితి మత్ప్రార్థన

బ్రాతిగ జేకొనక యునికి పాడియె నీకున్" (195)

అని ప్రార్థించెను.

అందుకు ద్యుమత్సేనుడు సంతసించి

వ॥ "శుభ లగ్నంబున సత్యవంతునకు సావిత్రికి పరిణయమును చేసెను." (196)

3.1.1.6.3.12. రాక్షసుల వరములు

ఈ వర్గములో రాక్షసుల వరములు రెండు ఇవి.
1. మధు కైటభుల మరణాంగీకారము, 2. శర్మిష్ఠాదుల దాస్యమునకు వృషపర్వుని యంగీకారము.

3.1.1.6.3.12.1. మధు కైటభుల మరణాంగీకారము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "ఆరణ్య" పర్వము చతుర్థాశ్వాసములో (392-400) గలదు. వరమును కోరి పొందినవాడు విష్ణుమూర్తి (చక్రధరుడు). వరప్రదాతలు "మధు కైటభులను రాక్షస సోదరులు.

పూర్వము జగత్రయ మేకార్ణవమై యుండెను. అప్పుడు హరి పాము పడకపై చాల కాలము యోగ నిద్రాయుత సుఖయుక్తితో నిదురించెను. ఆ సమయమున బలవంతులును, శత్రువులును నైన మధు కైటభులను రాక్షసులు వచ్చి, హరి నాభి కమలమున నున్న బ్రహ్మను చూచి గర్వ బుద్ధితో నతనిని చంపుటకు పూనుకొనిరి. అప్పుడు బ్రహ్మ భయపడి, విష్ణుమూర్తిని "ఆది పురుషా! నన్ను కాపాడు" మని యాక్రోశించెను బ్రహ్మ యరుపుకు హరి మేల్కొనెను. భయంకరులైన రాక్షసులను చూచి "మీ రిట్లతని నెందుకు బాధ పెట్టు

చున్నారు? మీ బల పరాక్రమ యుక్తికి ప్రీతుడనైతిని వరములను వేడుడు. వెంటనే యిచ్చెద" నని పలికెను. హరి మాటలకు వారు నవ్వి "నీవు మాకేమి యిచ్చెదవు. నీకు మేము వరముల నిచ్చెదము. ఇష్టమైనచో నడుగు" మని పలికిరి. హరి వారి మాటలను విని

కం॥ "సత్యవ్రతులార వరం
బత్యంత ప్రీతి నడిగెద లోక
ప్రీత్యర్థముగా నాచే
మృత్యువునం బొందు డిపుడ మీర లిరువురన్" (395)
అని కోరెను.

హరి కోరిన వరమును వారు విని యొకరి ముఖము నొకరు చూచుకొనిరి. పరిహాసమునకైనను బొంకును పల్కమనియు నన్నివిధముల కాలము యొక్క గతిని మరల్చుటకు వీలుకాదు గదా యని పలికి .

ఆ.వె॥ "చంపె దేని మమ్ము జలములు లేని దే
శమున జంప వలయు గమలనాభ
నిక్క మింత వట్టు నీచేత మడి యంగ
దగుదు మనిరి" (398)

హరి వారి మాటలకు నవ్వి, కొంచెము సమయ మాలోచించి తన యూరువుల మీద వారి నుంచుకొని తన సుదర్శన చక్రముతో వారిని చంపెను.

సాధారణముగా దేవతలు, ఋషులు, రాజ్యాధినేతలు వరముల నిత్తురు. కాని రాక్షసు లితరులకు వరముల నిచ్చుట యపూర్వము. అందులోను నారాయణమూర్తికే వరము నొసగుటయు సంసిద్ధులగుట మరింత విశేషము.

### 3.1.1.6.3.12.2. శర్మిష్ఠాదుల దాస్యమునకు వృష పర్వుని యంగీ కారము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వము తృతీయాశ్వాసములో (134-153) గలదు. వరమును కోరి పొందినది శుక్రాచార్యుని కూతురైన దేవయాని. వరప్రదాత "వృష పర్వుడను రాక్షసరాజు.

దేవయాని శుక్రాచార్యుని కూతురు. శర్మిష్ఠ రాక్షసుల రాజగు వృషపర్వుని కూతురు. శర్మిష్ఠకు వేయికన్యలు దాసీలు. ఒక్కనాడు వనములో జల క్రీడలాడి బట్టలను ధరించు సమయమున శర్మిష్ఠ దేవ యాని నవమానించి నూతిలో త్రోచెను. వేటకు వెళ్ళిన యయాతి నూతిలోని దేవయానిని కాపాడెను. అవమానముతో దేవయాని పుర ప్రవేశము చేయక తండ్రియగు శుక్రాచార్యునికి తెలియ జేసెను. అతడు వెళ్ళి కుమార్తె నెంతయో యోదార్చెను. కాని యామె విన లేదు. మరియు నెక్కడికైనను వెళ్ళుదునని యామె తెలిపెను. తండ్రి యా మాటలను విని "నాకు నీవే గతివి. నీతోడ నేనును వచ్చుదు" ననెను. ఆ విషయమును చారుల వలన వృషపర్వరాజు తెలిసికొనెను. తమ పురోహితుడును గురువు నగు శుక్రాచార్యుని దగ్గరకు వెళ్ళి యతని గొప్పదనమును, సహాయమును పొగడి మేమందరమును మీ వారమే గదా: బాధను మానుమని పలికి

వ॥ "ఈ దేవయాని కెద్ది యిష్టంబు దానిన యిత్తు నడుగు
మనెను"(153).

ఆ మాటలకు దేవయాని సంతసిల్లి

వ॥ "అట్లేని శర్మిష్ఠ గన్యకా సహస్రంబుతో నాకు దాసి
గా వలయు నిదియ నా కిష్టంబు దీనిన యిచ్చునది" (153)
అని కోరెను.

వెంటనే

వ॥ వృషపర్వుం డప్పు డక్కూతు రావించి కన్యకా సహస్రం
బుతో దేవయానికి దాసిగా నిచ్చి శుక్రునకు మనఃప్రియంబు
సేసెను" (153)

3.1.1.6.3.13. తిర్యక్కుల వరము

తిర్యక్కు లనగా పశుపక్ష్యాదులు. జడము లనగా నచేతన
ములు. పశుపక్ష్యాదులు మానవుల కంటె తక్కువే. కాని యవి మాన
వుల కంటే మిన్నగా నతిథి సత్కార్యమును చేయుట యిందలి
విశేషము.

పావురముల యతిథి సత్కారము :

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగములోని శాంతి పర్వము
తృతీయాశ్వాసము (307-340) లో కలదు. ఆతిథ్యమును కోరిన వాడు
బోయవాడు. అతిథి సత్కారమును చేసినవి పావురముల జంటలు.

ఒక బోయవాడు పక్షులను వేటాడుటకై యడవి కేగెను. ఎన్నో
పక్షులను పట్టెను. వానిలో నొక యాడ పావురము కూడ కలదు.
బోయవాడింటికి మరలు నపుడు పెద్ద గాలివాన వచ్చెను. బోయడొక
చెట్టు క్రిందకు చేరెను. అతడొక రాతి మీద పరుండి చలికి వణక
సాగెను. దిక్కులు చూచుచు తన్ను రక్షించుడని భూతావళిని ప్రార్థిం
చెను. ఆ మొఱను చెట్టు తొఱ్ఱలోని మగ పావురమును వలలోని యాడు
పావురమును నాలకించినవి. మగ పావురము తన యాడు పావురము
మరలి రాలేదని దిగులు పడినది. ఆ పావురము దురవస్థను ఆడు పావు
రము గుర్తించి తానున్న చోటును తెలిపి, యతిథి సత్కారమును
చేయుమని యాదేశించినది. మగ పావురము బోయ వాని కోరికను

ప్రశ్నించినది. అతడు చలి బాధను పోగొట్టుమని ప్రార్థించెను. మగ పావుర మెండిన పుల్లలను ముక్కున కరచికొని తెచ్చి యొక చోట వేసెను. ఆపై దగ్గరలో నున్న పల్లెకు వెళ్ళి యగ్గియున్న పుల్లను తెచ్చి యా పుల్లల మీద వేసినది. బోయవాడూది మంట జేసి చలి బాధను పోగొట్టు కొనెను. చలి తీరినది. కాని యాకలి పట్టుకొన్నది. తన యాకలిని తీర్చుమని బోయవాడు నోరు విడిచి యడిగెను. పక్షులకు సంచితాహారమెక్కడిదని.

వ॥ "నా శరీరం బాహారంబుగా నిచ్చెద గైకొను మని" (322) పలికి యా యగ్ని చుట్టును తిరిగి మంటలోని కురికినది. ఈ త్యాగమునకు బోయవాడు చలించి పోయెను,

3.1.2. వైఫల్య వరములు

ఆడిన మాట నిలబెట్టుకొనలేక పోవుట వైఫల్య వరములలోని ప్రధానాంశము. మహాభారతములో పరశురామ, ద్రోణా చార్యులు తమ మాటను నిలబెట్టుకొనలేక పోయిరి.

3.1.2.1. పరశురాముని వాక్ వైఫల్యము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగ" పర్వము చతుర్థాశ్వాసములో (285-360) గలదు. అంబ కోరిన వరమును తీర్చలేక నిరుత్తరుడైన వాడు పరశురాముడు.

భీష్ముని కారణంగా "అంబ" చివరకు నడి వీధిన పడ్డది. అప్పుడు "అంబ" పరశురాముని సహాయమును కోరినది. పరశురాముడు భీష్మునితో కయ్యమునకు తలపడెను. సమరము సాగినది. జయాపజయములు తెలియని రీతి పోరు జరిగినది. భీష్ముడు "అష్ట వస్తువుల" ను

తలచెను. వారు సమ్మోహనాస్త్రము నిచ్చిరి. ఆ యస్త్రమును పరశు రామునిపై ప్రయోగింప దలచెను. నారద మహర్షి వలదని హిత మును చెప్పెను. జమదగ్న్యాది మునులు భీష్మ-పరశురాములకు "రాజీ"ని కుదిర్చిరి. చివరకు పరశురాముడు భీష్ముని కాదనలేక "అంబ"తో

వ॥ "నన్ను భీష్ముండు గెలిచె నావలన నయ్యెడు పని యింతియ
నీ వింక నీకుం జూడం బోలిన గతిం బొమ్మనెను" (360)

3.1.2.2. ద్రోణాచార్యుని వాక్ వైఫల్యము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ద్రోణపర్వము ప్రథ మాశ్వాసములో (104-114) గలదు. దుర్యోధనుడు కోరిన వరమును తీర్చలేక మరణించిన వాడు ద్రోణాచార్యుడు.

ద్రోణుడు ప్రధాన సేనాని యయ్యెను. అంత వరమును కోరు కొనుమని ద్రోణుడు దుర్యోధనుని నడిగెను. దుర్యోధనుడు కర్ణాదులతో మంతనమును సాగించెను. ఆ పై

కం॥ "............ధర్మపుత్రు బ్రాణము తోడన్
దురమున బట్టి భుజా భీ
కరకాని రావలయు మత్ప్రకాశంబునకున్" (107)

అని కోరెను. ధర్మరాజు అజాత శత్రు బిరుదాంకితుడు. అతనిని పట్టి తెచ్చిన సగము రాజ్యము నీయ సమకట్టితివా?" యని ద్రోణుడు ప్రశ్నించెను. అంత దుర్యోధనుడు మరల జూదము నాడించి యడవికి పంపుదు"నని తెలిపెను. ఈ మాటకు ద్రోణుడు ఉసహ్యించు కొనెను. అయినను వాక్పాలనమును చేయబూని

చం॥ "నరు డెడ సొచ్చె నేని నా కది దుష్కర మే నొకండనే
సురగణ మైన వ్రేల గొని చూపగ జాలరు వాడు లేనిచో
దిర మయి పోర నిచ్చిన యుధిష్ఠురు ద్రౌపది పుట్టినింట వే
వురు వెఱగంది చూడ నలవు జలముం జెడ బట్టి తెచ్చెదన్"
(113)

అని పలికెను. ఈ మాటలతో ధర్మరాజు పట్టుబట్టి నట్లేయని మూర్ఖులైన దుర్యోధనాదులు తలంచిరి. కాని ధర్మరాజును ద్రోణాచార్యుడు పట్టివ్వ లేక పోయెను. పైగా రణరంగమున మరణించెను.

3.1.3. అదత్త వరము

దత్త మనగా ఇవ్వబడినదని యర్థము, అదత్త మనగా ఇవ్వ బడనిదని యభిప్రాయము. దేవతలు కోరికల నెరవేర్తురు. కాని కోరిన కోరిక నివ్వని సందర్భము కూడ రావచ్చును. అట్టిదే ఇంద్రుడు మాంధాతృరాజు కోరికను చెల్లింపక పోవుట

ఇంద్రుని యదత్త వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతిపర్వము ద్వితీయాశ్వాసములో (241-250) గలదు. వరమును కోరిన వాడు మాంధాతృడు. వరము నీయని వాడు ఇంద్రుడు.

మాంధాతృడు రాజు. క్షత్రియుడు. సద్గుణవంతుడు. నిష్ఠతో నొక మహాధ్వరమును చేసెను. విష్ణువు ప్రత్యక్షము కాలేదు. కాని "ఇంద్రుడు" ప్రత్యక్ష మయ్యెను. అతనికి మాంధాతృడును నచట నుండిన యితర రాజులును సాష్టాంగ నమస్కారములను చేసిరి. లేచి ముకుళిత హస్తులైరి. అప్పుడు "ఇంద్రుడు" మాంధాతృనితో" విష్ణు

వును చూచుటకు వేడుక పడితివి. అతని దర్శనము నాకైనను బ్రహ్మకైనను నరు"దని చెప్పెను. మరియు

ఆ.వె॥ "...........నీదు తల పెద్ది యెఱిగింపు
మది యెనర్చెదను మహానుభావ" (245) అని పలికెను.

అప్పుడు మాంధాతృడు

కం॥ "...........సాంసారిక వ
ర్తన ముడుపుము భైక్ష చరణ తత్పరత మనం
బున దృఢముగ నొందింపుము
నను జరితార్థునిగ జేయు" (246) మని కోరెను.

ఇంద్రుడు మాంధాతృని కోరికను వినెను. కాని యా కోరికను తీర్చ లేదు. పైగా మాంధాతృడు రాజుగానే యుండుట మంచిదని తెలుపుచు షద్ధర్మము లన్నింటి కంటెను నృప ధర్మము మేలనియు, నే విధముగనైనను రాజు తగిన సిద్ధిని పొందుననియు, కామ క్రోధములను నణచి ధర్మము నందలి విషయములో సమానముగ వ్యాప్తిని చేయుచు భూమిని పాలించిన రాజు పొందు లోక మెవ్వరికిని శక్యము కాదనియు తెలిపి యాశ్వాసించెను. మఱియు నచట నుండిన రాజులందరిని చూచి బిక్షు చరణ మర్హము కాదనియు, ప్రజలను కాపాడుట యుద్ధ యుక్త దేహులై రాజులుగ నుండుట చాల శ్రేష్ఠమైన దనియు నాదేశించెను. అద్దాన మాంధాతృడును నితర రాజులును వారి ప్రయత్నమును మాని రాజులుగానే యుండిరి.

ఈ వరములో మూడంశము లున్నవి. మొదటిది మాంధాతృనికి విష్ణువు ప్రత్యక్షము కాక పోవుట. ప్రత్యక్షమైన ఇంద్రుడు మాంధాతృనకు సహాయపడక పోవుట, రెండవది. మూడవది రాజ ధర్మమును నొక్కి వక్కాణించుట.

**3.2.** అయాచిత వరములు

అయాచిత వర మనగా "అడుగ కుండుట, ప్రార్థించ కుండుట" అని యర్థము. ఈ విధముగ పొందిన వరములు అయాచిత వరములు. ఏ కోరిక లేని తపమునకు, ధైర్య సాహసములకు, సకల భూత దయకు, నతిథులను సంతృప్తి పరచి నందులకు, శాస్త్రకృష్ట యాగ కర్మకు, శాస్త్ర విధి పాలనకు మెచ్చి, మంచి వారికి నుత్తములకు కలిగిన కష్టములను చూచి, మంచి వారికి సహాయపడిన యుత్తములకు, గొప్పవారి మనసులలోని భావములను గమనించి, ప్రజా శ్రేయస్సు దృష్ట్యా గొప్పవారి మూర్ఖత్వమును తొలగించ దలచి అయాచిత వరముల నిచ్చిరి. మహాభారతములో నిట్టివి 60 గలవు. వీటిని ప్రధానముగా బ్రహ్మ, విష్ణు, శివ, శ్రీరాముని, శ్రీకృష్ణుని, షణ్ముఖుని, గీర్వాణ విభుని, ఇంద్రాగ్నుల, అగ్నిదేవ, యమధర్మరాజ, యమ వరుణ కుబేర, వాయుదేవ, వినత, అంతర్హిత భూతముల, తుంబుర ప్రభృతుల, స్థూల కర్ణ, గరుత్మంత, కర్కోటక, దేవర్షి, మహర్షి, మునుల, బ్రాహ్మణుల, రాజుల, మంత్రుల, రాజవంశపు స్త్రీల, సైన్య వరములని 24 విధములుగ వర్గీకరించ వచ్చును.

**3.2.1.** బ్రహ్మ వరములు

బ్రహ్మ యొసగిన యయాచిత వరములు "ఆరు" ఇవి.
1. దేవతల కాధిక్యము నిలుపుట 2. వాసుకికి నవ్యయుత్వము, 3. మృత వానర పునరుజ్జీవనము 4. సురభి మార్తాండుల సంతానమునకు గోలోక వాసము 5. సురభి సంతానమునకు గోలోక వాసము 6. గోవులకు శృంగ వరము

**3.2.1.1.** దేవతల కాధిక్యము నిలుపు వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వము

పంచమాశ్వాసములోను (159-160), ద్వితీయాశ్వాసములోను (179-180) గలదు. వరమును పొందినవారు దేవతలు. వరప్రదాత బ్రహ్మ.

తొలుత మానవులకు పూర్వ జన్మ పరిజ్ఞాన ముండెడిది. అందు వలన వారు మంచి పనులను చేసి దేవలోకమునకు వెళ్ళి "అమరు" లగు చుండిరి. అద్దాన దేవలోకములో సంఖ్య పెరుగు చుండెను. అప్పుడు బ్రహ్మ, వేల్పుల సంకటమును తొలగించుటకు నుపాయము నాలోచించెను. దేవతలు కోరకనే

తే.గీ॥ "మానవుల కయ్యెఱుక కల్మి మాన్చి కామ
రోషములను" (159) కలిగించెను.

అప్పటి నుండి మానవులందరు దోష కార్యములను చేయ సాగిరి. పాపాత్ములైరి. నరక లోకమును చేరు చుండిరి.

అది మంచిది కాదని బ్రహ్మ యాలోచించెను. మానవుల ప్రవర్తనకు శాస్త్రమును కల్పించి, యా శాస్త్రములో తెలిపినట్లు ప్రవర్తించిన వారికి దేవ లోకము కలుగు ననియు, నట్లు చేయని వారికి నరక లోకము కలుగు ననియు నిర్దేశించెను. మరియు

వ॥ "అతివల మాయావంతులం గావించి వారిక గామం బగ్గలం
బుగా జేసెను" (180)

3.2.1.2. వాసుకికి అవ్యయత్వ వరము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము ఆదిపర్వము ద్వితీయాశ్వాసములో (128) గలదు. వరమును పొందినవాడు వాసుకి. వరప్రదాత బ్రహ్మ దేవుడు.

సురాసురలు "అమృతము" కొఱకు సముద్రమును చిలుకు వేళ వాసుకి కవ్వపు త్రాడయ్యెను. మథనము పూర్తియైన పిమ్మట దేవత

లందరును వాసుకి క్లేశమును, త్యాగమును మెచ్చు కొనిరి. పితామహుని ప్రార్థించిరి. అంత బ్రహ్మ వాసుకి వరము కోరక కున్నను

వ॥ "అవ్యయత్వంబును వకలభయవిమోక్షంబునుంగా" (128)
వర మొసగెను.

3.2.1.3. శ్రీరామునకు మృత వానర పునరుజ్జీవనము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య"పర్వము సప్తమాశ్వాసములో (154-165) గలదు. వరమును పొందిన వాడు శ్రీరాముడు. వరప్రదాత బ్రహ్మ.

శ్రీరాముడు రావణాసురుని సంహరించెను. విభీషణునికి పట్టాభిషేకమును చేసెను. పిమ్మట "అవింద్యుడును", విభీషణుడును కలిసి సీతాదేవిని శ్రీరామునికి గౌరవ పూర్వకముగ సమర్పించిరి. అప్పుడత డామె శీలమును శంకించి యామె కిష్టమున్న చోటికి వెళ్ళుమనెను. అక్కడున్న వారందరు నాశ్చర్య పడిరి. ఆమె మూర్చపడి, తెప్పరిల్లెను. అగ్ని యందు దూకి వెలుపలికి వచ్చెదను. అప్పుడు స్వీకరించుడని పలికెను. అప్పుడే భూమి, అగ్ని, గాలి, చంద్ర, సూర్యులు వారి వారి పేర్లను తెలిపి సీతాదేవి పవిత్రురాలు, నుత్తమురాలని పలికిరి.

అప్పుడు శ్రీరాముడు కోరకనే బ్రహ్మ సకల దేవతల సహితముగా ప్రత్యక్ష మయ్యెను. శ్రీరాముడు బ్రహ్మను పూజించెను. శ్రీ రాముడు రావణుని పరి మార్చి లోకమునకు హితమును చేసితివని బ్రహ్మ శ్లాఘించెను. నలకూబరుని శాపము వలన దశగ్రీవుడు పర స్త్రీలను బలత్కారము చేయడనియు, కావున సీతాదేవి యే దురితమును చేయ లేదనియు నే విచారము లేకుండ నీ పతివ్రతను స్వీక

రించి పురమునకు చను మనియు శ్రీరామునికి బ్రహ్మ తెలిపెను. మరియు శ్రీరాముడు కోరననే

వ॥ "అతనికి ప్రియంబుగా దత్సమర నిహతులైన వానరుల బ్రాప్త జీవులంగా జేసెను" (165)

3.2.1.4. సురభి మార్తాండుల సంతానమునకు గోలోకవాసము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక"పర్వము తృతీయాశ్వాసములో (52) గలదు. వరమును పొందినవి సురభి మార్తాండుల సంతానము. వరప్రదాత బ్రహ్మ.

విశ్వకర్మ యజ్ఞార్థము, మోక్షార్థము తపోనియతుడై యమృత మయమూర్తియును, కామరూపిణియును నగు సురభి యను కన్యకను తన మనోవృత్తిచే కల్పించెను. మరియు మహా తేజో మయుడగు నొక్క పురుషుని సృజించెను. ఆ పురుష డతి మనోహరాకారముగ నున్న యా స్త్రీని చూచి కామ మోహితుడై యార్తి నొందెను. ఆ సమయమున నఖిలలోక పావనుడైన బ్రహ్మ ప్రత్యక్షమై "మార్తో భవ" యని పలికి యా పురుషుని కామ యార్తిత్వము నుడిపెను. తన పల్కు కారణముగా మార్తాండు డను నామము నొసగి, యామె నతని కిచ్చెను.

వ॥ "ఇన్నెలంతకు నీకును జనియించిన యపత్యంబులు యాగావ వర్గార్థ క్షీరజనకంబులై మదీయ లోకంబునకు నుపరి భాగం బున వర్తింప (52) వర మొసగెను.

3.2.1.5. సురభి సంతానమునకు గోలోకవాసము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక"పర్వము

తృతీయాశ్వాసములో (120-124) గలదు. వరమును పొందినది సురభి సంతానము. వరప్రదాత బ్రహ్మ.

సురభి తపస్సును చేసెను. బ్రహ్మ ప్రత్యక్షమై మనోరథమును చెప్పు మిచ్చెదనని పలికెను. అప్పుడు సురభి ప్రసన్న, గౌరవ భావములతో బ్రహ్మ తనకు ప్రత్యక్ష మగుట కంటె తన కిష్టమైన దానిని కోరుట మేలు కాదని చెప్పెను. అందుకు బ్రహ్మ సంతసించెను. తన లోకము కంటె పైన గోలోకముండు నట్లు వరము నిత్తునని తలచెను. కాని యీ వరము పూర్వమే తన వలన సిద్ధించెనని స్మరణ కలిగెను. కావున

తే.గీ॥ "గోవులకు మేలు సేయంగ గోరు నాదు
చిత్తమున మద్వరంబున సిద్ధమైన
తెఱగ యొలసె దైవిక మయి దీని పెంప
యావహించెద నని" (123) తలచి

సురభి కోరకనే

తే.గీ॥ "ఇచ్చె నవ్వరంబు" (123)
అప్పటి నుండి గోలోకము మహోజ్జ్వల కాంతి వంతమయ్యెను

3.2.1.6. గోవులకు శృంగ వరము

ఈ వృత్తాంతము "తిక్కన" భారతభాగము "అనుశాసనిక"పర్వము తృతీయాశ్వాసములో (44-47) గలదు. వరమును పొందినది గోవులు. వరప్రదాత వేధ.

గోవులు పరమ నియతితో వేధను కొలిచినవి. అంత మన మలరి వాటిని చూచి యవి కోరకనే

కం॥ "మును వానికి లేని శృంగములు గల్పించెన్" (44)

అట్లు వాటికి కొమ్ము లొసగి సుర, ముని సమూహమును చూచి వారితో

చం॥ "పరమ పవిత్రముల్ యజన భాజనముల్ దమ విన్న
జూచినన్
దురిత చయంబులం దొలంగ ద్రోవగ జాలు బ్రిధాన కర్తకు
త్తర గతి లాభ వైభవము తంగెటి జున్నుగ జేయు గోవులె
వ్వరు దగ వీని గొల్తు రనివారణ జొత్తురు వారు నాకమున్"
(46) అనెను.

3.2.2. విష్ణుమూర్తి వరములు

విష్ణుమూర్తి యిచ్చిన వరములు రెండు. 1) నరకాసురునికి 2) గరుత్మంతునికి

3.2.2.1. నరకాసురునికి వైష్ణవాస్త్రము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ద్రోణ పర్వము తృతీయా శ్వాసములో (357, 351,356) గలదు. వరమును పొందిన వాడు నరకాసురుడు. వరప్రదాత విష్ణుమూర్తి.

కల్పాంతరమున విష్ణువు యోగ నిద్రలో మునిగెను. భూమి విష్ణువు మోహనాకారమును దర్శించినది, కామించినది. విష్ణువు భూదేవి కోరికను మన్నించెను. పైగా భూదేవి కుమారునికి వైష్ణవాస్త్రము విధేయమగు (357) నని చెప్పెను.

### 3.2.2.2. గరుత్మంతునకు బలాభివృద్ధి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక"పర్వము ప్రథమాశ్వాసములో (351-354) గలదు. వరమును పొందిన వాడు గరుత్మంతుడు. వరప్రదాత నారాయణుడు.

గరుత్మంతు డమృతాపహరణము చేసి వెళ్ళుచుండెను. దారిలో నారాయణమూర్తి యెదురై గరుత్మంతుని మెచ్చుకొనెను. తనకు వాహనము కమ్మని యడిగెను. గరుత్మంతుడు కోరకనే

తే.గీ॥ "జరయు మరణంబు లేక యసురుల సురుల
నోర్వ జాలిన బలముతో నుల్లసిల్లు
మని వరం బిచ్చెను" (351)

ఆ మాటలను వినిన గరుత్మంతుడు దండ ప్రణామము నాచరించి నారాయణుని

కం॥ "నీ వాహన మయ్యెద రథ
మీ వెక్కిన గీతువై వహింతు బెనుపు నా
కీ వరము నిచ్చి మనుపుము" (353) నని కోరెను.

అందుకు నారాయణుడు సమ్మతించెను.

### 3.2.3. శివుని వరములు

శివుడిచ్చిన వరములు రెండు. 1) వేదవ్యాసునికి, 2) గృధ్ర జంబుకములకు

### 3.2.3.1. వేద వ్యాస మహర్షికి పుత్ర సదృశచ్ఛాయానుగమనము

ఈ వృత్తాంతము "తిక్కన" భారతభాగము శాంతి పర్వము

షష్ఠాశ్వాసములో (322-342) గలదు. వరమును పొందిన వాడు వేద వ్యాస మహర్షి. వరప్రదాత శివుడు.

వేద వ్యాసుని కుమారుడు శుకుడు. అతడు యోగసిద్ధి నంద దలచెను. నారదు డుపాయము నెఱిగించెను. పిమ్మట తండ్రియగు వేదవ్యాస మహర్షి యనుమతిని పొందెను. తన కంటి చూపు దూర ములో తన ముందు శుకుని వెళ్ళుమనియు, తా నతని వెంబడింతు ననియు వ్యాసుడు చెప్పెను. శుకముని యుత్తర దిక్కు వైపు కద లెను. అతని వెనుక వ్యాస మహర్షియు వెళ్ళు చుండెను. శుకముని యోగ విద్యతో వెళ్ళు వాని వలె వెళ్ళు చుండెను. మందాకినీ నదిలో నగ్నముగ స్నానమాడు చుండిన "అప్సరస" స్త్రీలు శుకమునిని చూచినను వారు శంకింప లేదు. వేదవ్యాస మహర్షికి కుమారుడు కనబడ లేదు. వ్యాసుడు సిద్ధ చారణుల నడుగుచు "శుకా"యని యర చుచు వెళ్ళు చుండెను. మందాకినీ తీర మందలి "అప్సరస" స్త్రీలు సిగ్గుపడి బట్టలను ధరించిరి. వ్యాసుడు చలించెను. కుమారుడగు శుకముని వెళ్ళి నప్పు డీ స్త్రీలు శంక లేకుండ నుండి తన్ను చూడగానే సిగ్గుతో ప్రవర్తించుటకు కారణమును గ్రహించెను. అతని యశక్త తను నిరూపించు ప్రియ,లజ్జ భావము లొక్కుమ్మడిగ వ్యాసమహర్షిలో కలిగెను. అప్పు డచటికి సురముని సిద్ధ గణ పరివేష్టిత గంగాధ రుడు వచ్చెను. అతనికి వ్యాస మహర్షిపై కరుణా బుద్ధి కలిగెను. పూర్వము వేద వ్యాస మహర్షి కోరినట్లు శుకుని నిచ్చితి ననియు, తన ప్రభావము చేతను, వేద వ్యాస మహర్షి తపో విశేషము చేతను శుక ముని బ్రహ్మ తేజోమయుడై దేవతలకు పొందరాని వరమ గతిని పొందెననియు, దీని వలన సంతోషించుట మంచిదనియు భూమి, కొండలు సముద్రము లెంత కాలముండునో యంత వరకు శుకముని

కీర్తియు వేద వ్యాస మహర్షి వైభవము వెలుగునని శివుడు నిర్దేశిం చెను. మరియు వేద వ్యాస మహర్షి కోరకనే శివుడు

వ॥ "వలయునేని బుత్రి సదృశయైన ఛాయ నిన్నెప్పుడు నను గమింప దర్శించు వాడను గా కని" (342) పలికెను.

3.2.3.2. గృధ్రజంబుకములకు క్షుధాభావము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతిపర్వము తృతీయాశ్వాసములో (366-381) గలదు. వరమును పొందినవి గృధ్రజం బుకములు. వరప్రదాత శంకరుడు.

"విదిశా పట్టణము"న నొక బాలుడు మరణించెను. అతని తల్లి దండ్రులు, బంధువు లా శవమును ప్రేత భూమికి తీసికొని వెళ్ళిరి. అమిత దుఃఖముతో వగచు చుండిరి. అచట నుండిన యొక గ్రద్ధ చీకటి పడక ముందే యా బాలుని శవమును తినదలచెను. కావున వారికి భయము కలుగు నట్లు మాట్లాడెను. ఆ గ్రద్ధ మాటల నప్పు డచట నొక బొరియలో నుండిన యొక నక్క వినెను. అదియు నా బాలుని శవమును తిన దలచెను. కాని యా గ్రద్ధ చీకటి పడు నంత వరకు తనను రానీయదని గ్రహించెను. చీకటి పడునంత వరకు వారి నచటనే యుంచ దలచెను. అందుకు తగినట్లుగ వారికి నాశ గొలిపెను. నీతిని బోధించెను. ధిటవు గలిపెను. అట్లు గ్రద్ధ జంబుకములు రెండును కాయశక్తుల ప్రసంగములను సాగించిరి. ఇంతలో చీకటి పడెను. అప్పుడు ప్రేత వన విహార నిరతుడైన శంకరుడు వచ్చెను. వారి యేడ్పులను వినెను. కరుణాకరుడై వరముల నడుగు మని పలికెను. వారు కోరినట్లు బాలుని బ్రదికించి శతాయు సంపన్ను డగునని దీవించెను. అచటనే యుండిన గృద్ధ జంబుకముల మీద గూడ శంకరునికి దయ గలిగెను. అవి కోరకనే వాటికి

వ॥ "ఆకలి యెన్నండును లేక యుండ బ్రసాదించెను" (381)

3.2.4.1. శ్రీరాముని వరము-హనుమత్కథా సుస్థిరత్వము

ఈ వృత్తాంతము "నన్నయ" భారతభాగము "అరణ్య"పర్వము తృతీయాశ్వాసములో (330-331) గలదు. వరమును పొందినవాడు హనుమంతుడు. వరప్రదాత శ్రీరాముడు.

శ్రీరామ లక్ష్మణులు సీతాదేవిని వెదకుచు దారిలో సుగ్రీవాది వానరులతో స్నేహమును చేసి కొనిరి. సీతాదేవిని వెదకుటకు వానరుల సహాయమును కోరిరి. వారిలో హనుమంతుడు మహా సముద్రమును దాటి లంకకు నిప్పును పెట్టెను. తిరిగి వచ్చి సీతాదేవి విషయమును శ్రీరామునికి తెలిపెను. శ్రీరాముడు వానర సైన్యమును సహాయముగ తీసికొని మహా సముద్రములో వారధిని కట్టించి లంకకు చేరెను. యుద్ధములో రావణుని వధించెను. సీతాదేవిని గ్రహించెను. సీతాదేవిని కనుగొనుటలోను, లంకకు నిప్పును పెట్టుటలోను, యుద్ధములోను హనుమంతుడు చూపిన ధైర్య సాహసమునకు శ్రీరాముడు మెచ్చి హనుమంతుడు కోరకనే

మధ్యాక్కర॥ "నర సుర స్తుత్యమై యెంత కాలంబు నాకథలు నిలుచు
నిరతంబుగా నంతకాలమున్ నీవు నిత్యుండ వగుచు
బరగు మని వరము" (331) నను గ్రహించెను.

3.2.5. శ్రీకృష్ణుని వరములు

శ్రీకృష్ణు డిచ్చిన వరములు రెండు. 1) భీష్మాదులకు, 2) భీష్మునకు.

3.2.5.1. భీష్మ విదుర ద్రోణ సంజయులకు దివ్య దృష్టి వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగ" పర్వము

తృతీయాశ్వాసములో (405) గలదు. వరమును పొందిన వారు నార దాది మహా మునులును, భీష్మ, విదుర ద్రోణ సంజయులును. వర ప్రదాత శ్రీకృష్ణుడు.

శ్రీకృష్ణ రాయబార ఘట్టపు చివరలో దుర్యోధనుని దుశ్చేష్టకు శ్రీకృష్ణుడు కోపించెను. "నేనొక్కడే నని తలచి దుర్మదముతో బం ధింప పూనుకొంటివా?" యని దుర్యోధనుని నడిగెను. అపై దరహా సమును చేయుచు దుర్నిరీక్ష్యమైన విశ్వరూపమును ప్రదర్శించెను. అప్పుడు సభలోని యందరును కన్నులను మూసుకొని యద్భుత భయానక చిత్తములతో కదల కుండిరి, తన విశ్వరూపము నెవ్వ రును చూడలేక పోవు చున్నారని శ్రీకృష్ణుడు గ్రహించెను. నారదాది మహా మునులును, భీష్మ, విదుర, ద్రోణ, సంజయుల మీద కరుణ భావముతో వారు కోరకనే

వ॥ "వారలకు దివ్యదృష్టి యొసగెను" (405)

3.2.5.2. అంపశయ్యపై నున్న గాంగేయునికి ననేక వరములు

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము ద్వితీ యాశ్వాసములో (99-125) గలదు. వరమును పొందిన వాడు భీష్ము డు. వరప్రదాత శ్రీకృష్ణుడు.

భారత యుద్ధములో ధర్మరాజునకు విజయము లభించెను. తరు వాత నతనికి పాలనను గురించి సందేహములు కలిగెను. వాటిని తీర్చుటకు శ్రీకృష్ణుడు ధర్మరాజును శరతల్పముపై "ఓఘవతీ" నదీ సమీపమున నున్న భీష్ముని దగ్గరకు పిలిచికొని వెళ్ళెను. శ్రీకృష్ణుడు భీష్ముని పరామర్శించి-స్తుతించెను. పిమ్మట ధర్మరాజుకు గలిగిన సం దేహములను తొలగించు మనెను. అప్పుడు భీష్ముడు శ్రీకృష్ణుని

పొగడెను. తాను నిశిత బాణములచే పీడితుడనగు, తాను ధర్మ సందే హములను తీర్చుట గురువుండియు శిష్యుడు చెప్పి నట్లుగ నుండు ననియు తెలిపి శ్రీకృష్ణునినే ధర్మరాజు సందేహములను తొలగించు మని చెప్పెను. అంత కృష్ణుడు, భీష్ముడు కోరకనే మూడు వరములను ప్రసాదించెను. అవి. 1. బాణముల దెబ్బలచే మూర్ఛ కలుగకుండు నలసటను పొందకుండ నుండు నట్లు, 2. దప్పిక, యాకలి, కలుగ కుండ నుండు నట్లను గ్రహించెను. మరియు

3. కం॥ "విను సకల భూతముల వ
ర్తనములు గను నపుడు బుద్ధి దపుల బడక యెం
దును బరగి దివ్య బోధం
బున నలవడు నట్టి పెంపు బొందు మనిందా్య" (124)

అని యాశ్వాసించెను.

3.2.6, షణ్ముఖుని శత్రు సంహార వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శల్య పర్వము ద్వి యాశ్వాసములో (179 185) గలదు. వరమును పొందిన వారు దేవ తలు, వరప్రదాత షణ్ముఖుడు.

షణ్ముఖుడు పుట్టిన తరువాత నొక్కనాడు పార్వతీ పరమేశ్వ రులును, బ్రహ్మ, విష్ణువులును, ప్రథమ గణములును, ఇంద్రాది దిక్పా లురును, రుద్రాదిత్య మరుద్వసు ప్రభృతి సకల సురలును, గరుడ గంధర్వోరగ కిన్నర కింపురుష సిద్ధ సాధ్య విద్యాధర యక్షాది దివ్య లును, మునులును, పితృ దేవతలును, మూర్తి మంతములైన ఓషధి సరిత్సముద్ర పర్వతములును షణ్ముఖుని చూడ కదలిరి. బ్రహ్మ సలహా ప్రకారము సరస్వతీ నదీ సమీపమున షణ్ముఖునకు దేవసేన

నాయకత్వాభిషేకమును చేసిరి. అందరును దీవించిరి. అందరి దగ్గర నున్న రూప గుణ బల పరాక్రమాధికులైన వారి నేఱి కుమారస్వామికి ననేక వీరుల నొసంగిరి. వారితో కలిసి యుండుటకు తగిన సేనాంగ సమూహములను మూల బలముగా నొనర్చిరి. అప్పుడు సురలు కోర కనే షణ్ముఖుడు సురలను చూచి

వ॥ "మీ కెవ్వరి నేనియుం జంపను జెఱుపను వలసి యున్న యది యట్టి బల్లిదంపు బగఱం బరి మార్చెద నని" (185) వరము నిచ్చెను.

అందుకు సురలు బహు ప్రమోదము నొందిరి.

3.2.7. గీర్వాణ విభుని వరములు

ఇతడిచ్చిన వరములు నాలుగు. ఇవి - 1) ఉదంక మునికి సాహాయ్యము 2) వసు రాజునకు ననేక వరములు 3) అర్జునునకు ననేకాస్త్రములు 4) అర్జునునకు అమరావతి ప్రవేశార్హత.

3.2.7.1. ఉదంకమునికి సాహాయ్యము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది"పర్వము ప్రథమాశ్వాసములోను (91-93), తిక్కన భారతభాగము "అశ్వమేథ"పర్వము తృతీయాశ్వాసములోను (104-108) నించుమించు సమానముఁగా గలదు. వరమును పొందిన వాడు ఉదంకముని. వరప్రదాత గీర్వాణ విభుడు.

నన్నయ భాగములో "ఉదంక" ముని పైల ముని శిష్యుడు. తిక్కన భాగములో గౌతమ ముని శిష్యుడు. నన్నయ భాగములో ఉదంక ముని గురుదక్షిణార్థమై పౌష్యమహారాజు భార్య కుండలముల

కొఱకు వెళ్ళు చుండెను. తిక్కన భాగములో సౌదాసరాజు భార్య మిత్ర సహాఖ్య దేవి కుండలముల కొఱకు వెళ్ళెను. నన్నయ భాగములో "ఉదంకు"నికి దారిలోనే యొక దివ్య పురుషుని యాకారములో నొక మహోక్షము నెక్కి "ఇంద్రు" డెదురై గోమయ భక్షణము చేయుమనెను. ఉదంకు డట్లు చేసెను. అద్దాన "ఉదంకుడు" త్వరగా పౌష్యరాజును చేరెను. మరియు కుండలములను గ్రహించి తిరుగు ప్రయాణములో నా కుండలమును తక్షకు డపహరించి పుట్ట ద్వార వెళ్ళి నపుడు "ఉదంకుడు"ను వెళ్ళెను.

తిక్కన భాగములో తిరుగు ప్రయాణములో తక్షకు డపహరించి నాగ లోకమునకు పుట్ట ద్వార వెళ్ళి నపుడు, కట్టెతో నా పుట్టను త్రవ్వ సాగెను. అందుకు భూమి కదలెను. అప్పుడు గీర్వాణ విభుడు బ్రాహ్మణ వేషములో నచటికి వచ్చెను. కట్టెతో త్రవ్వినంత మాత్రమున పాతాళ యానము సిద్ధించ దనియు పాతాళ మిచటికి సహస్ర యోజనముల దూరమున్న దనియు, కుండలములను "ఐరావతు"ని కొడుకు తీసికొని వెళ్ళెననియు "ఉదంకు" నికి చెప్పెను. అతని మాటలకు "ఉదంకుడు" సమాదానముగ పాతాళమున నున్నను తాను తెచ్చెదననియు, తన చేత గాకున్న నీ పనిలో తన ప్రాణమును వదలుదుననియు "ఇదిధ్రువ"మని చెప్పెను. ఇంద్రుడు "ఉదంకు"ని దృఢ భావము నెఱింగెను. ఉదంకుడు కోరకనే యతని

చం॥ "..........కాష్ఠమునం గులిశంబున గల్గు వాడియున్
బలువును నిచ్చి వజ్రి చనెను" (108)

3.2.7.2. వసు రాజుకు ననేక వరములు

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వము

తృతీయాశ్వాసములోను (23,24) తిక్కన భారతభాగము "శాంతి" పర్వము షష్ఠాశ్వాసములోను (353-359) నించుమించు సమానముగా గలదు. వరమును పొందిన వాడు వసు రాజు. వరప్రదాత ఇంద్రుడు.

వసువు చేది దేశపు రాజు. అతడు వాసవ ప్రతిముడు. అతడు రాజ్య పాలనను చేయుచు శిష్టుల పొగడ్త లందెను. అత డొకనాడు మృగయా వినోదార్థ మరణ్యమునకు వెళ్ళెను. ముని జనాశ్రమ మందు నిర్వేద భావముతో మహా నిష్ఠతో సన్యస్త్ర శస్త్రుడై తపస్సును చేయ సాగెను. ఇంద్రుడు దేవతల సమూహముతో వసువు దగ్గరకు వెళ్ళి రాజ్య వైభవమును వదలి తపస్సును చేయుట యెందుకని ప్రశ్నించెను. అతడు సమాధానమును చెప్ప లేదు. ఇంద్రుని పలుకరించ లేదు. అయినను తపస్సునకు మెచ్చితి ననియు, తనతో చెలిమి చేయు మనియు, తన యొద్దకు రాకపోకలు సాగించుచు రాజ్య పాలనను చేయు మనియు ఇంద్రుడు వసురాజుతో పలికెను. మరియు నతడు కోరకనే యతనికి

వ॥ "దేవత్వంబును గనక రత్నమయం బైన దివ్య విమానంబును నెద్దాని నేని తాల్చిన నాయుధంబుల్ను దాక నోడు నట్టి వాడని వనజంబులు గలిగిన యింద్ర మాల యను కమలమాలిక యును, దుష్ట నిగ్రహ శిష్ట పరిపాలన క్షమం బైన యొక్క వేణు యష్టియు నిచ్చెను" (24)

పిమ్మట నా దివ్య విమానములో వసురాజు విహరించుటచే నప్పటి నుండి యతనికి "ఉపరిచర వసువు" అను పేరు స్థిర పడెను.

3.2.7.3. అర్జునునకు ననేకాస్త్ర దానములు

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది"పర్వ మష్టమా

శ్వాసములో (319-321) గలదు. వరమును పొందిన వాడు "అర్జునుడు" వరప్రదాత "ఇంద్రుడు."

ఖాండవవన దహనార్థము "అగ్ని దేవుడు" శ్రీకృష్ణార్జునుల సాహాయ్యము నపేక్షించెను. అందులకు వారిరువురును సమ్మతించిరి. కాని "ఇంద్రుడు" వారి ప్రయత్నములకు విఫలమును కలిగింప నెంచెను. కాని "ఇంద్రుడు" పరాజితు డయ్యెను. చివరకు "అశరీరవాణి" యొుక్క పలుకుటచే "ఇంద్రుడు" శ్రీకృష్ణునికి పాదాక్రాంతు డయ్యెను. అప్పుడు అర్జునుడు కోరకనే ఇంద్రుడు

వ॥ "ఆగ్నేయ వారుణ వాయువ్యాది దివ్య బాణము లిచ్చెను" (321)

3.2.7.4. అర్జునునకు దివ్యాస్త్ర ప్రాప్తికై ఇంద్రుని యాకాంక్ష

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య"పర్వము ప్రథమాశ్వాసములో (276-295) గలదు. వరమును పొందిన వాడు అర్జునుడు. వరప్రదాత ఇంద్రుడు.

దివ్యాస్త్రములను పొందుటకు అర్జునుని పంపుమని కృష్ణద్వైపాయనుడు ప్రతిస్మృతి విద్యను ధర్మరాజుకు తెలిపెను. ఆ విద్యను ధర్మరాజు అర్జునునికి తెలిపెను. ఆ విద్యచే అర్జునుడు నిఖిల భూత దుర్నిరీక్షు డగుచు హిమశ్శైల గంధ మాదన పర్వతములను దాటి ఇంద్రకీల పర్వతముపై వెళ్ళు చుండెను. "నీ వింక పోవల" దను మాట వినబడి, అర్జునునిపై పూలవాన కురిసెను. సమీపమున నొక వృక్షమూలమున గల నొక బ్రాహ్మణునికి అర్జునుడు నమస్కరించెను. తపస్వికి నాయుధములు వలదని వృద్ధుడు చెప్పెను. కాని అర్జునుడు వినలేదు. అప్పు డా వృద్ధుడు ఇంద్రుని రూపమును ధరించి

ఆ.వె॥ "ఇష్టమైన వరము లిచ్చెద ప్రీతితో వేడు మనెను" (292)
అర్జునుడు భక్తితో నమస్కరించి "దివ్యాస్త్ర లాభమని" కోరెను. అవి కాక విశేషమైన వానిని కోరుమని ఇంద్రుడు తెలిపెను. అర్జునుడు మరేదియు వలదనెను. ఇంద్రుడు అర్జునుని పట్టుదలను విని కరుణా బుద్ధితో

ఆ.వె॥ "...........పరమాస్త్ర లాభంబు
నీకు నిష్టమేని లోక వంద్యు
గరళ కంఠు నీశు బరము బ్రసన్నుగా
వేగ చేయు మధిక యోగశక్తి" (294)

వ॥ "అట్లైన నిఖిల లోకపాల సహితుడై యీశ్వరుడు నీ యభి
మతం బొనరించు" (295) నని పలికి మాయ మయ్యెను.

3.2.7.5. అర్జునునకు అమరావతి ప్రవేశార్హత

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య" పర్వము ప్రథమాశ్వాసములో (341-343,369) గలదు. వరమును పొందినవాడు అర్జునుడు. వరప్రదాత ఇంద్రుడు.

అర్జునుడు పాశుపతాస్త్రమును పొందెను. పిమ్మట యమధర్మ, వరుణ, కుబేర దేవతలు అర్జునునకు "అయాచిత" వరముగ వారి దివ్యాస్త్రముల నిచ్చిరి. అంత ఐరావతము నెక్కి "ఇంద్రుడు" వచ్చెను. అర్జునుని చూని ఇంద్రుడు చాల సంతసించెను. అపై అర్జునుడు కోరకనే

వ॥ "నీవు పరమేశ్వరు వలన బరమ సిద్ధితో దేవత్వంబు వడసి
తివి దేవ కార్యంబు దీర్ప నర్హుండవు గాన నారథంబు

బు త్తెంచెద నమరావతికి రమ్ము నీకు దివ్యాస్త్రంబు లంద

యిచ్చెద నని" (343);

దేవేంద్రుడు దేవ గణములతో నమరావతికి నరిగెను. తరువాత ఇం ద్రుని రథసారథియైన మాతలి ఇంద్రుని రథమును తీసికొని వచ్చెను. అర్జునుని నారథము మీద దేవలోకమునకు తీసికొని వెళ్ళెను. అచ్చట ఇంద్రుడు కిరీటిని మొదట తన యంక స్థలమున కూర్చొన బెట్టుకొని పిమ్మట తన యాసనమున సగ భాగము నిచ్చి తన ప్రక్కన కూర్చొన బెట్టుకొనెను. తరువాత ఊర్వశి అర్జునున కిచ్చిన శాప మును ఇంద్రుడు తెలిసి కొనెను. దాని వలన అర్జునునిక గలుగు లాభమును శాప మోక్షము ననుగ్రహించెను. తరువాత అర్జునుడు కోరకనే

సీ॥ "వజ్రాస్త్ర మాదిగా వరదుడై వివిధ ది
వ్యాస్త్రముల్ పార్థున కమర నిచ్చి
తత్ప్రయోగంబులు దద్రహస్యంబులు
దన్నివర్తనములు దడయ కపుడు
దయ నుపదేశించి దారుణాహవము లం
దవిజేయ వీర్యుండ వగుము పేర్మి
నని" (369) పలికెను.

3.2.8. శిబికి ఇంద్రాగ్నుల వరము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆరణ్య" పర్వము తృతీయాశ్వాసములో (227 237) గలదు. వరమును పొందినవాడు శిబి చక్రవర్తి. వర ప్రదాతలు ఇంద్రాగ్నులు.

పూర్వము భృగుతుంగ మను పర్వతము మీద శిబి చక్రవర్తి

యజ్ఞమును చేయుచుండెను. అప్పుడు ఇంద్రాగ్నులు శిబి చక్రవర్తి సద్గుణముల నరయు వారై ఇంద్రుడు డేగ రూపమున, అగ్ని పావురము రూపమున వచ్చిరి. డేగ పావురమును తరుముకొనుచు వచ్చుచుండగ పావురము భయముతో శిబి చక్రవర్తి మరుగున దాగెను. అతడు దానికి నాశ్రయము నిచ్చెను. డేగ కూడ నచటికి వెళ్ళెను. శిబి చక్రవర్తి సత్యధర్మనిర్మల గుణములను పొగడెను. ప్రాణుల కాహారావసరమును గురించి తెలిపెను. తన యాహారము నకు భంగము కలిగించుట ధర్మ విరోధమని పలికెను. అంత శిబి చక్రవర్తి పావురము యొక్క ప్రాణ భీతిని; శరణాగత ధర్మమును విశదీకరించెను. మరియు డేగ యాకలి తీరుటకు వనములో గల నవేక జంతువుల పక్షుల మాంసములను దాని కంటె నెక్కువగ తెచ్చి పెట్టెదననియు పావురము మీద గల కోపమును విడిచిపెట్టుమని కోరెను. కాని డేగ తనకు నిర్ణయించ బడిన యాహారము పావుర మనియు, దానిని రక్షింప దలచినచో దాని యంత శిబి మాంసమును తూచి తన కప్పుడే పెట్టుమనియు నడిగెను. వెంటనే శిబి డేగ మాటలకు సమ్మతించితి నని పలికెను. త్రాసులో నొక వైపు పావురము నుంచెను దానికి సమానమగు తూకము వచ్చునంత వరకు తన మాంసమును తానే కత్తితో కొంచెము కొంచెముగా కోసి రెండవ వైపున వేయుచుండెను. ఎంత వేసిన పావురమునకు సమానముగా తూగలేదు. చివరకు రక్తము కారుచున్న శరీరముతో తానే త్రాసులో కూర్చొనెను. అప్పుడతని గుణోన్నతిని ఇంద్రాగ్నులు స్తుతించిరి. డేగ పావురముల యాకారములను వదలి నిజ రూపములతో ప్రత్యక్ష మయిరి శిబి కొరకనే ఇంద్రాగ్నులు

వ॥ "నీ ధైర్య శౌర్యాది గుణంబు లనన్యసాధారణంబులు గావున

నీకీర్తి నిత్యంబై శబ్ద బ్రహ్మము గల యంత కాలమును వర్తిల్లుచు నుండెడు" అని (237) వర మొసగిరి.

3.2.9. అగ్ని దేవుని వరములు

అగ్ని దేవు డిచ్చిన వరములు రెండు 1) ఉదంకమునికి 2) గో సేవా ఫలము.

3.2.9.1. ఉదంక మునికి నుపాయ సూచన

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అశ్వమేధ" పర్వము తృతీయాశ్వాసములో (108-118) గలదు. వరమును పొందిన వాడు "ఉదంకుడను ముని. వరప్రదాత అగ్ని దేవుడు.

ఉదంకుడు గౌతమ మహర్షి శిష్యుడు. అతడు గురుదక్షిణార్థము సౌదాసరాజు భార్య కుండలములను తీసికొని వెళ్ళు చుండెను. దారిలో వానిని తక్షకు డపహరించి పాతాళమును చేరెను. బ్రాహ్మణ వేష ధారియగు ఇంద్రుని సహాయమున ఉదంకుడు పాతాళమును చేరెను. అది చాల పెద్దది. దృఢమైనది. ఆ పాతాళ ముఖద్వారమును చూచి కుండల గ్రహణము కష్ట మని డిల్ల పడెను. అప్పు డచటనే "అరుణ" ముఖముతో నీల వర్ణ శరీరియై శ్వేత వాలము గల యొక గుఱ్ఱమును చూచెను. అది ఉదంకుడు కోరకనే

ఉ॥ "ఆతతమైన నాదగు నపానము నూదు మొకింతయున్ జుగు
ప్సాతురవృత్తి నీదు హృదయంబున జొన్పకు లోకవంద్య డ
గ్గౌతము నాశ్రమంబున నఖండ భక్తి నుపాస్తి చేసి నన్
బ్రీతుని జేసి నాడవు వరిష్ఠ తపోధన యట్లు గావునన్" (110)

వ॥ "నీకుం బొడసూపి యైరావత సుతుం డపహరించిన సముచిత

కుండలంబులు మగుడం జేరెడు నుపాయం బుపదేశించితి
వని" (111) చెప్పెను.

ఉదంకుడా మాటలను విని తా నా గుఱ్ఱము నెఱుంగ ననియు. దాని నుపాసించు టెట్లు జరిగెననియు నడిగెను. ఉదంకునికి గురువైన గౌతమునికి తాను గురువుననియు "అగ్ని దేవు"డ ననియు, శుచియై నిత్యము నియతితో సభక్తికముగ తన్ను పూజించితి వని ఉదంకునికి నా గుఱ్ఱము సమాధానమును చెప్పెను. ఉదంకుడు ప్రీతి చెంది యా గుఱ్ఱము చెప్పినట్లు చేసెను. అప్పుడు గుఱ్ఱము యొక్క రోమ కూపముల నుండి యొక్క మారుగ ధూమ మెగ బ్రాకినది. ఆ పొగ పాతాళ లోక మంతయు కప్పెను. ఐరావతుని నివాసములో హాహాకారములు చెలరేగినవి. ఆ పొగకు పాము లన్నియు భయ పడెను. ఆ పాములు ఉదంకుని దగ్గరకు వెళ్ళి భక్తితో నర్చించెను. ఉదంకుని కోరికను తెలిసికొని కుండలములను తెచ్చి యిచ్చెను. ఉదంకుడు అగ్ని దేవునికి భక్తితో ప్రదక్షిణమును చేసి నమస్కరించెను. అగ్ని దేవుడు సంతోషించెను.

### 3.2.9.2. గోసేవా ఫలము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వము తృతీయాశ్వాసములో (101-102) గలదు. వరమును పొందినవి కపిల వర్ణ గోవులు. వరప్రదాత అగ్ని దేవుడు.

ఒక కారణమున అగ్ని దేవుడు సురలను వంచించివెళ్ళెను. గోవుల నర్థించి వాని నాశ్రయించి వాటి యందు దాగెను. ఆ గోవులు నతనిని దాచెను. దేవత లందరును వెదకిరి. కనబడ లేదు. వారు గోవుల కడకు వెళ్ళి "అగ్నిని దాచుట యఖిల జగములకును నహితము. కావున

నతనిని చూపు"మని గోవుల నడిగిరి. అవి సంకోచించి అగ్ని దేవుని చూపెను. దేవతలు సంతసించిరి. ఆ గోవులకు వరము నీయవలయు నని "అగ్ని దేవు"ని ప్రార్థించిరి. అతడు తా నా గోవులందు దాగి యుండుటచే నవి కపిల వర్ణమును పొందెనని యవి కోరకనే

వ॥ "గోవుల కెల్లను గపిల యెక్కుడగుటయుం దదీయారాధనంబు నుం దద్దానంబునుం బుణ్యతమంబులై దురితంబుల దమి యించి యుత్తమ లోకంబుల నిచ్చుట వరంబులుగా నిచ్చెను (102)

### 3.2.10. యమధర్మరాజు వరములు

యమధర్మరాజు ప్రదానము చేసిన వరములు నాలుగు. ఇవి

1) ఒక బ్రాహ్మణ కుటుంబ సభ్యులకు స్వర్లోక స్వాగతము
2) యాగాదులలో హింసాహింస వివేకము
3) సుదర్శనా ఓఘువతులకు నూర్ధ్వలోకానుమతి
4) జనక రాజునకు శాశ్వత వివేక పరిపాకము

### 3.2.10.1. ఒక బ్రాహ్మణుని కుటుంబ సభ్యులకు స్వర్లోక స్వాగతము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అశ్వమేథ" పర్వము చతుర్థాశ్వాసములో (220-251) గలదు. వరమును పొందినవాడు "ఉంఛవృత్తి"ని పాటించు యొక బ్రాహ్మణ కుటుంబ సభ్యులు. వర ప్రదాత యమధర్మరాజు.

కురుక్షేత్రమునందు రోష కామ విరహితుడైన యొక మహాద్వి జుడు భార్యతో, పిల్లలతో, కోడలితో కలిసి జీవించుచుండెను. ఒక పర్యాయము తీవ్రమగు ననావృష్టి యేర్పడినది. అరగింప నాహారము

లేక ప్రజలు విలవిల లాడిరి. ఆ కాలములో నొకనా డుదయముననే యా నల్గురును లేచి "ఉంఛవృత్తి"కై బయలు దేరిరి. సాయంకాలము వరకు ప్రయత్నించి తెచ్చిన ప్రస్థమాత్రమైన (నాలుగు మానికలు) గింజలు సక్తు (పేల పిండి) వయ్యెను. వా రారగింప పూనుకొని నాలుగు భాగములుగ పంచుకొనిరి. ఆ సమయమున బ్రాహ్మణ వేష ములో యమధర్మరా జతిథియై వచ్చెను. బ్రాహ్మణు డతిథికి తన భాగపు పేలపిండి నిచ్చి తినుమని చెప్పెను. కాని తృప్తి కలుగ లేదు. బ్రాహ్మణు డా యతిథి యసంతృప్తిని గ్రహించెను. ఏ పదార్థము నిచ్చి తృప్తి పరచుట యా? యని యాలోచించు చుండెను. అప్పు డతని భార్య నచ్చచెప్పి తన భాగపు పేలపిండి నతిథి కిమ్మనెను. అద్దాన కూడ నతిథి తృప్తి పడలేదు. అప్పుడు కుమారుడు నచ్చచెప్పి తన భాగము నతిథి కిమ్మనెను. అయినను నతిథి తృప్తి పడ లేదు. అప్పుడు కోడలు నచ్చచెప్పి తన భాగము నతిథి కిమ్మనెను. ఆ భాగ మారగించి "అతిథి" తృప్తి చెందెను. సంతోషించెను. అప్పుడు తా నా బ్రాహ్మణుని పరీక్షించుటకు వచ్చిన ధర్ముడనని పలికెను. అతని వ్రతశీలతను మెచ్చి యా బ్రాహ్మణుడు కోరకనే

కం॥ "................................... స
జ్జన కీర్తనీయ దివికిం
జను డెమ్ము ప్రియా సుత సుస్నాసహితముగన్" (243)

అని యాహ్వానించెను. మరియు

కం॥ "తగు ప్రియమున సకుటుంబం
బుగ దన సభ కీవు రాక బుద్ధిం గని బ్ర
హ్మ గడున్ వేడ్క విమానం
బు గురువ్రతశీల శీఘ్రమున బుత్తెంచున్" (245)

అప్పుటే బ్రహ్మ పంపిన విమానము వచ్చెను. విమానములో కూర్చొనుమని యమధర్మరాజు చెప్పెను. ఆ నల్గురు నందెక్కి బ్రహ్మలోకమునకు వెళ్ళిరి.

3.2.10.2. యాగాదులలో హింసాహింస వివేకము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము పంచమాశ్వాసములో (362) గలదు. వరమును పొందిన వారొక బ్రాహ్మణ దంపతులు. వర ప్రదాత ధర్మదేవత.

ఒక విప్రుడు భార్యా సహితుడై వనమున "ఉంఛవృత్తి" ని చేపట్టెను. ఆతడచటనే యజ్ఞమును చేయుటకు పూనుకొనెను. అహింసాపరుడై ఫల మూలమును హవిస్సుగా నీయ దలచెను. ఈ పని విహితాచరణము కాదని యతని భార్యకు తెలియును. కాని భర్త శాపమునిచ్చునేమో యని యామె భర్తకు చెప్పలేదు. అహింసా రూపకమయిన ఫలరూప హవిర్భాగములను తీసికొనుటకు ఇంద్రాది దేవతలు రారని అగ్నిదేవుడు కూడ యజ్ఞ కుండమున వెలుగలేదు. ఆ సమయమున సమీపమున జింక తిరుగాడుచుండెను. ఆ జింక యా బ్రాహ్మణుని భార్యను తప్పులు పట్టెను. ఆ బ్రాహ్మణుని యెదుట నిలిచి తన్నుహింసించి యజ్ఞమును చేయుమని పలికెను. కాని బ్రాహ్మణుడు సమ్మతించలేదు. అ జింక కొంతదూరము పోయి మరల వచ్చి యా బ్రాహ్మణుడు కోరకనే యతనితో

వ॥ "నా యిచ్చు దివ్య దృష్టిం గనుగొను మేను జెప్పినట్లు సేసిన
నిన్నభినందించు వారైరె యప్సరః కాంతలును గంధర్వులును
వీరె విమానంబుల నే తెంచిన వా రని" (362) చెప్పెను.

విప్రుడు జింక మాటలను విని యప్సరః కాంతలను, గంధర్వులను

చూచెను. దివ్యత్వసిద్ధికై యా జింకను హింసించ దలచెను. దాని వలన నతని తపస్సునకు నుత్పాతములు పుట్టెను. అప్పుడు జింక రూపములో నుండిన ధర్మదేవత యా బ్రాహ్మణుని యెదుట ప్రత్యక్షమై యతడు కోరకనే

వ॥ "నీయజ్ఞశ్రద్ధకు సంతోషించి ధర్మసూక్ష్మత్వంబు దెలుప వచ్చితి నర్థం బగు హింసా విశేషం బహింసావ్రత హానిం జేయదు క్రతువు గదా యని యనర్థహింస కర్తవ్యంబు గా దని నిర్దేశించెను" (382)

3.2.10.3. సుదర్శనా ఓఘవతులకు నూర్ధ్వలోకానుమతి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక"పర్వము ప్రథమాశ్వాసములో (64-83) గలదు. వరమును పొందినవారు "అగ్ని దేవు"ని కుమారుడైన సుదర్శనుడును,నతని భార్య "ఓఘవతి"యును. వరప్రదాత ధర్మదేవత.

సుదర్శను డను బ్రాహ్మణుడు "గృహస్థ ధర్మానుష్ఠానమున మృత్యువును జయింతు" నని ప్రతిజ్ఞను చేసెను. తన భార్యతో కురుక్షేత్రమునకు వెళ్ళి రమణీయ ప్రదేశమున విశాలమగు పర్ణశాలలో వసింప సాగెను. అత డతిథిని పూజించుట తనకు చాల యిష్టమనియు తానింట నున్నను లేకున్నను నతిథిని పూజింపు మనియు, నతిథి కోర్కెలను భార్య తీర్చినచో దంపతులు కృతకృత్యులగుదురని చెప్పెను. తరువాత నొకనా డత డడవికి కట్టెలకొఱకు వెళ్ళెను. అప్పుడు ధర్మదేవత బ్రాహ్మణ వేషములో నా యింటికి నతిథియై విచ్చేసెను. సుదర్శనుని భార్య "ఓఘవతి" వినయముగ నా యతిథిని గౌరవించెను. అత డామెను చూచి కామాతురుడై తన కామవాంఛ నామెకు

తెలిపెను. కాని యందుల కామె సమ్మతించ లేదు. అతని ప్రయత్న మును విరమింప జేయుటకు తన వాక్చాతురిని ప్రయోగించెను. కాని యతని పట్టు వదల లేదు. చివరి కామె తన భర్త చెప్పి నట్లు చేయ వలెనని భావించి సమ్మతించెను. ఆతనిని మరుగు స్థలమునకు పిలిచి కొని వెళ్ళెను. ఆ సమయము నందే యామె భర్త సుదర్శనుడు వచ్చి ఇంటి ముందర నిలిచి భార్యను పిలిచెను. భర్త పిలుపునకు సమాధానము నీయ వలదని యతిథి చెప్పెను. సమాధానము నిచ్చి నచో నతిథి కోపించి శపించు నేమో యని భావించి యామె పలుక కుండెను. సుదర్శనుడు చాల మారులు పిలిచి, యింటి లోనికి నడుగు పెట్టెను. కాని యామె యచట లేదు. అప్పు డతడు ప్రేమ పురస్సర ముగా పిలిచెను. అప్పు డతిథి సుదర్శనునికి వినబడునట్లు "నీభార్య నా కాతిధ్యము నిచ్చు చున్నది. నీవు గృహధర్మ పరుడవు. కావున కోపగించు కొనవల"దని పలికెను. సుదర్శను డా మాటలను విని తన సంతోషమును తెలియ బరచెను. అప్పు డా కాశము నుండి దివ్య వాణి సుదర్శనుని మెచ్చు కొనెను. అతిథి ప్రీతి జెంది సుదర్శనుని కడకు వెళ్ళి సహజ రూపమును చూపెను. తాను ధర్మదేవత ననియు నతని చిత్తము నరయుటకు వచ్చితి ననియు పలికి యతని నిశ్చల వ్రతమును మెచ్చి కొనెను. మరియు సుదర్శనుని వ్రతమునకు హాని కలిగినచో వెంటనే చంపుటకు మృత్యు దేవత సుదర్శనుని వెను వెంట తిరుగు చుండెననియు, కామరోషాది వికారముల చేత సుదర్శనుడు మృత్యువును జయించె ననియు, నతని భార్య కూడ పవిత్రమైన దనియు, నస్ఖలిత చరిత యనియు పలికెను. సుదర్శనుడు కోరకనే

ఆ.వె॥ "ఒడలి తోడ నీకు నూర్ధ్వలోకము నకు
 నరుగ వచ్చు నెపు డరుగు తలంపు

దోచె నవ్వు డిదియు దోడిదయ్యై ప్రీతి
నరుగు దెంచు ననియె" (80)

మరియు

చం॥ "నరవర పొల్చు నోఘవతి నా నదియై జన పావనాకృతిం
బరమ తపంబులోని సగపాలను నియ్యమ యున్న సాము న
వ్వెరవున దొంటియై నిలిచి నీకు దగం బరిచర్య సేయు ని
చ్చరితము మీకు నిర్మల యశంబు నొనర్చుట కే నొనర్చి
తిన్" (82)

అని చెప్పి ధర్ముడు వేయి తెల్లని గుఱ్ఱములను పూన్చిన రథము నెక్కి వెళ్ళెను.

3.2.10.4. జనక రాజునకు శాశ్వత వివేక పరిపాకము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అశ్వమేథ"పర్వము ద్వితీయాశ్వాసములో (87-96) గలదు. వరమును పొందిన వాడు జనకుడను రాజు. వరప్రదాత ధర్మదేవత.

ధర్మదేవత జనక రాజును పరీక్షింప దలచెను. బ్రాహ్మణ వేషములో జనకుని యెదుట కొఱగామి పనులను చేసెను. అప్పుడు జనకుడతనిని తన దేశము నుండి వెడలి పొమ్మనెను. అంత నా బ్రాహ్మణుడా దేశ మెంతటిదో వివరముగ చెప్పిన తరువాత దేశము నుండి వెడలుదు ననెను. జనకుడు విని నిరుత్తరుడై మూర్ఛ పోయెను. కొంత సమయమునకు తెరుకొని, తన తాత, తండ్రులు సంపాదించిన భూమి తన వశమున నున్నదనియు, కావున దీనిపై తనకు మమత లేనియు మిథిలా నగరమున నెప్పుడు నివశించు చుండెద ననియు, నయినను నీ పురము తనదని యఙ్గీకరింప వీలు లేదనియు, నింతకు నతనిని

తన దేశము నుండి పొమ్మని చెప్పిన మాట వలననే యెక్కువ బాధ కలిగి మూర్ఛ కలిగెననియు చెప్పెను. ఇట్టి మమకార రాహిత్యము నకు కారణమేమవి బ్రాహ్మణు డడిగెను. అన్నియు నశించినవి కనుక తనకు మమకారము లేదని జనకుడు తెలిపెను. బ్రాహ్మణు డా మాట లను విని మెల్లగ నవ్వుచు "రాజా! నిన్ను పరీక్షింప వలయునని వేడుక కలిగి వచ్చితిని నేను ధర్ముడ" నని చెప్పి యతడు కోరకనే

చం॥ "వనుపడు నిర్వివేక పరిపాకము గాఢనిరూఢ భావ మొం
దినిలుచు గాత నీ దగు మదిన్ సతతంబును శాంతి కారియై"
(95) అని వరము నిచ్చెను.

3 2.11. అర్జునునకు యమ, వరుణ, కుబేరుల వరములు

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య" పర్వము ప్రథమాశ్వాసములో (335-340) గలదు. వరమును పొందిన వాడు అర్జునుడు. వర ప్రదాతలు యమ, వరుణ, కుబేర దేవతలు.

అర్జునుడు హరుని వలన పాశుపతాస్త్రమును పొందెనని ఇంద్రుడు తెలిసికొనెను. వెంటనే యమధర్మ, వరుణ, కుబేర, దిక్పాలురతోను, నితర దేవతలతోను కదలి, దయతో అర్జునుని దగ్గరకు వచ్చెను. అప్పుడు యమధర్మరాజు ప్రీతితో అర్జునుడు కోరకనే "నీ పరాక్రమమునకు మెచ్చి దేవతలు వచ్చి"రని పలికి

వ॥ "వీరలం జూడు మని దివ్యదృష్టి యిచ్చెను" (338)
తరువాత "అర్జును"ని పూర్వజన్మ వృత్తాంతమును ప్రస్తుత జన్మలో నతడు చేయవలసిన విధ్యుక్త ధర్మమును తెలిపెను. "అర్జునుడు" కోరకనే దండ ధరుడు

వ॥ "అప్రతి వారం బైన దండంబు విధి యుక్తంబుగా
నిచ్చెను" (338)

వరుణ దేవుడు "అర్జును"నికి

కం॥ "ఘోరార్మిదారుణము లగు
వారుణ పాశంబు" లిచ్చెను (339)

కుబేరుడు "అర్జును" నికి

కం॥ "........................ కౌ
బేరాస్త్ర మిచ్చెను" (339)

3.2.12. కార్తవీర్యార్జునకు వాయుదేవుని యుద్బోధ

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వము పంచమాశ్వాసములో (338-355) గలదు. వరమును పొందిన వాడు కార్తవీర్యార్జును డను రాజు. వర ప్రదాత వాయు దేవుడు.

కార్తవీర్యార్జునుడు సహస్ర బాహుడు. అతడు సప్త ద్వీపముల నేలుచు నద్భుత బల పరాక్రమములతో నతిశయించెను. తనతో సమానమైన వారెవ్వరు నెచ్చటను లేరని గర్వించెను. అప్పుడొక భూతమాకాశము నుండి యతనిని తప్పులు పట్టెను. అందరి కంటె నధికులు బ్రాహ్మణులని పలికి నచ్చ జెప్పెను. కాని యతడు సమ్మతించ లేదు. అతని యహంకార వచనములను విని యా భూతము భయపడి వెళ్ళెను. ఆ సమయమున నాకాశము నుండి వాయు దేవుడా రాజుతక్కు తన యునికిని చెప్పి, బ్రాహ్మణుల వలననే కదా రాజులు ప్రజా రక్షణను చేయుచున్నారనియు, బ్రాహ్మణుల కంటె నధికులు లేరనియు పలికెను. మరియు గౌతమ, అగస్త్య, భృగు, వసిష్ఠ, అత్రి, భార్గవ, చ్యవన మహర్షుల మహిమలను వివరించెను. ఆ మాట

లను వినియు నా రాజు పలుకక యూర కుండెను. అప్పుడు వాయు దేవుని కతని పై దయ కలిగెను. పూర్వము కార్తవీర్యార్జునుడు దత్తాత్రేయునికి చేసిన భక్తి శుశ్రూషలను గుర్తుకు తెచ్చెను. ప్రబోధ మొందిన కార్తవీర్యార్జును డప్పుడు వాయు దేవునితో

కం॥ "నీవనుపు చేసి బ్రదికెద
నేపు నహం కృతియు విడిచి యెల్ల వలన మే
లాపాదించుచు విప్రుల
శ్రీపాదము లాశ్రయించి చెందెద శాంతిన్ (354)

అని పలికెను.

ఆ మాటలను విని వాయుదేవుడు సంతసించి

ఆ.వె॥ "..............................బుద్ధి
గలిగి బ్రదుకు మనుచు గౌరవించి
వీడు కొల్పెను" (355)

3.2.13. వినత వరము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వము ద్వితీయాశ్వాసములో (54-119) గలదు. వరమును పొందినవాడు గరుత్మంతుడు. వర ప్రదాత వినత.

గరుత్మంతుడు తన తల్లి యగు వినతకును, తనకును దాస్యమును తొలగించు కొన దలచెను. అమృతమును తెచ్చి యిచ్చి దాస్యమును తొలగించు కొనుమని సర్పములు చెప్పిన మాటను తల్లికి చెప్పి, "అమృత" హరణార్థము వెళ్ళుదునని మ్రొక్కెను. అందుకు వినత సంతసించి కొడుకును కౌగలించుకొని

చం॥ "అనిలుడు పక్షయుగ్మ మమృతాంశుండు వీ పనలుండు మస్తకం
బినుడు సమస్తదేహమును నెప్పుడు గాచుచు నీ కభీష్టముల్
ఘనముగ జేయు చుండెడు జగన్నుత యున్నతియున్ జయంబు జే
కొను మని యిచ్చె దీవనలు గోరి ఖగేంద్రునకున్ ముదంబునన్" (56)

3.2.14. అంతర్హిత భూతముల, బ్రాహ్మణుల వరము

అంతర్హిత భూతముల వరములు రెండు.

1) అర్జునునకు, 2) ఏకాదులకు

3.2.14.1. అర్జునునకు

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య" పర్వము ప్రథమాశ్వాసములో (282-283) గలదు. వరమును పొందినవాడు అర్జునుడు. వర ప్రదాతలు అంతర్హిత భూతములును, బ్రాహ్మణ ప్రవరులును.

అర్జునుడు పాశుపతాస్త్రము కొఱకు తన వారిని వీడ్కొని చన దలచెను. తన వెంట గాండీవమును, నక్షయ తూణీర యుగళమును తీసికొన దలచెను. అప్పుడు "అంతర్హిత" భూతములును, బ్రాహ్మణ ప్రవరులును "అర్జును"ని చూచి సంతోషించి

సీ॥ "———— పార్థుని మనమున
దలచిన యర్థంబు దడయ కిష్ట
సంసిద్ధి యయ్యెడు సర్వ విఘ్నములును
శాంతి బొందెడు మని సంతసమున
ఆ.వె॥ "బరికిరి" (283)

3.2.14.2. ఏకాదులకు

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము షష్ఠాశ్వాసములో (356-370) గలదు. వరము (ఉపాయము)ను పొందిన వారు "ఏక, ద్వితి, త్రితులను పేర్లు గల మునులు. వర ప్రదాతలు "అశరీర వాణి, ఒక భూతము.

బ్రహ్మ మానస పుత్రులైన ఏక, ద్వితి, త్రితులు హరిని చూడ వలెనని యధిక తపస్సును చేయు చుండిరి. వారు కోరకనే వారికి నశరీర వాణి

సీ॥ "దుగ్ధార్ణవంబునందు విశాల రమణీయ
మగు నొక్క దీవి దెల్పారి యుండు

ఆ.వె॥ నచటి కరుగు డచట నతిసితవర్ణు ల
స్వేదు లింద్రియ ప్రవృత్తి విముఖు
లధిక సురభిదేహు లాహార రహితులు
హరిహరాత్ములైన నరులు గలరు" (365)

కం॥ "వారలకు జూపు నిజతే
జోరూపము విష్ణు డపుడు సూపగ నైనన్
మీరును జూతు రని" (366) తెలిపెను.

వెంటనే వా రచటికి వెళ్ళిరి. వారు "అశరీరవాణి" తెలిపి నటు వంటి మానవుల నచట చూచిరి. వా రచట ని టు న టు తి రు గు చుండిరి. ఒక గొప్ప దివ్య తేజోరూప మచట నుండిన మానవుల ముందు భాగమున కనబడెను. వారందరును కలిసి భక్తి పూర్వక ప్రణామములను చేసి విష్ణుమూర్తిని గొప్పగ స్తుతించిరి. ఏక, ద్వితి, త్రితులు మాత్ర మా వెలుగును చూడలేక పోయిరి. అప్పుడొక భూత మాకాశము నుండి ఏక, ద్వితి, త్రితులు కోరకనే వారికి

కం॥ "ఈ దేవుని గన్నట్టూల
కాదే యిప్పూరుషవరుల గాంచుట మీకున్
ఖేదంబు వఱదు నియమ త
పోదానము లితని జూప బూట వడియెనే" (369)

కం॥ "ఏకాంతిక భక్తి రతి న
నేకము లగు వత్సరముల కివ్విష్ణుని నా
లోకింపంగా దొరకొను
గా కిటు వేగ మీకు గానగ వశవే" (370) అని తెలిపెను.

### 3.2.15. కిరీటికి తుంబుర ప్రభృతుల వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ద్రోణ పర్వము ద్వితీయాశ్వాసములో (85) గలదు. వరమును పొందినవాడు "అర్జునుడు" వరప్రదాతలు తుంబుర ప్రభృతులు.

అభిమన్యుడు పద్మవ్యూహములో గాంధర్వియైన మాయ విద్యను గావించెను. దాని నతడు తన తండ్రియైన అర్జును నుండి పొందెను అర్జునుని కా విద్యను పూర్వము తుంబుర ప్రభృతు లొసంగిరి. ఆ విద్య వలన ననేక రథముల వారు చుట్టు ముట్టి, యనేకాస్త్ర శస్త్రములను ప్రయోగించి నట్లు దుర్యోధన పక్షము భాసించుట యా విద్యా ప్రభావము.

### 3.2.16. శిఖండికి స్థూల కర్ణుని వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగ" పర్వము చతుర్థాశ్వాసములో (375-391) గలదు. వరమును పొందినది శిఖండి. వర ప్రదాత స్థూల కర్ణుడను యక్షుడు.

ద్రుపద, హేమవర్మరాజులిద్దరు వియ్యంకులు. శిఖండి పురుషుడు కాడనియు, ద్రుపదుడు మోసము చేసెననియు హేమవర్మ కోపించెను. ద్రుపదుని మీదికి యుద్ధమునకు తరలెను. ద్రుపదుడు యుద్ధమునకు తన సైన్యమును మాత్రమే పంపెను. ఆ రోజు రాత్రి శిఖండి తనకు మరణము తప్ప మరియొక విధానము లేదని యాలోచించెను. ఎవ్వరికని చెప్పకుండ సమీపమున నున్న నిర్జనమైన యడవికి వెళ్ళెను. అరణ్యములో స్థూలకర్ణుడను యక్షుని సుందర గృహ మున్నదని శిఖండికి తెలియును. కావున నా గృహము లోనికి వెళ్ళి యాత్మహత్యకు పూనుకొనెను. అతని రాకను గుర్తించిన స్థూలకర్ణుడు శిఖండి యాత్మహత్యకు కారణము నడిగెను. శిఖండి విషయము నంతటిని వివరించెను. స్థూలకర్ణునికి శిఖండి మీద దయ కలిగెను. శిఖండి కోరకనే

కం॥ "నా పురుషత్వము గైగొని
వే పోయి దశార్ణవపతికి వెలయించిన మీ
యాపదలు దొలగి చన బొడ
చూపుము పదినాళ్ళయంత సూనృత మొప్పన్" (387)

కం॥ 'అంతపు నంతకు నీ దగు
కాంతారూపంబు నేను గైకొనియెద ని
శ్చింతమున మగుడ జనుముని
యింతికి బురుషత్వ మిచ్చె నెంతయు వేడ్కన్" (388)

తే.గీ॥ "........తాను భామాకృతి చెలిమి దాల్చెను" (389)

పురుషత్వమును బొందిన శిఖండి సంతోషముతో తెల్లవారక మునుపే యింటికి కదలెను.

### 3.2.17. గాలవునకు గరుత్మంతుని వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగ" పర్వము

తృతీయాశ్వాసములో (306-322) గలదు. వరమును పొందిన వాడు గాలవుడను ముని. వర ప్రదాత గరుత్మంతుడు.

గాలవుడు విశ్వామిత్రుని శిష్యుడు. అతడు గురువు కడ విద్య నభ్యసించెను. కాని గురువు దక్షిణ వద్దని చెప్పెను. గాలవుడు బల వంత పెట్టెను. ఒక చెవి మాత్రము నీలము రంగును మిగిలిన శరీర మంతయు తెల్లని రంగును కలిగిన యుత్తమమైన యశ్వము లెన మన్నూటింటిని గురు దక్షిణగ నిమ్మని గురువు నాదేశించెను. గాల వుడు వాని కొఱకు ప్రయత్నించెను. కాని లాభము లేక పోయెను. గాల వునికి బాల్య సఖుడైన గరుత్మంతు డొకనాడు కనబడెను. అతనికి గాలవుడు తన పరిస్థితిని తెలిపెను. మిత్రునికి కలిగిన కష్టమునకు గరుత్మంతుడు దయగల వాడయ్యెను. గాలవుడు కోరకనే యతనికి సహాయమును చేయ దలచెను. అటు వంటి గుఱ్ఱములను వెదకుటకు గాలవుని తన వీపు మీద కూర్చొన బెట్టు కొని మొదట తూర్పు దిక్కు నకు బయలు దేరెను. ప్రతిష్ఠాన పురము నందలి తన మిత్రుడగు యయాతి రాజు దగ్గరకు వెళ్ళి గాలవుని విషయమును చెప్పెను. యయాతి తన దగ్గర నటువంటి గుఱ్ఱములు లేవని చెప్పెను. మరియు తన కూతురగు మాధవిని గాలవునికి నిచ్చెద ననియు, నామె కొఱ కు నేరాజైన నటువంటి గుఱ్ఱముల నిచ్చు ననియు చెప్పెను. ఆమెను గాలవునికి నిచ్చెను. పిమ్మట గరుత్మంతు డా యిద్దరిని వెంట బెట్టు కొని అయోధ్యకు వెళ్ళెను. ఇక్ష్వాక రాజునకు గాలవుని విషయమును చెప్పి యా మాధవిని తీసికొని, యటువంటి గుఱ్ఱముల నిమ్మని యడి గెను. ఆ రాజు తన దగ్గర రెండు వందల గుఱ్ఱములు మాత్రమే యున్నవని చెప్పెను. అప్పుడు మాధవి తా నొక మహాను భావుని వలన వరమును పొందితి ననియు, తా నొకని భార్యనైనను నా వర

వ్రిభావము వలన కన్యనే యగుదు ననియు, కావున తన నీ రాజున కిచ్చి యా రెండు వందల గుఱ్ఱములను పొందు మనియు చెప్పెను. ఇక్ష్వాకుడు తనకు నామె వలన నొక పుత్రుడు పుట్టునంత వరకు నామె నుంచుకొని మరల నప్పగింతునని సమయమును చేసెను. మాధవిని పొంది రెండు వందల గుఱ్ఱముల నిచ్చెను. ఆ విధముగనే మాధవిని గుఱ్ఱములున్న రాజున కిచ్చి మిగిలిన గుఱ్ఱములను పొందుమని గరుత్మంతుడు గాలవునికి చెప్పి వెళ్ళెను. తరువాత గాలవు డా విధముగ వెదకుచు భోజపురాధీశు డయిన దివోదాసునికి, పిమ్మట కాశి రాజునకును మాధవి నిచ్చి యొక్కొక్కరి దగ్గర "ఇన్నూరు" గుఱ్ఱములను పొందెను. ఇక తక్కువైన రెండు వందల గుఱ్ఱముల కొఱకు గాలవుడు మాధవిని వెంట బెట్టుకొని తిరుగు చుండెను. గరుత్మంతుడు మరల గాలవుని దగ్గరకు వచ్చి జాలి పడెను. ఆ విశ్వామిత్రునికే మాధవి నిచ్చి తక్కువైన రెండు వందల గుఱ్ఱములను పొందుట మంచిదని గాలవునికి సలహా నిచ్చెను. గరుత్మంతు డా యిద్దరిని విశ్వామిత్రుని దగ్గరకు పిలిచికొని వెళ్ళెను. గుఱ్ఱముల కొఱకు గాలవుడును, తాను పడిన కష్టమును వివరించెను. గాలవుని వట్ల కరుణను చూపుమని కోరెను.

3.2.18. నలునకు కర్కోటకుని వరము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆరణ్య"పర్వము ద్వితీయాశ్వాసములో (123-130) గలదు. వరమును పొందిన వాడు నలుడను రాజు. వర ప్రదాత కర్కోటకుడను సర్పదేవత.

నలుడు జూదమున నోడి యడవి పాలయ్యెను. రాత్రి వేళ నిదురపోవు చుండిన తన భార్య వస్త్రములో సగ భాగమును చింపు

కొని ధరించి కదలెను. ఒక చోట "అగ్ని" నాలుగు దిక్కుల నుండి విజృంభించినది. ఆకాశము నంటు చున్నట్లు చెట్లను కాల్చసాగినది. మంటల నుండి "నరనాథా! నన్ను గారవమున గావవే" రమ్మను నార్త నాదము వినిపించినది. దయార్ద్ర హృదయుడైన నలుడు వెంటనే యనుమానించక మంట వైపు కదలెను. అచట దీనాననుడైన యొక నాగ కుమారుని చూచెను. ఆ నాగ కుమారుడు కృతాంజలియై తన పేరు కర్కోటకు డనియు, కర్మ వరమున నొక బ్రహ్మర్షి శాపము వలన కదలలేకున్నా ననియు, నలు వైపులనుండి మంటలు చుట్టుముట్టు చున్న వనియు తన్ను సరోవరతీరముకడ చేర్చుమని ప్రార్థించినది. పైగా తనను రక్షించిన నలునికి ప్రియమును చేయుదునని తెలిపెను. అందుకు నలుడు సమ్మతించెను. కర్కోటకు డంగుష్ఠ ప్రమాణ దేహుడయ్యెను. నలు డతని నెత్తికొని యొక సరోవర సమీపమున విడుచుటకు సిద్ధ పడెను. అపుడు

వ॥ "ఇంకను బది యడుగు లరుగుము నీకు శ్రేయః ప్రాప్తి జేసెద" (128) నని కర్కోటకు డడిగెను.

నలుడు లెక్క పెట్టుకొని పదవ యడుగును వేయునపు డతనిని కర్కోటకుడు కఱచెను. వెంటనే నలుని రూపము వికృతముగ మారెను అప్పుడు కర్కోటకుడు నిజ రూపమును చూపెను. నలుడు కోరకనే నలునితో

వ॥ "అయ్యా! నీవు నాచేత విష పీడితుండ వైతినని దుఃఖింప వలదు నిన్నెరు లెఱింగిన నెగ్గగుం గావున వికృత శరీరుం జేసితి నెంత కాలము నీ శరీరంబున నా విషం బుండు నంత కాలంబును నీకు విషోరగ రాక్షస పిశాచ శత్రు నివహంబు

వలని భయంబు లేదు. సర్వసంగ్రామ జయంబును భార్యా
సంగమంబును సెప్పటి రాజ్య విభవంబును నగు నీ కెప్పు డేని
నిజ రూపంబు సేకొన నిష్టం బయ్యె నవ్వుడ నన్నుం దలంపు
మీ వస్త్రంబు నీయొద్దకు వచ్చు దాని ధరియించుడు నిజరూప
ప్రాప్తి యగు నని వరం బిచ్చి వెండియు నిట్లనియె" (128)
అశ్వ హృదయ మిచ్చి ఋతుపర్ణుని "అక్ష విద్య" పడయుమని సలహా
నొసగెను. మఱియు

వ॥ "బాహుకుం డను నామంబుతో సూతవృత్తి నుండు మని
హితోపదేశంబు సేసి కర్కోటకుం డదృశ్యుం డయ్యెను" (130)

3.2.19. సతీ సావిత్రికి దేవర్షి (నారద) వరము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య" పర్వము
సప్తమాశ్వాసములో (174-186) గలదు. వరమును పొందినది సావిత్రి.
వర ప్రదాత నారద మహర్షి.

అశ్వపతి మద్రదేశపు రాజు. అతని యేకైక సంతానము
సావిత్రి. ఆమె వివాహ వయస్సునకు వచ్చినది. ఒకనాడు నారద
మహర్షి "అశ్వపతి" యింటికి వెళ్ళెను. సావిత్రిని చూచెను. ఆమెకు
వివాహము చేయకుండుటకు కారణమును రాజు నడిగెను. సావిత్రి
రూప గుణ ప్రవర్తలకు తగిన వరుడు లభించ లేదని రాజు చెప్పెను.
నచ్చిన వరు డున్నచో చెప్పుమని రాజు సావిత్రి నడిగెను. సమా
ధానముగ నామె సాళ్వ దేశపు రాజైన ద్యుమత్సేనుడు గ్రుడ్డివాడై
రాజ్యమును కోల్పోయి యడవిలో నున్నాడనియు, నతని పుత్రుడైన
సత్యవంతునే వివాహ మాడుదునని చెప్పెను. ఆ సత్యవంతుని
గురించి తెలుపుమని రాజు మహర్షి నడిగెను. సత్యవంతుడే తగిన
వాడే కాని యాయువు మాత్ర మింక నొక సంవత్సర మున్నదని

మహర్షి తెలిపెను. మరియొక వరుని వివాహమాడుమని రాజు కూతు రికి తెలిపెను. కాని యామె వినలేదు. అప్పుడు మహర్షి యామె చెప్పినట్లు చేయుమని చెప్పెను. మరియు నతడును సావిత్రియును కోరకనే నామె

చం॥ "......................చేసిన పుణ్య గారవం
బున నయినం బ్రియుండు పరిపూర్ణ చిరాయు పేతు
డయ్యెడున్" (185)

అని పలికెను.

### 3.2.20. మహర్షుల, మునుల, ఆచార్యుల, బ్రాహ్మణుల వరములు

వీ రిచ్చిన వరములను ప్రధానముగా 13 విధములుగా విభజించ వచ్చును.

1. కపిల మహా ముని, 2. దుర్వాస మహర్షి, 3. అగస్త్య మహర్షి, 4. వసిష్ఠ మహర్షి, 5. మార్కండేయ మహాముని, 6. బకదాల్భ్య మహాముని, 7. కృష్ణద్వైపాయన మహాముని, 8. భార్గవ చ్యవనుని, 9. దధీచి, 10. గౌతమ మహాముని, 11. దేవశర్మ, 12. కృపాచార్యుని, 13. బ్రాహ్మణుల వరములు.

### 3.2.20.1. అంశుమంతునికి కపిల మహాముని వరము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య" పర్వము తృతీయాశ్వాసములో (68-71) గలదు. వరమును పొందిన వాడు సగర చక్రవర్తి మనుమడైన "అంశుమంతుడు". వరప్రదాత కపిల మహాముని.

సగర చక్రవర్తికి వైదర్భి (సుమతి), శైబ్య (కేశిని)లు భార్యలు. శివుని వరము వలన వైదర్భికి అరువది వేల మంది పుత్రులు, శైబ్యకు

నొక్క పుత్రుడు కలిగిరి. తరువాత సగర చక్రవర్తి "అశ్వమేధ" యాగమును చేయ దలచెను. ఆ యశ్వరక్షణార్థమతడు తన మొదటి భార్య సుతుల నందరిని పంపెను. వారు కపిల మహాముని కోపాగ్నికి భస్మమైరి. నారదు డా విషయమును సగరునికి చెప్పెను. పిమ్మట సగరుడు శైబ్య పుత్రుని పుత్రుడైన "అంశుమంతు"ని కా విషయ మును చెప్పి గుఱ్ఱమును తీసికొని రమ్మనెను. వెంటనే "అంశుమం తుడు" సగర పుత్రులు వెళ్ళిన మార్గము ననుసరించి వెళ్ళి కపిల మహా ముని యాశ్రమమును చేరెను. సహస్ర సూర్య ద్యుతియై వెలుగు చుండిన కపిల మహామునికి నమస్కరించెను. తాను వచ్చిన విషయ మును విన్నవించెను. కపిల మహాముని "అంశుమంతు"ని వినయ, భయ, భక్తి, యుక్తి విశేషములకు పరమానంద హృదయు డయ్యెను. దయ గలిగి యాగాశ్వము నిచ్చెను. మరియు అంశుమంతుడు కోరకనే

కం॥ "ఘన భుజ నీ కారణమున
జన గాంతురు పుణ్యగతికి సొగరులు ముదం
బున సగరునకు దొరుకును
నొనరగ సుత వంతు లైన యుత్తముల గతుల్" (70)

వ॥ "మఱియు నీచేత నుపనీతం బైన యీ యశ్వంబున నశ్వమే ధంబు సేసి సగరుండు కృతార్థుం డగు నీపౌత్రుం డైన భగీరథు చేత తేర బడియెడు గంగా జలౌఘంబులం జేసి సగర సుతులు స్వర్గగతు లగుదురు సముద్రంబు సంపూర్ణం బగు నని" (71) పలికెను.

3.2.20.2. దుర్వాస మహర్షి వరములు

దుర్వాస మహర్షి యిచ్చిన వరములు రెండు. ఇవి.

1) రుక్మిణీ శ్రీకృష్ణులకు, 2) కుంతికి.

### 3.2.20.2.1. రుక్మిణీ శ్రీకృష్ణులకు దుర్వాస వరములు

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వము పంచమాశ్వాసములో (371-381) గలదు. వరములను పొందిన వారు రుక్మిణీ శ్రీకృష్ణులు. వరప్రదాత దుర్వాస మహర్షి.

స్వతంత్ర ప్రవర్తనుడగు దుర్వాస మహర్షి యొకనాడు శ్రీకృష్ణుని మందిరమునకు వెళ్ళెను. తన కిష్టము వచ్చినట్లు ప్రవర్తించుచు కొన్ని రోజులు గడిపెను. ఒకనాడు పాయసమును పెట్టించుమని శ్రీకృష్ణుని నడిగెను. శ్రీకృష్ణుడు వెంటనే పాయసమును సిద్ధము చేసెను. ఆ మహర్షి యా పాయసములో కొంత భాగమును సేవించి కొంత తన శరీరమునకు పూయుమని శ్రీకృష్ణుని నాదేశించెను. అతడట్లు చేసెను. అప్పు డా మహర్షి సమీపమున నున్న రుక్మిణీ దేవిని చూచి యామె శరీరమునకు కొంత పాయసమును పూసెను. ఆమెను రథమునకు పూన్చి తాను రథము నధిరోహించి రథమును లాగుమనెను. ఆమె రథమును వీధి లోనికి లాగెను. అప్పు డా మహర్షి "ములుగోల" చేత నామెను పొడువ సాగెను. అట్టి వేళ శ్రీకృష్ణునికి, కోపమును నీర్ష్యయును కూడ కలుగ లేదు. అతడు రథము వెంట నడచు చుండెను. యాదవు లా దృశ్యమును చూచి కిమ్మన కుండిరి. రుక్మిణీదేవి రథమును లాగిన యలసటతో కింద పడినది. ఆ మహర్షి రథము నుండి దిగి దక్షిణ దిక్కు వైపు వెళ్ళెను. శ్రీకృష్ణు డతనిని ప్రార్థించుచు ననుసరించెను. అప్పు డా మహర్షి సంతసించి వెనుదిరిగి వచ్చెను. శ్రీకృష్ణునితో "మిమ్ములను కష్టపెట్టితిని కదా!" అని చెప్పెను. దయా గుణముతో శ్రీకృష్ణుని చూచి

వ॥ "నన్నుం గనుంగొని నీవు కోపంబు జయించితివి నీకు వరం బిచ్చెద గైకొనుము" (374) అని పలికి యతడు కోరకనే

ఆ.వె॥ 'ఎల్లవారు దమకు నెంత గూర్తురు నీకు
నంత గూర్చి నిన్ననుసరించు
వారుగాక లోక వంద్యుండవై యెందు
మాఱు లేక యతుల మహిమ మనుము" (375)

అని నిర్దేశించెను. పిమ్మట రుక్మిణిని చూచి, యామె కోరకనే

వ॥ "నీవు సౌందర్య సౌభాగ్యంబుల నప్రతిమానవై మాననీయ
త్వంబు నం గృష్ణుని షోడశ సహస్రాంతఃపుర కాంతల కంటె
నెక్కు డగు మని" (379) దీవన నిచ్చెను.

3.2.20.2.2. కుంతికి దుర్వాస వరము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వము పంచమాశ్వాసములోను (17-18) "ఎఱ్ఱన" భారతభాగము "ఆరణ్య" పర్వము సప్తమాశ్వాసములోను (308-324) గలదు. వరమును పొందినది కుంతి. వర ప్రదాత దుర్వాస మహర్షి.

కుంతి, కుంతి భోజుని పెంపుడు కూతురు. ఆమె యింటికి వచ్చిన యనేక విప్రవరులకు నతిథులకు తండ్రి యాజ్ఞ చొప్పున తృప్తిగ శిష్టాన్న దానమును చేయు చుండెను. ఒకనాడు దుర్వాస మహర్షి భోజన వాంఛతో నతిథిగ వచ్చెను. అతనికి సంతుష్టిగ సపర్యలను చేసెను. మహర్షి సంతుష్టుడై యామె కోరకనే

వ॥ "ఈ మంత్రంబున నీ వే వేల్పుల నారాధించి తద్వేల్పులు
నీకోరిన యట్టి పుత్రకుల నిత్తు రని యాపద్ధర్మంబుగా నొక్క
దివ్య మంత్రంబు బ్రసాదించి చనెను." (ఆది-5 ఆ-18).

ఆరణ్య పర్వము సప్తమాశ్వాసములో దుర్వాస మహర్షి కుంతితో

వ॥ "నీ చేసిన యారాధనంబునకు మెచ్చితి నభిమతంబు లిచ్చెద
నడుగు మనెను." అరణ్య-సప్త ఆ (324)

కుంతి యతనికి నమస్కరించుచు నతడు ప్రసన్ను డగుట కంటె తన
కే వరము వలదనెను. అప్పుడామె కోరకనే ఋషి

వ॥ "అర్లోని నిది యొక్క మంత్రంబు గైకొను దీనం జేసి
యెయ్యేని వేల్పు నాహ్వానంబు సేసెద నవ్వేల్పు ననుదెంచి
నీ వశంబున నుండు ననెను" (అరణ్య-సప్త-ఆ 324)

ఆ మాటలకు కుంతి మాఱుమాట లాడుటకు భయపడి

వ॥ "ప్రసాదం బనియె" (324)

అప్పుడు మహర్షి

వ॥ "దాని కమ్మంత్రంబు విధి యుక్తంబుగా నుపదేశించి కుంతి
భోజుని దీవించి నిజేచ్ఛం జనియె" (324)

3.2.20.3. అగస్త్య మహాముని కట్టడి

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వము
పంచమాశ్వాసములో (47-57) గలదు. వరమును పొందిన వారు
రాజులు. వర ప్రదాతలు అగస్త్య మహాముని.

పాండురాజు తన యిద్దరి భార్యలతో కలిసి దిగ్వి
జయ యాత్రకు బయలు దేరెను. క్రమముగా దిగ్విజయమును
చేయుచు హిమాలయ దక్షిణ పార్శ్వ ప్రాంతమునకు వెళ్ళి విహరించు
చుండెను. ఒకనా డతనికి వేటలో నే జంతువును కనబడలేదు. చివ
రకు రతి క్రీడలో నుండిన యిర్లిని, లేడిని చూచి యైదు బాణములతో
వానిని కొట్టెను. వానిలో నొకటి "మైమఱచియున్న మమ్ములను కొట్టుట

తగని పని" అని కోపగించినది. అప్పుడు పాండురాజు శత్రువుల
నైన వదల వచ్చును గాని మృగములను వదల కూడదని తెలిపి

వ॥ "తొల్లి యగస్త్య మహా మునీంద్రుడు మృగ మాంసంబున
నిత్య శ్రాద్ధంబు సేయు చుండి రాజులకు మృగవధ దోషం
బు లేకుండ నిర్మించె" (57) నని చెప్పెను.

3.2.20.4. కల్మషాదునకు వసిష్ఠ మహర్షి వరము

ఈ వృత్తాంతము నన్నయ భారత భాగము "ఆది" పర్వము సప్తమాశ్వాసములో (113-128) గలదు. వరమును పొందిన వాడు కల్మాషపాదుడను రాజు. వర ప్రదాత వసిష్ఠ మహర్షి.

మిత్రసఖు (కల్మాషపాదు) డొక రాజు. అతడు పూర్వ మొక పర్యాయము వసిష్ఠ మహర్షి పెద్ద కొడుకైన శక్తి వలనను, మరియొక పర్యాయ మొక బ్రాహ్మణుని వలనను రాక్షసుడై మనుష్య మాంస భక్షణను శాపముగా పొందెను. దాని ప్రభావము వలన మానుష భావమును విడిచి రాక్షసుడై భార్యయైన మదయంతితో కలిసి యరణ్య ములో తిరుగుచు మనుష్య మాంస భక్షణము చేయ సాగెను. విశ్వా మిత్ర మహర్షిచే ప్రేరేపితుడై వసిష్ఠ మహర్షి నూఱు మంది కొడుకులను క్రమముగా చంపి తినెను. ఒకనాడు శక్తి భార్య "అదృశ్యంతి" రౌద్రాకారమున వచ్చు కల్మాషపాదుని చూచి భయ పడెను. అచ్చ టనే యుండిన వసిష్ఠ మహర్షి భయ పడకు మని యామెకు చెప్పి యా రాక్షసుడు కోరకనే

వ॥ "హుంకారంబున రాక్షసు వారించి వాని పయి మంత్రపూరి
తంబు లైన కమండలు జలంబు లొలికెను" (126)

ఆ మంత్రి పూరితమైన కమండలు జలముతే కల్మాషపాదునికి నయా చిత వరమయ్యెను. కావున పండ్రెండు సంవత్సరములు రాక్షసుడుగా నుండిన కల్మాషపాదుడు వెంటనే

కం॥ "రూపము చెడి యపుడు మనుజ రూపము" (127)

తాల్చెను. శాప విముక్తుడైన కల్మాషపాదుడు వసిష్ఠ మహర్షికి నమ స్కరించి

వ॥ "మునీంద్రా నీ ప్రసాదంబున శాపంబు వలనం బాసి కృతా ర్థుండ నయితి ననెను" (128)

3.2.20.5. పాండవులకు మార్కండేయ మహాముని వరము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆరణ్య" పర్వము ప్రథమాశ్వాసములో (202-205) గలదు. వరమును పొందిన వారు పాండవులు. వరప్రదాత మార్కండేయ మహాముని.

పాండవు లరణ్య వాసమును గడుపుటకు ద్వైత వనమునకు వెళ్ళిరి. కొన్ని రోజుల తరువాత వారి దగ్గరకు మార్కండేయ మహా ముని శిష్యులతో వెళ్ళెను. వా రతనిని గౌరవించిరి. అతడు తాను పూర్వము తండ్రి మాటలను విని భార్యతో కలిసి యడవికి వెళ్ళిన సీతా రాములను చూచితి ననియు, నిప్పుడు సత్య ధర్మ నిత్యుడైన ధర్మజుని జూచితి ననియు, నల, అంబరీష, వైన్య నాభాగులు మొదల లగు పూర్వపు రాజు లధిక ధర్మ సత్య యుక్తితో సకల లోకములను పొంది యదృష్టవంతులై రనియు, పాపిష్ఠుడైన సౌబలుని (శకుని)తో గూడిన దుర్యోధనుని వలె ధర్మమును దప్పిన వా రెవ్వరును లేరనియు పలికి వారు కోరకనే

వ॥ "మీరు ధర్మనిత్యులరు సత్యవ్రతులరు గావున మీ కిష్ట సిద్ధి యగునని" (205) పలికెను.

### 3.2.20.6. బకదాల్భ్య మహాముని వరము

ఈ వృత్తాంతము "నన్నయ" భారతభాగము "అరణ్య" పర్వము ప్రథమాశ్వాసములో (205-207) గలదు. వరమును పొందిన వారు పాండవులు. వర ప్రదాత బకదాల్భ్యుడను మహాముని.

పాండవు లరణ్యవాసమును గడుపుటకు ద్వైతవనమునకు వెళ్ళిరి. కొంత కాలమునకు వారి దగ్గరకు బకదాల్భ్యుడను మహాముని వెళ్ళెను. వా రతనిని గౌరవించిరి. పాండవులతో నుండిన సహస్ర బ్రాహ్మణుల "అగ్నిహోత్రము"లను ముని చూచెను. బ్రాహ్మణులను పోషించు చుండిన పాండవులను మెచ్చుకొనెను. బ్రాహ్మణానుగ్రహముచే త్రొల్లి వైరోచనుడు మొదలగు వా రనేక సంవత్సరము లక్షయ లక్ష్మీ విభవుడై భూమిని రక్షించి రనియు, వాయుదేవునితో గూడిన "అగ్ని దేవు" డరణ్యములను కాల్చునట్లు బ్రాహ్మణుల సహాయుడైన రాజు శత్రు వర్గమును నిశ్శేషముగా చేయుననియు, ప్రజానురాగము లేని వానికి రాజ్యము సుస్థిరముగా నుండదనియు, పలికి వారు కోరకనే

వ॥ "మీరు బ్రాహ్మణ ప్రియులరు ధర్మనిత్యుల రెప్పుడును మీ కభ్యుదయం బగు నని" (207) పలికెను.

### 3.2.20.7. కృష్ణద్వైపాయముని వరములు

కృష్ణద్వైపాయను డిచ్చిన వరములు మూడు. వీటిలో రెండు ధర్మరాజుకు, ఒకటి గాంధారికి.

### 3.2.20.7.1. ధర్మరాజుకు

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య" పర్వము ప్రథమా శ్వాసములో (271-281) గలదు. వరమును పొందినవాడు

ధర్మరాజు. వరప్రదాత కృష్ణద్వైపాయనుడు.

పాండవు లరణ్యవాస కాలము సంవత్సరము గడచినది. ధర్మ రాజు వలననే యరణ్యాజ్ఞాత వాస కష్టములు కలగెనని మొదట ద్రౌపది, పిమ్మట భీముడు తప్పులు పట్టిరి. ధర్మరాజు వారి నను నయించు చుండెను. ఆ సమయమున కృష్ణద్వైపాయను డచటికి వచ్చెను. పాండవు లతనిని గౌరవించిరి, భీష్మ, ద్రోణ, కృపాచా ర్యులను యుద్ధములో గెలుచుట కష్టమని యభిప్రాయపడిన ధర్మ రాజు భావము నణచుటకు తా నిప్పుడు వచ్చినట్లు కృష్ణద్వైపాయ నుడు ధర్మరాజుకు తెలిపెను. అప్పుడు కోరకనే ప్రతి స్మృతి విద్య నుపదేశించెను. ఈ విద్య వలన అర్జునుడు రాణించునని తెలియ జేసెను. ఇంద్ర, యమ, వరుణ, కుబేరాదుల దర్శించు భాగ్యము కలుగునని భవిష్యత్తును తెలిపెను. మరియు ద్వైతవనమున నెక్కువ కాలముండుట మంచిది కాదనియు, మరియొక వనమునకు వెళ్ళుడని ధర్మరాజుకు చెప్పి వెళ్ళెను.

3.2.20.7.2. ధర్మరాజుకు

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ద్రోణ పర్వము పం చమాశ్వాసములో (254-264) గలదు. వరమును పొందినవాడు ధర్మ రాజు. వర ప్రదాత వేద వ్యాసుడు.

ద్రోణాచార్యుని యాధిపత్యమున నాల్గవ నాటి యుద్ధములో ఇంద్రుని యాయుధమైన శక్తిని కర్ణుడు ఘటోత్కచునిపై ప్రయో గించెను. అతడు చనిపోయెను. ఆ విషయమును తెలిసికొనిన ధర్మ రాజు చాల దుఃఖించెను. శ్రీకృష్ణుడు వెళ్ళి ధర్మరాజు నోదార్చెను. హితమును చెప్పి యుద్ధోన్ముఖుని చేసెను. ధర్మరాజు కోపించి కర్ణుని చంపుదునని యుద్ధమునకు కదలెను. ఆ సమయమున వేదవ్యాసుడు ప్రత్యక్ష మయ్యెను. ధర్మరాజు నమస్కరించి గౌరవించెను. వేద

వ్యాసుడు ధర్మరాజును దీవించెను. అర్జునుని చంపుటకే కరుడు "ఇంద్రు"ని నడిగి శక్తిని పొందెననియు, నా విధముగా జరిగినచో సహింప లేమనియు, ఘటోత్కచునికి కాలము సమీపింపగ చనిపోయె ననియు, నిది చాల మేలనియు చెప్పెను. దూషణముతో దిగులు పడక రాజులను తమ్ములను మిత్రులను కూర్చుకొని శత్రుపక్షముతో యుద్ధమును చేసి బలమును చూపుమనియు, కలతను వదలి పెట్టి మనస్సును నిర్మల ధరోత్తముగ నమర్చి ప్రవర్తింపు మనియు, నే వైపు ధర్మమున్న నా వైపు జయము తప్పక కలుగుననియు, ధర్మ రాజుకు హితోపదేశమును చేసెను. మరియు ధర్మరాజు కోరకనే

కం॥ "విను మే నగు దివసంబున
నిను బొందు ననూన మేదినీ రాజ్యశ్రీ
యనుమాన మేమియును లేదు" (264)

అని యాశీర్వదించి ముని వెళ్ళెను.

3.2.20.7.3. గాంధారికి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము స్త్రీ పర్వము ద్వితీయాశ్వాసములో (2) గలదు. వరమును పొందినది గాంధారి. వర ప్రదాత పారాశర మునీంద్రుడు.

భారత యుద్ధము ముగిసినది. పిమ్మట గాంధారీ ధృతరాష్ట్రులు, తమ నూరు మంది కోడండ్రతో, కుంతితో కదలి వెళ్ళిరి. అప్పటికే ద్రౌపదీ సహితమై శ్రీకృష్ణ పాండవులును చేరి యుండిరి. ఆ సమయమున పారాశర మునీంద్రుడును సమరభూమికి చేరుకొనెను. అత నిని పాండవులును, గాంధారీ ధృతరాష్ట్రులను పలుకరించిరి. గాంధారి ద్రౌపదిని నూకడించినది. పిమ్మట పతివ్రతా శిరోమణియు,

మహాభాగయు, సత్యవచనయు నగు గాంధారికి నామె కోరకనే వ్యాసుడు వ్రత భంగము లేని విధముగా దివ్య దృష్టిని ప్రసాదించెను.

3.2.20.8. మీనములకు, బోయలకు, భార్గవ చ్యవనుని వరము

ఈ వృత్తాంతము తిక్కన భారత భాగము "ఆనుశాసనిక" పర్వము ద్వితీయాశ్వాసములో (258-287) గలదు. వరములను పొందిన వారు చేపలును, బోయవారును, నహుషుడను రాజును. వర ప్రదాతలు భార్గవ చ్యవనముని, గవిజాతుడు.

భార్గవ చ్యవనముని గంగా నది యందు తపమును చేయసాగెను. అతని చుట్టును మీదను చేపలు తిరుగాడుచుండెను. వానిమీద కరుణా బుద్ధితో పండ్రెండు సంవత్సరము లుండెను. ఒకనాడు బోయవారు చేపలను పట్టుటకు వెళ్ళి వలలను వేసిరి. ఆ వలకు చ్యవనముని తగులుకొని చేపలతో బాటు పైకి వచ్చెను. తెలియని తప్పుకు క్షమింపుమని నింక నిప్పుడేమి చేయ వలయుననియు బోయలు ప్రార్థించిరి. చేపల మీద గల ప్రేమ, దయా భావములతో ముని బోయల మీద కోపించ లేదు. మరియు నిరంతర సహవాసముతో చేపలతో మమకారము పెరిగెననియు, చేపలతో బాటు తన్ను గూడ వెలకు నమ్ముకొనుడనియు వారికి తెలిపెను. వా రా విషయమును రాజైన నహుషునికి విన్నవించిరి. వెంటనే రాజు ముని కడకు వెళ్ళి సాష్టాంగ నమస్కారమును చేసెను. బోయలు చేసిన యపరాధము నే విధముగా పోగొట్టు కొనువాడననియు యడిగెను. ముని దయ దలచి బోయలు కుల ధర్మము ప్రకారము ప్రవర్తించిరనియు, తన శరీరమునకు తగిన వెలను వారికిమ్మని రాజుకు చెప్పెను. రాజు సంతసించి బోయలకు వేయి మాడల నిమ్మని మంత్రులకు చెప్పెను. అప్పుడు ముని "తగవెఱిఁగి వెల నీయుము"ని రాజుకు చెప్పెను. ముని వాక్యమును సరిగా

నర్థము చేసికొన లేని రాజు పదివేల మాడల నిమ్మనెను. "తగ వెఱిగి వెల నీయు"మను వాక్యమును ముని రెండవ పర్యాయము రాజుకు చెప్పెను. రాజు మూల్యమును పెంచెను. అట్లు ముని యైదు పర్యాయములు చెప్పెను. ఐదు పర్యాయములును రాజు విలువను పెంచుచు చివరకు పూర్తి రాజ్యము నిచ్చెదననెను. మంత్రి వరులతో కలిసి యాలోచించి యుచితమైన మూల్యము నిమ్మని ముని చెప్పెను. రాజు మంత్రులతో కలిసి కొంచెము దూరముగా వెళ్ళి యేమి చేయుటయా? యని యాలోచించు చుండెను. అప్పుడు "గవిజాతు" డను ముని వచ్చెను. విషయమును తెలిసి కొనెను. తానా చ్యవనముని మూల్యమును నిర్ణయించెదనని పలికెను. గోవులకును, బ్రాహ్మణులకును కుల మొక్కటియే యనియు, బ్రహ్మ రెండు తెఱగులుగా నొనర్చెననియు, కావున బ్రాహ్మణునికి వెల "గోవు" అనియు చెప్పెను. రాజు చ్యవనముని కడకు వెళ్ళి, బోయలకు గోవు నిచ్చెదననెను. ముని సమ్మతించెను. రాజు మేలైన గోవును బోయల కిచ్చెను. బోయలు గోవును ముని దగ్గరకు తోలుకొని వెళ్ళి, ప్రార్థించి, యా గోవు నతని కిచ్చిరి. ముని వారిపై ప్రీతి జెందెను. అతనికి చేపల మీద గూడ నపేక్ష కలిగెను. అప్పుడు బోయలు కోరకనే యచట నున్న వారందరు విను నట్లు

తే.గీ॥ "మీరు మీలును సమ్మోద మార దివికి
 నేగు డని పల్కె" (282)

వెంటనే యందరును చూచు చుండగ చేపలును బోయలును శరీరములతో బాటు స్వర్గలోకమునకు వెళ్ళిరి. అప్పుడు మును లిద్దరును వరమును కోరుమని రాజుకు తెలిపిరి. రాజు కోరలేదు. రాజు కోరకనే యతని మీద నాదర భావముతో రాజుకు

తే.గీ॥ "........ధర్మ పరత్వంబు వాసవాభ
వైభవము నయ్యెడుమ నీకు వంశపావ
నాత్మ యనిరి" (287).

3.2.20.9. సరస్వతీ నదికి దధీచి వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "శల్య" పర్వము ద్వితీయాశ్వాసములో (202-203) గలదు. వరమును పొందినది సరస్వతీ తరంగిణి. వరప్రదాత దధీచి ముని.

పూర్వము దధీచి ముని సరస్వతీ నది సమీపమున చాల నిష్ఠతో నియమముల నాచరించు చుండెను. అందుకు "ఇంద్రుడు" శంకించి విఘ్నమును కలిగింప "అలంబస" అను "అప్సరస"ను పంపెను. ఆమెను చూడగనే మునికి వీర్య స్ఖలనము జరిగెను. ఆ వీర్యమును వృథాగా పోనీయకుండ సరస్వతీ నది తన గర్భములో ధరించెను. పిమ్మట పుత్రుని గాంచెను. మునుల గోష్ఠిలో నున్న యా దధీచి దగ్గరకు సపుత్రియైన సరస్వతి వచ్చినది. జరిగిన పూర్వపు విషయమును తెలిపి యా బాలుని స్వీకరింపుమని చెప్పినది. దధీచి యా బాలుని నెత్తుకొనెను. ఆమె కోరకనే

వ॥ "నీ జలంబులం దర్పణంబు సేసిన విశ్వేదేవతలు పితరులు గంధర్వులు దృప్తు లౌదు రని యనుగ్రహించి యిక్కుమారుండు నీపేర సారస్వతుం డనం బరగు బదంపడి పండ్రెండేం డ్లనావృష్టి యైన నయ్యాపద బొందకుండ నెక్కండ్రడు మునుల రక్షించి వేదాధ్యయనములు చేయించు నని" (203) పలికెను.

సరస్వతి ప్రీతియై తనయుంగొని చనియె.

3.2.20.10. గౌతమ మహాముని వరములు

ఇత డిచ్చిన వరములు రెండు. 1) శిష్యులకు, 2) ఉదంకునికి.

3.2.20.10.1. శిష్యులకు గురు వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అశ్వమేధ"పర్వము తృతీయాశ్వాసములో (72) గలదు. వరమును పొందినవారు శిష్యులు. వరప్రదాత గౌతమ మహాముని.

గౌతమ మహాముని శిష్యుల చేత శుశ్రూషను చేయించుకొనుచు చాల కాలము గడపెను. తరువాత నతడు వారు కోరకనే

సీ॥ "...........శిష్యసమితి కెల్ల
వివిధ వరము లిచ్చి వీడ్కొల్పి పుచ్చెను" (72).

3.2.20.10.2. ఉదంకునకు గౌతమముని వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అశ్వమేధ" పర్వము తృతీయాశ్వాసములో (72-81) గలదు. వరమును పొందిన వాడు ఉదంకుడను ముని. వరప్రదాత గౌతమ ఋషి.

గౌతమ ఋషి దగ్గర చాల మంది శిష్యులుండిరి. వారు చాల కాలము శుశ్రూషను సేసిరి. గౌతముడు ఉదంకునికి తప్ప మిగిలిన వారికి వివిధ వరముల నిచ్చి పంపెను. అయినను ఉదంకుడు శుశ్రూషను కొనసాగించు చుండెను. అత డొకనాడు కట్టెల కొఱకు నడవికి వెళ్ళెను. అడవి నుండి మోపును తల మీద మోసికొని వచ్చి గురువు నాశ్రమమున క్రింద వేసెను. అప్పు డొక కట్టెకు నతని తలలోని యొక జడ తగులుకొని క్రింద బడెను. అది ముసలితనముచే నెఱసిన

వెంట్రుకల జడ. ఉదంకుడు దానిని చూచి తనకు ముసలితనము వచ్చినదని చాల బాధ పడెను. గౌతము డా దృశ్యమును చూచి ఉదంకుని "కన్నీటిని" క్రింద బడకుండ దోసిలితో పట్టుమని తన కూతురికి చెప్పెను. ఆమె పరుగెత్తుకొని వెళ్ళి యట్లు చేసెను. కాని యా కన్నీటి వేడిమికి తాళలేక క్రిందకు వదలెను. అపుడచటి భూమి చలించెను. గౌతముడు ఉదంకుని తన దగ్గరకు పిలిచి బాధకు కారణము నడిగెను. వెళ్ళి పోయిన శిష్యుల పట్ల నున్నట్లూ తన మీద గురువు గారికి దయ కలుగక పోవుటయే యని చెప్పెను. ఆ మాటలను విని గౌతమునికి ఉదంకునిపై దయ కలిగెను. ఉదంకుడు కోరకనే యతనితో

కం॥ "ఎలప్రాయ మిచ్చితిని నీ
కలఘుమతీ యిచ్చెదను మదాత్మజ నుల్లం
బలరగ బెండిలి గమ్మని" (76) చెప్పెను.

మరియు ఉదంకుడు యౌవ్వనమును పొంది గౌతముని కుమార్తెను వివాహ మాడెను.

3.2.20.11. శిష్యుడగు విపులునికి దేవశర్మ ముని వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వము ద్వితీయాశ్వాసములో (182-206) గలదు. వరమును పొందిన వాడు విపులుడు. వర ప్రదాత యతని గురువగు దేవశర్మ.

దేవశర్మ యను పేరు గల ముని భార్య పేరు రుచి. ఆమె చాల యందగత్తె. ఆమెతో సంభోగించ వలెనని ఇంద్రుడు చాల పర్యాయములు ప్రయత్నించెను. కాని దేవశర్మ తన భార్యకు తగు రక్షణను చేయు చుండెను. ఒకనాడు దేవశర్మ వేరొకచోట క్రతువును చేయుటకు

వెళ్ళ దలచెను. తన శిష్యుడగు విపులునికి ఇంద్రుని ప్రయత్నమును తెలిపి తన భార్యకు రక్షణగా నుండుమని చెప్పి వెళ్ళెను. విపులుడు రుచి రక్షణార్థ మామెతో కొంత సమయము మాట లాడెను. తరువాత యోగ ప్రావీణ్యముచే నామెకు తెలియకుండ నామెలో ప్రవేశించెను. ఆమె చైతన్యమును జడముగ చేసి యుండెను. తరువాత కొంత సమయమునకు ఇంద్రుడు సుందరాకారుడై వచ్చెను. తన కామెపై గల ప్రేమను తెలిపెను. కాని యామె పలుక లేదు. ఆ మాటలను విని రుచి యందున్న విపులుడు "నీ కిందు రా బని యే" మని యడిగెను. ఇంద్రుడు పరవశమగు నట్లుగ పలికెను. ఇంద్రుని పరవశతను గమనించిన విపులుడు రుచి నుండి వెలుపలకు వచ్చెను. దేవతల నాయకుడవైన ఇంద్రుని కిది తగునా? యనియు తన గురుని కోపాగ్నిచే దేవగణ విభుత్వ మహోన్నతి కాలి పోవుననియు దివ్య బోధనమును చేసెను. ఇంద్రుడా మాటలను విని తప్పు చేసిన వాని వలె వెళ్ళి పోయెను. తరువాత విపులుడు రుచికిని బోధించెను. దేవ శర్మ యజ్ఞమును ముగించి వచ్చెను. అతనికి విపులుడు జరిగిన విష యము నంతటిని తెలిపెను. దేవశర్మ విపులునకు చెడు బుద్ధి లేదని గ్రహించి సంతసించెను. విపులుడు కోరకనే

తే.గీ॥ "అభిమతం బగు వర మిచ్చెను" (205)

తరువాత విపులుడు గొప్పగా తపస్సును చేసెను. దేవశర్మకు దేవేం ద్రుని వలన భయము తప్పినది.

3.2.20.12. కృపాచార్యుని వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము భీష్మ పర్వము ప్రథ మాశ్వాసములో (161) గలదు. వరమును పొందినవాడు ధర్మరాజు. వర ప్రదాత కృపాచార్యుడు.

యుద్ధము ప్రారంభ మగుటకు ముందు యుద్ధ రంగములో భీష్మ ద్రోణాదుల నుండి ధర్మరాజు వరములను పొందెను. పిమ్మట నతడు కృపాచార్యుని కడకు వెళ్ళెను. అతనికి నమస్కరించి యతనిని పరిమార్చు తెఱగు నడుగుటకు నిశ్చయించు కొనెను. కాని మాట లాడ లేకుండెను. ఆ విషయమును గ్రహించిన కృపాచార్యుడు

వ॥ "తాను వధ్యుండు గామి యెఱిగించి గెలువు మని
దీవించెను" (161)

3.2.20 13. భగీరధునకు బ్రాహ్మణుల వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వము చతుర్థాశ్వాసములో (82-85) గలదు. వరమును పొందినవాడు భగీరధుడను రాజు. వర ప్రదాతలు బ్రాహ్మణులు.

ఒక పర్యాయము కొంత మంది బ్రాహ్మణు లొక చోట యజ్ఞమును చేయు చుండిరి. ఆ యజ్ఞమునకు నాటంకములు కలిగెను. అప్పుడు భగీరథుడను రాజు ఆహార పానీయములను వర్జించి బ్రాహ్మణుల యజ్ఞమునకు కలిగిన విఘాతములను తొలగించి యుత్సాహమును కలిగించెను. అందుల కా బ్రాహ్మణులు ముద మందిరి. వారు భగీరధుడు కోరకనే యతనికి

మ॥ "..............................బ్రహ్మపొ
ల వరిష్ఠా వ్యయ సౌఖ్య మొందు మని" (83)

వరము ననుగ్రహించిరి.

3.2.21. రాజుల వరములు

భీష్మునకు శంతనుని వరము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వము

చతుర్థాశ్వాసములో (170-193) గలదు. వరమును పొందినవాడు శాంతనవుడు (గాంగేయుడు). వరప్రదాత శంతనుడు.

శంతనుడు సత్యవతని భార్యగా కోరెను. కాని దాసరాజు పట్టుదలతో తండ్రి బాధ పడుటకు గల కారణమును గాంగేయుడు తెలిసికొనెను. రాజు లనేకులతో కలసి దాసరాజు దగ్గరకు వెళ్ళెను. సత్యవతిని తన తండ్రికిచ్చి వివాహము చేయుమని యడిగెను. 1) రాజ్య పరిత్యాగమును, 2) బ్రహ్మచర్య వ్రత పరిగ్రహణమును గురించి రెండు ప్రతిజ్ఞలను శాంతనవుడు చేసెను. అందుకు దేవర్షి గణము మెచ్చి దేవవ్రతునిపై పూల వాసను కురిపించి "భీష్ము" డని పొగడిరి. శాంతనవుడు సత్యవతిని తీసికొని వచ్చి తండ్రికి వివాహమును చేసెను. అందుకు శంతను డతిమానుషం బయిన యా భీష్మ సత్య వ్రతమునకు సంతసిల్లెను. భీష్ముడు కోరకనే

వ॥ "ఆతనికి స్వచ్ఛంద మరణంబుగా వరం" (193) బిచ్చెను.

3.2.22. మంత్రుల వరము

పాండవులకు విదురుని వరము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము సభా పర్వము ద్వితీయాశ్వాసములో (280-283) గలదు. వరమును పొందిన వారు పాండవులు. వర ప్రదాత విదురుడు.

అరణ్యవాసమునకు బయలుదేరినపాండవులు భీష్మ, ధృతరాష్ట్ర, విదుర, కృప, ద్రోణాచార్యులకు చెప్పి వెళ్ళుటకు వచ్చిరి. అప్పుడు విదురుడు తన యింటిలో కుంతిని నుంచుకొని గౌరవముతో చూతుననియు, మంచి గుణములను గలిగిన పాండవుల నోర్వలేని యితరులు భేదింప లేరనియు, కృష్ణద్వైపాయనునిచే జ్ఞానమును పొంది, నారద

నిచే రక్షింపబడిన పాండవులకు పురోహితుడుగా ధౌమ్యుడుండుటచే వారు దైవ మానుష సంపన్నులైరనియు, వారు బల పరాక్రమము లచే రాజులను, ధర్మ చరితముచే ఋషులను, మహత్త్వముచే కుబేర వాసవాదులను జయించిన వారని పలికి

వ॥ "మిమ్ము భూమియు గాడ్పును జంద్రాదిత్యులు నెల్ల కాలము రక్షించు చుండెడ" (283) రని దీవించెను.

3.2.23. రాజ వంశపు స్త్రీల వరము

వీ రిచ్చిన వరములు "ఐదు" ఇవి. 1) బ్రాహ్మణ కుటుంబము నకు కుంతి వరము 2) పాండవులకు కుంతి వరము 3) ద్రౌపది యాకాంక్ష 4) దమయంతికి చేది దేశపు రాజమాత వరము 5) సావిత్రికి నత్తమామల, బ్రాహ్మణుల వరము

3.2.23.1 కుంతి వరము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది"పర్వము షష్ఠాశ్వాసములో (241-278) గలదు. పక్షము (సహాయము) ను పొందిన వారు బ్రాహ్మణ కుటుంబము. వర ప్రదాత్రి కుంతి.

ఏక చక్రపురములో నొక బ్రాహ్మణుని యింటి భాగములో కుంతి యును నామె యైదుగురు పుత్రులును నివాస ముండిరి. బకాసురునికి నాహారమై వెళ్ళ వలసిన వంతు బ్రాహ్మణుని పాలబడినిది. అప్పు డా యింటి వా రొక్క పెట్టున నేడ్చిరి. అప్పుడు ప్రక్క భాగములో కుంతియు భీముడు మాత్రమే యుండిరి. మిగిలిన నల్గురును భిక్షకు వెళ్ళి యుండిరి. బ్రాహ్మణునకు నేదేని యుపాయమును చేయుద మని కుంతి భీమునకు తెలిపెను. కుంతి వెళ్ళి విషయమును తెలిసి కొనెను. ఆ బ్రాహ్మణుడు కోరకనే కుంతి తన కున్న యైదుగురు

పుత్రులలో నొకనిని బకుని కాహారముగా పంపుదునని తెలిపెను. అతిథుల, నభ్యాగతులను, శరణాగతులను తన స్వార్థము కొఱకు చంపుట (లేక) చంపించుట పాప మనియు చెప్పి కుంతి సహాయము నిరాకరించెను. విప్రవధను సహించుట కంటె బకుని కాహారముగా పోవుట పాపము కాదనియు నదియును గాక తన కొడుకును చంపుట రాక్షసునికి వశము కాదనియు చెప్పెను. అంతియగాక పూర్వము తన కుమారు డెందరో రాక్షసులను మట్టుపెట్టెనని, తెలిపి బ్రాహ్మణుని సమ్మతింప జేసెను. అపై భీముని పిలిచి

వ॥ "బ్రాహ్మణు నాపదం దలంగి నాకు మనః ప్రియంబు సేయుమని" (278) ఆదేశించెను.

అతడు "వల్లె" యని కదలెను.

3.2.23.2. పాండవులకు కుంతి వరము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "సభా" పర్వము ద్వితీయాశ్వాసములో (283-292) గలదు. వరమును పొందిన వారు ద్రౌపదీ పాండవులు. వర ప్రదాత కుంతి.

అరణ్యవాసమునకు బయలుదేరిన పాండవులు విదురుని దీవనను పొందిరి. పిమ్మట వారు తల్లియైన కుంతి పాదములకు నమస్కరించిరి. అప్పు డామె వారు ధరించిన నార చీరలను చూచి చాల దుఃఖించెను. వారి కష్టములను తొలగించ లేదని శ్రీకృష్ణు నుద్దేశించి పలికెను. ధార్తరాష్ట్రుల వలన నిట్లు జరిగినదని విలపించెను. పిమ్మట సహదేవుని నడవులకు వెళ్ళవలదని యడిగెను. ద్రౌపదిని చూచి భర్తల వెంట నడవులకు వెళ్ళుచున్న యామె పుణ్యమునకు మెచ్చుకొని యామెను కౌగలించుకొని

వ॥ "కోడలిం గొడుకులను దీవించెను" (292)

### 3.2.23.3. ద్రౌపది ఆకాంక్ష

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య" పర్వము ప్రథమాశ్వాసములో (282-286) గలదు. వరమును పొందిన వాడు అర్జునుడు. వర ప్రదాత ద్రౌపది.

అర్జునుడు పాశుపతాస్త్రము కొఱకు తన వారిని వీడ్కొని చన దలచెను. అప్పుడు పాంచాలి "అర్జును"ని దగ్గరకు వచ్చి, యవమానము సహించలేని యీ క్షత్రియ కులములో కంటె తరువాత జన్మములో నవమానమును సహించ గల బ్రాహ్మణ కులములో తనకు జన్మము కలుగుననియు, శత్రువులచే చేయబడిన యవమానమనెడు మహా సముద్రములో మునిగిన తమ నందరిని సముద్ధరింపు మని "అర్జును"నితో పలికి

చం॥ "...............జగన్నుత యన్యులు పూన గాని యీ
భరము వహింప బూనిన యపార గుణాన్వితు నిన్ను దిక్కు
లున్
ధరణియు సోముఁడున్ నభము ధాత్రియు గాడ్పును గాచు
చుండెడున్ (285)

అని పలికెను.

### 3.2.23.4. చేది దేశపు రాజమాత వరము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య"పర్వము ద్వితీయాశ్వాసములో (108-121) గలదు. వరమును పొందినది దమయంతి. వర ప్రదాత చేది దేశపు రాజమాత.

నలునిచే పరిత్యజింపబడి దమయంతి యేకాకియయ్యెను. ఆమెకు కాననములో వ్యాపారులును బ్రాహ్మణులును కలిసి వెళ్ళు సమూహము

కనబడెను. వారు చేది దేశపు రాజధానియైన సుబాహు పురమునకు వెళ్ళు చుండిరి. వారి వెంట కదలి దమయంతి సుబాహు పురపు వీధు లలో నడచు చుండెను. అప్పుడు రాజమాత యంతఃపురము నుండి ధూళి ధూసరితయై చెదరిన జుట్టును గలిగి యేక వస్త్రయైన దమ యంతి యందమునకు నాశ్చర్య పడెను. తన దాసిచేత దమయంతిని నంతఃపురమునకు పిలిపించెను. రాజమాత యడిగిన ప్రశ్నలకు దమయంతి తన పేరును తన భర్త పేరును చెప్పకుండ తన భర్త గొప్పదనమును,జూదములో నతని యోటమిని గురించి చెప్పెను. తాను సైరంధ్రీ వృత్తిని చేపట్టి యడవిలో నతనిని వెదకితినని తెలిపి తల వంచుకొని యేడ్చెను. అప్పుడు దమయంతి కోరకనే రాజమాత దమయంతిని

కం॥ "నీ వుండుము నాకడ నిం
దీవరదళనేత్ర నీపతి రోయగ భూ
దేవోత్తములం బంచెద" (120) నని పలికెను.

తనకు నయాచితముగ నాశ్రయము లభించినను దమయంతి వెంటనే సమ్మతించ లేదు. సైరంధ్రి ప్రవర్తనకు కొంచెము భిన్నముగా నుండు నట్లు తా నుచ్ఛిష్టమును ముట్టననియు తన భర్తను వెదక బోవు బ్రాహ్మణులతో తప్ప నితర పురుషులతో మాట్లాడ ననియు నట్లైన నుండుదుననియు తెలిపెను. అందుకు రాజమాత దమయంతితో

వ॥ "నీ కిష్టం బైన విధంబున నాయొద్దన నుండు" (121) మని సమ్మతిని తెలియ జేసెను. అతి గౌరవముతో దమయంతిని చూడ రాజమాత తన కూతురగు సునంద నాదేశించెను.

### 3.2.23.5. సావిత్రికి నత్తమామల బ్రాహ్మణుల వరము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య" పర్వము

సప్తమాశ్వాసములో (199-204) గలదు. వరమును పొందినది సావిత్రి. వరప్రదాత లామె యత్తమామలును, బ్రాహ్మణులును.

సావిత్రి తన భర్తకు నింక నాలుగు దినములే యాయువున్న దని యాలోచించెను. కడు నిష్ఠతో త్రిరాత్రోపవాస వ్రతమును చేయ బూనెను. దానికి కారణము నామె మామ యడిగెను. తరువాత తెలిసికొందురని యామె సమాధానము నిచ్చెను. ఆమె వ్రతమును పూర్తి చేసెను. నాల్గవ దినము తెల్లవారు జాముననే మేల్కొనెను. శుచిగ పతికి నిష్టముతో పరిచర్యలను చేసి, యత్తమామలకును, నచటి విప్రులకును వేర్వేరుగా ప్రణమిల్లెను. అప్పుడు సంతోషముతో వారు

తే.గీ|| "తనకు సౌభాగ్య భాగ్య వర్ధనము గాగ
నిచ్చు దీవెన మదిలో గ్రహించి యుండెను" (204)

3.2.24. సైన్య వరము

అర్జునునకు దుర్యోధనుని సైన్య వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ద్రోణ పర్వము పంచమాశ్వాసములో (267-271) గలదు. వరమును పొందిన వాడు అర్జునుడు. వరప్రదాతలు దుర్యోధనుని సైన్యము.

ద్రోణుని యాధిపత్యమున నాల్గవ నాడు యుద్ధము రాత్రియందు కూడ జరుగుచుండెను. కొంత సమయమునకు నిరు పక్షములందలి సైనికులు నిద్రా పరవశత్వముచే సరిగా యుద్ధమును చేయలేకుండిరి. అప్పుడు "అర్జును" డిరు పక్షముల వారి నుద్దేశించి యెలుగెత్తి "నిద్రాభరముచే నలసితిరి. అందరును నలసటను తగ్గించుకొనుడు. చంద్రుడు పుట్టిన తరువాత మరల యుద్ధమును చేయవచ్చు" నని పలికెను. ఆ మాటలను విని పాండవ సైన్యము విశ్రామము నొందెను. కాని దుర్యోధనుని సైన్యము

ఆ.వె॥ "కరుణ గలవు మమ్ము గారవంబున సుభా
న్వితుల జేసి తనకు నీకు సురలు
వరము లెపుడు నిచ్చువాఁడు గాపుత మనో
రథము బొందు మమర రాజ తనయ" (270)

కం॥ "అని యక్కౌరవ సైన్యము
జనములు సంప్రీతి సవ్యసాచికి బలు దీ
వన లిచ్చుచు నాతని గీ
ర్తన సేయుచు నిద్ర నొందెను" (271)

### 3.3. యాచితా యాచిత వరములు

యాచిత మనగా "అడుగుట, ప్రార్థించుట" అని యర్థము. అయాచిత మనగా "అడుగ కుండుట, ప్రార్థించకుండుట" అని యర్థము. యాచితాయాచిత మనగా ప్రార్థించి వరమును పొందిన వారికి ప్రార్థించకనే మరియొక వరము నిచ్చుట యని యర్థము. కోరిన వరము యొక్క స్వభావమును బట్టి గాని, కోరిన వారి ప్రవర్తనను బట్టి గాని వరప్రదాతలు "అయాచిత వరమును" ప్రదానము చేసిరి. ఇట్టివి "ఆంధ్ర మహాభారతము"లో 10 గలవు. ఇవి

1. రావణునికి బ్రహ్మ, 2. ఉదంకునకు పాంచజన్య ధరుని, 3. కిరీటికి శ్రీకృష్ణుని, 4. కుమార సప్తమాతృకలకు కుమారస్వామి, 5. గౌతమ మునికి ఇంద్రుని, 6. కువలాశ్వునికి ఇంద్రాది దేవతల, 7. ధర్మరాజునకు యమధర్మరాజు, 8. ఉదంకునకు పర్జన్యుని, 9. కౌశికునకు పార్వతీదేవి, 10. కుశికునకు చ్యవన ముని వరములు.

### 3.3.1. రావణునకు బ్రహ్మ వరము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య" పర్వము

షష్ఠాశ్వాసములో (276–281) గలదు. యాచితాయాచిత వరమును పొందిన వాడు రావణుడు. వర ప్రదాత బ్రహ్మ.

వైశ్రవణుడు తపశ్శక్తిచే దివ్య వైభవము నందెనని దశముఖుడు తెలిసి కొనెను. కావున నతడు మాత్సర్య బుద్ధి గలవాడై బ్రహ్మనుద్దేశించి హఠయోగము నవలంభించెను. నిశ్చల బుద్ధితో వాయు భక్షుడై తపస్సును చేయుచు వేయేసి సంవత్సరముల కొక తల వంతున నగ్ని యందు వేల్చుచు పదవ తలను ఖండించు కొనుటకు సిద్ధముగా నుండెను. అప్పుడు బ్రహ్మ ప్రత్యక్షమై పదవ తలను ఖండించకుండ నివారించెను. ముందు ఖండించిన తొమ్మిది తలలు పూర్వము వలె నుండు నట్లొసంగి

వ॥ "అమరత్వంబు దక్క నొండు నీ కభిమతం బగు నది
యెయ్యది యైనను నడుగు మని" (279) పలికెను.

అప్పుడు రావణుడు

శా॥ "దేవా యేను సమస్త దేవ పితృ దైతేయాహి గంధర్వ ర
క్షో విద్యాధర యక్షజాతులకు నక్షోభ్యుండగా బ్రీతితో
నీ విశ్వంబున గామరూపగతి నాత్మేచ్ఛా విహారుండ గా
నీవే" (280) అని కోరెను.

బ్రహ్మ వాని కా వరము నిచ్చెను. మరియు రావణుడు కోరకనే

వ॥ "మనుష్య జాతి యొక్కండు దక్క నీ చెప్పిన యందఱ
వలనను నీకు మరణ భయంబు లే దని" (281) వరము
నిచ్చెను.

### 3.3.2. ఉదంకునకు పాంచజన్య ధరుని వరము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య" పర్వము

చతుర్థాశ్వాసములో (374-379) గలదు. యాచితాయాచిత వరమును పొందిన వాడు "ఉదంక" ముని. వరప్రదాత పాంచజన్య ధరుడు.

ఉదంక ముని వ్రత నిష్ఠుడై మరుభూమియందు నిశ్శంకమతితో నివసించు చుండెను. ఎల్లప్పుడును విష్ణుమూర్తిని మనస్సులో నిలిపి యనేక సంవత్సరములు తపస్సును చేసెను. విష్ణుమూర్తి సంతోషించి ప్రత్యక్ష మయ్యెను. ఉదంకుడు నమస్కరించి విష్ణుమూర్తి గొప్ప పనుల ననేక విధముల స్తుతించెను. పాంచజన్య ధరుడు కరుణించి వరము నడుగుమని పలికెను. ఉదంకుడు పాంచజన్య ధరుని దివ్య రూపమును ప్రత్యక్షముగా చూచుట కంటె గొప్పవరము లేదని పలికి

వ॥ "ఐనను నా మనంబు నిత్యంబు సత్యధర్మ శమంబుల యందు దిరంబై నీ యందు దృఢ భక్తికంబు గావలయు నిదియ నాకు వరం బనెను." (379)

ఆ మాటలకు విష్ణుదేవుడు

వ॥ "నీ కోరిన యట్ల యిచ్చితి" (379) నని పలికెను. మరియు ఉదంకుడు కోరకనే

వ॥ "మత్ప్రసాదంబున నీకుం బరమ జ్ఞానయోగంబు సిద్ధించు" (379) నని వరము నిచ్చెను.

3.3.3. కిరీటికి శ్రీకృష్ణుని వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము భీష్మ పర్వము ప్రథమాశ్వాసములో (205-210) గలదు. యాచితాయాచిత వరమును పొందిన వాడు అర్జునుడు. వరప్రదాత శ్రీకృష్ణుడు.

భారత యుద్ధభూమిలో యుద్ధము ప్రారంభము కాక మునుపు "అర్జునుడు" శ్రీకృష్ణుని జ్ఞానోపదేశమును వినెను. సముత్థితుడై జగన్నాథుని (శ్రీకృష్ణుని) తో

మ॥ "అతి గుహ్యం బిది నీవు భూరికృప నీ యధ్యాత్మకముం గాన జే
సితి నా కిమ్మెయి విన్కి గొంత భ్రమ వాసెన్ యోగి హృద్ధ్యేయమై
యతులైశ్వర విభూతి నొప్పు భవదీయం బైన రూపంబు సూ
చుతల పెత్తెడు బోలు నేని దయ జక్షుఃప్రీతి గావింపవే"
(206)

అని కోరెను. శ్రీకృష్ణుడు "అర్జును"ని కోరికని విని యనేక వర్ణము లను గలిగి యనేక విధములుగ నుండు తన రూపమును మామూలు మానవ కన్నులతో చూచుటకు శక్యము కాదనియు, కావున దివ్యదృష్టి నిచ్చుదు ననియు పలికెను. అర్జునుడు కోరకనే

వ॥ "అతనికి దివ్యదృష్టి యొసంగి యోగీశ్వరేశ్వరుం డైన
యా లక్ష్మీశ్వరుండు దన దివ్య రూపంబు సూపెను" (210)

### 3.3.4. కుమార సప్త మాతృకలకు కుమారస్వామి వరము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "ఆరణ్య" పర్వము పంచమాశ్వాసములో (245–252) గలదు. యాచితాయాచిత వర మును పొందిన వారు కుమార సప్తమాతృకలు. వర ప్రదాత కుమార స్వామి.

కుమారస్వామి స్వాహాదేవి కోరికను నెరవేర్చిన వేళ కుమార సప్తమాతృకలతని కడకు వెళ్ళిరి. వారు ముందున్న సప్తమాతృ కల కంటె నెక్కువగా జగత్రియములకు తమ నిప్పుడే మాతలగా నుంచుడనియు, ముందున్న సప్తమాతృకల గౌరవము కంటె నెల్లప్పు డును తమనే సర్వ లోకములు నిష్టముతో కొలుచు నట్లుగ వరము నిమ్మనియు కోరిరి. ఆ మాటలకు కుమారస్వామి నవ్వుచు పూర్వపు సప్తమాతృకల గౌరవమును తగ్గించవలదనియు, మరియొక వరమును

కోరుమని వారికి తెలిపెను. అందుకు కుమార సప్తమాతృకలు గౌరవ ముతో సమ్మతించి

కం॥ "......................ఏ మీ
జగముల గల శిశువులకు నజస్రము బీడల్
దగ నొనరించుచు నీకృప
నెగడెద మివ్వరము మాకు నీ వొసగ దగున్" (248)

అని కోరిరి.

వారి కోరికను వినిన కుమారస్వామి

కం॥ "అక్కట కీడు దలంచితి
రిక్కార్యము దగవే యైన నిచ్చితి మీకున్
ద్రొక్కిన గొల్చిన వేడిన
నక్కటికము తోడ గావు డమ్మ శిశువులన్" (250)

కం॥ "పాయక పది యార్వేడుల
ప్రాయము నందాక నరుల బాధింపుడు మే
రని" (251) పలికెను

మరియు వారు కోరకనే వారికి రక్షకునిగా తన దేహము నుండి కాంచన వర్ణుడైన పురుషుని పుట్టించెను. వానికి "స్కందాపస్మార" మను పేరి డెను.

3.3.5. గౌతమ మునికి ఇంద్రుని వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వ ము చతుర్థాశ్వాసములో (54-79) గలదు. వరమును పొందినవారు గౌతముడను మునియును, నతని పెంపుడు "ఏనుగు"ను. వరప్రదాత ఇంద్రుడు.

గౌతముడను మహాద్విజుడు తపస్సుకై వనమునకు వెళ్ళెను. అచ్చట తల్లి లేని యేనుగు పిల్లను దయతో పుత్రుని వలె పెంచెను. అది పెరిగి పెద్దదై మేటి యేనుగై తిరుగు చుండెను. ఇంద్రుడు గౌతముని పరీక్షింప దలచెను. కావున నా కాలమున రాజ్య పాలనము చేయు ధృతరాష్ట్రుడను రాజు రూపమును ధరించి గౌతముని దగ్గరకు వెళ్ళెను. ఆ యేనుగును తన కిమ్మని యడిచెను. అప్పు డతనిని గౌతముడు రాజుగానే భావించెను. తన కా యేనుగు కట్టెలను తెచ్చి యిచ్చు చున్నదనియు, తానులేని సమయమున తన పర్ణశాలను కాపాడు చున్నదనియు దానిని తన పుత్రుని వలె పెంచితి ననియు కావున రాజునకు సమర్పించ లేనని చెప్పెను. రాజాకారములో నున్న ఇంద్రుడు మునులకు "ఏనుగెం"దు కనియు దీనికి బదులుగా నమూల్య పశు సంపద నిత్తుననియు, నేనుగును తన కిమ్మని మరల నడిగెను. తల్లి లేని చిన్న పిల్ల నుండి దయతో పెంచుటచే దీని మీద ప్రేమ కల్గెను. కావున కోటి యావుల నిచ్చినను దాని నీయనని ముని చెప్పెను. దీనిని వాహనముగా తీసికొన దలచితినని కావున నీయనని చెప్పుట తగునా? యని రా జడిగెను. అందుకు ముని సమ్మతించెను. కాని యమధర్మరాజు సభకు వచ్చి యేనుగును తీసికొనుమని పలికెను. నాస్తికులును, పాపాత్ములును వెళ్ళు నచటికి రానని ఇంద్రుడు సమాధానమును చెప్పెను. ఈ విధముగనే ముని వరుసగ మందాకిని తటమునకు, మేరు వనమునకు, నారదముని విహార స్థలములకు, కురు భూములకు, చంద్రుని గృహమునకు, సూర్యుని సమీపమునకు, వరుణ పురమునకు, ఇంద్రుని సమీపమునకు, ప్రజాపతి లోకమునకు, గోగణ లోకమునకు, బ్రహ్మ లోకమునకు వచ్చి యేనుగును తీసికొనుమని చెప్పెను. రాజాకారములో నున్న ఇంద్రుడు వరుసగ పైన తెలిపిన ప్రతి స్థలమునకు వచ్చుటకు నిరాకరించుచు

నేదియో యొక కారణమునుచెప్పెను. అప్పుడు ముని "నిన్ను నేను ఇంద్రునిగ గ్రహించితిని. ఎల్లలోకము లందు తిరుగు నీకు నెచటనైన కష్టము కలుగదు గదా"! అని యడిగెను. వెంటనే ఇంద్రుడు మునికి మ్రొక్కెను. ఏదైన నిత్తునని వాగ్దానము చేసెను.
ముని వెంటనే స్వాంతనముగ

చం॥ "......................పుత్రు డీ

వనకరి నాకు సాధుజనవత్సల యిమ్ము కరంబు నెమ్మి

ని ననియె" (75)

ఇంద్రు డందుకు సమ్మతించెను. ముని బోధనలకు సంతసించెను.
ఆపై కోరకనే

మ॥ "——————మునీంద్రా రండు నీవున్ భవ

త్తనయుం డీ కరియున్ నితాంతసుఖ నిత్యం బైన నాకంబు నం

దన పాయస్థితి మత్ప్రభుత్వమున బెంపారం బ్రివర్తింపగన్" (78)

అని వరము నిచ్చెను.

అందుకు ముని సంతసించి సమ్మతించెను. ఏనుగుతో కలసి ముని ఇంద్రుని వెంట దేవలోకమునకు వెళ్ళెను.

3.3.6. కువలాశ్వునకు ఇంద్రాది దేవతల వరము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య" పర్వము చతుర్థాశ్వాసములో (379-391, 402-415) గలదు. యాచితాయాచిత వరమును పొందినవాడు కువలాశ్వుడను రాజు. వర ప్రదాతలు ఇంద్రాది దేవతలు.

శ్రీకృష్ణుడు ఉదంకుడను మునికి నడిగిన వరము నిచ్చెను.

మరియు త్రిలోక హితమైన కార్యము నొక దానిని సాధించుమని చెప్పెను. అదే మనగా - దుంధుడను దానవుడు జగములకు నుపద్రవమును కలిగించు చుండెను. వానిని వధించుటకై బృహదశ్వుని నుద్యుక్తునిగా ఉదంక ముని చేయుట, కువలాశ్వుడు విష్ణుమూర్తి ప్రసాద లబ్ధమైన యోగ బలము చేతను, ఉదంకముని వియోగము చేతను నా రాక్షసుని చంప గలుగుట — ఉదంకముని వలన నఖిల లోకములును సంతసిల్లునని శ్రీకృష్ణుడు చెప్పెను. పిమ్మట ఉదంక ముని కువలాశ్వునిని ప్రేరేపించెను. అత డా రాక్షసుని పైకి యుద్ధమునకు బయలు దేరెను. అప్పుడు విష్ణుమూర్తి యా రాజు నందు తన యంశము యొక్క శక్తిని ప్రవేశ పెట్టెను. అందుకు దేవతలు సంతసించిరి. సముద్రతీరమున నిసుకలో వాలికా పులినములో నిదురించు చుండిన ధుంధునిని, కువలాశ్వుని పుత్రులు భయంకరాగ్ని జ్వాలల సహాయముతో నిదుర లేపిరి. ధుంధుడు యుద్ధమునకు పూనెను. అప్పుడు వాని శరీరముపై మండు చుండిన యగ్నిని కువలాశ్వుడు తన యోగ విద్యా మహా ప్రభావ మగు జల ప్రవాహముచే ప్రశాంతము కావించి వెంటనే బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. దాని వలన ధుంధుని శరీరము క్షణకాలములో బూడిదయయ్యెను. అప్పుడు ఇంద్రాది దేవతలును, మునులును నా రాజు నభినందించి

వ॥ "బ్రాహ్మణ శక్తియు ననపరత దానశీలతయు విష్ణువుతోడి సఖ్యంబును వరంబులుగా దనకు గోరెను." (415)

అతని కోరికలను వినిన ఇంద్రాది దేవతలు "అట్ల యొసంగిరి" (415) మరియు కువలాశ్వుడు కోరకనే

వ॥ "రాక్షస నిహతులైన యతని పుత్రులం బునర్జీవితులుగా బ్రసాదించిరి" (415)

3.3.7. ధర్మరాజునకు యమధర్మరాజు వరము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య" పర్వము సప్తమాశ్వాసములో (459 467) గలదు. యాచితాయాచిత వరమును పొందిన వాడు ధర్మరాజు. వరప్రదాత యమధర్మరాజు.

యమధర్మరాజు యక్షుని రూపములో నుండి ధర్మరాజుయొక్క ధర్మజ్ఞతను పరీక్షించెను. ధర్మరాజు ప్రార్థనపై తా నతని తండ్రి యైన యమధర్మరాజునని చెప్పెను. తన నాశ్రయించిన వారు దుర్గతిని పొందరనియు కావున నభిమత వరమును వేడుమని పలికెను. వెంటనే ధర్మరాజు సంభ్రమ భక్తిభావయుతుడై నమస్కరించి

వ॥ "దేవా మదీయాశ్రమ వాసుండైన భూసుర ముఖ్యు నరణి
యొక హరిణంబు చేత నపహృతం బయ్యె నతనికిం గర్మ
లోపంబు గాకుండ నయ్యరణిం గరుణింపవే" (463) అని

కోరెను. అందుకు యమధర్మరాజు సంతోషించిన వాడై

కం॥ "విను మేను నీ మనోగతి
యనఘా యెఱుగంగ వేడి యరణీ హరణం
బొనరించితి మృగ మెక్కడి
దని యమ్మహనీయ వస్తు వతని కిచ్చెను".(464)

మరియు వెంటనే ధర్మరాజు కోరకనే

వ॥ "ఇదె పదమూడవ యేడు సనుదెంచె నింక మీకు నజ్ఞాత
వాసంబు సలువవలయు నందు మీ రెవ్వ రెక్కడ నే
రూపంబునం జరియింపం గోరిన నయ్యేరూపంబు లలవడి
యెడు నెట్లున్నను మిమ్ము నెవ్వరు నెఱుంగ కుండు నట్లుగా
వరం బిచ్చితి" (465) నని పలికెను.

3.3.8. ఉదంకునకు పర్జన్యుని వరము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వము ప్రథమాశ్వాసములో (101-115) గలదు. యాచితాయాచిత వరమును పొందినవాడు "ఉదంకు"డను ముని. వర ప్రదాత యొక దివ్య పురుషుడు.

ఉదంకుడు తీసికొని వెళ్ళు చుండిన కుండలములను తక్షకు డపహరించెను. నాగ లోకమునకు తీసికొని వెళ్ళెను. ఉదంకుడు తక్షకుని వెంటాడెను. అచట నాగ ముఖ్యులును, నాగుల నందరిని స్తుతించెను. అప్పుడచట సితాసిత తంతు సంతాన పటమును నేయు చుండిన యిద్దఱ స్త్రీలను, ద్వాదశార చక్రమును త్రిప్పు చుండిన యాఱుగుర కుమారులను, నతి ప్రమాణ తురంగము నెక్కిన మహా తేజస్వి నొక్క దివ్య పురుషుని చూచెను. అతి భక్తి యుతుడై విపు లార్థవంతములైన మంత్రములతో నతనిని స్తుతించెను. అందుకు దివ్య పురుషుడు ప్రసన్నుడై ఉదంకుని యభివాంఛితమును తీర్చు దునని పలికెను. ఉదంకుడు సంతసించి

వ॥ "ఇన్నాగ కులం బెల్ల నాకు వశం బగు నట్టులుగ ననుగ్ర హింపు మని" (110) కోరెను.

అపుడా దివ్య పురుషుడు ఉదంకునికి

వ॥ "అట్లేని నీ యశ్వకర్ణ రంధ్రాధ్మానంబు సేయు మని" (110) చెప్పెను.

వెంటనే ఉదంకు డట్లు చేసెను. ఆ గుఱ్ఱము యొక్క రోమ కూప ముల నుండి దహనార్చులు పుట్టెను. అవి పాతాళ లోక మంతయు వ్యాపించెను. సర్పము లన్నియు భీతిల్లెను. శంకర నిభుడగు విప్రుని భయంకర కోపాగ్ని యేమో యని తక్షకుడు భయపడి కుండలములన

తెచ్చి యిచ్చెను. వాటిని ఉదంకుడు గ్రహించెను. కుండలములను తెచ్చుటకు ఉదంకునికి గురుపత్ని నాలుగు రోజులు గడువును పెట్టి యుండెను. అది నాల్గవ రోజు. ఆ రోజు లోపల పాతాళలోకము నుండి భూలోకములో గురువు దగ్గరకు వెళ్లి చేరగలనని ఉదంకుడు తనలో భావించెను. చేరక పోయినచో చేసిన ప్రయత్నమంతయు నిష్ఫల మగునని తలంచు చుండెను. అప్పుడా దివ్య పురుషుడు ఉదంకుని ముఖ కవళికలను గమనించెను. ఉదంకుడు కోరకనే

ఆ.వె॥ "ఈ హయుంబు నెక్కి యేగుమ యిది వడి
గలదు మనము కంటె గాడ్పు కంటె" (114) నని పలికెను. ఉదంకుడా గుఱ్ఱము నెక్కి భూలోక మందలి గురువు గృహమునకు చేరెను. ఆ దివ్య పురుషుడు పర్జన్యుడని గురువు ఉదంకునకు తెలిపెను.

3.3.9. కౌశికునకు సావిత్రి దేవి వరము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము చతుర్థాశ్వాసములో (133–171) గలదు. యాచితాయాచిత వరమును పొందిన వాడు కౌశికుడు. వర ప్రదాత్రి సావిత్రీదేవి.

కౌశికుడను బ్రాహ్మణుడు వేద వేదాంగములను చదివెను. సంహితా జపమును మంచి శీలముతో వేయి సంవత్సరముల కాలము చేసెను.

అప్పుడు సావిత్రిదేవి ప్రత్యక్షమై తనను గురించి చెప్పెను. అతడు కడు భక్తితో నమస్కరించెను. "నీ యిష్ట మడుగు" మని యామె పలికెను. అతడు

సీ॥ "జపాతి నిష్ఠయు కోరెను" (133)
ఆమె యతని కోరికను నెరవేర్చెను. మరియు నతడు కోరకనే

సీ॥ "—————————నీ కత్యుదాత్త

తే.గీ॥ "గతియు నగు ధర్మ మర్థి నీ కడకు వచ్చు
యముడు గాలుండు మృత్యువు నరుగు దెంతు
రనఘ నీకును వారికి నావహిల్లు
వాద మని చెప్పి చనియె" (133)

తరువాత నట్లు జరిగెను. చివరలో కౌశికుడు బ్రహ్మపద ప్రాప్తుడయ్యెను.

3.3.10. కుశికునకు చ్యవన ముని వరము

ఈ వృత్తాంతము తిక్కన భారత భాగము "అనుశాసనిక" పర్వము ద్వితీయాశ్వాసములో (291-331) గలదు. యాచితాయాచిత వరమును పొందిన వాడు కుశికుడను రాజు. వరప్రదాత చ్యవన ముని.

బ్రహ్మ మునుల సురలతో కొలువు దీరి యుండెను. ప్రసంగ వశమున వారితో బ్రహ్మ, భృగు, కుశిక వంశములకు సంకరము వాటిల్లునని చెప్పెను. అచటనే యుండిన భృగు మహర్షి కుమారుడగు చ్యవన ముని యా మాటలను వినెను. అట్లు జరుగుటకు నిష్టపడక కుశికుని వంశమును నాశనము చేయుటకు పూనుకొనెను. కన్యాకుబ్జ దేశపు రాజగు కుశికుని యింటికి వెళ్ళెను. కుశికుడును నతని భార్యయును మునికి నతిథి మర్యాదలను చేసిరి. తనకు పరిచర్యలను చేయుడని వారి నాదేశించెను. వా రట్లు చేసిరి. అతడు వారి ననేక విధములుగ పరీక్షించి మెచ్చుకొనెను. గంగా తీరమున జపమును చేసికొను తన దగ్గరకు మరునాడు రమ్మని వారికి చెప్పెను. వా రట్లు వెళ్ళిరి. వారికి తన యోగబలముచే స్వర్గలోకమును చూపించి క్షణ కాలములో మాయము చేసెను. వారు బ్రాహ్మణత్వమును కోరి యాడిరి. అతడు వారిని మెచ్చుకొని వరమును వేడుమనెను. వారిని పరీక్షించిన కారణమును తెలుపు మనిరి. అతడు వారి కా విషయమును వివరించెను. మరియు వారు కోరకనే

వ॥ "నీకు మూడవ వాడు బ్రహ్మ తేజో దీప్తుడయి జనియించు" (331) నని పలికెను.

కుశికుని పుత్రుడు గాధి. గాధి కొడుకు విశ్వామిత్రుడు. అతడే కొంత కాలము రాజ్య పాలన చేసి పిమ్మట తపమును చేసి బ్రహ్మర్షియై బ్రహ్మ తేజోదీప్తుడయ్యెను.

# ఆంధ్ర మహాభారతములోని శాపముల వృత్తాంతములు

ఆంధ్ర మహాభారతములోని శాపములను ప్రధానముగా స్థాన భ్రష్టాత్మక, స్థితి భ్రష్టాత్మక, స్వరూప వైకల్య శాపములని మూడు విధములుగా వర్గీకరించ వచ్చును.

## 4.1. స్థాన భ్రష్టాత్మక శాప వృత్తాంతములు

స్థానమను మాటకు "చోటు, ఉనికి, త్రివర్గములందొకటి, విలుకాని యుద్ధమప్పటి నిలుపు పోలిక" అను నర్థము లున్నవి. స్థిరమగు వాసమును సూచించు శబ్దము "ఉనికి". ఈ దృష్టితో చూడగా స్వర్గ, మర్త్య, పాతాలాది లోకములు కదలక యొక చోట నిలిచిన లోకములు. ప్రధానముగా "అతల, వితల"లాది లోకములే లోకములైనను ప్రజా సంరక్షణమున బాధ్యతను వహించు "అష్టదిక్పాల"కుల వాసస్థానములు కూడ లోకములే. కనుక నీ లోకముల నుండి భ్రష్టత్వమును కలిగించిన శాపము లన్నియు స్థాన భ్రష్ట సూచకములే.

### 4.1.1. లోకాంతర గమన ప్రాప్తి

లోకాంతర మనగా వేరొక లోకమని యర్థము. ఒక లోకము నుండి మరియొక లోకమునకు చనుట లోకాంతర గమనము.

శాపము వలన నధోలోక గమనము-సంప్రార్థన సాహాయ్యాదుల వలన పుణ్యలోక ప్రాప్తి, శాపము వలన యమ (పితృ) లోక గమనము-సంప్రార్థనము వలన స్వస్థాన (పుణ్యలోక) ప్రాప్తి మొదలగునవి లోకాంతర గమనములు. ఇట్టివి "ఆంధ్ర మహాభారతము"లో నాలుగు గలవు.

1) యయాతి వృత్తాంతము 2) ఉపరిచర వసు వృత్తాంతము
3) మేధావి వృత్తాంతము 4) నాచికేతుని వృత్తాంతము.

4.1.1.1. యయాతి వృత్తాంతము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము" తృతీయాశ్వాసము (187-213) లో గలదు. యయాతి "అధోలోకము"న కరుగుట శాప విషయము. శాప కర్త ఇంద్రుడు.

యయాతి చంద్ర వంశపు రాజు. ఇత డిష్ట భోగముల ననుభవించి రాజ్యమును కుమారుడగు పూరువునకు నప్పగించి వాన ప్రస్థాశ్రమమును స్వీకరించెను. నియత, హత, కఠోర తపములను చేసి దివ్య విమానములో దేవ బ్రహ్మాది లోకములకు వెళ్ళి, చివరకు "ఇంద్ర లోకము" నకు చేరెను. అచట ఇంద్రుడు యయాతిని "నూరుపేల సంవత్సరముల పుణ్య లోక ప్రాప్తి నీ కెట్టి తపస్సు వలన కలిగిన" దని ప్రశ్నించెను. తాను దేవతల, ఋషుల కంటె చాల గొప్పగ తపస్సును చేసి నట్లు గర్వముతో యయాతి చెప్పెను.

ఆ మాటలను వినిన ఇంద్రుడు సహించక కోపించి

వ॥ "నీకు దేవలోక సుఖానుభవంబు లందు బుణ్యము సమాప్తి యయ్యె నీ గర్వంబు నిన్నింత సేసె నింక నధోలోకంబున కరుగు మని" (211) శపించెను.

అప్పుడు యయాతి గర్వహీనుడై, పశ్చాత్తాప తప్తుడై

వ॥ "మనుష్య లోకంబునకుం బోవ నోప నంతరిక్షంబున సద్భువనంబున సత్సంగతి నుండునట్లుగా నాకు ప్రసాదింపు మని" (211)

ఇంద్రుని ప్రార్థించెను. అందులకు ఇంద్రుడు సమ్మతించెను. యయాతి "అంతరిక్షము"లో సద్భువనమున మంచి వారితో కలిసి తపమును చేసి కొంత కాలముండి మరల దేవ లోకమునకు వెళ్ళెను.

ఈ కథలో "అధో లోకమున కరుగు" మనుట యా దేశ పూర్వకమైన శాపము. "అంతరిక్షమున సద్భువనమున సత్సంగతి నుండు

గా ప్రసాదింపు"మనుట సంప్రార్థనము. గర్వశాంతి కాగా దేవ
మున కరుగుట పుణ్య ఫలము.

1.2. ఉపరి చర వసు వృత్తాంతము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము షష్ఠా
సములోను (344-374) అశ్వమేధ పర్వము చతుర్థాశ్వాసములోను
-258) నించుమించు నొకే విధముగా గలదు. ఉపరిచర వస్తువు
లోకము"న కరుగుట శాప విషయము. శాప కర్తలు దేవలోకము
వలి మునులు.

ఉపరి చర వసువు చేది దేశపు రాజు. అతడు యజ్ఞ యాగము
చేయించుచు, వర్ణాశ్రమములను కాపాడుచు ప్రజలను ప్రజారం
ముగా పాలనము చేయుచుండెను. ఒక నా డతడు వేటకు వెళ్ళి
రహితమైన తపస్సును చేయసాగెను. అందుకు ఇంద్రుడు మెచ్చి,
త్యక్షమై, తనకు స్నేహితునిగా నుండి తన దగ్గరకు రాకపోకలు
ంచుచు ప్రజా పాలనను చేయుచుండుమని వసువుతో పలికి దివ్య
ానమును, వాడిపోని తామర పుష్పముల మాలను, నొక యష్టిని
ను) నిచ్చెను. అప్పటి నుండి యతనికి "ఉపరి చర వసు" నను
కలిగెను.

ఒకానొక వేళ దేవలోకములో ఇంద్రుడు యజ్ఞమును చేయు
డు జంతు బలి యవసరమని దేవతలును, ననవసరమని మును
వాదించుకొను చుండిరి. అప్పు డచటికి వచ్చిన "ఉపరిచర
వు"ను బలి విషయమై తన యభిప్రాయమును తెలుపు మని
డిగిరి. అతడు దేవతల పక్షము చెప్పెను. అప్పుడు మునులు
ంచి

"భూవివర పతితుండవయి యుండు మని" (374) శపించిరి

వ॥ "అతండు దేవతా పక్షపాతంబున బహు విశనంబు కర్తవ్యం
బని పలికి యథఃపాతంబు ప్రాప్తించెన్" (అశ్వ-4ఆ-258)

భూమి మీద పడియున్న "ఉపరిచర వసువు" దగ్గరకు దేవతలు వెళ్ళి, యతని యంతరంగమునకు తెలివిని కలిగించి శరీరమునకు నలసటను, తొలగించి విష్ణు ప్రసాదమున ప్రత్యాపన్నుడ వగుమని యారాడించి వెళ్ళిరి. అతడు విష్ణువును ధ్యానించెను. విష్ణువు గరుత్మంతునిని "ఉపరిచర వసువు" దగ్గరకు పంపి, యతనిని బ్రహ్మ లోకమునకు రప్పించి గౌరవించెను.

ఈ కథలో భూవివర పతితుండవై యుండుమనుట శాపము. విష్ణువు నుద్దేశించి తపమును చేయుమని సాహాయ్య రూపకమైన వర మును ప్రసాదించిన వారు దేవతలు. బ్రహ్మలోక ప్రాప్తి కనుగ్రహించిన వాడు విష్ణువు.

4.1.1.3. మేధావి వృత్తాంతము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము అరణ్య పర్వము తృతీయాశ్వాసములో (251-281) గలదు. మేధావి యమలోకమున కరుగుట శాప విషయము. ధనుషాక్షు డను తపోధనుడు శాప కర్త.

బాలధి యను పేరు గల ముని యొక్క కుమారుడు మేధావి. బాల్యదశలోనే యకాల మరణము నొందెను. అప్పుడు బాలధి పుత్ర శోకమును భరించలేక పోయెను. ఘోరమైన తపస్సును చేసి వేల్పుల దయచే చనిపోయిన తన కుమారుడు మరల బ్రతికి చిరంజీవిగా బ్రతుకునట్లు వరమును పొందెను. మేధావి బ్రతికెను.

ఒక పర్యాయము మేధావి పునరుజ్జీవన గర్వముతో నే ముని పైనను గౌరవించక తిరుగుచు ధనుషాక్షుడను తపోధనుని తూలాడెను. అందుకు ధనుషాక్షుడు కోపించి

సీ॥ "..............................వాని

అ.వె॥ నంతకాంతకమున కరుగంగ జేసె" (260)

అకాల మరణమునకు పాలైన వాడు వేల్పుల యనుగ్రహముతో బ్రతుకుట సాహాయ్యము. నిష్ఠుర కర్మ కారణముగ మేధావి ధనుషాక్షుని కోపమునకు గురియగుట శాపము.

4.1.1.4. నాచికేతుని వృత్తాంతము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక" పర్వము ద్వితీయాశ్వాసములో (445-462) గలదు. నాచికేతుడు యమలోకమును చూచుటకు వెళ్ళుట శాప విషయము. శాప కర్త యతని తండ్రి యైన ఔద్దాలకి.

ఔద్దాలకి నదీ స్నానమునకు వెళ్ళి, యా నదీతీరమున మరచిపోయి వచ్చిన "ఇధ్మము"లను, దర్భల కట్టను, జలపూర్ణ కలశమును, పువ్వులను, తీసికొని రమ్మని తన కుమారుడైన నాచికేతుని పంపెను. కాని యతడు వెళ్ళునప్పటికే యా వస్తుసామగ్రి జల ప్రవాహములో కొట్టుకొని పోయెను. కావున నాచికేతుడు వట్టి చేతులతో నింటికి మరలి వచ్చి యా వృత్తాంతమును తండ్రికి చెప్పెను. అప్పటికే యాకలితో నకనక లాడు చుండిన ఔద్దాలకి యాలోచించకుండ వెంటనే కోపించి

ఆ.వె॥ "ఓరి జము జూడ బొమ్మని" (446) శాపము నిచ్చెను.

వెంటనే నాచికేతుడు ప్రసన్నుడ వగుమని తండ్రిని కోరుచుండగ స్పృహను కోల్పోయి క్రింద బడెను. అప్పుడు ఔద్దాలకి తన దుష్ట ప్రవర్తనకు పశ్చాత్తాప పడి మూర్ఛ పడెను. కొంత సమయమునకు తేరుకొని కన్నీటితో కొడుకును చూచుచునే పనిని చేయకుండ నా పగలు రాత్రి గడపెను. సూర్యోదయమున నా బాలుడు స్పృహను పొంది కన్నులను తెరచి తన యెదుట నున్న తండ్రిని చూచెను.

తండ్రికి తాను చూచిన యమ (పితృ) లోక విశేషములను గురిం
చెప్పెను.

స్పృహ తెలియని దశలో యమపురమున కేగుట యిం
విశేషము. శరీరము భూమిపై నున్నను నంతశ్శరీరము (సూ
శరీరము) పుణ్య లోకమునకు చనినది. తండ్రి పశ్చాత్తాపము
నతడు మరల భూలోక ప్రాప్తుడయ్యెను. ఈ వృత్తాంతము
"జము జూడ బొమ్మ"నుట ప్రకటిత కోప వేశమున వెలువ
వాగ్రూప శాపము. పశ్చాత్తాపమే మనసా కోరుకొనిన సంప్రార్థన

4.2. స్థితి భ్రష్టాత్మక శాపములు

నిలుకడయైనది యేదియో యది స్థితి. నిర్దిష్ట స్థితి నుండి జా
స్థితి భ్రష్టాత్మకము. ఇట్టి శాపములను మూడు విధములుగా వర్గీక
వచ్చును. ఇవి 1) వంశ విచ్ఛేదక, 2) జన్మ పరివర్తక,
3) అవస్థా విపర్య యాత్మక శాపములు.

4.2.1. వంశ విచ్ఛేదక శాపములు

వంశమను మాటకు కులము, వెన్నెముక, సమూహము
నర్థములు గలవు. భారతీయ ధర్మములలో వివాహ వ్యవస్థ వ
వృద్ధికే యేర్పడినది. ఋణములలో పితృఋణము సంతాన వ
నప్పుడే తీరునని పెద్ద లందురు. సంతాన రాహిత్యము మా
లకు మాత్రమే గాక వంశమునకు నసర్థదాయకము. వంశ
నమునకు శాపము గాని, యుద్ధ ప్రయోగములు గాని కారణమ
చ్చును. ఇట్టివి "ఆంధ్ర మహాభారతము"న నాలుగు గలవు.

1) పౌష్య మహా రాజు శాపము 2) అశ్వత్థామాస్త్ర ప్రయో
3) కణ్వాదులు 4) గాంధారి శాపములు

4.2.1.1. పౌష్య మహా రాజు శాపము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వము ప్రథమాశ్వాసములో (91-101) గలదు. ఉదంక మహామునికి కలిగిన "అనపత్యత్వము" శాప విషయము. పౌష్య మహారాజు శాపకర్త.

గురు దక్షిణార్థము "ఉదంక"ముని పౌష్య మహారాజు నాశ్రయించి, యతని యనుమతితో నతని భార్య కుండలమును గ్రహించెను. ఆ రాజు కోరికపై "ఉదంక"ముని భోజనమును చేయసాగెను. అప్పు డన్నములో వెంట్రుక కనబడెను. అందు కత డసహ్యించుకొని కోపించి

వ॥ "ఇట్లపరీక్షితంబైన యశుద్ధాన్నంబు పెట్టినాడ వంధుండ వగు మని శాపం బిచ్చెను. (99)

ఆ మాటలను విని యా రాజు కూడ కోపించి యా మునికి

వ॥ "అల్పదోషంబున నాకు శాపం బిచ్చిన వాడవు నీ వన పత్యుండ వగు మని ప్రతి శాపం బిచ్చెను" (99)

అప్పుడు "ఉదంక"ముని యా రాజుతో తా ననపత్యుండను కాలేననియు, శాపము నుపసంహరించు మనియు ప్రార్థించెను. కాని శాపోపసంహరణమునకు క్షత్రియులు అర్హులు కారనియు, రాజు తన నిస్సహాయతను ప్రకటించి, తన కిచ్చిన శాపమును మరలింపుమని "ఉదంకు"ని వేడి కొనెను.

వ॥ "నీకు నల్పకాలంబున శాపమోక్షం బగు నని" (101)

ఉదంకముని యనుగ్రహించెను.

తామర తంపరగా వర్ధిల్ల వలసిన "ఉదంకు" ని వంశము పౌష్యరాజు శాపము వలన విచ్ఛిత్తిని పొందుట యిందలి విశేషము.

శాపోపసంహరణ వలన పౌష్యరాజుకు నష్టము లేదు. రెండు విధ ముల భ్రష్టుడైన వాడు "ఉదంకుడు". అల్పదోషమునకు కినియు టయు ననపత్య శాపమునకు గురియగుటయు నితని కర్మ విశేషమే.

4.2.1.2. అశ్వత్థామ బ్రహ్మశిరో నామకాస్త్ర ప్రయోగము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము సౌప్తిక పర్వము ద్వితీయాశ్వాసములో (39-86) గలదు. పాండవులకు వంశ నాశన మగుట శాప విషయము. శాప కర్త అశ్వత్థామ.

దుర్యోధనుడు తొడలు విరిగి క్రింద బడిన నాటి రాత్రి యతని మీద గల స్వామి భక్తితో "అశ్వత్థామ" పాండవుల సైన్య శిబిర ములో నందరిని చంపెను. అందులో "ఉప పాండవు"లు కూడ నుండిరి. మరునటి రోజు నుదయమున నా విషయము పాండవు లకు తెలిపెను. అప్పుడు భీముడు "అశ్వత్థామ" ను చంపుటకు సిద్ధ మయ్యెను. అంత కృష్ణుడు అస్త్ర విద్యలో నిపుణుడైన "అశ్వత్థామ" భీముని చంపగల సమర్థుడని భావించి, ధర్మజార్జున నకులుల తోడు రాగా వెళ్ళెను. అప్పటికే భీమాశ్వత్థామల సంవాదము తీవ్ర స్థాయి నందుకొనెను. అశ్వత్థామ శ్రీకృష్ణార్జునుల రాకను గమనించి "అర్జును"ని యుద్ధములో నెదిరించుట కష్టమని తలచి

వ॥ "బ్రహ్మశిరోనామకం బను దివ్యాస్త్రంబు దలంచి యొక్క
యిషీకంబు పుచ్చుకొని యందయ్యస్త్రంబు నావహించి
యపాండవం బయ్యెడు మని దారుణ భాషణంబుల తోడ
రోష ప్రదీప్తుం డగుచు బ్రయోగించెను" (68)

శ్రీకృష్ణుడు దానికి ప్రతిగ బ్రహ్మశిరోనామకాస్త్రమును వదలుమ "అర్జును"ని నాదేశించెను. అర్జును డట్లు చేసెను. అవి రెండు

నాకాశమున పోరాడు చుండెను. నారద వేదవ్యాస మహర్షు లా దివ్యా స్త్రముల నుపసంహరించు డని అశ్వత్థామార్జును"ల నాదేశించిరి. అర్జును డుపసంహరించెను. అశ్వత్థామ యట్లు చేయలేదు. మరియు తన యస్త్రము చేయు పనిని గురించి తెలిపెను. అప్పుడు శ్రీకృష్ణుడు "అభిమన్యు"ని భార్యయగు "ఉత్తర" గర్భము నందలి శిశువును వదలి పెట్టి, మిగిలిన వారిని నీ యస్త్రముచే దగ్ధము చేయుమని "అశ్వత్థామ" నడిగెను. అందుకు "అశ్వత్థామ" సమ్మతించ లేదు. తన బ్రహ్మ శిరోనామకాస్త్రము నికను ప్రేరేపించెను. కొంత కాలమునకు "ఉత్తర"కు పుట్టిన మృత శిశువును శ్రీకృష్ణుడు పరిరక్షించెను. కావున నతనికి పరీక్షితు డను పేరు స్థిర పడెను.

అశ్వత్థామ "అపాండవ మగు గాత" యని శపించుటలో నుద్దేశింప బడిన వ్యక్తులు ధర్మరాజాదులు. అయినను వేదవ్యాసుని యాదేశము, వాసు దేవాజ్ఞ వలన నిది పౌత్రుల పట్ల ఫలించినది. మృత శిశువును రక్షించిన కీర్తి పూర్ణావతారుడైన శ్రీకృష్ణునికి దక్కుట యిందలి విశేషము.

4.2.1.3. కణ్వాదుల శాపము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము మౌసల పర్వములో (6-85) గలదు. యాదవ వంశ నాశనము శాప విషయము. శాప కర్తలు కణ్వ, నారద, విశ్వామిత్ర మహర్షులు.

నారాయణావతారుడైన శ్రీకృష్ణుని చూడవలెనని కణ్వ, నారద విశ్వామిత్ర మహర్షులు ద్వారవతికి వచ్చి పుర వీధులలో నడచుచుండిరి. యుక్తాయుక్త వివేక శూన్యులైన బాల యాదవులు విధి వైపరీత్యము వలన మునులను పరీక్షింప సమ కట్టిరి. శ్రీకృష్ణుని కొడుకగు సాంబునికి తరుణీ వేషమును కైసేసిరి. మునులకు నమస్క

రించి, "ఈమె బభ్రుని భార్య. ఈమె వజ్రిలను కనునా?" అని యడి
గిరి. ఆ ఋషులు యాదవ కుమారుల దుష్ప్రవర్తనకు రోషముతో
బాటు కోపించి

కం॥ "అంబుజ నాభుని కొడు కీ
సాంబుడు గను యాదవ క్షయాపాదన క
ల్యం బగు ముసలము మా వచ
నంబున కనృతంబు లేదు నమ్ముడు మీరల్" (9)

అని శపించిరి. మరియు బలరామ కృష్ణులు తప్ప నెల్ల యాదవులు
ముసల ప్రభావము వలన హతు లగుదురని శపించిరి. తరువాత
ముసల జననము శ్రీకృష్ణు నాదేశము ననుసరించి ముసలమును
ముక్కలు ముక్కలుగా చేసి సముద్రమున పారవేయుట, యవి
తుంగలుగా మొలచుట జరిగెను. సముద్రతీరములో మద్యపాన
మత్తులైన యాదవుల మధ్య నకారణ కలహము కలుగగా తుంగలతో
పరస్పరము బాదుకొనుచు యాదవు లందరును హతులైరి.

పెద్దలతో పరియాచకము లాడుట, వారి తపశ్శక్తిని పరీక్షింప
నెంచుట, యాదవుల దోషము. దోషము బాలురదైనను ఫలితము
వంశ మంతయు ననుభవింప వలసి వచ్చుట యీ శాప విశేషము.

4.2.1.4. గాంధారి శాపము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము స్త్రీ పర్వము ద్వితీ
యాశ్వాసములో (2-165) గలదు. శ్రీకృష్ణునికి కలిగిన మరణమును
నతని జాతి వారందరికి కలిగిన వంశ నాశనమును శాప విషయము
శాపము నిచ్చినది గాంధారి.

పదునెనిమిది రోజుల పాటు భీషణ యుద్ధము సాగిన తరువాత
గాంధారి ధృతరాష్ట్రులు తక్కిన పరివారముతో సమర క్షేత్రమునకు
వెళ్ళిరి. వేద వ్యాసుడు గాంధారికి దివ్యదృష్టిని ప్రసాదించెను. సమ

రములో మరణించిన పరివారమును, పాడైన వస్తు సముదాయమును నామె చూచి యాక్రోశించెను. జ్ఞాతి యుద్ధమునకును, కురువంశ నిర్మూలనమునకును, ప్రజా వస్తు క్షయమునకు శ్రీకృష్ణుడే కారకుడ నియు, నతని యుపేక్ష వలన నిట్టి యనర్థము సంభవించెననియు తూలనాడెను. దీని కంతకు ఫలితము ననుభవింపు మనుచు

సీ॥ "——————పొలియుదు రన్యోన్య

ఘాతుకులై భవజ్ఞాతి జనులు" (161) అని శపించెను. అట్లే శ్రీకృష్ణునికి దిక్కులేని చావు వచ్చునని పలికెను. అప్పుడు శ్రీకృష్ణుడీ శాపము చర్విత చరణ మనియు, నిది వరకే కణ్వాది మహర్షి ప్రోక్త మనియు పేర్కొనెను.

గాంధారి శాపమునకు కారణములు రెండు. "నా యంతటి వారు పది వేవురు గల రని" శ్రీకృష్ణుడు దుర్యోధనున కప్పగించిన యాదవ వీరులు కౌరవులకు బాసట కాకపోగా వారిసహాయము నిష్ఫల మగుట యొక కారణము. ఒక వ్యక్తి మీది కోపముతో వ్యక్తి పరివారము నంతటిని శపించు మానవ ప్రకృతి మరియొక కారణము.

### 4.2.2. జన్మ పరివర్తక శాప వృత్తాంతములు

జన్మ మను మాటకు 1) పుట్టుట, 2) ఉద్భవ మను నర్థము లున్నవి. జన్మ మనునది పుట్టుకను సూచించును. ఈ జన్మ పరివర్తక శాపములు మర్త్య, నికృష్ట, తిర్యక్ జన్మలని మూడు విధములు.

#### 4.2.2.1. మర్త్య జన్మ ప్రాప్తి శాపములు

వరము వలన లేదా యజ్ఞయాగాదుల వలన మహోన్నత స్థితి నందుకొనిన వారు శాపము వలన నా స్థానమును వదలి మర్త్యులుగా పుట్టుట యీ విభాగమున చేరును. ఇట్టివి "ఆంధ్ర మహాభారతము"లో

మూడు గలవు. ఇవి 1) మహాభిషుని, 2) అష్ట వసువుల, 3) నాళా యిని (ఇంద్రసేన) పంచభర్తృక ప్రాప్తి వృత్తాంతము

4.2.2.1.1. మహాభిషుని వృత్తాంతము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము" చతుర్థాశ్వాసములో (120-125) గలదు. మహాభిషునికి కలిగిన మర్త్య జన్మ ప్రాప్తి శాప విషయము. శాప కర్త బ్రహ్మదేవుడు.

మహాభిషుడు "ఇక్ష్వాకు" వంశపు రాజు. అతడు ధర్మశీలుడై వేయి యశ్వమేథములను, నూఱు రాజ సూయములను చేసి, "ఇం ద్రాది" దేవతలను తృప్తి పఱచి, దేవ లోకమునకు వెళ్ళి, యచట దేవర్షి గణముతో కలిసి బ్రహ్మను కొలుచు చుండెను.

ఒకనాడు గంగానది దివ్య స్త్రీ రూపమును ధరించి బ్రహ్మ సభకు వచ్చెను. అప్పుడు గాలి వీచుట వలన నామె ధరించిన వస్త్రము తొలగెను. ఆ కారణము వలన నామె తొడలు కనిపించినవి. ఆ దృశ్యమును చూడలేక దేవతలు ముఖములను ప్రక్కకు త్రిప్పు కొనిరి. కాని మహాభిషుడు తదేకంగా చూచెను. బ్రహ్మ యా విష యమును పసిగట్టి మహాభిషునిపై కోపించి

సీ॥ "——మర్త్య యోని యందు బుట్టు
మనుచు శాప మిచ్చె నొసరంగ" (124)

మహాభిషుడు భీతిల్లి రెండు చేతులను జోడించి మర్త్యలోకమున ప్రతీ పునికి పుత్రునిగా జన్మింప ననుగ్రహింపు మని ప్రార్థించెను. బ్రహ్మ యనుగ్రహించెను.

బ్రహ్మ లోకమునకు చేరినను మహాభిషునిలో మర్త్యవాసనలు పోలేదనుటకు నీ వృత్తాంతము సాక్ష్యము. ఇతరులు ముఖములను

త్రిప్పుకొనినప్పుడును సమయోచిత చాతుర్యమును ప్రయోగింపకుండుట మహాభిషుని తప్పిదము. సభా మర్యాదతో బ్రహ్మ శాపము నిచ్చుట యుక్తమే.

4.2.2.1.2. అష్ట వసువుల వృత్తాంతము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వము చతుర్థాశ్వాసములో (120-162) గలదు. అష్ట వసువులకు కలిగిన మర్త్య యోని జన్మ శాప విషయము. శాప కర్త వసిష్ఠ మహర్షి.

వసిష్ఠ మహర్షి వరుణ దేవుని కుమారుడు. అతడు "నందినీ" ధేనువు వర ప్రసాదము వలన నే కొఱతయు లేకుండ నాశ్రమమున తపోదీక్షను వహించెను. అతిథులై వచ్చిన "అష్ట వసువులు" (దేవతలు) నందినీ ధేను మహిమను గుర్తించిరి. వారిలో ప్రభాసుడు తన భార్య ప్రోద్బలముతో నందిని నపహరించెను. వసిష్ఠుడు దివ్య దృష్టితో నందినీ చోరుని గుర్తించి

అ.వె॥ "మనుజ యోని బుట్టుడని" (161) శపించెను. అష్ట వసువులు ప్రార్థించగా

వ॥ "మీ కోరిన యట్ల యగు నష్టముం డయిన యీ ప్రభాసుండు పెద్దయు నపరాధంబు జేసెం గావున వీడు మర్త్య లోకంబునం బెద్ద కాలం బుండు ననపత్యుండు నగు నని (162) పలికెను.

దేవ జన్మను వదలి మానవజన్మ మెత్తుట శాపవిశేషము, ప్రభాసుడే భీష్ముడు. తన తప్పిదము వలన మానవ జన్మయే గాక నిస్సంతానత్వ శాపముగూడ నితనికి జోడైనది. చౌర్యమునకు పాల్పడిన వారెట్టి వారైనను శిక్ష ననుభవింపక తప్పదనుట "అష్టవసువుల" వృత్తాంతోపదేశము. ఇల్లాలి మాటలను విని చౌర్యమునకు సిద్ధ

మగుట వలన ప్రభాసునికి జన్మాంతరమున వివాహమే లేకపోయినది. తద్ద్వారా సంతాన రాహిత్యము ప్రభాసునికి (భీష్మునికి) తప్పలేదు.

4.2.2.1.3. నాళాయని (ఇంద్రసేన) పంచభర్తృ ప్రాప్తి వృత్తాంతము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది" పర్వము సప్తమాశ్వాసములో (239-277) గలదు. ఇంద్ర, యమ, వాయు, అశ్వినీ దేవతలకు మనుజ యోనియందు పుట్టుడనుట శాప విషయము. ఈ యాజ్ఞా రూప శాపమునకు కర్త రుద్రుడు (శివుడు).

మొదటి జన్మలో నాలాయని (ఇంద్రసేన). రెండవ జన్మలో కాశిరాజు కుమార్తెగా జన్మించి తపశ్చర్యకుపూనుకొనినను యమాదులు మరుసటి జన్మమున తమ యైదుగురిని భర్తలుగా పొంద వలయునని కోరిరి. కొంత కాలమునకు శివుడు ప్రత్యక్షమై 'ఏవురు పతులగుగురని, ఇది నా వచనమని" అనుగ్రహించెను. ఇంద్రుని పిలుచుకొని రమ్మని శివు డాదేశించెను. మార్గ మధ్యమున నొకానొక వనితతో జూదమాడు నతిలోక సుందరుని (శివుని) చూచిన ఇంద్రు డతనిని శివుదని గుర్తించక, యతడు తనను గౌరవించ లేదని గర్వోక్తు లాడెను. అందుకు శివుడు కోపించి సమీపమున గల గుహ ద్వారమును తెరువుమని "ఇంద్రుని" నాజ్ఞాపించెను. ఆ గుహలో లో తన వంటి యైదుగురిని దర్శించిన "ఇంద్రుడు" విస్మయ పడెను. అప్పుడు హరుడు

ఆ.వె॥ "..................అయ్యింద్రుల

నేవురను మహానుభావ మెసగ

మనుజయోని బుట్టు డని పంచె గీర్వాణ
హితము సేయు పొంటె మతి దలంచి" (276)

అని యాజ్ఞాపించెను.

పతి కావలయునని పరితపించు పడతి కాశిరాజు కుమార్తె. తమ్ము పతులుగా స్వీకరింపుమని ప్రార్థేయపడిన వారు యమాదులు. పతి ప్రదానముతో నైదుగురిని నాదేశించిన వాడు రుద్రుడు. వివాహానంతరము పతుల మధ్య నీర్ష్యానుద్వేషములు, పతిపట్ల నసమానాదులు లేకుండుటకై రుద్రుడు కల్పించిన మాయా స్వరూప వికృతులే. గుహలోని వ్యక్తులు. ఇది యాజ్ఞారూపమైన శాపము.

4.2.2.2. నికృష్ట జన్మ ప్రాప్తి శాపములు

నికృష్ట మను మాటకు నీచమని యర్థము. ప్రధానముగా కుల వృత్తులను బట్టి నికృష్టతను నిర్ణయించుట జరిగినది. ఈ దృష్టితో చూడగా "ఆంధ్ర మహాభారతము"లో రెండు గలవు. ఇవి 1) విదురుని, 2) ధర్మవ్యాధుని వృత్తాంతములు.

4.2.2.2.1. విదురుని వృత్తాంతము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము చతుర్థాశ్వాసములో (260-272) గలదు. యమధర్మరాజును శూద్ర యోని యందు పుట్టుమని యను శాసించుట శాప విషయము. శాపకర్త మాండవ్య మహర్షి.

మాండవ్యుడు చిఱు ప్రాయములో తూనీగలను పట్టి యాడెడి వాడు, ఆ బాలుడు పెరిగి పెద్దవాడై ఋషియై మౌన వ్రతియై యొకానొక నగరోప కంఠమున తపమును చేయ సాగెను. ఇట్లుండగా నా నగర మహారాజు ధన కనకాదులను దొంగిలించిన చోరులా

ఋష్యాశ్రమమున దాగిరి. వారిని తరుము కొని వచ్చిన భటు లా మునిని ప్రశ్నించి నిరుత్తరులై చివరకు చోరులతో నతనిని బంధించి రాజు నెదుట నిరిపిరి. రా జా మునిని కొఱత కాజ్ఞాపించెను. అప్పుడు బంధితుడైన మాండవ్యుడు తన యకృత్యము వలన తన కిట్టి యాపద కలిగెనని భావించెను. ఈ యాత్మ నిందను గ్రహించిన రాజు "కొఱ త"ను తీయించెను. మాండవ్యుడు తపశ్శక్తితో యమ సదనమున కేగి తన కిట్టి శిక్ష తగునా? యని యముని నధిక్షేపించెను. యముడు మాండవ్యుని బాల్యోచిత చేతలను స్మరణకు తెచ్చి యా హింసాకృత్య మునకు ఫలము ననుభవింప వలసి వచ్చినదని పలికెను. అప్పుడు మాండవ్యుడు కోపించి

వ॥ "బాల్యంబున నల్పదోషంబు జేసిన నాకు బ్రాహ్మణోచితంబు గాని క్రూర దండంబు గావించిన వాడవు మర్త్యలోకంబున శూద్ర యోనిం బుట్టు మని శాపం బిచ్చెను." (272) అతడే

విదురుడుగా జన్మించెను.

4.2.2.2.2. ధర్మవ్యాధుని వృత్తాంతము

ఈ వృత్తాంతము ఎట్టిన భారతభాగము "అరణ్య"పర్వము పంచ మాశ్వాసములో (112-135) గలదు. ఒకానొక బ్రాహ్మణుని ధర్మవ్యా ధునిగా జనించుమని యనుశాసించుట శాప విషయము. ఈ శాప కర్త "అనామకు"డగు నొక ముని.

ధర్మవ్యాధుడు పూర్వజన్మములో బ్రాహ్మణుడు. అయినను క్షత్రియ సహవాసముతో ధనుర్వేదము నభ్యసించెను. ఒకనాడు రాజుతో బాటు వేటకు వెళ్ళి వేటాడుచుండగా నతని బాణము తపో వృత్తిలో నున్న బ్రాహ్మణునికి తగిలినది. అతడు కోపించి

ఆ.వె॥ "బ్రాహ్మణుండ వయ్యు బాప వృత్తి పై
శూద్ర కర్మమునకు జొచ్చి తీవు.

గాని నిక్కువముగ గవ్యాద జన్మాంత

వగుము" (133) అని శపించెను.

అప్పు డా బ్రాహ్మణుడు తెలియక చేసిన తప్పిదమును క్షమింపు మనియు, హీనజన్మ వలదనియు ప్రార్థించెను. అంత ముని నిరంతర ధర్మపరత్వము, పితృ గురు శుశ్రూషా నిరతి వలన పునః పరము బ్రాహ్మణుడ వగుదువని యనుగ్రహించెను.

అ బ్రాహ్మణుడే తరువాతి జన్మమున బోయ కులములో పుట్టి ధర్మవ్యాధుడను పేరును గాంచెను. అయినను ముని యనుగ్రహము వలన ధర్మపరత్వమును, పితృ, గురు శుశ్రూషా నిరతులను గలిగి యా తరువాతి జన్మమున మరల బ్రాహ్మణ కులములో జన్మించెను.

4.2.2.3. తిర్యక్ జన్మ ప్రాప్తి శాపములు

తిర్యక్కులనగా పశుపక్ష్యాదులు. దేవతలు, మానవులు, ఋషులు, యితరులు శాపము వలన పశుపక్ష్యాదులుగా జీవించుట. ఇట్టివి "ఆంధ్ర మహా భారతములో నేడు వృత్తాంతములు గలవు. ఇవి 1) ఉరగ, 2) గజ కచ్ఛప, 3) గ్రాహ, 4) కీటక, 5) శునక, 6) కృకల, 7) నకుల జన్మలు.

4.2.2.3.1. ఉరగ జన్మలు

ఆంధ్ర మహాభారతమున శాప వశమున నురగ జన్మను పొందిన వారి కథలు రెండు గలవు. మొదటిది ఖగముడు తన సహాధ్యాయి యగు సహస్రపాదున కొసంగిన శాపము. రెండవది "అగస్త్యమహర్షి" నహుషున కొసంగిన శాపము.

4.2.2.3.1.1. ఖగముని శాపము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము"

ప్రథమాశ్వాసములో (126-128, 144-156) గలదు. సహస్రపాదుడు "ఉరగ" జన్మ మెత్తుట శాప విషయము. శాప కర్త ఖగముడు.

ఖగమ సహస్రపాదులు సహాధ్యాయులు. ముని బాలకులు. ఒక నాడు ఖగము డగ్ని హోత్ర కార్యమును నిర్వర్తించు వేళ సహస్ర పాదుడు వయోజనిత మగు నవహాస్య బుద్ధితో గడ్డితో పెనవేసిన తాడును ఖగమునిపై వేసెను. ఖగము డులికిపడి సహస్రపాదునిపై కోపించి

వ॥ "నీవు నిర్వీర్యం బైన యురగంబ వగు మని" (156) శాపం బిచ్చెను.

పరిహాస విజల్పితమగు చేతకు నింతగా కినియ దగదనియు, తనను క్షమింపు మనియు సహస్రపాదుడు కోరెను. ఖగముడు ప్రసన్నుడై "ఉరగ" జన్మములో భార్గవ కులవర్ధనుడైన రురుని సందర్శనముతో శాప విమోచన మగునని యనుగ్రహించెను.

తన ప్రేయసి యగు ప్రమద్వరను కాటు వేసిన కోపముతో రురుడు తనకు కనబడిన పాములను చంపనుద్యమించెను. ఆ ప్రయత్నములో "ఉరగ" జన్మ మెత్తిన సహస్రపాదుడు రురుని కంటబడెను. అద్దాన శాప విమోచనము కలిగెను.

తృణ రజ్జువుకు పాముకు పోలిక. తృణ రజ్జు స్పర్శ వంటిదే సర్ప స్పర్శ. కనుక ఖగముడు "ఉరగ" జన్మము నెత్తుమని శపించుట సహజము. అగ్నిహోత్ర కార్యావసరమున జరిగినదగుట వలన పరుషోక్తులు శాప ప్రాయ మగుట తథ్యము.

4.2.2.3.1.2. అగస్త్య మహర్షి శాపము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య పర్వము చతుర్థాశ్వాసములోను (100-133) గలదు. తిక్కన భారతభాగము

"ఉద్యోగ పర్వము" ప్రథమాశ్వాసములోను (104-122) గలదు. రెం డింట కథాంశములు సమానములే నహుషుడు "ఉరగ" జన్మ మెత్తుట శాప విషయము. శాప కర్త అగస్త్య మహర్షి.

నహుషుడు చంద్ర వంశపు రాజు. అత డనేక యాగము లొనరించి, పుణ్య ఫలముచే స్వ[illegible]మును చేరెను. అప్పుడే "ఇంద్రుడు" వృత్తాసురుని చంపుట కా[illegible]ముగా బ్రహ్మహత్యా పాపము నంటుకొనగా విమోచనార్థము పదవీ త్యాగ మొనరించి రహస్య వర్తనమున జీవించుచుండెను. అప్పుడు దేవర్షుల కోరికతో నహుషుడు "ఇంద్ర పదవి"ని చేపట్టెను. కాని యైశ్వర్యమదముతో వివేకశూన్యుడై బ్రాహ్మణోత్తములు (మహర్షులు) మోయగా బ్రహ్మరథము నెక్కి వారిని నవమానించెను. వారిలో "అగస్త్య మహర్షి" నహుష వర్తనమునకు రోసి

ఆ వె॥ "అత్యుగ్రాహి వగు మని" (119) శపించెను.

నహుషుడు మహర్షి పాదముల మీద పడెను. అగస్త్యుడు నహుషునికి పూర్వస్మృతి యుండు నట్లును, బలవంతమగు సత్వములు నహుషు నెదుట బలహీన మగు నట్లును వరము లొసంగెను. మరియు నెవ రేని నహుషుని ప్రశ్నలకు ప్రత్యుత్తరముల నిచ్చునాడు శాప విమోచనమగునని కూడ ననుగ్రహించెను.

పాండవుల యరణ్య వాస సందర్భములో నహుషుడు పదివేల గజముల బలము గల భీముని పట్టుకొని బంధించెను. ఆ సంద్భ ములో ధర్మరాజు నహుషునికి ప్రత్యుత్తరము లొసగగా శాపవిమోచన మైనది.

బుస కొట్టుట సర్పలక్షణ[illegible], అధికార మధాంధుడు సర్పము వలె బుసకొట్టుట సహజము. న[illegible]షుని యైశ్వర్య మదమే యతని సర్పజన్మమునకు కారణము. చంద్రవంశపు రాజునకు మరియొక చంద్ర వంశపు రాజుచే శాప విమోచనము కలుగుట విశేషము.

4.2.2.3.2. గజ కచ్ఛప జన్మలు

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము" ద్వితీయాశ్వాసములో (36-78) గలదు. అన్నదమ్ములైన విభావస సుప్రతీకులు పరస్పరము శపించుకొనినవృత్తాంతములో గజ కచ్ఛప శాపము లున్నవి. ఇరువురును శాప కర్తలే. శాప ఫలముల నిరువురును ననుభవించిరి.

విభావస సుప్రతీకు లన్నదమ్ములు. తండ్రి మరణానంతరము విభాసుడు పితృసముడై గృహ కార్యములను చక్కదిద్దు చుండెను. కాని సుప్రతీకు డొకనాడు పిత్రార్జితమును సమ విభక్తము గావించుమని సోదరుని గద్దించెను. విభావసుడు తమ్ముని మీద కోపించి

కం॥ "ఏనుగవై యుండుమని" (67) శపించెను.
అదిగి నందుకే యాగ్రహించిన యన్నను చూచి తమ్ముడు

కం॥ "కూర్మమ వగుమని" (67) విభావసుని శపించెను.
జన్మ విపర్యయము నందినను వారు పూర్వ వైరమును మరువక కలహించుకొని చివరకు గరుత్మంతునికి నాహారమైరి.

సోదరులు పరస్పరము శపించు కొనిరి. కాని విమోచనమును వేడుట వారిరువురును పట్టించుకొన లేదు. చివరకు కశ్యపాత్మజుడగు గరుత్మంతుడు వారిని భక్షించెను.

తిక్కన భారతభాగము "అనుశాసనిక పర్వము" ప్రథమాశ్వాసములో (220-227) మధుకైటభులను రాక్షసులు పరస్పరము శపించుకొని గజ కచ్ఛప జన్మముల నెత్తి నట్లును, వాటి నాహారముగా తీసికొనుమని కశ్యప మహర్షి తన కుమారుడగు గరుత్మంతునికి తెలిపినట్లును, నితడట్లు చేసినట్లు రచించెను.

4.2.2.3.3. గ్రాహజన్మ

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వ" మష్టమాశ్వాసములో (62-163) గలదు. వంద లతాది "అప్సరసలు" మొసలి జన్మ మెత్తుట శాప విషయము. శాప కర్త "అగ్నికల్ప" డను బ్రాహ్మణుడు.

"వంద, సౌరభేయి, సమీచి, బుద్బుద, లత" అను వారు "అప్సరసలు". వారు దిక్పాలక లోకములను సందర్శించి భూలోకమున నడుగిడిరి. వారొక వనములో తపమును చేయు "అగ్నికల్ప" ని రూప సౌభాగ్య తపోనిష్ఠలను గుర్తించి తపో భంగమును చేయ నమకట్టిరి. ఆ ముని యెదుట నృత్యగీత పరిహాస ప్రసంగములను చేయుచు నాతని నాకర్షింప సమకట్టిరి. కాని "అగ్నికల్ప"ని తపోనిష్ఠ చెదర లేదు. అప్పుడా దేవకన్యలు శృంగార రసోచిత సల్లాపముల నొనర్చుచు వికారముగా ప్రవర్తించిరి. అప్పుడు తపోభంగమైన "అగ్నికల్పుడు" వారిని

వ॥ "మహా గ్రాహంబులుగా" (158) శపించెను.

వారు ముకుళిత హస్తులై క్షమా భిక్ష నర్థించిరి. జలాశయము నుండి యెవడు కడతేర్చునో యప్పుడే వారికి శాపవిమోచనమగునని యను గ్రహించెను. చివరకు ధనంజయానుగ్రహము వలన శాప విముక్తి కలిగినది.

మొసలి పట్టు, భల్లూకపు పట్టు మొదలైనవి జగ ద్ప్రసిద్ధములు. శాంత స్వభావుడని తెలిసినను తమపై పు త్రిప్పుకొనుటకై "అప్సరస"లు చేసిన ప్రయత్నములు మొసలి పట్టు వంటివే. అందు వలన వారికి గ్రాహ జన్మ సముచితము.

శాప ప్రదాత శాప విమోచన పద్ధతిని సూచించుట సహజము. కాని యిక్కథలో నారదుడు 'అప్సరస" లతో

కం॥ "జన నుతుడు పాండు తనయుండు
ధనంజయుు డశేష తీర్థ దర్శన కాంక్షం
జనుదెంచి మీకు దయ న
మ్మునిని చెప్పిన యట్ల శాప విమోక్షము సేయన్" (162)

అనుట చిత్రము.

4.2.2.3.4. కీటక జన్మ

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము ప్రథమాశ్వాసములో (2-26) గలదు. గ్రస్తుడు కీటక మగుట శాప విషయము. శాప కర్త భృగు మహర్షి.

గ్రస్తుడు రాక్షసుడు. అతడు భృగు మహర్షి భార్య నపహరించెను. అంత నతడు కోపించెను.

వ॥ "తదీయ శాపంబున గీటంబనై యుండెను." (24)

గ్రస్తుడు శాప విమోచనార్థ మర్థించెను. అంత నతడు పరశురాముని వీక్షణములతో శాప విముక్తి యగునని శాసించెను. గ్రస్తుడు కీటక మాయెను.

కర్ణుడు పరశురాముని శిష్యుడై విద్యా రహస్యముల నెఱింగెను. ఒకనాడు కర్ణుని తొడలపై పరశురాముడు సేద దీర్చుకొను చుండెను. ఇదియే తగిన సమయమని కీటకము కర్ణుని తొడను తొలచ సాగెను. రక్తము స్రవించి ప్రవహించెను. అది పరశురాముని శరీరమునకు చల్లగా తగిలెను. పరశురాముడు మేల్కొనెను. రక్తప్రవాహము నకు కీటకము కారణమని కర్ణుడు చూపించెను. పరశురామ సందర్శనముతో శాప విమోచనము కలిగినది.

దుష్టుడు తప్పును చేయుట సహజమే యైనను సజ్జనుడౌ దుష్టుని పాప ఫలము మరియొక మహాత్ముని సందర్శనము వలన తొలగు ననుట యిందలి విశేషము.

4.2.2.3.5. శునక జన్మ

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతిపర్వము తృతీయాశ్వాసములో (91-97) గలదు. శునక మనేక జంతు రూపములను పొంది మరల శునక మగుట శాప విషయము. శాప కర్త యొక ముని.

ఒక ముని యాశ్రమములో ననేక జంతువు లుండెను. వాటిలో నొక శునక మా మునిని భక్తి శ్రద్ధలతో సేవించు చుండెను. ఒకనాడు చిఱుతపులి యా కుక్కను తఱుముగా నది ముని దగ్గరకు పరుగెత్తు కొని వచ్చెను. అప్పు డా ముని తపశ్శక్తితో నా కుక్కను చిఱుత పులిగా మార్చెను. అట్లే పులి తఱుముగా పులిగా, "ఏనుగు" తఱుముగా "ఏనుగు"గా, సింహము వెంటాడగా సింహముగా, శరభము తఱుముగా శరభముగా మార్చెను. శరభ రూపమున నున్నప్పుడు దురాలోచనతో నా మునినే వధింప నెంచెను. అప్పు డా ముని యద్దాని యాలోచనను పసిగట్టి

తే.గీ॥ "———————ఈ యధము జాతి
యున్నత స్థితి యెఱుగునే యున్న పోలె
గుక్క యయి యుండు గాక" (96) అని పలికెను.

వెంటనే యా శరభము శునకమైనది.

జంతువులలో వెనుకటి గుణము నేమాత్రము మార్చు కొనలేని జంతువు శునకము. బలోపాయములు తోడైనప్పుడు మునిని చంపనెంచుట యద్దాని యాలోచనా విధాన మందలి హైన్యమే.

4.2.2.3.6. కృకల (తొండ) జన్మ

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనిక పర్వము"

ద్వితీయాశ్వాసములో (418-437) గలదు. నృగు డను రాజు కృకల (తొండ) జన్మము నెత్తుట శాప విషయము. దీనికి నతని ప్రమేయ మేమాత్రము లేకుండ జరిగిన పొరబాటు కారణము.

నృగు డను రా జొక గోవును నొక యుత్తమ బ్రాహ్మణునకు దానముగ నిచ్చెను. అది మేతకు వెళ్ళి రాజుకు చెందిన గోగణములో కలిసెను. మరియొక పర్యాయము రాజు గోవును దానము చేయు నప్పుడు పొరబాటున నా గోవునే గోపాలకులు తోలుకొని వచ్చిరి. రాజు కూడ తెలియక యా గోవును మరియొక బ్రాహ్మణునికి దానము చేసెను. తరువాత మొదటి బ్రాహ్మణుడు మరియొక బ్రాహ్మణుని నింట నున్న గోవును తనదిగ గుర్తించి చెప్పెను. రెండవ బ్రాహ్మణుడు దానిని రాజు తనకు దానము చేసినట్లు చెప్పెను. ఇరువురును రాజుకు విన్నవించిరి. రాజు బాధపడి మొదటి బ్రాహ్మణునికి చాల గోవుల నిచ్చెదనని పలికెను. కాని యతడు సమ్మతించ లేదు. రెండవ బ్రాహ్మణుడును సమ్మతించ లేదు.

కొంత కాలమునకు రాజు మరణించి యముని దగ్గరకు వెళ్ళెను. పాప పుణ్యములలో దేనిని ముందుగ ననుభవించెదవని యముడు రాజు నడిగెను. పాపమునని రాజు చెప్పెను. వెంటనే రాజు తలక్రిందుగ భూమిపై పడునప్పుడు యముడు దయా బుద్ధితో

తే.గీ॥ "వాసుదేవు డనేక సంవత్సరముల
కథిప నీ యున్న చోటికి నరుగుదెంచి
యుద్ధరించు నిన్నిట నిత్య సిద్ధ సౌఖ్య
మైన లోకమునకు జను దనఘ నీవు" (434)

అని చెప్పెను. ఆ మాటలతో నృగుడు భూమి మీద పడెను. కృకలా (తొండ) రూపు డయ్యెను. ఒకనాడు దైవదత్తమైన చిద్వరత్నముతో "ద్వారవతి" అను నూరు సమీపమున నొక బావియందు బృహత్శరీర ధారియై కాలమును గడప సాగెను. దారిన పోవు జనులు దానిని

చూచి,యద్దాన నీరు కలుషితమగుననితలచి వెలుపలకు తీయ ప్రయత్నించిరి. లాభము లేక పోయెను. శ్రీకృష్ణునికి తెలిపిరి. అతడు వెళ్ళి దానిని ప్రశ్నించెను. అది "ఏను నృగుడ"నని చెప్పెను. అతని దురవస్థకు కారణమును శ్రీకృష్ణు డడిగెను. తన పొరబాటు గోదాన మందలి విపర్యయమే యని చెప్పి, నీ "కతము వలన పాప విముక్తుడనైతి" నని చెప్పి, విమానములో నుత్తమ లోకములకు వెళ్ళెను.

పొరబాటైనను, గ్రహపాటైనను, తెలియక చేసినను, తెలిసి చేసినను, తప్పే యగు ననియు దాని ఫలితమును తప్పించు కొన లేమనియు నీ వృత్తాంతము వలన తెలియు చున్నది.

4.2.2 3.7. నకుల జన్మ

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అశ్వమేధ పర్వము" చతుర్థాశ్వాసము లో (213_284) గలదు. జమదగ్ని మహర్షి నకులమగుట శాప విషయము. శాప కర్త లతని పితృ దేవతలు.

జమదగ్ని ముని పితృ కార్యార్థము స్వయముగా హోమ ధేనువు పాలను పితికి కొత్త కుండలో భద్ర పరచెను. కాని జమదగ్ని చిత్తమును పరీక్షింప గోరి క్రోధాధి దైవము మానవాకారముతో నచట ప్రత్యక్షమై ప్రామాదికముగ పడవైచి నట్లా భాండమును నేల దొరలించెను. కాని జమదగ్ని కనుక వహించలేదు. క్రోధాధిదైవము జమదగ్ని సహనమునకు మెచ్చుకొనుచు తా నోడితినని పలికెను. జమదగ్ని పితృదేవతలు కోపగింతురు, కనుక తక్షణమే వెళ్ళుమని క్రోధాధిదైవమును వేడుకొనెను. కాని పితృదేవతలు పాల కుండ దొరలుటను, జమదగ్ని సహనమును గాంచి

వ॥ "నీవు శ్రాద్ధంబునకు సంకల్పించి యుండి తద్వైకల్యంబు పుట్టిన నూరకుండితని పలికి ముంగివయి పుట్టుమని" (282)

జమదగ్నిని శపించిరి.

అప్పుడు జమదగ్ని వారితో తపసికి కోపము తగదను నెపముతో క్రోధా ధిదేవతను కోపగించ లేదనియు, శాప విమోచనము ననుగ్రహింపు డనియు పితరులను ప్రార్థించెను. అప్పు డా పితరులు

వ॥ "విదగ్ధ విప్ర సమూహం బొడం బడు నట్టి యుచిత వాక్యం బుల నీ వెన్న డేని మహా ధర్మంబు కీ డని యాడితి నాడు నీకు శాప మోక్షం బగు నని" (284) నిర్దేశించిరి.

ముంగిసయైన జమదగ్ని బహు కాలము జీవించి ధర్మరాజు "అశ్వమేధ" యాగ సందర్భమున వెళ్ళి సక్తుప్రస్థుని కథను విన్న వించెను. ధర్మరాజాదు లొనర్చిన దానము సక్తుప్రస్థ ముని ధర్మ మునకు సమానము కాదని స్పష్ట పఱచెను. ఆ మహాముని "ఉంఛ వృత్తి" మహిమను గురించి చెప్పగా జమదగ్నికి శాప విముక్తి కలిగెను.

### 4.2.3. అవస్థా విపర్య యాత్మక శాపములు

"అవస్థ" యనుమాటకు కాలకృతమైన స్థితి విశేషమని యర్థము. జాగ్రత్, స్వప్న, సుషుప్తులు త్ర్యవస్థలు కాగా బాల్య, కౌమార, యౌవన, వార్ధక్యములు చతురవస్థలు. దర్శనము, మనస్సంగమము, సంకల్పము, జాగరము, కార్శ్యము, అరతి, అలజ్జ, ఉన్మాదము, మూర్ఛ, మరణోద్యమములు దశావస్థలు. జ్వర సంతాపాదులతో చేర్చి ద్వాదశావస్థ లగును. ఏదియేమైననూ కాలకృతమగు స్థితి విశేషము "అవస్థ" కాగలదు. ఈ "అవస్థా విపర్య యాత్మక" మగు శాపములు "ఆంధ్ర మహాభారతము"న మూడు విధములు. ఇవి 1) విద్యా విస్మృతి, 2) ఆహార విపర్య యాత్మక శాపము, 3) గౌరవ రాహిత్య శాపములు.

4.2.3.1. విద్యా, విస్మృతి శాపములు

నేర్చుకొనిన విద్య అవసరమునకు పనికిరాక పోవుటయో లేదా మరచుటయో యగుట యీ విభాగమున చేటును. ఇట్టివి "ఆంధ్ర మహాభారతములో రెండు గలవు. మొదటిది సంజీవనీ విద్యా నిరుపయోగత్వము, రెండవది భార్గవాస్త్ర విస్మృతి.

4.2.3.1.1. సంజీవని విద్యా నిరుపయోగిత్వము

ఈ వృత్తాంతము నన్నయ భాకతభాగము "ఆది పర్వము" తృతీయాశ్వాసములో (96-133) గలదు. సంజీవని విద్యా నిరుపయోగిత్వము కచునికి కలుగుట శాప విషయము. శాప కర్త దేవయాని.

దేవతల గురువైన బృహస్పతి యొక్క కొడుకగు కచుడు రాక్షసుల గురువగు శుక్రాచార్యుని దగ్గర మృత సంజీవినీ విద్యను నేర్చుకొనుటకు వెళ్ళి శిష్యునిగా చేరెను. గురువు చెప్పిన పనులను శ్రద్ధతో చేయుచు గురువుకును, గురువు కూతురగు దేవయానికిని ప్రియమైన వాడయ్యెను. ఈ విషయము రాక్షసులకు నచ్చలేదు. శుక్రాచార్యునికి తెలియకుండ రెండు పర్యాయములు కచుని చంపిరి. కాని దేవయాని పట్టుదలతో రెండు పర్యాయములును శుక్రాచార్యుడు కచుని బ్రతికించెను. రెండవ పర్యాయము బ్రతికించి నప్పుడు తప్పని సరిగా శుక్రాచార్యుడు మృత సంజీవినీ విద్యను కచునికి నేర్పించెను. పిమ్మట కచుడు దేవ లోకమునకు వెళ్ళుటకు గురువు ననుమతిని పొంది దేవయాని దగ్గర ననుమతి కొఱకు వెళ్ళెను. అప్పుడా దేవయాని తానతనిని ప్రేమించితినని పలికి, పెండ్లి యాడుమని కోరెను. గురువు కూతురు సోదరితో సమానమను నీతిని కచుడు చెప్పి తిరస్కరించెను. అందుకామె కోపించి

వ॥ "నీవు నా మనోరథంబు విఫలంబుగా జేసిన వాడవు నీకు
సంజీనని పని సేయకుండెడు మని శాపం బిచ్చెను" (132)

వెంటనే కచుడు "బ్రాహ్మణుడు వివాహ మాడకుండు గాక" అని దేవ యానిని శపించి వెళ్ళెను.

తనకు చాల సన్నిహితులుగా నున్నవారు తన యభ్యర్థనను సమ్మతించనప్పుడు పురుషుని కంటె స్త్రీ యెక్కువగ సహనమును కోల్పోవును. అందులోను కాబోవు దాంపత్య ప్రేమ విషయములో స్త్రీకి నింకను నెక్కువ సహనము తగ్గి కోప మెక్కువై యంత వరకు నా వ్యక్తి బాగును కోరిన యామె తన కతడు పూర్తి బద్ధ శత్రువగ భావించి యతని నాశనమునకు ప్రయత్నించు ననుట యీ శాప విషయము తెలుపుచున్నది. యుక్తాయుక్తములను మరచి స్త్రీ పురులు పెంచుకొనుట, యట్లే తగదను కోపముతో పురుషుడు శపించుట లోక సైజము.

4 2.3.1.2. భార్గవాస్త్ర విస్మృతి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము కర్ణ పర్వము ద్వితీయాశ్వాసములోను (87-88, 341-348), శాంతి పర్వము ప్రథమాశ్వాసములోను (19-27) గలదు. భార్గవాస్త్ర ప్రయోగ విస్మృతి కర్ణునకు కలుగుట శాప విషయము. శాప కర్త పరశురాముడు.

కర్ణుడు ధనుర్విద్యా గ్రహణార్థము తాను బ్రాహ్మణుడనని చెప్పి పరశురాముని శిష్యుడయ్యెను. పరశురాముడును కర్ణునికి భార్గవ బ్రహ్మాస్త్రముల ననుగ్రహించెను. ఒకనాడు పరశురాముడు కర్ణుని తొడపై తలనుంచుకొని పడుకొని, విశ్రమించుచుండెను. కీటక మొకటి కర్ణుని తొడను తొలచ సాగెను. పరశురామునికి నిద్రాభంగ మగునని కర్ణుడు కదల లేదు. రక్తము ప్రవహించెను. ఆ రక్త స్పర్శకు పరశురాముడు లేచి కారణమును తెలిసికొని, సహనము

బ్రాహ్మణుల కుండదని "నీ వెవ్వడవో తెలుపు" మని ప్రశ్నించెను. కర్ణుడు తన నిజ వృత్తాంతమును తెలిపెను. అప్పుడు పరశురాముడు కోపించి

వ॥ "కపటంబున బ్రహ్మాస్త్రంబు బరిగ్రహించి తది నీకు వలయు కాలంబున దోపమియు మృత్యు వాసన్నం బైనం దోచుటయు నాపద ముట్టిన యెడ భార్గవాస్త్రంబు దోపకుండుటయుం గలి గెడు మని శపించెను." (89)

అర్జునుడు కర్ణుని చుట్టుముట్టినప్పుడు భార్గవ బ్రహ్మాస్త్రములు కర్ణునికి తోపలేదు.

ఈ వృత్తాంతమున నిరువురి దోషము లున్నవి. ఒక వర్ణము వారికి విద్యను నేర్పుదుననుట పరశురామునికి తగనిది. కపటముతో విద్యను నేర్చుట కర్ణునికి తగనిది. సచ్ఛిష్యుని పోగొట్టుకొనుట పరశు రాముని వంతుకాగా, నేర్చిన విద్య నిష్ప్రయోజన మగుట కర్ణుని వంతైనది.

4.2.3.2. ఆహార విపర్యయాత్మక శాపము

ఆహారపు టలవాట్లు వ్యక్తి స్వభావము ననుసరించినవి. ఏ వ్యక్తి యైనను శాపము వలన విరుద్ధమైన యాహార సేవనము చేయవలసి వచ్చుట యాహార విపర్యయము కాగలదు. "ఆంధ్ర మహాభారత మున నిట్టి శాప వృత్తాంత మొకటి గలదు.

కల్మాషపాదుని మనుష్య మాంస భక్షణము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము" సప్తమాశ్వాసములో (2,91,111,117) గలదు. మనుష్య మాంస భక్ష ణము కల్మాషపాదునకు కలిగిన శాప విషయము. శాప కర్త 1) శక్తి, 2) ఒక బ్రాహ్మణుడు.

కల్మాషపాదుడు "ఇక్ష్వాకు" వంశపురాజు. అత డొకనాడు వేటకు వెళ్ళి యలసటను తీర్చుకొనుటకై తన పురోహితుడగు వసిష్ఠ మహర్షి యాశ్రమమునకు వెళ్ళు చుండెను. దారిలో వసిష్ఠుని జేష్ఠ పుత్రుడగు "శక్తి" యెదురయ్యెను. కాని యతడెవరో కల్మాషపాదునకు తెలి యదు. కనుక రాజోజితాహంకారముతో దారి తొలగుమని రాజు 'శక్తి' నాదేశించెను. కాని యుచితోక్తులు పలికినచో బ్రాహ్మణోత్తములు దారి తొలగుదురని "శక్తి" పలికెను. తన మాటకు నెదురాడిన "శక్తి"ని రాజు కట్టెతో కొట్టెను. అప్పుడా "శక్తి" కోపించి

వ॥ "నీవు రాక్షస భావంబున నకారణంబ నాకు నికారంబు సేసితి కావున రాక్షసుండ వయి మనుష్య పిశితం బశనంబుగా నుండు మని శాపం బిచ్చెను." (113)

అప్పుడా రాజు "శక్తి"ని వసిష్ఠ పుత్రుడని గ్రహించి శాప వ్యపా యమును ప్రసాదింపుమని ప్రార్థించ దలచిన సమయమునకు విశ్వా మిత్రుని మాయోపాయము చేత రాజులో కింకరుడను రాక్షసు డావే శించి యుండుట వలన నడుగలేక పోయెను. శాప ప్రభావముచే నతడు మనుష్య మాంస భక్షణమును చేయుచు రాజ్య పాలనమును చేయు చుండెను.

తరువాత కొంత కాలమునకు నొక బ్రాహ్మణుడు తనకు మాంస భోజనము కావలయునని కల్మాషపాదుని నర్థించెను. అందుకు రాజు సమ్మతించెను. కాని కారణాంతరము వలన నతని కోరికను మరచి పోయెను. అర్ధరాత్రి సమయమున బ్రాహ్మణుని కోరిక రాజుకు గుర్తు వచ్చెను. రాత్రి యగుటతో రాక్షసభావము నావహించుటచే మనుష్య మాంసముతో భోజనమును బ్రాహ్మణునికి పెట్టుమని వంట వాని నాదే శించెను. అతడు వధ్యస్థానమునకు వెళ్ళి మానవ మాంసమును తెచ్చి వండి పెట్టెను. బ్రాహ్మణుడు దివ్య దృష్టితో చూచి దానిని మనుష్య మాంసముగా నెఱిగి రాజుపై కోపించి

కం॥ "తివిరి యభోజ్యం బగు మా
నవ మాంసముతోడ భోజనము పెట్టిన వా
డవు నీవు మనుష్యాదుడ
వవు మని" (16) శాపము నిచ్చెను.

తరువాత కల్మాషపాదుడు "శక్తి" దగ్గరకు వెళ్ళి యతని వలననే యట్టి శాపములు కలిగెనని యతనిని చంపి తినెను. తరువాత విశ్వామిత్ర ప్రేరితుడై వసిష్ఠ పుత్రుల నందరిని చంపెను.

అహంకారము వలన కలుగు కీడులను గురించి చెప్పుట యీ శాప ప్రయోజనము.

4.2.3.3. గౌరవ రాహిత్య శాపము

గౌరవ రాహిత్యమునకు సంబంధించిన శాపము "ఆంధ్ర మహా భారతము"న నొకటియే కలదు.

దీర్ఘతముని శాపము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము" చతుర్థాశ్వాసములో (227-231) గలదు. భర్త లేని స్త్రీకి గౌరవ రాహిత్యము కలుగుట శాప విషయము. శాప కర్త దీర్ఘతము డను బ్రాహ్మణుడు.

దీర్ఘతముని భార్య ప్రద్వేషిణి. ఆ యిద్దరికి పెక్కండ్రు పుత్రులు. బృహస్పతి శాపము వలన పుట్టుకతోనే దీర్ఘతము డంధుడయ్యెను. వివాహత్పూర్వము భర్తను గౌరవించిన ప్రద్వేషిణి సంతాన ప్రాప్త్యనంతరము చులకనగా చూడసాగిరి. దీర్ఘతము డామె పరివర్తనను మెచ్చక నిరాదరణకు కారణము నడిగెను. భర్త మాటకు సమాధానముగ ప్రద్వేషిణి "పతి తాను పెండ్లి చేసికొనిన స్త్రీని భరించును. కావున భర్త యయ్యెను. స్త్రీ పెండ్లియైన పిమ్మట పతిచే భరింపబడును. కావున భార్య యయ్యెను. అలోచించినచో నివి మన యందు

వ్యతిరేకముగ నున్నవి. కావున నిన్ను నే నెల్లకాలమును భరించ లేను. నీ వెచటికైనను వెళ్ళు" మని దయ లేకుండ కోపముతో చెప్పెను. అప్పుడు దీర్ఘతముడు స్త్రీలు నిర్దయాత్ములనుచు

కం॥ "పతి హీను లయిన భామిను
లతి ధనవంతు లయ్యు గులజ లయ్యును ననలం
కృత లయ్యెడు గృపణ వృత్తి నిదియు మొదలుగన్"
(230) అని శపించెను.

కారణాంతరము వలన భర్త శక్తిహీనుడై, సంపాదన రాహిత్యుడై నప్పుడు భార్య యతనిని చులకనగా చూచు సన్నివేశమునకు నీ శాప మొక సాక్ష్యము.

4.2.4. అనుభూతి విపర్యయాత్మక శాపములు

"అనుభూతి" యనగా ననుభవింపబడినదని యర్థము. తా నెట్టి గౌరవ మర్యాదల ననుభవింప వలయునో యట్లుగాక మరొకరి గౌరవ మర్యాదలకై పాటు పడవలసి వచ్చుట "అనుభూతి విపర్యయ" మగును. ఈ యనుభూతి తన యోగ్యతాహరణము, రూప విపర్యయము, తనదగు వస్తు వినాశన క్లేశము కావచ్చును. ఇట్టివి "ఆంధ్ర మహాభారతములో "ఆరు" గలవు. ఇవి 1) అనూరుని, 2) నల మహారాజు 3) వైశ్రవణ, 4) బక మునీంద్ర, 5) విశ్వామిత్ర, 6) గోలోక ధేనువుల శాపములు.

4.2.4.1. అనూరుని శాపము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము" ప్రథమాశ్వాసములోను (158-160), ద్వితీయాశ్వాసములోను (2-7, 37-120) గలదు. సవతికి దాసియై యుండుమనుట వినతకు కలిగిన శాప విషయము. శాప కర్త "అనూరుడు".

ఆదిమ యుగమున కద్రువ వినతలు పుత్రార్థులై భర్తయగు

కశ్యపుని నారాధించిరి. అతడు వరమం అను కోరుకొనుడని యాదేశిం చెను. కద్రువ పుత్ర సహస్రమును, వినత వారి కంటె బలవంతులగు పుత్రద్వయమును కోరినది. కశ్యపుడు అనుగ్రహించెను. కొంత కాల మునకు వారికి సంతానోత్పత్తి కలుగగా వారు నేతికుండలలో పెట్టి రక్షించు చుండిరి. ఐదు వందల యేండ్లకు కద్రువ రక్షించిన కుండల లోని గ్రుడ్లు విడిగెను. అందుండి "ఆదిశేషాదు"లు జన్మించిరి. సవతి పుత్ర భాగ్యమును చూచి వినత బాధ పడినది. తాను రక్షించు కుండలోని యొక గ్రుడ్డును చిదుమగా "అనూరుడు" పుట్టెను. అతడు కోపించి

వ॥ "నన్ను సంపూర్ణ శరీరుం గానీక యండం బవియించిన
యవినీతవు గావున నీవు నీ సవతికి దాసివై యేనూఱేండ్లుండు
మని శాపం బిచ్చెను" (7)

మఱియు వినత యడుగకనే యామెకు రెండవ యండమును రక్షిం చుమనియు, నందుండి జనించు మహా బల పరాక్రమ సంపన్నుడు తల్లి దాస్యమును వాపుననియు చెప్పి సూర్యభగవానుని సారథిగా వెళ్ళెను. తరువాత పుట్టిన గరుత్మంతుడు "అమృత భాండమును" తెచ్చి యిచ్చుటచే వినతకు దాస్య విమోచన మయ్యెను.

అసూయా, మాత్సర్యము లున్నవారు తగిన ఫలితము నను భవించకుండ తప్పించుకొనలేరను విషయము స్పష్టమగు చున్నది.

4.2.4.2. నల మహారాజు శాపము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య పర్వము" ద్వితీయాశ్వాసములో (2.7,164-131) గలదు. శాపమునకు గురికాబోవు వ్యక్తి శనిదేవత. శాప కర్త నల మహారాజు.

దమయంతి రెండవ స్వయంవరమునకు వెళ్ళునప్పుడు ఋతు పర్ణరాజు రథమును బాహుకుడు (నలుడు) నడుపు చుండిన సమయ మున దారిలో నొక విభీతక వృక్షము దగ్గర ఋతుపర్ణుని "అక్షహృదయ

విద్య"ను పరీక్షించుటకు నాగిరి. అప్పుడు బాహుకుని కోరికపై ఋతుపర్ణుడు "అక్షహృదయ విద్య"ను బాహుకునకు నేర్పించెను. పూర్వము నలుని నావేశించిన కలి (శని) యప్పుడా విద్యా ప్రభావముచే కర్కోటక విషమును గ్రక్కుచు వెలువడి నలునికి నమస్కరించి తనను గురించి తెలిపెను. అప్పుడు బాహుకుడు (నలుడు) కలి (శని)ని చూచి

ఆ.వె॥ "................తా నల్గి శావ మీ
　　నున్న" (180)

కలి యా విషయమును గ్రహించి నలునితో

ఆ.వె॥ "................నిన్ను బొంది
　　యహి విషంబుచేత ననిశంబు దగ్ధుండ
　　నైతి నింక నాకు నలుగ వలదు" (180)

వ॥ "నిన్నుం గీర్తించిన జనంబులు నా వలని భయంబు బొందరు నాకుం గరుణింపు మనెను" (181)

నలుడు శనిదేవత ప్రార్థనను విని

వ॥ "కోపం బుడిగెను" (181)

మనిషిలోని ధర్మనిష్ఠకు, తేజో మహిమకు దేవతలు గూడ జంకుదురను విషయ మీ శాపము వలన తెలియు చున్నది.

### 4.2.4.3. వైశ్రవణ శాప వృత్తాంతము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య పర్వము" షష్ఠాశ్వాసములోను (267-286), సప్తమాశ్వాసములోను (151-168) గలదు. రావణునికి విమానాపహరణము కలుగుట శాప విషయము. శాప కర్త వైశ్రవణుడు.

అన్ని లోకములకు కర్తయగు బ్రహ్మకు పులస్త్యుడు మానస పుత్రుడు. అతని కొడుకు వైశ్రవణుడు. వైశ్రవణుడు తన తండ్రిని

వదలి తాతయగు బ్రహ్మనుద్దేశించి తపస్సును చేసి నలకూబరుడను కొడుకును, లోక పాలకత్వమును, ధనేశ్వరత్వమును, లంకయను పురమును, శంకరునితో సఖ్యమును వరములుగా పొంది మహావిభూతి (సంపద)తో వర్ధిల్లు చుండెను. అందుకు పులస్త్యుడు కోపించి తన శరీరమునం దర్ధభాగము నుండి విశ్రవసుడను వానిని పుట్టించి, వైశ్రవణునికి కష్టమును కలిగించు మని చెప్పెను. ఆ విషయమును వైశ్రవణుడు తెలిసికొని విశ్రవసుని దగ్గరకు వెళ్ళి "మహాత్మా ! నేను నీకు పుత్రుడ నయ్యెదను. నన్ను కరుణింపు" మని పలికి యతనిని సంతోష పఱచి, నృత్యగీత విశారదులైన పుష్పోత్కట, మాలిని, పాక యను పేర్లు గల రాక్షస స్త్రీల నా విశ్రవసునికి పరిచారికలుగా నియమించెను. విశ్రవసునికి పుష్పోత్కట వలన రావణ కుంభకర్ణులును, మాలిని వలన విభీషణుడును, పాక వలన ఖరుడు, శూర్పణఖలును పుట్టిరి. వీరిలో విభీషణుడు తప్ప మిగిలినవారు దుర్మార్గులు. కొడుకులకు విశ్రవసుడు వేద వేదాంగ ధనుర్వేదములను నేర్పించెను. ఒకనాడు విశ్రవసునికి నమస్కరించుటకు గంధమాదన గిరికి వైభవముతో గొప్పగ వైశ్రవణుడు వచ్చెను. అప్పుడు రావణుడు వైశ్రవణుని సంపదకు నసూయపడి, వైశ్రవణుడు సంపదను పొందిన విధానమును గురించి తెలిసి కొనెను. తరువాత రావణుడు బ్రహ్మనుద్దేశించి తపస్సును చేసి, "మానవుని చేత తప్ప నింకెవరి చేతను మరణమును పొందకుండు" నట్లు వరమును పొంది, యా వర గర్వముతో వైశ్రవణుని పైకి యుద్ధమునకు వెళ్ళెను. వైశ్రవణు డా విషయమును తెలిసికొని లంకను వదలి పెట్టి వెళ్ళుచుండగ రావణుడు వెన్నంటి వైశ్రవణుని మానమును మఱియు విమానము నపహరించెను. అప్పుడు వైశ్రవణుడు కోపించి

వ॥ "గురుండగు నన్ను నవమానించితివి గావున నివ్విమానంబు నీ పగతు పాలయ్యెడు మని శపించెను" (286)

తరువాత కొంతకాలమునకు జరిగిన రామ రావణ యుద్ధములో

శ్రీరాముడు రావణుని చంపి, లంకా రాజ్యమును విభీషణునికి నప్పగించెను. సీతాదేవి, లక్ష్మణ, హనుమంత, సుగ్రీవాదులతో కలిసి యా పుష్పక విమానములో "అయోధ్యకు" చేరెను. పిమ్మట నా పుష్పక విమానమును వైశ్రవణునికి పంపెను.

తండ్రిని కుమారు, డన్నను తమ్ముడు గౌరవించక పోవుటచే కలుగు ననర్థముల నీ శాపము విశదపఱచు చున్నది.

4.2.4.4. బక మునీంద్ర శాపము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శల్య పర్వము ద్వితీయాశ్వాసములో (142-145, 165, 168) గలదు. ధృతరాష్ట్రు డను రాజు రాజ్యములోని సకల జంతువులకు కష్టమును కలిగించుట శాప విషయము. శాప కర్త బకుడను ముని.

పూర్వము బకుడను పేరు గల మునీంద్రు డొక యావును దానముగా నిమ్మని ధృతరాష్ట్రు డను పేరు గల రాజు నడిగెను. రాజందుకు నంగీకరించ లేదు. మరియు మునినే యధిక్షేపించి పలికెను. అందుకు ముని కోపించి

కం॥ "————హోమ మొసప్పెను
ఘృత నరమాంసముల నతనికిం గీ డొదవన్" (166)

దాని ప్రభావము వలన రాజు రాజ్యములోని జంతువు లన్నియు నఱకబడిన యడవి వలె న్యూనత చెందెను. అప్పుడు రాజు భయపడి యా ముని దగ్గరకు వెళ్ళి నమస్కరించి యనేక విధములుగ స్తుతించి యా మునికి ననేక యావుల నిచ్చి, తన కష్టములను తొలగించు కొనెను.

అధికారాహంకారములను పక్కకు పెట్టి రాజు సమయ సందర్భములను బట్టి ప్రవర్తించుట లెస్సయని యా శాపము విశదము చేయుచున్నది.

4.2.4.5. విశ్వామిత్ర శాపము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శల్య పర్వము ద్వితీయాశ్వాసములో (142-145, 163, 155, 168, 171) గలదు. శాపమును పొందినది సరస్వతీ నది. శాప కర్త విశ్వామిత్ర మహర్షి.

విశ్వామిత్రుడు క్షత్రియుడు. కన్యాకుబ్జ దేశపు రాజు. ఇతడు రాక్షసులను నాశనము చేయుటకు సైన్యముతో బయలు దేరెను. దారిలో వసిష్ఠ మహర్షి యాశ్రమము దగ్గర విడిది చేసిరి. వసిష్ఠుడు తన హోమధేనువును రుచికరములగు పదార్థముల నడిగి వారికి నాతిథ్యము నిచ్చెను. అందుకు మెచ్చుకొని విశ్వామిత్రు డా హోమ ధేనువు నిమ్మని వసిష్ఠు నడిగెను. అతడు సమ్మతించ లేదు. విశ్వామిత్రుని సైన్యము బలవంతముగా నా యావును తీసికొని పోవుటకు ప్రయత్నించిరి. అప్పుడు వసిష్ఠుడు కోపించి "నీ బలమును పంపు" మని యావుకు చెప్పెను. ఆవు తన నుండి గొప్ప వీరులను పుట్టించి పంపెను. వారు విశ్వామిత్రుని సైన్యమును నాశనము చేసిరి. విశ్వామిత్రు డవమానమును పొంది రాజ్యపాలనను చేయుట మాని తపస్సును చేసి మహిమను పొంది వసిష్ఠుని చంపవలయునని భావించి, యట్లు చేయుటకు పూనెను. విశ్వామిత్రుడు బ్రహ్మర్షియైన తరువాత నొకనాడు వసిష్ఠుని చంపుటకు సరస్వతీ నదిని మనస్సులో తలచెను. ఆ నది వెంటనే సౌమ్యమైన స్త్రీ రూపములో ప్రత్యక్షమై "పనియేమి" అని యడిగెను. "వసిష్ఠుని నా దగ్గరకు తీసికొని రమ్మ"ని నదికి చెప్పెను. వసిష్ఠ విశ్వామిత్రుల తపో వైభవమునకు నామె భయపడి యా విషయమును వసిష్ఠునికి చెప్పెను. వసిష్ఠు డామెతో "విశ్వామిత్రుడు చెప్పినట్లు చేయుము, లేనిచో శపించు"నని చెప్పెను. ఒకనాడు వసిష్ఠుడు సరస్వతీ నది దగ్గర తపస్సును చేసికొనుచుండగా నతడు కూర్చొనియున్న స్థలము నామె యపహరించి విశ్వామిత్రుని దగ్గరకు తీసికొని వెళ్ళి యప్పగించెను. విశ్వామిత్రు డా నదిని స్తుతించి,

వసిష్ఠుని చంపుటకు సాధనమును వెదకు చుండెను. అప్పు డా నది విశ్వామిత్రుని వంచించి తన నీటి ప్రవాహముచే వసిష్ఠుని తొలగించెను. అందుకు విశ్వామిత్రుడు కోపించి యా నదిని

వ॥ "శోణిత వాహిని వగు మని శపించెను" (170)
ఆ నది యట్లయ్యెను. ఆ నదిని దైత్యులు సేవించుచుండిరి. ఒక సంవత్సరము తరువాత కొందరు మును లచటికి వచ్చిరి. శోణిత వాహిని యగుటకు కారణము నడిగిరి. రక్త ప్రవాహము కాకుండునట్లు నుగ్రహించిరి. తామే యందు స్నాన మాడిరి.

కొందరు స్వసామర్థ్యము వలన మహోన్నతులు కావచ్చును. కాని వారిలో నిద్రాణమైన దుడుకుదనము మాసిపోదు. అది మాత్స ర్యవిషయములో బహిర్గత మగును.

4.2.4.6. గోలోక ధేనువుల శాపము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనికపర్వము" తృతీయాశ్వాసములో (62-80) గలదు. భూలోక మందలి గోవులకు శాపము కలుగుట యిందలి విషయము. శాప కర్తలు గోలోక మందలి కామరూపిణులగు గోవులు.

భృగు వంశ సంభవుడైన సుమిత్రుని కడ నొక గోవు కలదు. క్రమముగా దాని సంతతి హెచ్చెను. ఆ యావులు చిత్రవర్ణ శోభితములు. ఒకనాడు సుమిత్రుని గోవులు మేయు చుండిన సమీపమున గల సరస్సులో కామరూపిణులగు గోవులు కొన్ని స్త్రీల రూపములను ధరించి జలక్రీడలాడు చుండెను. వారిని చూచిన సుమిత్రుని గోవులు "మీరెవ్వ"రని మనుష్య మాటలలో నడిగెను. వారు "మేము గోవుల" మని చెప్పిరి. "ఇటువంటి యద్భుతానుభవము మీ కెట్లు కలిగె"నని మరల సుమిత్రుని గోవు లడిగెను. ఆ స్త్రీలు "హవ్యకవ్యములకు నతిథి పూజలకు వారి యాహారములకు, బ్రాహ్మణులకు పాల నిత్తుము. వారి

పనులను చేయుటకు మా పుత్రులను పంపుదుము. కావున మా సుకృతముల కారణముగా మా కీ గొప్పదనము కలిగెను. మాకు గోలోకము లభించు"నని గోవులతో చెప్పిరి. ఆ మాటలను వినిన సుమిత్రుని గోవులు దీన ముఖములతో నా స్త్రీలను 'గోవులకు గోవులే గతి. కావున మాకును సుగతి కలుగున ట్లుపాయమును చెప్పు" మని యడిగెను. అందుకు స్త్రీలు "రంతిదేవుడు వేయి సంవత్సరముల కాలము పాటు యజ్ఞమును చేయును. ఆ యజ్ఞమున గోవులను వధించును మీ రా యజ్ఞమునకు వెళ్ళుడు. అతడు మిమ్ములను వధించుటతో మీకును గోలోకము లభించు"నని చెప్పిరి.

వెంటనే సుమిత్రుని గోవులు రంతిదేవుని యజ్ఞమునకు వెళ్ళుటకు ప్రయత్నించగా వాటిలో నొక గోవు "మనము సుమిత్రుని ధనము కదా! అతని యనుమతి లేనిదే యెట్లు వెళ్ళ గల"మని పలికెను. ఆ మాటలను వినిన యితర గోవులు "సుమిత్రుని చంపుదుము. అప్పు డతడు కూడ గోలోకమునకు వచ్చును కదా!" అని పలికెను. అన్ని గోవులును సుమిత్రుని చంపుటకు వెళ్ళి భయపడి యతనిని తేఱి చూడలేకుండ వెను తిరిగెను. అప్పుడు వాటిలో నున్న కొన్ని కపిల వర ధేనువు లితర ధేనువులతో "మే మతి క్రూర చిత్తులము. అతనిని వధించెదము. మీరు మా కేమి మేలును చేయుదు"రని ప్రశ్నించెను. ఆ ప్రశ్నకు సమాధానముగ నితర గోవులు "సకల వర్ణ ధేనువుల సమూహమునకు కపిల వర్ణ ధేనువు శ్రేష్ఠముగ కాగలదనియు, కపిల వర్ణ ధేనువును దానముగ నిచ్చినచో నూరు గోవులను దానముగ నిచ్చినట్లుగా వరమును మీ కిత్తు"మని పలికెను. ఆ మాటలకు కపిల వర్ణ గోవులు సంతోషించి కామ రూపిణులగుటచే రూపాంతరములను పొంది సుమిత్రుని దగ్గరకు వెళ్ళి "మేము గోమాతలము. నీ గో సమారాధనకు మెచ్చి వరము నిచ్చుటకు వచ్చితిమి. వరము నడుగు"మని యతనితో పలికెను. అతడు వాటిని "ఎలప్పుడును గోవుల వలన

భక్తి స్నేహములు కలుగునట్లు వరము నిమ్మని కోరెను. అతని కోరి కను వినిన యవి "అట్ల యయ్యెడు గాక" అని పలికి యతనితో మరల "నీ కీ లోక మెందుకు? మన గోలోకమునకు రమ్ము" అని పలికెను. అతడు "నేను నా గోవులను వదలి వచ్చుటకు నర్హుడనా?" అని ప్రశ్నిం చెను. వెంటనే యా కపిల వర్ణ గోవు లతనిని కొమ్ములతో పైకెత్తి యోగబలముచే నతని ప్రాణమును పోగొట్టి కళేబరమును భూమిపై పడవేసి కొమ్ములతో, కాళ్ళతో పిండి యగునట్లు చేసెను. ఆ విషయ ము నితర గోవులకు చెప్పెను. అవి సంతోషించెను.

మరణించిన పిమ్మట గోలోకమునకు వెళ్ళిన సుమిత్రుని గోలోక మందలి ముఖ్యమైన గోమాత లాదరించి యతని గోవుల పద్ధతి నతనికి తెలిపి, యతనికి గోలోకమే మంచిదని పలికి యతనిని సంతోష పఱి చెను. పిమ్మట నవి బ్రాహ్మణుడైన సుమిత్రుని చంపిన యన్ని గోవులకును

వ॥ "మీ వంశం బఱచి వదనం బయ్యెడు మని శాపం బిచ్చెను" (80)

శాపపు మాటలను వినిన సుమిత్రుని గోవులు రంతిదేవుని దగ్గరకు వెళ్ళి సుగతిని వేడి తమను యజ్ఞ బలి పశువులుగా చంపుమని మానుషమాట లలో నతనిని ప్రార్థించెను. అత డట్లు చేసెను.

స్వార్థము బలీయము. అది పోషకులను గూడ లెక్క చేయదు. కనుక సజ్జనులు ధర్మార్థ మా స్వార్థ శక్తులను శపింపక మానరు.

### 4.3. స్వరూప వైకల్య శాపములు

"రూప" మనుమాటకు "ఆకార" మని సామాన్యార్థము. శాపము వలన రూప వైకల్య మేర్పడుట యిందలి ప్రధానాంశము. ఈ వైక ల్యము మూడు రకములు. 1) యావద్దేహ, 2) అంగ, 3) మర ణాదుల వలన వైకల్యములు.

### 4.3.1. యావద్దేహ వైకల్యము

శాపము కారణముగా శాపగ్రస్తుని దేహము నంతట - అనగా- సర్వాంగములందును వైకల్యము స్పష్టముగా గోచరించుట. ఇట్టివి "ఆంధ్ర మహాభారతము"న నేడు గలవు. ఇవి 1) జరత్వ, 2) షండత్వ, 3) వక్రాంగత్వ, 4) వృద్ధిక్షయత్వము, 5) దిగ్ధాంగత్వము, 6) స్త్రీత్వ ప్రాప్తులు.

#### 4.3.1.1. జరత్వ సిద్ధి

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము" తృతీయాశ్వాసములో (134-190) గలదు. యయాతి జరాభార పీడితుడగుట యిందలి శాప విషయము. శాప కర్త శుక్రాచార్యుడు.

యయాతి భార్య దేవయాని. శర్మిష్ఠ దేవయానికి దాసి. ఒక నాడు యయాతి వన విహారము చేయుచుండగా శర్మిష్ఠ యతనిని చూచి వలచినది. కోరివచ్చిన వారి పొందు ధర్మమని ప్రోత్సహించినది. రాజు కాదనలేక పోయెను. శర్మిష్ఠాయయాతులకు "ద్రుహ్యు, అను, పూరువు"లను ముగ్గురు కుమారు లుదయించిరి. ఒకనాడు దేవయాని వన విహారమును గావించుచు ద్రుహ్యాదులలో యయాతి పోలికలను గుర్తించి తల్లిదండ్రు లెవరని గద్దించినది. వారు శర్మిష్ఠాయయాతులను చూపిరి. దేవయాని తండ్రికా విషయమును చెప్పినది. శుక్రాచార్యుడు కోపించి యయాతిని

వ॥ "నీవు యౌవన గర్వంబున రాగాంధుడవై నా కూతున కప్రియంబు సేసితివి కావున జరాభార పీడితుండవు గమ్మని శాపం బిచ్చెను" (187)

యయాతి ప్రార్థింపగా కుమారులలో నెవరేని జరత్వమును స్వీకరింప దలచిన పునర్యౌవనము వచ్చునని తెలియ జేసెను.

యౌవన మున్నప్పుడే శృంగార రస విలాసములు. యౌవన గర్వముతో కామేచ్ఛతో ధర్మపత్ని దేవయానితో తృప్తి పడక శర్మిష్ఠ కోరికకు తలనొగ్గుట యకృత్యము. ఇట్లే నెందరేని స్త్రీలను లోగొన గలడని శుక్రాచార్యుడు యయాతిని శపించుట యుక్తము. శపించిన తరువాత గాని శుక్రాచార్యునికి దేవయాని గుర్తుకు వచ్చెను. కనుక కుమారులలో నెవరికేని జరత్వ మొసగి శృంగార విలాసముల ననుభ వింపు మని యాదేశించెను.

4.3.1.2. షండత్వ సిద్ధి

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య పర్వము" ప్రథమాశ్వాసములో (337-368) గలదు. అర్జునుడు నపుంసకు డగుట శాప విషయము. శాప కర్త "అప్సరస" యగు "ఊర్వశి".

అర్జునుడు "ఇంద్రుని యాహ్వానము మేరకు స్వర్గమునకు వెళ్ళె ను. ఇంద్రు డతనికి సకల గౌరవ మర్యాదలను చేయుటతో బా టతనిని సంతోష పెట్టుటకై "ఊర్వశి"ని పంపెను. కాని "అర్జును" డామెను "తల్లీ" యని సంబోధించెను. ఊర్వశికి నోడలు మండినది. స్వర్గ లోకములో వావి వరుసలు లేవనియు తాను "తల్లి" యెట్లగుదునని ప్రశ్నించినది. చంద్రవంశ కర్త యగు పురూరవునికి భార్య యగుట వలనను, "ఇంద్రు"నికి పరిచర్యను చేయుట వలనను, "తల్లి" వైతి వని "అర్జునుడు" చెప్పెను. వెంటనే "ఊర్వశి" కోపించి

వ॥ "ఏను కామించి వచ్చిన నా మనోరథము విఫలంబు జేసిన
వాడవు నీవు మర్త్యలోకంబున మాన వర్జితుండవై మానినీ
మధ్యంబున నపుంసకుండవై యుండు మని శాపం బిచ్చెను.
(365)

మరుసటి రోజు "ఇంద్రుడు" డా వృత్తాంత మెఱిగి మెచ్చుకొని యా షండత్వ మజ్ఞాతవాస సమయమున నుపకరించుననియనుగ్రహించెను.

ఈ వృత్తాంతములో మూడంశము లున్నది. మొదటిది "అర్జు ను"ని శీల పరీక్ష. రెండవది యజ్ఞాత వేషధారణ. మూడవది యతిథి గౌరవ విధానము. ఈ షండత్వ శాపమే లేకున్నచో నజ్ఞాతవాసనమయ మున "అర్జునుడు" మనుట కష్టము.

4.3.1.3. వక్రాంగిత్వ సిద్ధి

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య పర్వము" తృతీయాశ్వాసములో (237-242) గలదు. గర్భస్థ శిశువునకు శాపము కలుగుట యిందలి శాప విషయము. శాప కర్త "ఏకపాదు" డను తాపసవరేణ్యుడు.

ఏకపాదుని భార్య సుజాత. ఏకపాదుడు సతత వేదాధ్యయన తత్పరుడు. శిష్యులకు పాఠ ప్రవచనములను చేయుటలో నిష్ణాగరి ష్ఠుడు. కొంత కాలమునకు సుజాత యంతర్వత్ని యైనది. గర్భస్థ శిశువు తండ్రి, తచ్ఛిష్యుల వేదాధ్యయనమును శ్రద్ధతో నాలకించు చుండెను. శిష్యులు నిద్రారాహిత్యము వలన నప్పుడప్పుడు తప్పులు చదువుటను గర్భస్థ శిశువు గుర్తించి తండ్రి నధిక్షేపించు రీతి పలికెను. అప్పుడు "ఏకపాదుడు" కోపించి

వ॥ "నీ వధ్యయనంబునకు వక్రంబుగా బలికితివి గావున నెనిమిది వంకలుగల శరీరంబుతో జన్మింపు మని కుమారునకు శాపం బిచ్చెను" (239)

కొంత కాలమునకు శిశువు "అష్టావక్ర" మూర్తియై జన్మించెను.

తన పరిధిని తెలిసికొనక పోవుట శిశువు దోషము. "తగుదు నమ్మా" యనుచు నధిక్షేపించుట బాల్య చాపల్యము. విద్యాతురులగు వారికి సుఖనిద్ర లుండకూడదను నీతిని చాటు వృత్తాంతమిది. శాపము నకు విమోచన ముండుట సహజమయ్యు నీ కథలో నట్టిది లేకపోవుట గుర్తింపదగు నంశము.

### 4.3.1.4. వృద్ధి క్షయత్వము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శల్య పర్వము ద్వితీయాశ్వాసములో (142-153) గలదు. చంద్రుని "అఱుదెవులు" గొనుమని శాప మిచ్చుట విషయము. శాప కర్త దక్ష ప్రజాపతి.

అశ్విని, భరణి మొదలగు వారు దక్షుని కుమార్తెలు. దక్షుడు తన కుమార్తె లిరువది యేడుగురిని చంద్రుని కిచ్చి వివాహమును జరిపించెను. చంద్రుడు రోహిణి పట్ల నత్యంతానురక్తుడై యితరులను చూడలేదు. ఈ కారణము వలన కినిసిన "అశ్విన్యాదులు" తండ్రికి తమ యావేదనను తెలిపిరి. దక్షుడు చంద్రుని మందలించెను. అయినను చంద్రునిలో మార్పు లేదు. మరల "అశ్విన్యాదులు" తండ్రితో పిర్యాదు చేయగా దక్షుడు చంద్రునిపై కినిసి

వ॥ "అఱు దెవులు గొను మని శపించెను" (148)

చంద్రుడు శాప కారణముగా కృశించెను. ఓషధులు నిస్సారము కాగా దేవతలు చంద్రుని ముందిడుకొని దక్షుని కడకేగి ప్రార్థించిరి. దక్షుడు భార్యల పట్ల సమానానురక్తితో నుండవలయునని సరస్వతీ జలనిధి సంగమ తీర్థజలముల నవగాహము వలన వృద్ధిక్షయావస్థ నొందునని పలికెను.

చంద్రుడు తనంతట తాను శాప విమోచనమును కోరకుండుట యిందలి ప్రత్యేకత. దేవతల సంప్రార్థనమును దక్షుడు కాదనలేకపోవుట మరియొక విశేషము. సంప్రార్థనకు తల యొగ్గుటతో బాటు వనితలకు విప్రులకు నవమానమును చేయకుండు మని యాదేశించుటలో దక్షుని పితృ హృదయము వ్యక్తము.

### 4.3.1.5. దిగ్ధాంగత్వము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము సౌప్తిక పర్వము ద్వితీయాశ్వాసములో (39-96) గలదు. అశ్వత్థామ దిగ్ధాంగు డగుట శాప విషయము. శాప కర్తలు శ్రీకృష్ణ, వేదవ్యాసులు.

అశ్వత్థామ "అపాండవము" చేయగోరి బ్రహ్మ శిరోనామకాస్త్రమును ప్రయోగించెను. చివరకా యస్త్రోపసంహరణకు నిరాకరించెను. అప్పుడు శ్రీకృష్ణుడు.

వ॥ "బాల ఘాతి వగు నీకు నశనంబు దుర్లభంబై సహాయ
రహితుండవై దుర్గంధ రక్తంబున నంగంబు దిగ్ధం బగుచుండ మూడు వేలేండ్లు దిరుగుము" (86) అని శపించెను.

అప్పుడే వేదవ్యాసుడు కూడ

తే.గీ॥ "బ్రాహ్మణుడ వయ్యు నిట్లు క్రూరతకు రోయ
కస్మదీయ వాక్యంబుల నాదరంబు
సేయ కీ పాప కర్మంబు సేసినాడ
వచ్యుతుడు వల్కి నట్టుల యగుము నీవు" (87)

అని శపించెను.

పెద్దల మాటలను మన్నింపకుండుట "అశ్వత్థామ" దోషము. బ్రహ్మశిరోనామకాస్త్రము నిష్ఫలము కారాదు. కనుక "ఉత్తర" గర్భస్థ శిశువు మరణించినది.

### 4.3.1.6. స్త్రీయత్వ ప్రాప్తి శాపములు

ఆంధ్ర మహాభారతములో శాప వశమున పురుషులు స్త్రీలుగా మారిన కథలు రెండు. ఇవి 1) స్థూలకర్ణ, 2) భంగాస్వన వృత్తాంతములు.

#### 4.3.1.6.1. స్థూలకర్ణ వృత్తాంతము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగ పర్వము" చతుర్థాశ్వాసములో (360-400) గలదు. స్థూలకర్ణునికి నిర్దిష్ట కాలాంతము వఱకు స్త్రీత్వ ప్రాప్తి కలుగుట శాప విషయము. శాప కర్త కుబేరుడు.

ద్రుపదుని కుమార్తె శిఖండి. శిఖండి కూతురైనను ద్రుపదుడు కుమారునిగానే పెంచెను. దశార్ణదేశాధిపతియగు హేమవర్మ కూతురిని కట్టబెట్టెను. ఆమెకు శిఖండి పుంస్త్వముపై ననుమానము కలిగినది. ఆ విషయమును దాసి ద్వారా హేమవర్మ గ్రహించి ద్రుపదుని కడకు దూత నంపెను. కాని ద్రుపదుడు మాటలతో కాలమును గడపెను. హేమవర్మ ద్రుపదునిపై దండెత్తి వచ్చెను. తన వలన నిట్టి యనర్థము కలిగెనని శిఖండి భావించి యరణ్యమునకు వెళ్ళెను. స్థూలకర్ణుడను యక్షుని గృహమున నాత్మహత్యకు సిద్ధమైనది. అప్పుడు స్థూలకర్ణుడు కరుణించి పది దినముల వఱకు పుంస్త్వమును శిఖండికి నొసగెను. శిఖండి పట్టణమునకు తిరిగి వచ్చి తన పౌరుషమును నిరూపించుకొనెను.

ఆ మధ్య కాలములో కుబేరుడు పరివారముతో స్థూలకర్ణుని గృహసీమలలో విహరింప వచ్చెను. స్థూలకర్ణుడు యక్షాధిపతిని కలిసికొనలేదు. చివరకు యక్షులు స్థూలకర్ణుని యాకార వికారమును కుబేరునికి తెలిపిరి. అప్పుడు కుబేరుడు

ఆ.వె॥ "...........ఇంక నీవు దాని కిట్టుల

యుండు గాక" (394) అని "తథాస్తు" అని పలికెను. యక్షుడు స్థూలకర్ణుని యథార్థ విషయమును తెలిపిరి. అప్పుడు కుబేరుడు కరుణించి శిఖండి ప్రాణ మున్నంత వఱకు స్త్రీత్వము తప్పదనియు నాపై పురుషుడగు ననియు నివృత్తిని తెలిపెను.

పుణ్యమునకు పోగా పాపమెదురగు ననుటకు నీ శాపమొక యుదాహరణము. ఈ శాపమే లేకున్నచో భీష్మవధ కుదురదు.

4.3.1.6.2. భంగాస్వన రాజు వృత్తాంతము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనికపర్వము" ప్రథమాశ్వాసములో (286-308) గలదు. భంగాస్వనునికి స్త్రీత్వము కలుగుట శాప విషయము. శాప కర్త ఇంద్రుడు.

భంగాస్వను డను రాజు పుత్రులను పొందవలెనని తలచి "ఇం ద్రు"నికి నప్రియముగ యజ్ఞమును చేసి నూఱు మంది పుత్రులను పొందెను. సంతోషముతో రాజ్యపాలనను చేయుచుండెను. ఆ రా జొక నాడు తన భటులతో కలిసి, గుఱ్ఱము మీద వేటకు నడవికి వెళ్ళెను. అప్పుడు "ఇంద్రు" డా రాజునకు

సీ॥ "............దిగ్భ్రాంతి పుట్టించి తేరకాడు
సను నట్లు సేసెను" (287)

ఆ రాజు గుఱ్ఱము మీద నొంటరిగ పయనించి భటులకు దూరముగా నడవిలో వెళ్ళెను. దప్పిక కలుగ టచే వెదకి యొక సరస్సును చూచి గుఱ్ఱము వీపు మునుగు నట్లు నీటి లోనికి నడిపి తాను ను

కం॥ "— ————తృష్ణ సెడం
బాన క్రియ యాచరించి భామినియై" (288)

నీటి నుండి వెలుపలికి వచ్చెను. తన రూపము మారి నందుకు నాశ్చ ర్యపడి "ఈ స్త్రీ రూపముతో నేవిధముగ రాజధానికి వెళ్ళుట" అని యాలోచించి, చివఱకు రాజధానికి మరలెను. పుర ప్రజలు చూచి యాశ్చర్య పడిరి. భంగాస్వనుడు మంత్రులను పిలిచి యడవిలో జరిగిన విషయమును తెలిపి రాజ్యమును పుత్రులకు నప్పగించి యరణ్యమునకు తపముచేయ వెళ్ళెను.

అచట నొక ఋషి యామెను వివాహ మాడెను. వారికి నూఱు మంది పుత్రులు పుట్టిరి. వారి నామె రాజధానికి పిలిచికొని వెళ్ళి, మొదటి నూఱు మంది పుత్రులతో విషయ మంతటిని చెప్పి, రాజ్యమును రెండు వందల మంది పాలించు నట్లుగ చేసి యడవికి వెళ్ళెను. ఇంద్రుడు తా నామెకు కలిగించిన కష్టమె మేలైనదని భావించి, మొదటి నూఱు మందికి రెండవ నూఱు మందికి భేదమును కల్గించెను. వారు యుద్ధ మును చేసి యందరును మరణించిరి. ఆ విషయము తెలిసిన యామె నగరమునకు వెళ్ళి యాక్రోశించెను. అప్పుడు "ఇంద్రుడు" బ్రాహ్మణ

వేషములో నామె దగ్గరకు వెళ్ళి సానుభూతి వాక్యము లాడెను. ఆమె యతనికి తాను వేటకు వెళ్ళి నప్పటి నుండి జరిగిన విషయమును చెప్పెను. అప్పుడు "ఇంద్రు"నికి దయ గలిగి తాను "ఇంద్రు"డ ననియు తానే యిన్ని కష్టములను కలిగించినదనియు చెప్పెను. ఆమె సాష్టాంగ నమస్కరించి తన తప్పును మన్నించుమని ప్రార్థించెను. ఇంద్రు డామె కోరినట్లుగ కొడుకులందరిని బ్రతికించెను. అమె స్త్రీత్వ మును స్థిరము చేసెను.

రతి క్రీడలలో స్త్రీ పురుషులకు సమాన భాగము. కాని తృప్తిలో పురుషునికంటె స్త్రీకి నెక్కువయని కామశాస్త్రము చెప్పుచున్నది. కనుక పురుషుడుగా తాను పొందిన సుఖము కంటె స్త్రీగా తాను పొందిన సుఖ ము మెండగుట వలననే భంగాస్వన రాజు స్త్రీత్వమునే కోరుకొనెను.

పై రెండు శాపములు కూడ స్త్రీత్వ ప్రాప్తి సూచకములైనను రెండింటికిని కొన్ని భేదము లున్నవి. - మొదటి శాపములో స్త్రీత్వము తాత్కాలికము, పరిమిత ప్రయోజనము కాగా రెండవ శాపములో నిష్టదాయకము. స్వయాచితము నగు చున్నది.

## 4.3.2. పాక్షిక "అంగ" వైకల్య శాపములు

శాప కారణముగా శరీరాంగములలో నొకటి శాశ్వతముగా లేదా తాత్కాలికముగా మార్పు నొందుట లేదా భగ్న మగుట లేదా నిరుపయోగ మగుట కారణముగా గల శాపములు. ఇట్టివి "ఆంధ్ర మహాభారతము"లో 12 గలవు. ఇవి 1) శిరో భగ్నత, 2) వానర ముఖత్వ, 3) జన్మాంధత్వ, 4) దృష్టి లోప, 5) జిహ్వా స్ఫూర్తి రాహిత్య, 6) ప్రతీప జిహ్వా ప్రాప్తి, 7) జిహ్వా మరలబడుట, 8) బాహు భగ్నత, 9) హస్త స్తంభన, 10) ఊరు భగ్నత, 11) మూత్ర పురీష నిరోధ, 12) మృగ పక్షి సదృశ జన్మలు.

4.3.2.1. శిరోభగ్నత

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము ద్రోణ పర్వము చతుర్థాశ్వాసములో (311-331) గలదు. జయద్రథుని తల తునుమబడుట శాప విషయము. శాప కర్త వృద్ధక్షత్రుడు.

వృద్ధక్షత్రుడు సింధు దేశపు రాజు. అతని కుమారుడు జయద్రథుడు. అతడు దినదినాభివృద్ధి నొందుచుండగా "అశరీరవాణి"

వ॥ "వీడు సంగ్రామంబున నేమఱి తల దునుమంబడు నని
యాదేశించెను" (328)

అప్పుడు వృద్ధక్షత్రు డందరును వినునట్లు

వ॥ "వీని మస్తకంబు మహిం బడ సెవ్వడేసె వాని శిరంబు శకల
శతం బయ్యెడు మని తన తపంబు బలిమిం బలికెను" (328)

పిమ్మట నతడు తన కుమారునికి రాజ్యము నప్పగించి తపస్సున కేగెను.

భారత యుద్ధమున "అర్జునుడు" సైంధవుని తలను త్రుంచెను. అపై శ్రీకృష్ణప్రేరితుడై పాశుపతాస్త్రమును ప్రయోగించెను. ఆ యస్త్ర ప్రభావము వలన సైంధవుని తల తపస్సు చేసికొను చుండిన యతని తండ్రి తొడ మీద పడెను. వృద్ధక్షత్రుడు వెంటనే లేచి తలను క్రింద బడవైచెను. అప్పుడే వృద్ధక్షత్రుని తల నూఱు ముక్కలయ్యెను.

భవిష్యత్కథనమునకు మాత్రము "ఆకాశవాణి" కర్త్రి. పుత్ర మనుకారమే వృద్ధక్షత్రుని శాపమునకు కారణము. కుమారున కెట్టి యాపద రాకుండుటకై వృద్ధక్షత్రుడు తపస్సును చేసెను. అ తపః ఫలితమే సైంధవుని నన్ని రోజులు కాపాడినదని యభిప్రాయము.

4.3.2.2. వానర ముఖత్వము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము ప్రథ

మాశ్వాసములో (2,245-256) గలదు. నారద మహర్షి వానర ముఖు డగుట శాప విషయము. శాప కర్త పర్వతుడు.

నారద మహర్షి పర్వత లిద్దరును మామ యల్లుళ్ళ వలె ప్రవర్తించుచు భూలోక సంచారమునకు సమకట్టిరి. పరస్పరము తమ యభిప్రాయ గోపనమును చేయక మసలవలయునని కూడ వారు నియమమును చేసికొనిరి. కాని సృంజయు డను రాజు నింట "సుకుమారి"ని చూచిన తరువాత నారనుడు నియమమును తప్పెను. పర్వతుడు దివ్యదృష్టితో నీ విషయము నెఱిగి

వ॥ "పాణి గ్రహణానంతరంబ వానర వదనుండ వగుము" అని శపించెను. (253)

వెంటనే నారద మహర్షి

వ॥ "నీకు నాక లోకంబునకుం జనుట లేకుండెడు" అని ప్రతి శాపము నిచ్చెను.

సుకుమారిని వివాహమాడిన తరువాత నారద మహర్షి వానర వదనుడయ్యెను. అయినను సుకుమారి భర్తృ సేవానిరతిని మానలేదు.

కొంతకాలమునకు కానన సంచారమున నారద పర్వతులు కలిసి కొని పరస్పరము శాపోపసంహరణ గావించుకొనిరి.

ఈ శాపములో రెండంశములు గలవు. మొదటిది సమయ భంగము - తగదని బోధించుట. రెండవది "వలపు" విషయములో కూడ సమయ నిర్ణయము సరికాదనుట.

4.3.2.3. జన్మాంధత్వము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము" చతుర్థాశ్వాసములో (198-227) గలదు. ఉతథ్యుని భార్య మమత

శిశువును "అంధుడై" పుట్టుట శాప విషయము. శాప కర్త బృహస్పతి.

బృహస్పతి దేవతల గురువు. అతని సోదరుడు "ఉతథ్యుడు". ఉతథ్యుని భార్య మమత. ఆమె కొంత కాలమునకు నంతర్వత్ని యయ్యెను. ఆ కాలములో బృహస్పతి తన తమ్ముని యింటికి నతిథిగా వచ్చెను. మమత సౌందర్యచందములకు ముగ్ధుడైన బృహస్పతి యామె నభిలషించెను. కాని గర్భస్థ శిశువు "ఇది తగదని" యాక్రోశించెను. అందుకు బృహస్పతి కోపించి

వ॥ "సర్వ భూతేప్సితం బైన యిక్కార్యంబు నందు నాకు
ప్రతికూలుండ వయితివి గావున దీర్ఘతమంబు పొందు మని
శాపం బిచ్చెను" (227)

శాప ప్రభావంబు వలన శిశువు పుట్టుగ్రుడ్డియై జన్మించెను.

"దేవర న్యాయము" సంతాన రాహిత్య సమయమున పాటించవలసిన విషయము. కాని మమత చూలాలై యున్నప్పుడు బృహస్పతి కోరుట తగదు. ఉచితానుచితములను చెప్పుట శిశువుకు తగని కార్యభారము. కనుక దీర్ఘతముడుగా శాపము నొందుట జరిగినది.

4.3.2.4. దృష్టి లోపము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" సప్తమాశ్వాసములో (133-139) గలదు. కార్తవీర్యులకు దృష్టి పోవుట శాప విషయము. శాప కర్త ఔర్వుడు.

కార్తవీర్యులు (కృతవీరుని కుమారులు) తమ తండ్రి ధనము సంతటిని యజ్ఞముల దక్షిణల రూపములో భార్గవులు (భృగు సంతతి వారు) తీసికొని దాచిపెట్టుకొనిరని వారిని బాధపెట్టిరి. కొందరిని చంపిరి. అప్పుడు భార్గవుల భార్యలు కొందరు హిమాలయపర్వత ప్రాంతమునకు వెళ్ళి దాగిరి. వారిలో నొకామె తన గర్భమును తన యూరువునందు ధరించెను కార్తవీర్యులా విషయమును తెలిసికొని యా

మెను వెదకసాగిరి. అంతకు ముందుగనే నూఱు సంవత్సరముల కాల మూరువునందుండిన శిశువు పుట్టి "ఔర్వుడు" అను పేరుతో ప్రకాశించుచుండెను. కార్తవీర్యులు "ఔర్వు" ని చూచినప్పు డతని శరీర కాంతిచే వారికన్నులు గ్రుడ్డివి యయ్యెను. తరువాత వారు "ఔర్వు"ని తల్లి దగ్గరకు వెళ్ళి దృష్టి దానమును ప్రసాదింపుమని వేడిరి. ఔర్వునే ప్రార్థింపుమని వారికి నామె సలహా నిచ్చెను. వారు

వ॥ "అతి భక్తులై యౌర్వుం బ్రార్థించి తత్ప్రసాదంబున
దృష్టులు వడసి చనిరి." (139)

భార్గవులు సంపాదించిన ధనము దోచుకొన్నది కాదు. రాజ్య క్షేమము కొఱకు చేసిన యజ్ఞాదులలో రాజులు సంతసించి యీయగా కూడబెట్టిన సొమ్ము. దానముగా నిచ్చిన ధనమును దాతలు మరల కోరుట తగదు.

4.3.2.5. జిహ్వాస్ఫూర్తి రాహిత్యము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనికపర్వము" తృతీయాశ్వాసములో (127-143) గలదు. కప్పలకు జిహ్వాస్ఫూర్తి లేకుండ పోవుట శాప విషయము. శాప కర్త "అగ్ని దేవుడు".

పార్వతీ పరమేశ్వరుల వివాహము జగదానందదాయకమైనది. కాని తారకాసుర సంహారార్థము పుత్రోదయము కాలేదు. దేవతలు మరల బ్రహ్మ నడిగిరి. బ్రహ్మ "అగ్ని"ని ప్రార్థింపుడని యాదేశించెను. కాని "అగ్ని"ని కనుగొనలేక పోయిరి. కాని కప్ప "అగ్ని" పాతాళ లోకమున కలడని తెలిపెను. అంత నగ్ని కోపించి రావి చెట్టు యందు దాగుటకు వెళ్ళుచు

సీ॥ "...........శాప మిచ్చె జిహ్వాస్ఫూర్తి
లేక రసాలి వివేక మెడలి
తే.గీ॥ యుండెడుమ కప్పలని" (143)

కాని దేవతలు నిర్జల రంధ్రములందు కప్ప గ్రుడ్లున్నను జలస్పర్శతో మరల బ్రతుకునని వరము నొసగిరి.

స్పష్ట వాక్కులేక బెకబెక లాడుట యంగ వైకల్యమునకు చెందిన శాపము.

4.3.2.6. ప్రతీప జిహ్వాప్రాప్తి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనికపర్వము" తృతీయాశ్వాసములో (127-148) గలదు. గజములకు జిహ్వాతిరుగబడుట శాప విషయము. శాప కర్త "అగ్ని దేవుడు".

దేవతలు "అగ్ని" దేవునికై వెదకుచుండగా ఏనుగు రావిచెట్టు వైపు కను సన్నను చేసినది. అందుకు "అగ్ని" కోపించి

వ॥ "గజంబులకు జిహ్వ దిరుగం బడ శపించెను" (146)

కాని దేవతలు ప్రతీప జిహ్వ ప్రాప్తి యున్నను సర్వరసజ్ఞాన పూర్ణమై మాననీయమై గజము జీవించు నట్లుగా ననుగ్రహించిరి.

4.3.2.7. జిహ్వ మరల బడుట

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనికపర్వము" తృతీయాశ్వాసములో (127-148) గలదు. చిలుకలకు జిహ్వ మరల బడుట శాప విషయము. శాప కర్త "అగ్ని దేవుడు".

దేవతలు "అగ్ని"దేవునికై యన్వేషణ సాగించుచుండగా చిలుక శమీ వృక్షములో నతడు దాగి యున్నట్లు చెప్పెను. అంత "అగ్ని" కోపించి

ఆ.వె॥ "జిహ్వ మరల బడగ జిలుకల నగ్ని శపించెను" (147)

కాని దేవతలు చెవుల కింపైన పలుకులను చిలుకలకు వరముగా నొసగిరి.

అగ్ని యాచూకిని తెలుపుట ద్రోహము. ఆచూకిని చెప్పుట వలన దేవతలకు సంతోషము. కనుక తమకై శాపములను పొందిన వారికి తగిన వరముల నొసగిరి.

4.3.2.8. బాహు భగ్నత

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము ద్వితీయాశ్వాసములో (15-17, 72-80) గలదు. కార్తవీర్యార్జునుడు బాహు భగ్నతను పొందుట శాప విషయము. శాప కర్త వసిష్ఠ మహర్షి.

కార్తవీర్యార్జునుడు హైహయ వంశ క్షత్రియుడు. అతడు సహస్ర బాహుడు. అనంతాస్త్ర బల సమన్వితుడు. ఒకనాడు "అగ్ని" దేవుడు విచ్చేసి తన కాహారమును నిర్దేశింపుమని యడిగెను. అంత నతడు గిరి నగరారణ్య గ్రామ ఖర్వటాదుల నాహారముగ నియమించెను. అగ్ని దేవుడు నిర్దిష్టాహారమును వశపరచు కొనుచు వసిష్ఠుడు లేని తఱి నతని యాశ్రమమును గాల్చెను. వసిష్ఠుడు కోపించి "అగ్ని" దేవునికి రక్షకుడగు కార్తవీర్యార్జునుని

వ॥ 'నీవు మదీయ తపోవనంబు పరిహరింపక గహను సామాన్య బుద్ధిం గాల్చితివి గావున నీ బాహుపులు రాముండు నఱుకు వాడని శాపం బిచ్చెను" (76)

తరువాత కొంత కాలమునకు కార్తవీర్యార్జునుని కుమారులు దుష్టులై జమదగ్ని హోమధేనువును బట్టి తెచ్చిరి. కోపించిన పరశురాముడు దండెత్తి వచ్చి కార్తవీర్యార్జును నోడించి యతని బాహువులను నరికి వేసెను.

వసిష్ఠ మహర్షి "అగ్ని" దేవుని పై కోపింపక కార్తవీర్యార్జునికి శాపము నొసగుట విశేషము. భృత్యుని యపరాధమునకు రాజేకర్త. కనుక శాపము సమంజసమే. అట్లే హోమధేన్వపహరణ దోషమునకు

పరశురాముడు కార్తవీర్యార్జునుని చంపుట మరియొక విశేషము. పుత్రులు చేసిన కర్మలకు తండ్రిదే బాధ్యత. భృత్య, పుత్ర రక్షణమున కార్తవీర్యార్జునుడు శ్రద్ధను వహించ లేదని యభిప్రాయము.

4.3 2.9. హస్త స్తంభనము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య పర్వము" తృతీయాశ్వాసములోను (186-197) తిక్కన భారతభాగము "అనుశాసనిక పర్వము" పంచమాశ్వాసములోను (348-350) నించుమించు నొకే విధముగా గలదు. దేవేంద్రునికి హస్త స్తంభనము చేయుట శాప విషయము. శాప కర్త చ్యవన ముని.

వృద్ధుడైన చ్యవన ముని యువతియగు సుకన్యను వివాహమాడెను. సుకన్య పతి సేవా పరాయణురాలై కాలమును గడుపుచుండగా "అశ్వినీ దేవత" లాపె కడకు వచ్చిరి. వృద్ధుని వివాహమాడి యౌవనమును వృధాచేసి కొంటివనియు, తగిన యువకుని తెచ్చెదమనియు ప్రలోభ పెట్టిరి. కాని సుకన్య తిరస్కరించినది. పైగా "అశ్వినీ" దేవతల వ్యవహారమును భర్తతో మనవి చేసినది. చ్యవనుడు "అశ్వినీ"దేవతల మాటను వినుమని యాదేశించెను. సుకన్య యా మాటలకు సమ్మతించినది. అశ్వినీ దేవతలును, చ్యవనుడును పయోష్ణ సరస్సులో మునిగి యువకులై సుకన్య యెదుట నిలిచిరి. సుకన్య చ్యవను నెన్నుకొనెను. పునర్యౌవన భాగ్యప్రాప్తిని కలిగించిన "అశ్వినీదేవత"లకు శర్యాతి చేయు యాగములో సోమ పీథులను చేయుదునని చ్యవనుడు పలికెను. కాని శర్యాతి యాగములో నద్దానికి "ఇంద్రుడు" సమ్మతించక వజ్రాయుధముతో చ్యవనుని చంప సిద్ధమయ్యెను. అప్పుడు చ్యవనుడు

కం॥ "...........వజ్రయుత భుజాస్తంభము సం
స్తంభించెను" (193)

యాగము నుండి "మదు"డను రాక్షసుని సృష్టింపగా నతడు "ఇం
ద్రు"ని ధీ కొనెను. అప్పుడు "ఇంద్రుడు" క్షమింపుమని వేడెను.
చ్యవనుడు కరుణింపగా "ఇంద్రు"ని హస్తస్తంభనము తొలగెను.

చ్యవన మహర్షి తపశ్శక్తి తెలిసియు వజ్రాయుధము నెత్తుట "ఇం
ద్రు"ని దోషము.

4.3.2.10. ఊరు భగ్నత

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య పర్వము"
ప్రథమాశ్వాసములో (74-105) గలదు. దుర్యోధనుని "ఊరు యుగ
ళము" భగ్నమగుట శాప విషయము. శాప కర్త మైత్రేయ మహర్షి.

మైత్రేయ మహర్షి కురు పాండవ వంశ శ్రేయోభిలాషి. అత
డరణ్యములో పాండవులతో ముచ్చటించి యాపై హస్తినలో ధృత
రాష్ట్రాదులను కలిసి కొనెను. పాండవుల యోగ క్షేమములను ధృత
రాష్ట్రుడడుగగా వారి ధర్మ ప్రవర్తనను శ్లాఘించెను. దుర్యోధనుని
గాంచి పాండవులతో వైరమును మాని సంధిని చేసికొనుమని యాదే
శించెను. కాని దుర్యోధను డా మాటలను లెక్క చేయక కాలి బొటన
వ్రేలిని నేల మీద రాయుచు తొడలను నఱచుచు నవ్వసాగెను. అతని
దుష్ట ప్రవర్తనకు నసహ్యించు కొనుచు మైత్రేయుడు

వ॥ "ఈ యపరాధంబున నాహవంబునందు భీము గదా ఘాతంబున
నీ యూరు యుగళంబు భగ్నం బయ్యెడు మని శాపం బిచ్చె
ను" (103)

అప్పుడు ధృతరాష్ట్రుడు ప్రార్థించగా

తే.గీ॥ "కడగి సమబుద్ధి వీనికి గలిగెనేని
గాదు శాప ఫలం బట్లుగాక బుద్ధి
హీనుడై గర్వితుం డగునేని శాప
హవ్య వాహ ఫలంబు వీ డనుభవించు" (104) అని పలికెను

పెద్దల యెదుట ప్రవర్తింప వలసిన విధానమ్మును మఱచుట యా మర్యాదలను పాటింప కుండుట దుర్యోధనుని నేరము. తన కుమారునికి నిచ్చిన శాప నివారణోపాయమునకై తండ్రి యర్థించుట యిందలి విశేషము.

4 3.2.11. మూత్ర పురీష నిరోధము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆరణ్య పర్వము" తృతీయాశ్వాసములో (173-182) గలదు. శర్యాతి రాజు సైన్యము నకు మూత్ర పురీష నిరోధ మగుట శాప విషయము. శాప కర్త చ్యవనమహర్షి.

చ్యవనుడు భృగుమహర్షి కుమారుడు. అతడు నర్మదా నదీ తీరములో తపస్సును చేయుచుండెను. అతని చుట్టు పుట్ట పెరిగెను. కన్నులు మాత్రము నక్షత్రముల వలె వెలిగెడివి. ఒకనాడు శర్యాతి రాజు కుటుంబ సమేతుడై సైన్య, పరివారముతో నర్మదా నదీతీర విహారమునకు విచ్చేసెను. సుకన్య విహరించుచు నక్షత్రముల వలె మెఱయుట గాంచి పుట్టను త్రిప్పుడని సైన్యమున కాజ్ఞయిడెను. వా రట్లు చేసిరి. తపోభంగము కలుగగా చ్యవనుడు కోపించి

వ॥ "నిమీలిత నయనుండై చ్యవనుండు శర్యాతి సైన్యంబుల
కెల్ల మూత్ర పురీష నిరోధంబు జేసెను" (178)

సుకన్య వలన సర్వమును తెలిసికొనిన శర్యాతి చ్యవనుని క్షమింప వేడెను. సుకన్యా పాణి గ్రహణము తరువాత క్షమియింతునని చ్యవ నుడు పలికెను. అట్లు చేయ మూత్ర పురీష నిరోధము తొలగెను.

చ్యవనుని తపోభంగమునకు హేతువులు రెండు. మొదటిది సుకన్య బాల్యోచిత చేష్ట. రెండవది సైనికులు పుట్టను త్రవ్వుట. తపో భంగము కలుగగా మొదట కనబడిన వారు సైనికులు. కనుక వారికి మూత్ర పురీష నిరోధము. దీనికి ప్రధాన కారకురాలు సుకన్య. కనుక

సుకన్యా పాణిగ్రహణమును చ్యవనుడు కోరెను. సైన్యమునకై మహర్షి శాపమునకై తన కుమార్తె నొడ్డుట శర్యాతి రాజు వైశిష్ట్య గుణము.

4.3.2.12. మృగ పక్షి సదృశ జన్మ

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య పర్వము" తృతీయాశ్వాసములో (124-144) గలదు. జమదగ్ని కుమారులు మృగపక్షి సదృశులగుట శాప విషయము. శాప కర్త జమదగ్ని.

జమదగ్ని మహర్షి భార్య రేణుక. వారికి రుమణ్యత, సుషేణ, వసు, విశ్వావసు, పరశురాములు పుత్రులు. జమదగ్ని తపస్సును చేయుటకు భార్యా పుత్రులతో కలిసి యడవి కేగెను. వన్య ఫలము లను తెమ్మని భార్యాపుత్రుల నాదేశించెను. రేణుక వన్యఫలములను గొని మార్గములో జల క్రీడలాడు చిత్రరథుని సౌందర్యమునకు మోహి తురాలై యతనితో వ్యభిచరించెను. జమదగ్ని కీ విషయము తెలి యగా నామెను చంప వరుసగ మొదటి నలుగురి కుమారుల నాదేశిం చెను. కాని వారు మాతృ హననము మహాపాతకమని తిరస్కరించిరి. అందుకు జమదగ్ని వారికి

కం॥ "———— —శాప మిచ్చె ఘోరాటవిలో
జడమతి మృగ పక్షుల య
ట్లుడుగక యజ్ఞాన వృత్తి నుండుం డనుచున్" (141)

కాని పరశురాముడు మాత్రము తండ్రియాజ్ఞను నెరవేర్చి వరముగా మాతా సోదరులను పునరుజ్జీవన వరమును పొందెను.

ఇది పరశురాముని మాతా పితృభక్తిని సోదర ప్రేమను వ్యక్త ము చేయు శాపము. సమయోచిత యాజ్ఞా పాలనముతో నందరిని రక్షించుకొనుట పరశురాముని ధీశక్తిని రుజువు చేయుచున్నది.

4.3.3. మరణాదుల వలన వైకల్య శాపములు

"రూప వికృతి" నొందుట, పంచ భూతములలో పంచ ప్రాణములు కలియుట మరణ స్వరూప మగును. ఇట్టి మరణము స్వాభావికమో, శాపాదులో కావచ్చును. మరణములు రెండు రకములు. ఇవి 1) సద్యో మరణ, 2) కాలాంతర మరణ శాపములు.

4.3.3.1. సద్యో మరణ శాపములు

సద్యో మరణ మనగా శాపము నిచ్చిన తక్షణమే వ్యక్తి మరణించుట. ఇట్టివి "ఆంధ్రమహాభారతము"లో నైదు గలవు. ఇవి 1) కిరాత, 2) సగర పుత్రుల, 3) చార్వాక రాక్షస మరణములు, 4) కృత్తి వినాశనము, 5) పూర్వ గీర్వాణ వినాశనము

4.3.3.1.1. కిరాత మరణము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య పర్వము" ద్వితీయాశ్వాసములో (1,71-92) గలదు. కిరాతుడు తక్షణమే మరణమును పొందుట శాప విషయము. శాప కర్త దమయంతి.

రాజ్యభ్రష్టుడైన నలుడు దమయంతీ సహితుడై యడవిలో తిరుగు చుండెను. తానున్నంత వరకు దమయంతి తన్నొడ బాయదని భావించి నలుడు దమయంతిని వదలి వెళ్ళిపోయెను. నలుని గానక దమయంతి ప్రలపించినది. అప్పుడే యొక సర్పము దమయంతిని పట్టెను. ఆమె దీనాలాపమును విని యొక యొఱుక వరు గెత్తుకొని వచ్చి కత్తితో పామును నరికి వేసెను. కాని దమయంతి యందచందములకు ముగ్ధుడై యామెను వాంఛించెను. అప్పుడు దమయంతి కోపముతో

వ॥ "ఏను పతివ్రత నైతినేని దుష్టురాత్ముండైన కిరాతుం
డిప్పుడ మృతుం డయ్యెడు మని శాపం బిచ్చెను" (92)

ఆ కిరాతుడు వెంటనే మంటలతో కాలిన చెట్టు వలె నేల కొరిగెను.

ఉపకారమునకు ప్రత్యుపకారమును కోరుటయో లేదా దురభిప్రాయమును వ్యక్తము చేయుటయో ధర్మము గాదు. అధర్మబుద్ధితో దమయంతి నభిలషించుట వలన "ఎఱుక" వాడు దగ్ధుడయ్యెను. ఈ శాప వృత్తాంతము దమయంతి పాతివ్రత్యమునకు, నధర్మశీలునికి వట్టిడి గతికి నుదాహరణము కాగలదు.

4.3.3..2. సగర పుత్రుల మరణము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య పర్వము" తృతీయాశ్వాసములో (48-84) గలదు. అరువది వేలు సగర పుత్రులు దగ్ధులగుట శాప విషయము. దీనికి కపిల మహాముని రూక్ష వీక్షణములే కారణము.

సగరుడు "ఇక్ష్వాకు" వంశపు రాజు. అతని భార్య వైదర్భి. వారికి "అరుబది" వేల మంది పుత్రులు పుట్టిరి. కాని వారు గర్వితులు. సగర మహారాజు "అశ్వమేధయాగ తురగ రక్షణార్థము సగర పుత్రులు చనిరి. ఆ యశ్వము క్రమముగా భూ సంచారమును చేసి సముద్రములో నదృశ్య మయ్యెను. అరువది వేల మంది పుత్రులు తండ్రితో నా విషయమును తెలిపిరి. అతని యాదేశము ననుసరించి సముద్రమును త్రవ్విరి. త్రవ్వగా త్రవ్వగా కపిల మహాముని యాశ్రమ ప్రాంతమున తమ గుఱ్ఱమును చూచిరి. యుక్తాయుక్తములు తెలియక కపిలుని తూల నాడిరి. అప్పుడు

వ॥ "అమ్మునిని వరుం డలిగి యనల శిఖలు దూల నతిఘోర
దృష్టిం జూచిన నప్పుడ సగర సుతు లందఱు భస్మం
బైరి" (64)

ఈ విషయము నెరిగిన సగరుడు రెండవ భార్య కొడుకైన "అసంజసు"ని పుత్రుడగు "అంశుమంతు"ని పంపెను. అతడు సవినయముగా

కపిలుని నర్థింపగా నతడు తురగమును వెంట బెట్టుకొని పోవ నను మతించెను. చివరకు భగీరథ ప్రయత్నము వలన సగర పుత్రులు పునరుజ్జీవితులైరి.

సత్యాసత్యములు తెలియక యొకరిపై నింద వేయుట తగదని యీ శాప వృత్తాంతము నిరూపించుచున్నది. సగర పుత్రుల మరణమునకు వారి దుర్మార్గ వర్తనము ప్రధాన కారణమైనను కపిల మహాముని క్రోధ వీక్షణము నిమిత్త మాత్రమగు రెండవ కారణము.

4.3.3.1.3. చార్వాక రాక్షస మరణము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము ప్రథమాశ్వాసములో (250 266) గలదు. చార్వాకు డను రాక్షసుడు మరణము నొందుట శాప విషయము. శాప కర్తలు ధర్మరాజు నాశ్రయించిన బ్రాహ్మణులు.

చార్వాకుడు రాక్షసుడు. అత డఖిల భూత భయము లేనట్లు బ్రహ్మ వలన వరమును పొందెను. భూదేవతలకు ననిష్ట కార్యములను చేసినచో మరణము కలుగునని బ్రహ్మ యాదేశించెను.

చార్వాకుడు మొదట దుర్యోధనాశ్రితుడై మెలగెను. కౌరవ మరణానంతరము ధర్మరాజు తిలోదకములను వదలి నగరమునకు చేరెను. తన కడకు బ్రాహ్మణులను రప్పించెను. చార్వాకుడు బ్రాహ్మణ భిక్షకుడై తాను బ్రాహ్మణ ప్రతినిధినని చెప్పుకొనెను. పైగా బ్రాహ్మణు లందరు ధర్మరాజును పితృ సోదర బాంధవ హంతకుడుగా దూలనాడు చున్నారనియు తెలియ జేసెను. ధర్మరాజు చాల బాధ పడెను. ఇంతలో బ్రాహ్మణులు తాము దూషింప లేదని తెలియ జేసిరి. మఱియు వారప్పుడు

కం॥ "ఆ రాక్షసు గను గొని కో
పా రంజిత నేత్రు లగుచు నవ్విప్రులు హుం

కార ముఖురు లగుటయు నతి
ఘోరాకృతితోడ వాడు గూలెం బుడమిన్" (367)

చార్వాక మరణమునకు బ్రాహ్మణులు నిమిత్తమాత్రులే. "భూదేవతల కనిష్టంబులైన పనులు సేయకుండు వాడవు. చేసితేని యదియ నీకు దుది" అను బ్రహ్మదేవుని శాపమే ప్రధాన కారణము. అనుచిత వాగ్వ్యవహారము మాత్రమే గాక మాయా బ్రాహ్మణవేషము చార్వాకునికి చేటు తెచ్చినది.

4.3.3.1.4. కృత్తి వినాశము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనికపర్వము" తృతీయాశ్వాసములో (207-223) గలదు. "కృత్తి" యను రాక్షసిని చంపుట శాప విషయము. శాప కర్త "శునస్సఖుడు" అను సన్యాసి.

సప్తర్షులు పరిచారికాబృందముతో భూలోక సంచారమునుచేయుచుండిరి. అప్పుడు భయంకరమైన కరువు వచ్చెను. ఆహారము లభ్యము కాలేదు. చివరకు నొక మానవ శవము కంట బడెను. వారా కళేబరము చుట్టును చేరిరి. అప్పుడే "వృషాదర్భి" యను మహారాజు సప్తర్షులను గాంచి యాహారమును తాను సమకూర్చెదుననెను. రాజదత్తము విషప్రాయమని సప్తర్షులు పలికిరి. రాజు నగరమునకు వెళ్ళి కృత్రిమ వన ఫలములను పంపెను. కాని సప్తర్షులు ఫల మధ్యమున గల బంగారమును చూచి తిరస్కరించిరి. తరువాత వృషాదర్భి యాగము నొనర్చి "కృత్తి"ని సృష్టించి వారి పైకి పంపెను. సప్తర్షులు శునస్సఖు డను సన్యాసితో నాహారార్థము తిరుగుచుండిరి. చివరకు నొక కొలనిలోని తామర కాడల నాహారముగా గ్రహింప సమకట్టిరి. కృత్తి వారి కడ్డముగా నిలిచి తమ పేర్లను తెలుపుకొన వలెనని యాదేశించినది. సప్తర్షులు భంగ్యంతరముగా తమ పేర్లను తెలుపగా శునస్సఖు డర్థోచితముగా తన పేరును తెలిపెను. కాని యారాక్షస

"నీ పేరు నర్థమగు నట్లు చెప్పకుండుటకు కారణమే" మని యడిగెను. అప్పుడు శునస్సఖుడు కోపించి

వ॥ 'ఇట్టి యుద్ధండవు మంత్రి దండము పాలు పడు మని
బ్రహ్మ దండ నిభంబగు నిజ హస్తగత దండంబున దాని
శిరంబు బెట్టు వ్రేయుచు బాప కర్మలారా పడుము భస్మంబ
వగు మని నిష్ఠురాక్షరంబుగా నిర్దేశించెను" (222)

వెంటనే యా రాక్షసి భస్మ మయ్యెను.

ఎదిరిని లెక్కచేయక పోవుట యహంకార స్వరూపము. అహంకార మెట్టి యనర్థమునకైనను దారి తీయును. కనుకనే సప్తర్షులపై కృత్తికా ప్రయోగమును రాజు చేసెను. శాంత స్వభావులు కోప గింపకున్నను ననుచరులు కనలి ప్రతికారమును చేయుట యిందలి విషయము.

4.3.3.1.5. పూర్వగీర్వాణుల వినాశము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనికపర్వము" పంచమాశ్వాసములో (346) గలదు. పూర్వగీర్వాణులు వినాశనమగుట శాప విషయము. దీనికి వసిష్ఠమహర్షి రూక్ష వీక్షణములే కారణము.

గంగా నదీతీరమున క్రతువుల నొనరించు గీర్వాణులను పూర్వ గీర్వాణులు గాసి చేసిరి. అప్పుడు గీర్వాణులు భయపడి వసిష్ఠమహర్షి కడకు పరుగెత్తి విషయమును చెప్పిరి. వెంటనే యతడు కోపించగా

వ॥ "అత్తాపసోత్తముని రోషానల జ్వాలలు సాకారంబు లయి
యా దైత్య లోకంబు నేర్చెను" (346)

లోకక్షేమార్థము క్రతువుల నాచరించుట సంప్రదాయము. అట్టి క్రతువులకు నాటంకమును కల్పించుట పూర్వగీర్వాణుల దోషము. కనుకనే వారు వసిష్ఠుని కోపమునకు పరోక్షముగ గురియైరి.

### 4.3.3.2. కాలాంతర మరణ శాపములు

శాపము నిచ్చిన తక్షణమే గాక కాలాంతరమున ఫలించునట్టివి కాలాంతర మరణశాపము లగును. ఈ శాపము లన్నిట మరణమునకు ప్రధానమైనటు వంటి యొక సన్నివేశములకు ప్రాధాన్యముండును. ఇట్టి శాపములు "ఆంధ్రమహాభారతము"న తొమ్మిది గలవు. ఇవి 1) కద్రువ, 2) శృంగి, 3) కిందముని, 4) అంగిరసి, 5) అగస్త్య మహర్షి, 6) అగ్నిదేవుని, 7) బ్రాహ్మణ, 8) దుర్వాసమహర్షి, 9) అష్ట వసువుల శాపములు.

### 4.3.3.2.1. కద్రువ శాపము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము" ద్వితీయాశ్వాసములో (26-36) గలదు. సర్పములు పంచత్వము నొందుట శాప విషయము. శాప కర్త వాటి తల్లియగు కద్రువ.

కద్రువ, వినతలు కశ్యప ప్రజాపతి భార్యలు. వారికి "ఉచ్చైశ్శ్రవ" తురగ వాల వర్ణమునకు సంబంధించి వివాద మేర్పడినది. సత్యము తేలినప్పుడు పరస్పరము దాసీ లగుటకు వారు నిర్ణయించు కొనిరి. కద్రువ తన సర్ప కుమారుల రావించి వినతతోడ పందెమును చెప్పి తురగవాలమును నీలవర్ణముగా చేయుడని యాదేశించినది. కాని వారు సమ్మతించ లేదు. అప్పుడు కద్రువ కోపించి

కం॥ "అనుపమముగ జనమేజయు
డను జనపతి సేయు సర్పయాగ నిమిత్తం
బున బాములు పంచత్వము
ననియెడ మని యురగములకు శాపం బిచ్చెన్" (35)

తల్లి శాపమునకు భయపడిన కర్కోటకుడు తాను తురగ వాలమును నీలముగచేసెదనని పలికి యట్లొనర్చెను. ఫలితముగా వినత కద్రువకు దాసి యయ్యెను. బ్రహ్మ యీ సమయమున సర్పయాగము మధ్య లోనే యాగిపోవునని స్పష్టము చేసెను.

తల్లి యాన ధర్మబద్ధము కానప్పుడు కుమారులైనను పాటించ నవసరము లేదను సత్యము నీ శాపము స్పష్ట పఱచును.

4.3 3.2.2. శృంగి శాపము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము" ద్వితీయాశ్వాసములో (162-198) లదు. పరీక్షితుడు తక్షక విషాగ్ని దగ్ధుడగుట శావ విషయము. శాప కర్త శృంగి యను ముని.

పరీక్షితుడు "ఉత్తరాభిమన్యుల కుమారుడు. అతడు మృగ యార్థము కాననమున కేగెను. అతనికి గురి తప్పి యొక మృగము దిక్కుతెలియకపోయెను. పరీక్షిత్తు శమీకుడను మునిని లేడి యాచూకిని గూర్చి యడిగెను. సమాధానము లభించక పోగా చనిపోయిన పామును ముని మెడలో వేసి హస్తినకు వెళ్ళెను. కొంతసేపటికి శమీ కుని పుత్రుడైన శృంగి వచ్చి యా దృశ్యమును చూచి

వ॥ "మదీయ జనకు నవమానించిన పరీక్షితుండు నేడు మొదలుగా సప్తదినంబులలోన దక్షక విషాగ్ని దగ్ధుండై యమసదనం బున కరిగెడు మని శాపం బిచ్చెను" (169)

కాని పరీక్షితుని శపించుట న్యాయము కాదని శాపోపసంహరణ చేయు మని తండ్రి యాదేశించెను. కాని శృంగి తన యసమర్థతను వ్యక్తము చేసెను. పరీక్షితు డెన్ని ప్రయత్నములను చేసినను పాముకాటును తప్పించు కొనలేక మరణించెను.

తనకు సమాధానమును చెప్పలేదని మహర్షిపై మృత సర్పము నుంచుట పరీక్షిత్తు నేరము. [illegible]టును శపింప వలదనుట శమీ కుని యౌదార్యమునకు తార్కాణము. తండ్రి చెప్పినను వినకుండుట శృంగి దోషము. ఎట్టి రక్షణలను కావించు కొనినను విధి నిర్ణయము దాటరాని దనుట యీ శాప ముఖ్యసారాంశము.

4.3.3.2.3. కిందముని శాపము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము" పంచమాశ్వాసములో (2, 46-57, 140-143) గలదు. ప్రియా సంగమ సమయమున పాండురాజు మరణించుట శాప విషయము. శాప కర్త కిందము డను ముని.

పాండు మహారాజునకు కుంతి, మాద్రి-యిద్దరు దేవేరులు. వారు హిమవత్పర్వత సీమలలో విహరించుచుండిరి. పాండురాజు వేటాడుచు సంగమ క్రీడలో నున్న జింకలను కొట్టెను. మగ జింక క్రింద పడి తాను కిందము డనియు మృగ వేషములో భార్యతో క్రీడించునపుడు బాణమును వేసి చంపుట తగదనియు నధిక్షేపించెను. కాని రాజులు శత్రువులను సహింతురు గాని మృగములను వేటాడకమానలేరని యది "అగస్త్య మహర్షి" సమ్మతమని పాండురాజు స్పష్ట పఱచెను. ఆ మాటలకు కిందముడు సమాధాన పడకుండ కోపించి

వ॥ "సర్వ ప్రాణులకు సాధారణం బయి యిష్టం బగు సుభావసరంబున నున్న మమ్ము నపరాధుల వధియించితివి గావున నీవునుం బ్రియా సంగమం బయిన యప్పుడ పంచత్వం బొందెదు మని నీ ప్రియము నిన్ను ననుగమించు నని పాండురాజునకు శాపం బిచ్చెను" (57)

ఈ శాప భయము వలన పాండురాజు భార్యాసంగమమును వదలి పెట్టెను. కాని యొక వసంత కాలమున విధిప్రేరితుడై మాద్రిని గవయగ నతనికి మరణము సంభవించినది.

శృంగారానుభవమును పొందు జంతువులను వేటాడుట యకృత్యమని చెప్పుట యీ శాప ప్రయోజనము.

4.3.3.2.4. అంగిరసి శాపము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము" సప్తమాశ్వాసములో (2,91,127-130) గలదు. కల్మాషపాదుడు వనితా సంభోగ సమయమున పంచత్వము నొందుట శాప విషయము. శాప కర్త "అంగిరసి".

వసిష్ఠమహర్షి పెద్దకొడుకైన, శక్తి మరియు నొక బ్రాహ్మణుని శాపముల ప్రభావము వలన కల్మాషపాదు డను రాజు తన భార్య మదయంతితో నరణ్యములో తిరుగాడు చుండెను. కాననములో పుత్రార్థులై యేకమై యున్న బ్రాహ్మణ దంపతులను వారు చూచిరి. రాక్షస ప్రవృత్తి కారణముగ కల్మాషపాదుడు బ్రాహ్మణుని చంపి భక్షించెను. అపుడు "అంగిరసి" యను పేరుగల నా బ్రాహ్మణ స్త్రీ పుత్రార్థులై యున్న యా కోరిక విఫలమైనది దుఃఖించి

వ॥ "వనితా సంభోగంబున నీవును నా పురుషు నట్లు పంచత్వం
బునుం బొందు మని శాపం బిచ్చెను" (130)

శాప విమోచనమైన పిమ్మట కల్మాషపాదుడు పుత్రార్థియై మదయంతిని వసిష్ఠమహర్షి కడకు పంపి పుత్రుని బడసెను.

కిందముని కథలో శాప కర్త పురుషుడు కాగా నీ కథలో స్త్రీ శాప కర్తృణి. మాద్రి సహగమనము చేసినట్లే "అంగిరసి" సహగమనమును చేయుట యొక సామ్యము.

4.3.3.2.5. అగస్త్యమహర్షి శాపము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య పర్వము" చతుర్థాశ్వాసములో (5-32) గలదు. యక్షుడైన మణిమంతుడు మనుష్యమాత్రుని చేత మరణము నొందుట శాప విషయము. శాప కర్త అగస్త్యమహర్షి.

మణిమంతుడు కుబేరుని ప్రియ సఖుడు. ఒక పర్యాయము గగన విహారము చేయు వేళ మణిమంతు డుమిసెను. ఆ యుమ్మి యమునా నదీతీరమున నూర్ధ్వబాహుడై తపమును చేయు "అగస్త్య మహర్షి" మీద పడినది. అందు కా ముని కోపించి

ఆ.వె॥ "నీవు సూచుచుండ నీ యిష్టు డిమ్మణి
మంతు డిపుడు తనదు మదము పేర్మి
నన్ను నుఱక యుమిసె నా మీద నిట్టి దు
ర్మదుడు పొలియు నొక్క మనుజు చేత" (31)

వ॥ "మఱియు నీ యక్ష రాక్షస బలంబులను వాని చేతన
నిహతంబు లగు నీ దురితంబు దద్దర్శనంబునం బాయు నని"
పలికెను. (32)

అరణ్యవాస సందర్భమున శ్వేతకి నదిలో కొట్టుకొని వచ్చిన బంగారు వన్నెగల పంచవర్ణ కుసుమములను ద్రౌపది కోరినది. భీము డా ప్రయత్నమున కుబేర సరస్తీరమున గల మణిమంతాదులను సంహరించెను.

తెలిసి చేసినను తెలియక చేసెనను నపరాధ మపరాధమే. మణి మంతు డుమియుట యట్టిదే. ఉపేక్షను వహించుట కుబేరుని నేరము. కనుక నతని పరివారమునకు నష్టము.

4.3.3.2.6. అగ్ని దేవుని శాపము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య పర్వము" పంచమాశ్వాసములో (147-170) గలదు. చేపలు మానవులచే దయ లేని భావముచే వధింపబడుట శాప విషయము. శాప కర్త "అగ్ని దేవుడు.

దేవతల కొఱకు హవ్యభారమును మోయలేక "అగ్ని దేవుడు" సముద్రమున దాగెను. దేవత లతనికై వెదకు చుండగా "అగ్ని"

యునికిని చేపలు తెలియజేసెను. అందుకు "అగ్ని" కోపించి

వ॥ "జనంబులు మిమ్ము నిర్దయులై వధియింతురు గావుత మని
శాపం బిచ్చెను" (170)

మానవులు చేపలను చూచినప్పుడు వాటిని వండి తినుటకై దయలేని వారై వాటిని చంపుచున్నారు. మిత్ర, శత్రు వర్గముల ననాహుత పరిసంగ మనర్థమును తెచ్చుననుటకు నీ శాపము సాక్ష్యము.

4.3.3.2.7. ఒక బ్రాహ్మణుని శాపము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము కర్ణపర్వము ద్వితీయాశ్వాసములోను (87-94, 341-362), శాంతి పర్వము ప్రథమాశ్వాసములోను (15-20) గలదు. యుద్ధరంగమున రథచక్రము క్రుంగుటయు, విరోధి బాణము వలన కర్ణుడు హతు డగుటయు శాప విషయములు. శాప కర్త యొకానొక బ్రాహ్మణుడు.

కర్ణుడు పరశురాముని శిష్యుడై ధనుర్విద్యను నేర్చుకొనుచు బాణాభ్యాసమును చేయు చుండెను. ఆ సమయమున నటునిటు తిరుగు చుండిన యొక యావు దూడకు కర్ణుని బాణము తగిలెను. అది మరణించెను. ఈ విషయము తెలిసిన బ్రాహ్మణుడు కోపించి

సీ॥ "——— ——— ఇది హోమ
ధేను వత్సం బిట్లు దీని శల్య
నిహతంబు జేసితి నీవు నా వచన శ
ల్యంబున నిహతుండ వగుము నీకు

తే.గీ॥ సమర మేకాగ్ర నిర్భరోత్సాహ వృత్తి
నడవ నరదంబు చక్రంబు పుడమి గ్రుంగ
వలయు నెవ్వీరు మార్కొని గెలువ గోరి
శ్రమము సేసెద వతనిచే జావు మీవు" (90) అని పలికెను.

అప్పుడు కర్ణుడు గో, గజ, వృషభ, రథాంగ, కాంతామణులను పెక్కింటిని నిచ్చెదనని శాంతింపుమని కోరెను. చిరకాలకు సంపద సంతతి నొసగెదనని ప్రలోభ పెట్టెను. కాని బ్రాహ్మణుడు శాంతింపక

వ॥ "నా పలుకులకు బొంకునుం గలదే నీ కీ దుష్కరంబు వర లోకంబునకు బాధకంబు గాకుండ నిదియ ప్రాయశ్చిత్తం బయ్యెడుం గాక పొమ్ము సూతనందనా యే నెట్లంటి నట్ల గుట దప్ప దరుగు మనియెను" (94)

కురుక్షేత్ర సమరావనిలో "అర్జును"ని తోడ సమరమున కర్ణ రథచక్రము క్రుంగెను. చివరకు కర్ణుడు హతు డయ్యెను.

ఆశ్రమ ప్రాంతమున బాణాభ్యాసమును చేయుట కర్ణుని దోషము. కావున ఫలితము ననుభవింప వలసి వచ్చెను.

4.3.3.2.8. దుర్వాసమహర్షి శాపము

ఈ వృత్తాంతము తిక్కన భారత భాగము "అనుశాసనికపర్వము" పంచమాశ్వాసములో (371-381) గలదు. శ్రీకృష్ణునికి నతికాలి వలన మరణము కలుగుట శాప విషయము. శాప కర్త దుర్వాసమహర్షి.

స్వతంత్ర ప్రవర్తనుడగు దుర్వాసమహర్షి యొకనాడు శ్రీకృష్ణ మందిరమునకు వెళ్ళి తన కిష్టము వచ్చినట్లుగ ప్రవర్తించుచు కొన్ని రోజులను గడిపి యొకనాడు పాయసమును పెట్టించుమని శ్రీకృష్ణు నడిగెను. శ్రీకృష్ణు వెంటనే పాయసమును చేయించి యిచ్చెను. ఆ మహర్షి పాయసములో కొంత భాగమును తిని, కొంత తన శరీరమునకు పూయుమని శ్రీకృష్ణునికి చెప్పెను. శ్రీకృష్ణుడట్లు చేసెను. అప్పుడా మహర్షి సమీపమున నున్న రుక్మిణీ దేవిని చూచి యామె శరీరమునకు కొంత పాయసమును పూసి, యామెను రథమునకు పూన్చి, యా రథము మీద కూర్చొని, రథమును లాగుమని చెప్పెను. ఆమె రథ

మును వీధి లోనికి లాగెను. అప్పు డామెను ములుగోలు చేత పొడు చుచు రథమును నడిపించెను. అందుకు శ్రీకృష్ణునికి కోపమును, నీర్ష్యయును కొద్దిగ కూడ కలుగలేదు. రథము వెంట నడచుచుండెను. యాదవు లా దృశ్యమును చూచి వారిలో వారు మాటలాడు కొనుచు నూరకనే యుండిరి. అట్లు రుక్మిణి రథమును లాగి, యలసి భూమి పై పడెను. ఆ మహర్షి రథము నుండి దిగి దక్షిణ దిక్కువైపు వెళ్ళెను. అతని వెంట శ్రీకృష్ణుడు ప్రార్థించుచు వెళ్ళెను. అప్పు డా మహర్షి సంతసించి వెనుదిరిగి వచ్చి శ్రీకృష్ణునితో "మిమ్ములను కష్ట పెట్టితిని కదా!" అని చెప్పి దయా గుణముతో శ్రీకృష్ణుని చూచి

కం॥ "నా యంగంబుల నెల్లం
బాయస మతి భక్తి బూసి పాదతలము నం
బూయవు గావున గలుగు న
పాయం బఱకాల నీకు నవిలంఘ్యంబై" (377)

అని శపించెను. ఆ విధముగనే శ్రీకృష్ణునికి మౌసల పర్వ భాగములో మరణము కలిగెను.

"నింద లేనిదే బొంది పోదు" అని సామెత. శ్రీకృష్ణ నిర్యాణ మునకు దుర్వాసమహర్షి శాపము నిమిత్తము మాత్రమే.

4.3.3.2.9. అష్ట వసువుల శాపము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అశ్వమేధ పర్వము" చతుర్థాశ్వాసములో (2,49-93) గలదు. అర్జునుని శాప సంతాపితుని చేయుట శాప విషయము. శాప కర్తలు "అష్ట వసువులు".

భారత యుద్ధము ముగిసినది. ఉలూపి సఖులతో నాకాశ గంగలో స్నానమాడ వెళ్ళినది. ఆ సమయమున "అష్ట వసువులు" కూడ మరొకచోట స్నానమాడుచుండిరి. అప్పుడు గంగాదేవి స్త్రీ వేషములో వారి కడ కేగినది. వారు గంగాదేవితో

వ॥ "గాండీవధరుండు శిఖండిం బురస్కరించుకొని గాంగేయుం
డేయకుండం బరమ సాయకంబుల నతనిం గూల్చె నట్లు
కుత్సిత జయార్జనం బొనర్చిన యయ్యర్జును నేము శాప
సంతాపితుం జేయుదు మని చెప్పిరి." (88)

గంగయు దానికి సమ్మతించెను.

ఈ మాటల నాలకించిన "ఉలూచి" తండ్రితో నీ విషయమును చెప్పి భర్తయగు "అర్జును"ని రక్షింపుమని కోరెను. అంత నాతడును "అష్ట వసువు"లను ప్రసన్నుల చేసికొని

సీ॥ "...............అనిలోన వాసవి దత్పూను
దగు బభ్రువాహనుం డస్త్ర మితతి

ఆ.వె॥ "బఱపి గూల్చెనేని బాయు నక్కిల్బిష
మని" (89) సమయమును చేసి పలికిరి.

ధర్మరాజు "అశ్వమేధ యాగమును మొదలు పెట్టెను. యాగాశ్వ రక్షణమునకై "అర్జును"ని నియోగించెను. చివఱకు నతడు మణిపురమును చేరెను. అట చిత్రాంగదార్జునుల కుమారుడగు బభ్రువాహనుడు తురగమును బంధించెను. విధి ప్రేరణమువలన వారిక మాటలు పెరిగెను. చివఱకు సమరము సాగగా "అర్జునుడు" మరణించెను. ఉలూపి సంజీవనీ మణిని తలచినది. అది లభ్యంకాగా బభ్రవాహనుని కిచ్చి "అర్జును"ని యెదపై పెట్టించెను. అతడు బ్రతికెను.

పౌత్రుని చేత భీష్మునకు మరణము. పుత్రుని చేత "అర్జును" నికి పరాజయ మరణములు. భీష్మ మరణమునకు "అర్జునుడు" నిమిత్త మాత్రుడు. అర్జున మరణమునకు నాతని కిల్బిషమే ప్రబల కారణము.

4.4.3. పరిశిష్టము:- పై విభాగములో చేరని శాపములు-పరిశిష్టములు

### 4.3.4.1. శాప సదృశ ప్రతిక్రియలు

ఈ కోవకు చెందిన వృత్తాంతములలో శాపమను మాట సాధారణముగా నుండదు. కాని "అన్యోడు, మర్యాద, అనుభవింతురు, పొందు, అగు, తున్మగాక, చెడుగాక, చనుము" వంటి పదములు కనిపించును. కొన్ని చోట్ల నీ మాటలు కూడ లేకుండ నెదుటి వారి వినాశనమునకు ప్రతి క్రియయే ప్రాధాన్యమును వహించును. అవన్నియును భీషణోక్తుల రూపములో నున్నవి. ఇటువంటివి "ఆంధ్ర మహాభారతములో పదనొండు గలవు ఇవి 1) ఇంద్రునికి ప్రతిసృష్టి, 2) సురాపాన నిషేధము, 3) పరపురుష సంగమ నిషేధము, 4) కురుకులపాంసల పాపానుభవము, 5) అరణ్యమున ధార్తరాష్ట్రునికి నవమానము, 6) ధార్తరాష్ట్రులకు ప్రళయము, 7) వామదేవ వృత్తాంతము, 8) సమరమున దుర్యోధనుని దుర్గతి, 9) పాప పుణ్య విభాగము, 10) జనమేజయుని కష్టానుభూతి, 11) ఉచథ్యుని వృత్తాంతము.

### 4.3.4.1.1. ఇంద్రునికి ప్రతిసృష్టి

ఈ వృత్తాంతము "నన్నయ" భారతభాగము "ఆది పర్వము" ద్వితీయాశ్వాసములో (84-88) గలదు. శాపమును పొందబోవువాడు "ఇంద్రుడు". శాప కర్తలు వాలఖిల్య మహామునులు.

తొల్లి కశ్యప ప్రజాపతి పుత్రార్థియై "ఇంద్రుడు" మొదలగు దేవగణములను, వాలఖిల్య మొదలగు మహాముని గణములను తనకు సహాయులుగా పొంది పుత్రికామేష్టిని చేయు చుండెను. ఆ సమయమున నంగుష్ఠ ప్రమాణ దేహులును, కర్తవ్య పరాయణులును నైన వాలఖిల్య మహామునులను "ఇంద్రుడు" చూచి నవ్వెను. వా రవమానముతో కోపించి

కం॥ "రణ విజయు డనల తేజుం
డణిమాది గుణాఢ్యు దురిత డయ్యెడు వీరా
గ్రణి శతముఖు కంటెను శత
గుణ వీర్యుం డైన పుత్రకుం డజితుండై" (85)

వ॥ "వాడు రెండవ యింద్రుం డయ్యెడు మని మహా వీర్య
వంతంబు లైన మంత్రంబుల వేల్చు చున్నంత" (86)

ఆ విషయము నంతటిని "ఇంద్రుడు" తెలిసికొని కశ్యప ప్రజాపతి దగ్గరకు వెళ్ళి

"నాకుం గరుణింపు మని ప్రార్థించెను." (86)

వెంటనే కశ్యప ప్రజాపతి వాలఖిల్య మహామునులతో "ఇతడు బ్రహ్మ నియోగము చేత త్రిజగములకు "ఇంద్రు"డై తన భుజ బల పరాక్రమముచే భూతరాశిని కాపాడుచున్నాడు. రెండవ "ఇంద్రుడు" పుట్టినచో భువన ప్రవృత్తి విపరీత మగును. బ్రహ్మ మాటకు వ్యతిరేకముగ చేయుట మాకు యుక్తము కాదు" అని పలికి

వ॥ "మీ వచనం బమోఘంబు గావున నింక నాకు నుద్భవిల్లెడు పుత్రుండు పక్షికులంబున కెల్ల నింద్రుం డయ్యెడ మని కశ్యపుండు వారల నొడంబఱచెను" (86)

అటువంటి కశ్యప ప్రజాపతి యజ్ఞమహిమ వలనను, వాలఖిల్య మహామునుల తపోమహిమ వలనను, వినతకు పుట్టిన రెండవ పుత్రుడైన గరుత్మంతుడు విహగేంద్రు డయ్యెను.

4.3.4.1.2. సురాపాన నిషేధము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము" తృతీయాశ్వాసములో (96-122) గలదు. మానవులు సురను త్రావిరేని పాపము వచ్చుననుట శాప విషయము. ఈ మర్యాదను చేసినవాడు శుక్రాచార్యులు.

కచుడు బృహస్పతి కుమారుడు. అతడు సంజీవని విద్యార్థము శుక్రాచార్యుని శిష్యుడయ్యెను. రాక్షసుల కీ విషయము నచ్చలేదు. ఒక పర్యాయము కచుని చంపిరి. కాని దేవయాని ప్రేరణతో శుక్రాచార్యుడు బ్రతికించెను. మరొక పర్యాయము కచుని చంపి బూడిదను చేసి సురతో కలిపి యాచార్యులవారికే రాక్షసు లిచ్చిరి. కచుడు రాకపోవుటతో దేవయాని మరల బ్రతికించుమని ప్రార్థించెను. శుక్రుడు కచుని యెందును గానక చివరకు తన యుదరములో నుండుటను గుర్తించి దేవయాని నోదార్చెను. కాని దేవయాని బలవంతముతో సంజీవనిని నేర్పి యతనికి విముక్తిని కలిగించెను. అప్పుడు శుక్రాచార్యులు "మానవులు ముందు జన్మలలో పుణ్య కర్మలను చేసి సంపాదించిన జ్ఞానము మద్యమును త్రాగుట వలన కొద్ది కాలములో నశించును. కావున మద్యమును తీసికొనరాదని" నిశ్చయించి

కం॥ "భూసురు లాదిగా గల జను
లీ సుర సేవించిరేని యిది మొదలుగ బా
పాసక్తి బతితు లగుదురు
చేసితి మర్యాద దీని జేకొనుడు జనుల్" (121)

వ॥ "అని సురాపానంబు మహాపాతకంబుగా శపియించెను" (122)

యుక్తాయుక్తముల నెఱుగక సురాపానమును చేసినవాడు శుక్రాచార్యుడు. కాని యితడందరికిని సురాపానము మహాపాపమని శాసించుట చిత్రము.

4.3.4.1.3. పరపురుష సంగమ నిషేధము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము" పంచమాశ్వాసములో (64-85) గలదు. స్త్రీలు పరపురుష సంగమము చేయరాదనుట శాప విషయము. ఈ మర్యాదను చేసినవాడు శ్వేతకేతువు.

ఘోషయాత్రలో దుర్యోధనాదులకు కృష్ణద్వైపాయనుని మాట ప్రకారమే పరాభవము కలిగెను.

4.3.4.1.6. ధార్తరాష్ట్రులకు ప్రళయము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య పర్వము" ప్రథమాశ్వాసములో (199-224) గలదు. దుర్యోధనుని కతమున ధార్తరాష్ట్రులకు ప్రళయమగు ననుట ధర్మరాజు ఆశంస.

పాండవు లరణ్యవాసమున ద్వైతవనమున నిలిచిరి. ఒక పర్యాయము ప్రసక్తానుప్రసక్తముగ ద్రౌపది బలవంతులైనను నరణ్యవాసము చేయవలసి వచ్చుటకు ధర్మజుడే కారకుడని నిందించెను. ధర్మరాజు ద్రౌపది నోదార్చినను లాభము లేకపోయెను. అప్పుడు ధర్మరాజు నోట

వ॥ "ఉపశమ హీనుం డయిన దుర్యోధను కారణంబున ధార్తరాష్ట్రుల కెల్లం బ్రళయం బగు నని" పలికెను (224).

మహాత్ములు నొచ్చుకొనుట లోకమునకు మంచిది కాదు. పైగా ధర్మరాజు నోట నెపుడును రాని మాట వెలువడుట వలన ననర్థమే యని స్పష్టమైనది.

4.3.4.1.7. వామదేవ వృత్తాంతము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య పర్వము" చతుర్థాశ్వాసములో (318,335-359) గలదు. దలుని కుమారుడు వామదేవ మహాముని వాక్యము వలన మరణము నొందుట శాప సదృశము.

సూర్యవంశపు రాజైన పరీక్షిత్తునకును, మండూక నాయకుడైన "ఆయువు" యొక్క కూతురగు సుశోభనకు పుట్టిన ముగ్గురు కుమారులలో "శలు" డొక పర్యాయము వేటకై వనమున కేగెను. వేటలో

నతని రథ గుఱ్ఱము లలసిపోగా వామదేవుని గుఱ్ఱముల సహాయముతో వేటాడి పట్టణమునకు చేరెను. కాని గుఱ్ఱముల నీయ లేదు. వామదేవుడు తనంత తాను వెళ్ళి యడిగిన నీయకపోగా పరిహసించి చంపుడని ముదల నిడెను. ముని కోపించి రాక్షసులను సృజించెను. వారు నిశిత శూలములతో రాజులను చంపిరి. ఈ వృత్తాంతము తెలిసియు శలుని తమ్ముడైన దలుడు వామదేవునికి గుఱ్ఱముల నొసగక యతనిని చంప దనుర్బాణములను తెమ్మనెను. అప్పుడు మహాముని కోపించి

సీ॥ "....నన్నీయ దెమ్మనిన విశిఖ
మంతఃపురంబున సంతసంబున నున్న
ఘను భవత్సుతు దున్మగాక యిపుడ" (353)

అని పలికెను. వెంటనే యట్లు జరిగెను. సుతుడు మరణించెను. దలుడు వామదేవుని చంప నుద్యుక్తుడు కాగా హస్తస్తంభన మయ్యెను. అపై దలుడు ప్రార్థింప వామదేవుడు కరుణించెను. హస్తస్తంభనము తొలగెను. బాలుడును బ్రతికెను.

అహంకార మెట్టి యనర్థమునేని తెచ్చిపెట్టు ననియు నహంకార ప్రేరితులు సులభముగా తమ తప్పును తెలిసికొన లేరనియు తెలియ జేయుటకు నీ కథ దృష్టాంతము.

4.3.4.1.8. సమరమున దుర్యోధనుని దుర్గతి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము భీష్మ పర్వము తృతీయాశ్వాసములో (413.436) గలదు. దుర్యోధనుడు భీముని వలన దుర్గతి పాలగుననుట భీష్ముని భవిష్యత్కథనము.

పది రోజులు సమరముచేసి "అర్జును"ని బాణములతో భీష్ముడు శరతల్పగతుడయ్యెను. అతనికి దాహమగుడు "అర్జునుడు" బాణములను ప్రయోగించి పాతాళగంగను రప్పించెను. భీష్ముడా జలపానము గావించి

అది యుగములో స్త్రీలు స్వేచ్ఛావర్తనులై యుండిరి. ఆ నాటికి పరపురుష సంగమము పాపము కాదు.

ఉద్దాలకు డొక మహర్షి. అతని భార్య ఋతుమతియై యున్న వేళ నొక వృద్ధ బ్రాహ్మణు డతిథిగా వచ్చెను. ఆ యతిథి యామెను కోరెను. ఈ విషయము తెలిసిన ఉద్దాలకుని కుమారుడగు శ్వేత కేతువు బాధపడి, కోపించి

సీ॥ "ఇది యాదిగా సతు లెన్నండు బర పురు
షార్థినుల్ గా జన దన్య పురుషు
సంగమంబున జేసె సకల పాతకములు
నగు బరిగ్రహ భూతలయిన సతుల
కిట్టి మర్యాద యిమ్మనుష్యుల కెల్ల
జేసితి లోక ప్రసిద్ధి గాగ" (85) అని పలికెను.

సమాజ మందలి స్వార్థ, మూర్ఖ, యనాగర కాచారములను తొలగించుటకు చేసిన ప్రయత్నము నీ శాపము విశదము చేయు చున్నది.

4.3.4.1.4. కురు కులపాంసనుల పాపానుభవము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము సభా పర్వము ద్వితీయాశ్వాసములో (194-245) గలదు. ధార్తరాష్ట్రుల వారి పాప ఫలము ననుభవింతురనుట శాప విషయము. భీష్ము డీ మాటలను పలికెను.

ధృతరాష్ట్రుని సభలో ధర్మరాజు సర్వస్వము నోడిన వేళ, "నన్నోడి తన్నోడెనో, తన్నోడి నన్నోడెనో" అని ద్రౌపది "ప్రాతికామిని" యడిగి రమ్మనిన వేళ, సభలోనే యీ విషయము తేలగల దని దుర్యోధను డాదేశించిన వేళ, రజస్వలయు నేక వస్త్రయు నగు ద్రౌపది కచగ్రహణమును దుశ్శాసనుడు చేయు వేళ, సభ్యులందరు ప్రత్యుత్తరమును చెప్పక మౌన ముద్రను వహించిన వేళ, వికర్ణుడు

మాత్రము ద్రౌపది యధర్మ విజేత యని యెలుగెత్తి చాటిన వేళ, "నా ప్రశ్నలకు సమాధానమును సభ్యులెవరైన చెప్పు"డని ద్రౌపది పలవించిన వేళ,

వ॥ "నీ ప్రశ్నంబునకు నుత్తరం బయ్యుధిష్ఠిరుండు సెప్ప
వలయు గానినాడు ధర్మసూక్ష్మత యెవ్వరికిని నెఱుంగ
గహనంబు దీనిఫలంబు వేగంబ యిక్కురు కులపాంసను
లనుభవింతు"రని పలికెను. (245)

భీము డిది వఱకే తాను కౌరవుల సంహరింతునని ప్రతిజ్ఞను చేసెను. భీష్ముని యీ మాటలు భీమ ప్రతిజ్ఞకు ప్రతిధ్వని రూప ముగు శాప సదృశము.

4 3.4.1.5. అరణ్యమున ధార్తరాష్ట్రునికి నవమానము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "అరణ్య పర్వము" ప్రథమాశ్వాసములో (51-79) గలదు. ధార్తరాష్ట్రు లరణ్యమున నవ మాన పాలగుదురనుట భవిష్యద్వాణి. ఈ మాటలనిన వ్యక్తి కృష్ణద్వైపాయన మహర్షి.

పాండవు లరణ్యవాసమున నుండు వేళ వారిపై సకలాయుధ ములతో సైన్యము నడిపింతమని కర్ణుడు దుర్యోధనునికి సలహా నొస గెను. దివ్యదృష్టితో నీ విషయము నెఱిగిన కృష్ణద్వైపాయనుడు దుర్యోధనుని వారించెను. అంతే గాక ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్ళి

కం॥ "వన గతులని వారలపై
జని భంగము బొంది రాగ సమకట్టెడు నీ
తనయుడు గావున నీ వా
తని వారింపు మది యనుచితం బని సెప్పెన్" (78)

అని చెప్పెను.

ఉ॥ "నారదుచేత నిన్ను మునినాథుని గాగ నెఱింగి యుండుదున్
శౌరియు నీవు గూడిన నసాధ్యము లెవ్వియు లేవు దర్ప దు
ర్వారుడవైన నీ వలని వైరము గీడని చెప్ప జెప్ప నీ
కౌరవ రాజు మానడు దెగం జెడు గా కిట మీద భీముచే" (434)
అని తన భవిష్యత్కథనమును స్పష్టము చేసెను.

ఇది వఱకే భీముడు దుర్యోధనుని చంపుదునని సభలో ప్రతిన లాడెను. ఈ మాటలు ఫలించుటకు భీష్ముని వాక్యములు కూడ తోడ య్యెను.

4.3.4.1.9. పాప పుణ్య విభాగము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము కర్ణపర్వము ద్వితీయా శ్వాసములో (108-109) గలదు. బాహ్లికుల పాపములు శల్యుని చేరుట శాప విషయము. ఈ కట్టడి చేసిన వాడు కర్ణుడు.

దుర్యోధనుని కోరిక మేరకు శల్యుడు కర్ణ సారధి యయ్యెను. కాని వారిరువురికి పొంతన కుదర లేదు. శల్యుడు కర్ణుని నవమానించు టకై యనోపాఖ్యానములను నడపెను. చివఱకు "అర్జును"ని కీర్తిం చుచు కర్ణుని తెగడెను. అప్పు డా కర్ణుడు కోపించి బాహ్లికుల వర్తన మును తూలనాడెను. బాహ్లికులు గోమాంస భక్షకులు. మద్యపాన రతులు. అసంగత దురాలాప చతురులు.

వ॥ "బాహ్లికుల కొడయుండవు తత్కృతంబు లగు పుణ్యపాపంబున నాఱవపాలు నిన్నుం జేట నట్లుంగాక వారి యనాచారంబులు వారింపమింజేసి యా కల్మషంబు లెల్లను నిన్నుంబొందు బాహ్లికుల కంటె మద్రదేశ జాతు లవినీతు లని యార్యులు సెప్పుదురు" (109) అని పలికెను.

అనేక శాపగ్రస్తుడు కర్ణుడు. అట్టివాని మాటలు ఫలించుట గగన కుసుమములు.

4.3.4.1.10. జనమేజయుని కష్టానుభూతి

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము శాంతి పర్వము తృతీయాశ్వాసములో (343-365) గలదు. జనమేజయునికి కష్టపరంపరానుభూతి శాప విషయము. దీనికి నతని స్వయంకృతాపరాధమే కారణము.

పూర్వకాలమునకు చెందిన పరీక్షిత్తుకుమారుడు జనమేజయుడు. అతనికి నధర్మప్రవర్తనము వలన బ్రహ్మహత్యాదోష మంటెను. కావున ప్రజ లతనిని నిందించిరి. బ్రాహ్మణులు కోపగించిరి. అందు వలన నతడు పురమును వదలి యరణ్యమున శౌనకు డను ముని యాశ్రమమునకు చేరెను. ముని యతనిని చూచి "పీనుగు వలె నున్నావు. ఎందుకు వచ్చితి"వని ప్రశ్నించుచు

చం॥ "——— ——— ఎక్కడే
జనుము శిరంబు క్రిందుగ నజస్రము వేల గలాడ వీ భవం
బున తుది గ్రూర కాక చయముల్ దొలువన్ నరకాధివాసివై"
(348)

అని పలికెను. అప్పుడు "మీ వలన దారుణ పాపమును పాచికొందు నని వచ్చితిని దయతో చూచి పరిగ్రహింపు" మని జనమేజయుడు ప్రార్థించెను. శౌనకు డప్పుడు నీతి ప్రసంగములను చేసి యతని దోషములను తొలగించెను.

బ్రహ్మహత్యా దోషము జనమేజయుని కున్నది. దానికి తోడుగా ముని కోపము బాధా (శాప) తీవ్రతను పెంచినది.

4.3.4.1.11. ఉచథ్యుని వృత్తాంతము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "అనుశాసనికపర్వము" పంచమాశ్వాసములో (340-345) గలదు. వరుణదేవుడు చేసిన దుష్కార్యమునకు "ఉచథ్యుడు" సర్వజలమును త్రాగుట శాప విషయము.

అంగిరస వంశజుడు "ఉచథ్యుడు". ఇతనికి సోముడు తన కూతుర్నిచ్చి వివాహమును చేసెను. వారిక్కిష్టము వచ్చునట్లు వనములో విహరించుచుండిరి. ఒకనాడు "ఉచథ్యుడు యమునా నదీ స్నానమునకు వెళ్ళెను. ఆ సమయమున వరుణదేవుడు "ఉచథ్యు"ని భార్యపై మనసుపడి వచ్చి యామె నెత్తుకొని పోయి తన పురములో నుంచు కొనెను. ఈ విషయమును నారద మహర్షి "ఉచథ్యు"నికి చెప్పెను. వరుణదేవుడు దిక్పాలకునిగా నుండియు నితరుని భార్యను బలవంతముగా తీసికొనిపోవుట తగునా యని "ఉచథ్యుడు" పలికి యామెను విడిపించుకొని రమ్మని నారద మహర్షిని పంపెను. నారద మహర్షి మాటను వరుణదేవుడు వినలేదు. తనను మెడపట్టి తోపించెనని నారదమహర్షి "ఉచథ్యు"నికి చెప్పెను. వెంటనే "ఉచథ్యుడు" కోపించి వరుణలోకములోని సర్వజలమును త్రాగెను. వరుణపురము ధూళి మయమయ్యెను. అప్పుడు వరుడు

సీ॥ "..............భయమంది మానిని గొని వచ్చి
యొప్పించి ప్రణమిల్లి తప్పు వాపి
కొని ముని కృప గాంచి చనియె" (345)

ఇచట వరుణలోకము ధూళిమయమగు గాత యని "ఉచథ్యుడు" శపించలేదు. క్రియా రూపమున సర్వజలము నాతడు త్రాగుటలో వరుణలోకము ధూళిమయ మయ్యెను. వరుణుడు "ఉచథ్యు"ని భార్యనప్పగించుటతో వివాదము పరిష్కృత మయ్యెను.

## 4.3.4.2. స్పష్టచిత్రణ లేని శాపములు

ఆంధ్ర మహాభారతములో స్పష్టచిత్రణ లేని శాపములు రెండు విధములుగా కనిపించును.

మొదటిది క్వాచిత్కముగా పద్యపాదము నందో లేదా వచన భాగమునందో యలవోకగా ప్రస్తావింపబడిన శాపములు స్పష్టచిత్రణ

లేని శాపములు. అనగా నీ శాపములు యవగాహణకు తదితర గ్రంథ సాక్ష్యము అవసరమని యభిప్రాయము.

రెండవది శాపమును మాట చెప్పను క్రియ ప్రతిక్రియ రూపములు కనిపించు వృత్తాంతములు. ఇట్టివి మూడు గలవు. ఇవి 1) బ్రహ్మ, 2) నలకూబరుని, 3) శాండిలి శాపములు

4.3.4.2.1. బ్రహ్మ శాపము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము" తృతీయాశ్వాసములో (2-47) గలదు. 'అద్రిక" అను "అప్సరస" మత్స్య మగుట శాప విషయము. శాప కర్త బ్రహ్మ.

"అద్రిక" వృత్తాంతము "ఆంధ్ర మహాభారతము"న సమగ్రముగా లేదు. కాని దేవీభాగవతమున కలదు. అద్రిక తెలియక ముని పాదముల మీద పడినది. అద్దాన బ్రహ్మ మత్స్య జన్మ మొందుమని శపించెను. మత్స్యమునకు మనుష్య శిశుజన్మ కలిగినవేళ, శాప విమోచన మగునని బ్రహ్మ యనుగ్రహించెను.

అద్రిక మత్స్యమై యమునా నదిలో తిరుగునపుడు "ఉపరిచర వసు" వీర్యమును త్రాగుట సంభవించెను. అద్దాన నంతర్వత్ని యయ్యెను. చివరకు జాలరు లా మత్స్యమును పట్టి కోయగా మనుష్య శిశు జననమును మత్స్యము పూర్వపు దివ్య వనితాకారమును దాల్చుటయు జరిగెను.

ఆంధ్ర మహాభారతమున

వ॥ "తొల్లి బ్రహ్మ శాప నిమిత్తంబున నద్రిక యను నప్సరస యమున యందు మీనయి క్రుమ్మరు చున్న" (31)

వ॥ "అయ్యద్రికయు మానుష ప్రసవం బొనరించినం దనకు శాపమోక్షణం బగు నని బ్రహ్మ వచనంబు గలుగుటం జేసి

మీన యోని విడిచి దివ్య వనిత యయి దేవలోకంబునకుం
జనియె" (33) అని యున్నది.

సృష్టి స్థితి లయములలో సృష్టి కార్యము బ్రహ్మది - అతని నిర్ణయము ననుసరించి పునర్జన్మలు, జన్మాంతర పరివర్తనములు సాగుచుండును. అద్రిక మీన మగుటకును, నా మీన గర్భమున మత్స్యరాజును, మత్స్యగంధి యనుజన్మించుట మొదలగునవన్నియు బ్రహ్మలలాట లేఖనమును బట్టి సంబంధించినవే. కనుకనే యీ కథలో ముని పాదముల మీదపడిన "అద్రిక"కు శాపకర్త ముని గాక బ్రహ్మ యయ్యెను.

### 4.3.4.2.2. నలకూబరుని శాపము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య పర్వము" సప్తమాశ్వాసములో (151-165) గలదు. రావణుడు పర స్త్రీలను బలత్కారము చేయకుండుట శాప విషయము. శాప కర్త నలకూబరుడు.

శ్రీరామచంద్రుడు రావణ వధానంతరము సీత నగ్ని ప్రవేశము చేయుమని యాదేశించెను. అప్పుడు పంచభూతములు సీత పతివ్రత యని చెప్పెను. అప్పుడే బ్రహ్మ దేవతాగణముతో విచ్చేసి

వ॥ "నలకూబరు శాపమునం జేసి దశగ్రీవునకు బరస్త్రీలయందు
బలాత్కారంబు సెల్లదు గావున నీ ధర్మపత్ని యందొక్క
దురితంబును బొరయదు" (165) అని చెప్పెను.

ఈ శాప వివరణ "ఆంధ్ర మహాభారతము"న కానరాదు.

### 4.3.4.2.3. శాండిలి శాపము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగ పర్వము" తృతీయాశ్వాసములో (302-311) గలదు. గరుత్మంతుని పక్షము (ఱెక్క)లు పోవుట శాప విషయము. శాప ప్రదాత "శాండిలి" అను పేరు గల తపస్వి.

గాలవ గరుత్మంతులు బాల్య మిత్రులు. గాలవుడు తన గురువగు విశ్వామిత్రుని గురుదక్షిణను తీర్చు నిమిత్తము గరుత్మంతుని సహాయము నర్థించెను. గరుత్మంతుడు గాలవుని వీపుమీద నుంచుకొని తూర్పు దిక్కువైపు పయనించెను. కాని గాలవుడు కూర్చొనలేక డస్సి పోయెను. అతనిని కొండమీద దించి జల సేవనము గావించెను. ఈ సందర్భమున గరుత్మంతునికి

వ॥ "శాండిలి యను నొక్క తపస్వి శాపంబున బక్షంబులు డుల్లి యను గ్రహంబునం గ్రమ్మఱ వచ్చిన విషాద మోదంబు లనుభవించి యట చనుట చాలించెను" (311) అని కలదు.

శాండిలి తపస్వి శాపము, తద్విమోచనము "ఆంధ్ర మహాభారతము"న వివరముగా లేదు.

## 4.3.4.3. విముక్తి లేని శాపములు

శాపములలో సాధారణముగా రెండంశము లుండును. మొదటిది శాపము నిచ్చుట, రెండవది శాప విమోచనోపాయము. కాని కొన్ని శాపములలో శాపము నిచ్చుటయే గాని శాప విమోచనోపాయ ముండదు. ఇటువంటివి విముక్తిలేని శాపములు. ఆంధ్ర మహాభారతములో విముక్తి చెప్పబడని శాపముల సంఖ్య "ఆఱు". ఇవి 1) భృగుమహర్షి (అగ్ని సర్వభక్షకత్వము), 2) సనత్కుమార, 3) యయాతి, 4) ఆయువు, 5) భాగీరథీ, 6) ధర్మరాజు శాపములు

## 4.3.4.3.1. భృగుమహర్షి శాపము (అగ్ని సర్వ భక్షకత్వము)

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము" ప్రథమాశ్వాసములో(126-135), తిక్కన భారతభాగము శల్యపర్వము ద్వితీయాశ్వాసములోను(174,193-195) నొకే విధముగా గలదు. అగ్ని దేవుడు సర్వభక్షకుడగుట శాప విషయము. శాప కర్త భృగుమహర్షి.

భృగుమహర్షి నదీస్నానమునకు వెళ్ళుచు "అగ్ని" ప్రజ్వలన కార్యమునకు గర్భిణియగు తన భార్య పులోమను నియమించెను. ఆ సమయమున పులోము డను రాక్షసు డామెను గాంచి కామపరవశుడై "ఈమె యెవరి భార్య" అని "అగ్ని" నడిగెను. నిజమును చెప్పకున్నచో పులోమను బాధపెట్టునేమో యనియు, భృగువు శపించునేమో యనియు, సత్యమును చెప్పకున్నచో నసత్య దోషపాపము తనకు సంక్రమించు ననియు "అగ్ని" యాలోచించి పులోమునికి నిజమును చెప్పెను. పులోముడు "పులోమ నాపూర్వ ప్రేయసి కనుక నా భార్య" అనుచు నామె నెత్తుకొని పోయెను. మార్గమధ్యములో గర్భస్థ శిశువు వెలువలికి వచ్చెను. ఆ బాలుని శరీర కాంతి దర్శనముతో పులోముడు భస్మ మయ్యెను. భృగువు స్నానానంతర మాశ్రమమునకు వచ్చి భార్య చంకలోనున్న బిడ్డనుచూచి విషయమును తెలిసికొని "అగ్ని" పై కోపించి

వ॥ "నీ వతి క్రూరుడవు సర్వభక్షకుం డవు కమ్మని శాపం
బిచ్చెను" (ఆది ప. 1 ఆ 135)

శాప విముక్తి యీ వృత్తాంతములో లేదు.

**4.3.4.3.2.** సనత్కుమార శాపము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆదిపర్వము" తృతీయాశ్వాసములో (88-92) గలదు. పురూరవుడు "ఉన్మత్తు"డగుట శాప విషయము. శాప కర్తలు సనత్కుమారాదులు.

ఇలా బుధుల కుమారుడు పురూరవుడు. అతడు పరాక్రమ వంతుడై పదమూడు ద్వీపముల నేలెను. కాని ధనాశచే బ్రాహ్మణ శ్రేష్ఠుల ధనముల నపహరించెను. బ్రహ్మకీ విషయము తెలిసి పురూరవ యత్న నివారణార్థమై సనత్కుమారుని పంపెను. అతడు దివ్య ముని గణముతో పురూరవుని కడ కేగెను. కాని రాజ గర్వముతో

పురూరవుడు వారిని కలిసికొన లేదు. అంత మునులు కోపించి రాజును

వ॥ "ఉన్మత్తుంగా శపియించిరి" (92)
దాని ప్రభావము వలన నతడు "ఉన్మత్తు"డై గంధర్వ లోకమున "ఊర్వశీ" సహితుడై యుండెను.

ఆంధ్ర మహాభారతమున పురూరవ శాప విముక్తి లేదు.

అధికారమున్నప్పు డహంకార ముండగూడదనియు, నున్నచో తగిన కష్టఫలితమును పొందక తప్పదనుటను నీ శాపము సూచించును

4.3.4.3.3. యయాతి శాపము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము" తృతీయాశ్వాసములో (187-198) గలదు. యయాతి తన కుమారు అను జవ్వనమునందే పంచత్వ మొందుడని శపించుట శాప విషయము. శాప కర్త యయాతి.

దేవయాని ప్రేరితుడై శుక్రాచార్యులు యయాతిని జరాభార పీడితు డగుదువని శపించెను. యయాతి ప్రార్థేయపడగా శుక్రాచార్యుడు కరుణించి జరాభారమును కొడుకుల కిచ్చి శాప విముక్తిని పొందు మనెను. ఆ విషయములో యయాతి మాట నతని మొదటి నల్గురు పుత్రులు సమ్మతింప లేదు. కాని యైదవ పుత్రుడు సమ్మతించెను. అప్పుడు యయాతి

వ॥ "యదు వంశంబున వారు రాజ్యంబున కయోగ్యులుగా
దుర్వసు వంశంబున వారు ధర్మాధర్మ వివేక శూన్యులై
సంకీర్ణ వర్ణ కిరాతులకు రాజులుగా ద్రుహ్యు వంశంబున
వారు డుపప్లవ సంతార్యంబైన దేశంబునకు రాజులుగా
జరా దూషకుం డగుట నను వంశంబున వారు ముదియు
వంతకు నుండక జవ్వనంబునన పంచత్వంబున కరుగు
వారునుం గా శాపం బిచ్చెను." (195)

తండ్రి మాటను వినకపోవుట కుమారుల నేరము. ఒక తండ్రి కరుణించి శాప విమోచనమును చెప్ప వచ్చును. ఒక తండ్రి యట్లు చేయక పోవచ్చును. యయాతి శాప విమోచనమును చెప్ప లేదు.

**4.3.4.3.4.** ఆయువు శాపము

ఈ వృత్తాంతము "ఎఱ్ఱన" భారతభాగము "అరణ్య పర్వము" చతుర్థాశ్వాసములో (318-335) గలదు. సుశోభన పుత్రులు కపట వర్తనులగుదురనుట శాప విషయము. శాప కర్త సుశోభన తండ్రి "ఆయువు".

ఆయువు మండూక నాయకుడు. అతని కుమార్తె సుశోభన. ఆమె సుందరీమణి. ఆమె యంద చందములకు ముగ్ధులై పలువు రామెను కోరిరి. జల విహారమునకు పంపకున్న పరింతునని చెప్పి రాజుల వివాహమాడెడిది. కాని తెలియకయో లేదా యాదృచ్ఛికముగానో జల విహారమున కాజ్ఞాపింప నామె జలములో మునిగి మాయమయ్యెడిది.

పరీక్షిత్తు సూర్యవంశపు రాజు. అతడు వేటకు వెళ్ళి యరణ్యమున సుశోభను చూచి యామె షరతుకు నంగీకరించి వివాహ మాడెను. ఒక దినమున వారు వనవిహారమును చేసిరి. చెమట పట్టుటచే రాజు కొలను లోనికి దిగి భార్యను కూడ స్నానార్థము రమ్మనెను. సుశోభన కొలను లోనికి దిగి మాయ మయ్యెను. రాజు సుశోభన కొఱకు కొలనిలో గాలించెను. కప్పలు మింగియుండునేమో యని భావించెను. ఆ కోపముతో కనబడిన కప్పలను చంపించెను. అప్పుడు మండూక నాయకుడగు "ఆయువు" రాజు కడకు వచ్చి సుశోభన తన కూతురని, రాజులనేకు లామె వలన బేలపడిరని తెలిపెను. రాజు సుశోభననే కోరెను. అయువు తన భావనతో నామెను రప్పించి

వ॥ "నీవు కడుం జెట్టవు ప్రసిద్ధు లగు రాజుల పెక్కండ్రం బెన
పెట్టితివి గావున నీకుం బుట్టెడు కొడుకులు గపట వర్తను
లయ్యెడు మని కూతు శపియించెను" (335)

కుటుంబ క్షేమము కంటె ప్రజాక్షేమము మిన్న. కనుక మం డూక నాయకుడు తండ్రిగా కుమార్తెను కొంత కాలము క్షమించినను చివరకు నామెకు శాపమునిచ్చెను. ఈ కథలో శాప విమోచనము లేదు. సుశోభన కుమారులు శల, దల, వలులు ముగ్గురును కపట స్వభావులే.

4.3.4.3.5. భాగీరథీ శాపము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "ఉద్యోగ పర్వము" చతుర్థాశ్వాసములో (360-364) గలదు. అంబ "ఏఱయి" పారుట శాప విషయము. శాప కర్త గంగాదేవి.

భీష్ముడు తన సోదరునికై "అంబ, అంబిక, అంబాలిక" లను నిర్ణయించెను. కాని "అంబ" తాను సాళ్వదేశపు రాజును ప్రేమించి తినని చెప్పగా నామెను వదలి పెట్టెను. అయినను "అంబ"ను సాళ్వ దేశపు రాజు తిరస్కరించుటతో తన బతుకిట్లు పాడగుటకు భీష్ముడే కారకుడని యతనిపై పగ బట్టెను. నిష్ఠుర తపశ్చర్యకు పూనుకొనెను. మరియు వ్రతముల ననేకముల నొనర్చెను. ఆమె తప మందరిని యాశ్చర్యచకితులను చేసినది. గంగానది కుతూహలముతో "అంబ" తపశ్చర్యకు కారణ మేమనెను. అంబ భీష్మహననార్థమే తాను తప మును చేయుచున్నట్లు పలికెను. ఆ మాటలకు భాగీరథి కోపించి

వ॥ "కుటిల ప్రచార వగుట నీ వీ తనువు విడిచి యేఱయి

పాఱం గలదాన వింతియ గాని యొండు గానేరవు"

(364) అని పలికెను.

భాగీరథి మాట (శాపమున)కు రెండంశము లున్నవి. మొదటిది తల్లి హృదయము. రెండవది కుటిల వర్తనుల పట్ల నేహ్యము. శాప విముక్తి చెప్పబడక పోవుట యిందలి విశేషము.

4.3.4.3.6. ధర్మరాజు శాపము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము స్త్రీ పర్వము ద్వితీయాశ్వాసములోను (173-184), శాంతి పర్వము ప్రథమాశ్వాసములోను (2-41) గలదు. రహస్య గోపనము స్త్రీల కుండదనుట శాప విషయము. శాప కర్త ధర్మరాజు.

భారత యుద్ధానంతరము ధర్మరాజు మరణించిన వారికి నగ్ని తిలోదక కార్యములను మొదలిడెను. అప్పుడు కుంతి కర్ణునికి నగ్ని తిలోదక కార్యములను చేయుమని యాతని జన్మ రహస్యమును ధర్మరాజుకు చెప్పెను. ధర్మరా జట్లు చేసెను. ఆపై "శుభ స్వీకరణార్థము" మాస పర్యంతము గంగాతీరమున విడిది చేసెను. అప్పుడు నారద వేదవ్యాసులు వచ్చిరి. వారిని ధర్మరాజు కర్ణునికి కలిగిన శాపములను గురించి యడిగెను. నారదుడు కర్ణ వృత్తాంతమును సమగ్రముగా తెలిపెను. అ మాటల నాలకించిన ధర్మరాజు చాల బాధపడెను. అప్పుడచటనే యున్న కుంతి కర్ణుని పాండవ పక్షమున చేర్చుటకు తాను చేసిన ప్రయత్నములను స్పష్టపఱచెను. మరియు శ్రీకృష్ణుని ప్రయత్నములను గూడ తెలిపెను. కనుక కర్ణార్థము బాధ పడుట తగదని బోధించెను. ఆ మాటలనువినిన ధర్మరాజు కుంతి నసహ్యించుకొనుచు కర్ణ జన్మ రహస్యము నింత కాలము తెలియజేయ కుండుట వలన ననర్థము వాటిల్లెనని

తే.గీ॥ "అంగనా జనమ్ములకు రహస్య రక్ష
ణంబు నందలి శక్తి మనంబులందు
గలుగ కుండెడు మెల్ల లోకంబుల నని శ
పించెను." (శాంతి ప. 1 ఆ. 41)

రహస్య గోపనము సమర్థనీయమే. కాని కొన్ని రహస్యములు వ్యక్తి, కుటుంబ, సమాజములకే యనర్థము తెచ్చునేని యట్టి వాని

రహస్య గోపనము సమర్థవంతము కాదు, నిందార్హము. భారతయు ద్ధమునకు ముందు పాండవులకు కుంతి కర్ణ జన్మ రహస్యమును తెలిపి యుండినచో భారత కథ మఱియొక విధముగ జరిగి యుండుననుటలో సందేహము లేదు.

4.3.4.4. ఫలించని శాపములు

శాపమన్న తరువాత ఫలింప వలయును. ఫలింపకున్న నది వ్యర్థము. వ్యర్థ శాపమునకు శాప కర్త తపశ్శక్తి లోపమో లేదా యా శాపమునకు విరుగుడుగా మరియొకరి వర బలమో కారణ మగును. ఇట్టివి "ఆంధ్ర మహాభారతము"న రెండు గలవు. ఇవి 1) సరమ, 2) పర్వతుని శాపములు.

4.3.4.4.1. సరమ శాపము

ఈ వృత్తాంతము నన్నయ భారతభాగము "ఆది పర్వము" ప్రథమాశ్వాసములో (73-90) గలదు. జనమేజయునికి ననిమిత్తా గమ భయము కలుగుట శాప విషయము. శాప కర్త దేవతల శున కియైన సరమ.

జనమేజయుడు కురుక్షేత్ర ప్రాంతములో దీర్ఘ సత్త్రి యాగ మును చేయ మొదలిడెను. అప్పుడు సరమ సంతతి యగు సారమే యము క్రీడార్థ మచటికి వెళ్ళెను. సత్త్రియాగ ప్రదేశమున సార మేయము ప్రవేశించుటతో జనమేజయుని సోదరులు దానిని కొట్టిరి. సారమేయ మా విషయమును సరమకు చెప్పెను. సరమ వెళ్ళి జన మేజయుని గద్దించి

కం॥ "తగునిది తగదని యెదలో
వగవక సాధులకు బేద వారల కెగ్గుల్
మొగి జేయు దుర్వినీతుల
కగు ననిమిత్తాగమంబు లయిన భయంబుల్" (85)

అని చెప్పి యదృశ్య మయ్యెను.

ఆ సత్త్రయాగము ముగిసినపిమ్మట జనమేజయరాజు "సరమ" మాటలకు ప్రతీకారార్థము శాంతిక పౌష్టిక క్రియలను నిర్వర్తించ దలచెను. అన్వేశించి సోమశ్రవసు డను నతనిని పురోహితునిగా గావించుకొని యనవరత శాంతిక పౌష్టిక క్రియలను నిర్వర్తించెను.

అనిమిత్తాగమంబులైన భయములు కలుగునని చెప్పి సరమ యదృశ్యమైనట్లే శాంతి కర్మలతో తత్శాప తీవ్రతము నదృశ్యమయ్యెను. కనుకనే జనమేజయునికి కలిగిన యనిమిత్తాగములైన భయముల వర్ణనలు "ఆంధ్ర మహాభారతము"న కానరావు.

4.3.4.4.2. పర్వతుని శాపము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము "శాంతి పర్వము" ప్రథమాశ్వాసములో (245-272) గలదు. సృంజయుని కుమారుడు దీర్ఘాయురుపేతుడు గాకుండుట శాప విషయము. శాపకర్త పర్వతుడు.

నారద పర్వతులు మామా యల్లుళ్ళ వలె భూలోకమున తిరుగుచు సృంజయు డను రాజు నింట చేరి కొంత కాల ముండిరి. వారు స్వర్లోక గమనమునకు నిశ్చయించు వేళ బ్రాహ్మణులు సృంజయునికి నుపకారమును చేయుడని కోరిరి. రాజు వేడకున్నను నారదముని "దేవతలను మించు కొడుకు పుట్టు" నని పలికెను. కాని పర్వతుడు దేవేంద్రుని తేజమును రక్షింప దలచి

వ॥ "విను మక్కుమారుండు దీర్ఘాయురుపేతుండు గాకుండు
 ననియెను" (259)

అప్పుడు నారదముని 'ఆపద కలుగు వేళ నన్ను స్మరింపు" మనెను. బాలుని స్వేదము, లాలాజలము, మల మూత్రములు బంగారముగా మారునని, దానిచే సువర్ణష్ఠీవి యనుపేరు కలుగునని చెప్పెను. నారదముని సహాయము వలన సువర్ణష్ఠీవి యెట్టి బాధలును లేకుండ శతాధిక సహస్ర సంవత్సరములు రాజ్యము నేలెను.

ఈ వృత్తాంతమున పర్వతుని శాపమును నారదముని పర మడ్డు కొనినది.

4.3.4.5. చర్విత చర్వణ శాపము

ఒక వ్యక్తి వినాశనమునకు గాని లేదా మరణమునకు గాని కార ణమైన శాపమే మరియొకరి చేత ప్రస్తావింప బడుట లేదా శాసింప బడుటను చర్విత చర్వణ శాప మన బడును.

అంధ్రి మహాభారతములో శ్రీకృష్ణ పరివార వినాశనమునకు సంబంధించిన శాప మిట్టిది.

గాంధారి శాపము

ఈ వృత్తాంతము తిక్కన భారతభాగము స్త్రీ పర్వము ద్వితీ యాశ్వాసములో (2-165) గలదు. శ్రీకృష్ణుని జాతి వారందరును పొలియుట శాప విషయము. శాప కర్త గాంధారి.

పదునెనిమిది రోజుల పాటు భీషణ యుద్ధము సాగిన తరువాత గాంధారీ ధృతరాష్ట్రులు తక్కిన పరివారముతో సమర క్షేత్రమునకు నేగుదెంచిరి. వేదవ్యాసుడు గాంధారికి దివ్యదృష్టిని ప్రసాదించెను. సమరములో మరణించిన పరివారమును, పాడైన వస్తు సముదాయ మును నామె చూచి యాక్రోశించెను. జ్ఞాతి యుద్ధమునకును, కురు వంశ నిర్మూలనమునకును, ప్రజా వస్తు క్షయమునకును శ్రీకృష్ణుడే కారకుడనియు, నతని యుపేక్ష వలన నిట్టి యనర్థము సంభవించె ననియు తూలనాడెను. దీని కంతకు ఫలితము ననుభవింపు మనుచు

సీ॥ "—— ——పొలియుదు రన్యోన్య

ఘాతుకులై భవజ్ఞాతి జనులు" (167)

అని శపించెను. అట్లే శ్రీకృష్ణునికి దిక్కులేని చావు వచ్చునని పలికెను.

అప్పుడు శ్రీకృష్ణుడు గాంధారితో నీ శాపము చర్విత చర్వణ మనియు నిదివరకే కణ్వాదిమహర్షి ప్రోక్త మని పేర్కొనెను.

ఇక ఉపసంహారము

ఈ సిద్ధాంత వ్యాసములో కనుగొన్న యంశములు "ఉపసం హారము"లో సమీకృతము.

ఋషిగణ విషయమున నారదుడు విష్ణుమూర్తి వలన మాత్రమే వరానుగ్రహమును పొందిన వాడు. ఇతరులు త్రిమూర్తుల వలన వరములను పొందిన వారు.

వైవాహిక వరములు-9. వీటిలో పురుష ప్రయత్నోపేతములు, వనితా ప్రయత్నోపేతములు గలవు. దేవతాస్త్రీల యాకర్షణలకు లోబడి వివాహమాడిన వారిలో శంతనుడు ప్రథముడు. మర్త్యాంగన యందచందములకు సొక్కి కన్య నిమ్మని కోరిన వారిలో "అర్జునుడు" ముఖ్యుడు. తానొక రాజునకు వరము నీయగా పుట్టిన కన్యను తానే వివాహమాడదలంచిన వాడు "అగస్త్యుడు". తమ సుఖ సంతోషముల కొఱకు శంతనుడు అర్జునుడు వివాహమాడగా సంతానము కొఱకు వివాహమాడిన వాడు "అగస్త్యుడు".

మగని కొఱకు తపించిన వారు "దేవయాని, దేవసేన, ఇంద్రసేన"లు. వీరిలో దేవయాని తన్ను రక్షించిన యయాతిని, దేవసేన తన్ను రక్షించిన "ఇంద్రు"ని సహాయము వలన తన కిష్టమైన కుమారస్వామిని వలచి వివాహమాడగా "ఇంద్రసేన" మాత్రము తపముతో పతి వరమును పొందినది.

పతి వరములు-5. వీటిలో దైవ, మానవ వరము లున్నవి. దేవేంద్రుడే పతి కావలయునని భరద్వాజముని కూతురు ప్రభావతి పట్టుబట్టి పొందుట యిందలి విశేషము.

సంతాన వరములు - 34. వీటిలో బ్రహ్మ మహేశ్వరుల, ఇంద్రాది దేవతల, ఋషుల, మహారాజుల వరము లున్నవి. సంతాన వరముల విషయములో నొక విశేష మున్నది. మహాభారత నాయకుడు విష్ణువు. విష్ణ్వంశయైన శ్రీకృష్ణుడు ప్రధాన సూత్రధారి. ఇతర దేవత లిచ్చిన సంతాన వరము లున్నవి. కాని విష్ణు విచ్చిన సంతాన వరమేదియు కనిపించదు. మంత్రోచ్చారణతో దేవతలు

సంతానమును ప్రసాదించగా, నితరులు చేసిన సేవకు మెచ్చి ఋషులు, తమ్ము ప్రార్థన చేయగా సంతసించి రాజులు వరముల నిచ్చుట కనిపించును.

భుక్తి వరములు - 4. వరప్రదాతలు కశ్యప ప్రజాపతి. ఇంద్రి, వినత దేవతలు కాగా కార్తవీర్యార్జునుడు రాజు. భుక్తికి నుద్దేశింపబడి నవి జంతువులు మరియు మనుష్యులు. సృష్టిలో బలవంతమైన జంతువుల యునికి మంచిది కాదు. వానికి కూడ వినాశమవసరము. అదియుగాక "వైరము" జంతు స్వభావము కూడ. కనుకనే "భుక్తి వరముల" ప్రసక్తి భారతమున కనిపించుచున్నవి. వీనిలో "గజగచ్ఛప" వైరము చెప్పుకొనదగిన వృత్తాంతము.

పునరుజ్జీవన వరములు - 5. భారతీయ జీవితములో కుటుంబ ప్రాముఖ్యము విస్మరింపరాని విషయము. కలహము లున్నను కలిసి పోదమను కాంక్ష పైగా తమ వారికి "ఎడరు" కలుగు వేళ వారికై స్మరించుట "పేగు ఎడలిక"కు సంబంధించిన విషయము. తల్లి కొఱకు ప్రాకులాడు వాడు పరశురాముడు. తండ్రి కొఱకు వగచిన వాడు "అర్వావసుడు" సోదరుల కొఱకు పరితపించినవాడు ధర్మరాజు. భర్తకై యిడుముల పాలైన యుంగన సావిత్రి. కొడుకకై కుమిలిన వారు శాంతి పర్వమున పేర్కొనిన వృద్ధ దంపతులు.

ఆంధ్ర భారతములోని విద్యావరములు కేవలము - 2 మాత్ర మే. వర ప్రదాతలలో నొకరు త్రిలోకాధిపతియైన "ఇంద్రుడు" కాగా రెండవ వారు కర్మసాక్షియైన సూర్యభగవానుడు. ఒకరు విద్యానుగ్రహమును చేయగా మరొకరు విద్యాలబ్ధిని పొందుట తొలి పెంటను కనిపించగా, పరస్పరము తమతమ విద్యలను బోధించుట నల,ఋతుపర్ణుల కథలో కనిపించును.

## 5. ఉపసంహారము

రామాయణ భారతములకు "ఇతిహాసము"లని పేరు. రామాయణము వ్యక్తి నిష్ఠము. భారత కథ కుటుంబ కథ. రామాయణములో ధర్మ ప్రసంగములకు నవకాశము తక్కువ. కథా విస్తృతి వలన భారతమున ధర్మ ప్రసంగములకు నవకాశ మెక్కువ. రామాయణమున వరములు, శాపములు చాల తక్కువ. భారతమున వరములు, శాపములు చాల యెక్కువ.

ఆంధ్ర మహాభారతమున లెక్కకు వచ్చిన వరముల సంఖ్య 354. వీనిలో భారత కథకు సంబంధించిన వరములు 103. ఈ 354లో 118 వరములు కేవలము "వర" శబ్దముతో స్థాపితము. ఇవియే గాక "అడుగుట, అనుగ్రహించుమని యడుగుట, అభివాంచితము, ఇష్టము, ఈప్సితము, కోరుట, చెవించుట, ప్రార్థించుట, కరుణించుట, శరణము" మొదలగు రూపములలో కూడ వరములు కనిపించును.

ప్రధాన దేవతలైన బ్రహ్మ విష్ణు మాహేశ్వరులలో బ్రహ్మ యిచ్చిన వరములే (30) యెక్కువ. దేవగణములో "అగ్ని యమా" దుల కంటె "ఇంద్రు" డిచ్చిన వరము (23) లెక్కువ. అట్లే మహర్షి గణములో వేదవ్యాసుడు ప్రస్తావించిన వరము (12) లెక్కువ.

వరానుగ్రహమును పొందిన వారి దృష్టితో చూడగా త్రిమూర్తులు పరస్పర మిచ్చుకొనిన వరములు కనిపించవు. దేవతలు పొందిన వరములు 16 కాగా, రాజులు పొందిన వరములు 130. లింగ విభేదముతో పరిశీలించగా స్త్రీల కంటె పురుషులు పుచ్చుకొనిన వరములే హెచ్చు. పురుషులు 271 వరానుగ్రహములను పొందగా స్త్రీలు

62 వరములనే పొందిరి. వరానుగ్రహమును పొందిన వారు దేవతలు, ఋషులు, మర్త్యులు, రాక్షసులు, పశుపక్ష్యాదులు.

వరములలో తొలి, తుది వరములను పరిశీలించగా మొట్టమొదటి వరము "ఆది" పర్వములో "[illegible]కోపాఖ్యానము" న కనిపించును. చివరి వరము స్వర్గారోహణ పర్వమున "ఇంద్రి" ధర్మరాజుల సంవాదమున ప్రస్తాపితము. తొలి, తుది వరములను ప్రసాదించిన వాడు దేవేంద్రుడే. ఇక స్వభావ దృష్టితో పరిశీలించగా మొదటి వరము "అయాచితము". స్వర్గారోహణ మందలి వరము యాచితవరము.

మహాభారతము నందలి వరములను పరిశీలించగా మరికొన్ని విశేషములు కనిపించును.

త్రిమూర్తులలో విష్ణు వొకడే యితరుల నుండి వరమును పొంద లేదు. బ్రహ్మ విష్ణువు నుండి వరములను పొందుట మాత్రమే గాక శివునకు కూడ వరము నిచ్చిన వాడే. శివుడు బ్రహ్మ నుండి యొక వరమును పొందినను బ్రహ్మకు ననేక వరములను ప్రసాదించెను.

రాక్షసులు బ్రహ్మ మహేశ్వరుల నుండి వరములను పొందిరి. కాని విష్ణువు నుండి పొందలేదు. కాని రాక్షసుల నుండి వరమును పొందిన కీర్తి విష్ణువుదే.

త్రిమూర్తులలో బ్రహ్మ మాహేశ్వరుల మధ్య పరస్పర వరము లున్నట్లు దేవగణములో పరస్పర వరప్రదానము కనిపించదు. నైరుతి చంద్రులు తప్ప యితర ప్రముఖ దేవతలు దేవతలకు, మర్త్యులకు, పశుపక్ష్యాదులకు వరముల నిచ్చిన వారే. వర ప్రదాతలైన దేవత లితరుల నుండి కూడ వరానుగ్రహమును పొందుట యొక విశేషము. అట్టి యనుగ్రహము చేసిన వారు "అగస్త్య, చ్యవన, దధీచి" మొదలైన వారు.

ఉపదేశ వరములు - 6. వీనిలో త్రికాల వేదిత్వము, పుణ్య తీర్థ మాహాత్మ్యము, క్షత్రియోచిత ధర్మము, తత్త్వోపదేశము, పరమార్థ రహస్యము, మహనీయ బోధనములు చేరును.

మైత్రీ వరములు - 3. ఈ మూడు కూడా సహజములు కావు. సకారణములు. ఇంద్రవృత్రాసురుల మైత్రికి విష్ణువు, అగస్త్యవింధ్యాచలముల మైత్రికి దేవతలు కారకులు. అర్జున అంగార పర్ణుల మైత్రిలో ముందడుగు వేసినవాడు అంగార పర్ణుడను గంధర్వుడు. మొదటిది దేవ రాక్షస మైత్రి. రెండవది అగస్త్య వింధ్యాచలముల మైత్రి. మూడవది క్షత్రియ గంధర్వ మైత్రి.

పదవీ వరములు - 9. ఇందులో ఇంద్రాధికారము, రాజ్యాధికారము, సైన్యాధ్యక్షతలు ప్రధానములు. ఇంద్రపదవిని కోరని నహుషుని "ఇంద్రు"నిగా చేసి, యతనికి నహంకారము కలుగునట్లుగ చేసి యతని భ్రష్టత్వమునకు పూనుకొన్న వారు దేవతలు. యౌవరాజ్యాధికారమును కోరిన వారిలో శకుంతలది యాకాంక్షా రూపమైన భవిష్యదృష్టి. కైకేయిది సమానులలో నాధిక్యము కొఱకు చేయు ప్రయత్నము.

కామ రూపత్వ వరములు - 2. కామ రూపమును కోరినవారు రాక్షసులే యగుట విశేషము. సుందోపసుందులు, రావణుడు కామ రూపత్వమును కోరినవారు.

భవిష్యత్కథన వరములు - 4. ఖాండవ వన దహనము, మర్త్యుల మరణము, త్రిపురాసుర సంహారము. సజల సముద్ర వృత్తాంతము.— ఈ నాల్గింటిని సూచించిన వాడు బ్రహ్మ. త్రిమూర్తులలో బ్రహ్మ సృష్టి కర్త, లలాటరేఖను విభజించు వాడగుటవలన భవిష్యత్కథనమును చేయుట యతనికే తగును.

